శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీమద్రామాయణము

# వచనము

# బాలకాండము.

దేవరాజసుధీ ప్రణీతము.

పండితులచే

పరిశోధితము.



మద్రాస్.

ఆనందముద్రణాలయమునందు

ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అన్డ్ కంపెనీవారిచే ప్రకటితము

1929.

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# ఉపోద్ఘాతము.

---

శ్రీమన్నారాయణుని పరిపూర్ణావతారమైన శ్రీరామచంద్రుని చరితామృతమై కావుననే, యాస్తికశిరోమణులకెల్ల అతిభోగ్యమై, వాల్మీకి మహర్షి ప్రణీతము నగుటంజేసి పఠనశ్రవణ లేఖన పూజనాదులచేత ఐహికాముష్మికసామ్రాజ్య ప్రదమై, యొప్పు శ్రీమద్రామాయణము మహిమనుగుఱించి యించుకైనను వ్రాయ నక్కఱలేదుగదా. మఱియు నందలి ప్రతిపాద్యవస్తువైన శ్రీరామునియందు ప్రతిపత్తిలేని యితరమతములవారికిని, అది నవరసము లొలుకుచు అనర్గళమైన కవితాధోరణిగల కావ్యరత్నమగుటచే మిక్కిలి యాదరణీయమై యున్నదనఁగా ప్రతిపాద్యవస్తువునందలి భక్త్యతిశయమునుబట్టియు, సాటిలేనికవిత్వమాధుర్యమునుబట్టియు అది మనవారి కెంత యాశ్రయింపఁదగినదో చెప్ప నెవరితరము? రామునికల్యాణగుణగణము లసదృశములు. అగణ్యములు. సీతపతిభక్తియు అప్రతిమము. రామలక్ష్మణులయు భరతశత్రుఘ్నులయు సౌభ్రాత్రము సర్వజనస్తుతిపాత్రము. అందు, రాముని పితృభక్తియు, సత్యవ్రతమును, ఆశ్రితపారతంత్ర్యమును, అతిభయంకరమైన వీరరసవిలసితమును, అతిస్ఫుటముగా వర్ణించువర్ణనము లతిమనోజ్ఞములు. ఆయారసము లొలుకుటకై చేయురచనలు కడుసుకుమారములు. ఆయాభావములను హవణించువిన్నాణములు బహుప్రౌఢములు. నాయికానాయకుల సహజమనోజ్ఞములైనగుణవృత్తాదులు, అతిసరళమై, సులలితమై, బహుమధురమై, యొప్పువాల్మీకి కవితామృత ప్రవాహమునం దోఁగి నిరతిశయమాధుర్యమునొందుచున్నవి. ఇట్టి రామాయణమును బెక్కుకవులు బహుభాషల గద్యపద్యాత్మకముగఁగూర్చియు మార్చియు మనోజ్ఞములైనయనేకమార్గముల రచించియున్నారుగాని బ్రహ్మప్రసాదమున భారతి యవతరించినయామహర్షి వాక్కునుండి వచ్చినయచ్చంపుఁబలుకుల ముద్దును, వాని సహజమాధుర్యమును మఱియెందును గానరావు. కావున శ్రీరామాయణమును మహర్షి చెప్పినమాటలనే యాంధ్రదేశీయు లనుభవించి యానందింపవలయు ననుతలంపుతో స్త్రీలకును బాలురకును దెలియఁ గూడినట్టి తేటతెనుఁగున, మృదుశైలిని, షట్కాండములును రచించి ప్రకటింపనయ్యెను.

మఱియు నిందుఁ గృష్ణసూరి యనువారు ఆయాశ్లోకమునకు విశేషార్థముఁ
నద్భుతముగాఁ బ్రతిపాదించుచు రచించినతనిశ్లోకియును, గోవిందరాజ మహేశ్వఁ
తీర్థాదివ్యాఖ్యానములం గలవిశేషవిషయములును, రహస్యవివరణములును అని
యును తేట తెనుఁగునఁ గూర్పంబడియున్నవి. ఆంధ్రభాషాభిమానులందఱును
దీనిని గొని యీయుద్యమమున కుత్సాహము గలిగింతురుగాక [illegible] కోరుచు
న్నాఁడను. టి. దే



శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః

# విషయసూచిక

# పటములపట్టిక.

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీమద్రామాయణము

## బాలకాండము.





శ్లో॥ కలయే మమహృదయే నవ
కువలయదళనీలకోమలాకారమ్ ।
కువలయజనమన్దారం ।
నన్దకుమారం నతార్తి భయచోరమ్॥

పస్స్వాధ్యాయనిష్ఠుండును* వాగ్విదులకెల్లముఖ్యుండును మునిజనములకు మేలుబంతియునైన నారదుని బూజించి తపస్వి యగు వాల్మీకి యిట్లడిగినవాఁ

---

* ఇందులకు 'తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్ । నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుఙ్గవమ్' అని మూలము. సకల లోకహితార్థంబు పితామహుండైన బ్రహ్మ యతిపవిత్రం బగు రామచరిత్రంబును శతకోటివిస్తరము గల ప్రబంధముగా రచించి నారదాదులచే దాని నధ్యయనము సేయించి యతివిపులమైనయా చరితమును సంగ్రహముగా వాల్మీకిమూలమున భూలోకమునఁ బ్రవర్తింపఁజేయం దలఁచిన వాఁడై నారదుని! వాల్మీకికడకుఁ బంపఁగా నతండును వచ్చి శ్రీరామచరితంబును సంగ్రహముగా వాక్యరూపమున వాల్మీకి కుపదేశించిన వాఁ డయ్యె. 'ఆచార్యాద్ధైవవిద్యా విదితా సాధిష్ఠంప్రాపత్' "ఆచార్యవాన్ పురుషో వేద' ఇత్యాదిప్రమాణము లంబట్టి వేదాంతాదిమహనీయ విషయములు సదాచార్యముఖముగానే లభింపవలయును. కానవాల్మీకికి గురుండైననారదునకుంగల సదాచార్యలక్షణములును, వాల్మీకికింగలశిష్యలక్షణములును, ఈ తొలివాక్యములందెలియనగు. ఎట్లన 'అభిజనవిద్యాసముపేతంసమాహితంసంస్కర్తారమీప్సేత్' అను నాపస్తంభవచనప్రకారమున ఆభిజాత్యము, విద్య, సమాహితత్వము అను మూఁడును సదాచార్యునిలక్షణము లగును. ఈమూఁడును నారదునకుంగలవు. ఎట్లన, (తపస్స్వాధ్యాయనిరతం) అనుచో తపస్సు అనఁగా మనస్సును నిర్మలముగా వించు వ్రత

డయ్యె. 'మునితిలకా' ఇక్కాలమున నీభూలోకమున నెవఁడు * సకలకల్యాణగుణసంపన్నుఁడు? వీర్యవంతుఁ డెవ్వఁడు? సకలసామాన్యధర్మములును విశేషధర్మములెల్లను బరిహరింపవలసినయధర్మము లన్నియు నెవ్వానికిఁ దెలిసియుండు? పరులు సేసినయావంతయుపకారము నత్యంతముగాఁ దలఁచువెన రెవ్వానికిఁ దనరు? ఎట్టియవస్థలయందుఁగానిసత్యమే పలుకువాఁ డెవఁడు? తానుదలఁచినతలంపుగాని పట్టినకార్యముగాని విడువనిగట్టిపూనిక యెవ్వానియందుఁ గనుపట్టు? కులాచారం బెవనియందెడ తెగక పొలుపారు? ఎక్కువతక్కువ లున్ననుగాని తనకుఁ దప్పు సేసిననుగాని పాటింపక యఖిలభూతములకును హితమే యాచరించుచుండువాఁడెవఁడు? ఎవ్వని

---

నియమోపవాసాదిరూపమైనకర్మము స్వాధ్యాయమనఁగా వేదము ఈతపోవేదములు రెండును 'తపోవిద్యాచవిప్రస్య నిశ్శ్రేయసకరా వుభౌ' అన్నట్లు ఆవశ్యకములుగాన నీరెంటియందు నెడ తెగనియాసక్తి గలవాఁడనియర్థము. లేక, 'తపోహిస్వాధ్యాయః' అన్నట్లు తపమనఁగా వేదము స్వాధ్యాయమనఁగా జపము 'వేదమేవజపేన్నిత్యమ్' అన్నట్లువేదజపమునందాసక్తుఁడనియర్థము లేక, 'బ్రహ్మైతదుపాస్స్వైతత్తపః' అన్నట్లు తపమనఁగా బ్రహ్మము. తపస్సు ప్రధానముగాఁ గల స్వాధ్యాయము తపస్స్వాధ్యాయము. ఇదియె వేదాంతము. వేదాంతము నెప్పుడును అధ్యయనాధ్యాపనములు సేయుచుండువాఁ డనియర్థము ఇట్టి యర్థములు గల తపస్స్వాధ్యాయశబ్దమువలన నారదునకు విద్యకలిమి చెప్పఁబడెను (వాగ్విదాంవరమ్) అనుచో 'వాక్' అనఁగా 'గీర్వాగ్వాణీ సరస్వతీ' అని సరస్వతి ఆమెచేత 'విద్యన్తేలభ్యన్తే' లభింపఁబడినవారు-అనఁగా పుత్రులైనమరీచ్యాదులు. వారలలో శ్రేష్ఠుఁడనియర్థము దీనిచే నాభిజాత్యము చెప్పఁబడియె ఇట్లాచార్యలక్షణములు మూఁడును బ్రతిపాదితములయ్యె (నారదమ్) నరుని సంబంధించినది నారము-అనఁగా జ్ఞానము దానిని 'ద్యతిఖణ్డయతి' ఖండించువాఁడు నారదుఁడు లేక, నార మనఁగా జ్ఞానము దానిని 'దదాతి' ఇచ్చువాఁడు నారదుఁడు ఇట్లాచార్యలక్షణపూర్తి చెప్పి యిఁక నధికారిత్వపూర్తి తెలుపుటకొఱకు శిష్యలక్షణములను చెప్పుచున్నాఁడు (తపస్వీ) అనఁగా బ్రహ్మజ్ఞానమునకు సాధనమైనతపస్సు గలవాఁడు, లేక తపస్సనఁగా వేదమును వ్యాకరణమును జ్ఞానము నగును గాన వ్యాకరణాద్యంగసహితముగా వేదము నధ్యయనముచేసి దానిచేఁ గేవలకర్మములల్పాస్థిరఫలము లనుజ్ఞానముం బడసినవాఁడై, కావున నే'తపస్వీ తాపసేశోచ్యే' అని తపస్సనఁగా నిర్వేదముగాన నిర్వేదమునొంది, మోక్షాభిలాష గలవాఁడగును 'తస్మాన్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః' అని తపస్సనఁగా న్యాస మగునుగాన 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా' అన్నట్లు గురుశరణాగతిరూపమైన న్యాసముగలవాఁడు అగును (వాల్మీకిః) 'వల్మీకస్య అపత్యమ్' అని పేరుగొనుటచే జ్ఞానాంగములైన శమదమాదులకలిమి స్ఫురించెడి 'పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్' అన్నట్లు కర్మచితము లగు లోకములంజూచి నిర్వేదమొంది మోక్షాభిలాష గలిగి శమదమాదిసంపన్నుఁడై గురుశరణాగతి సేయువాఁ డగు నని శిష్యలక్షణపూర్తియుఁ జెప్పఁబడియె

*ఇట్టికల్యాణగుణంబులు వైకుంఠలోకంబున నున్నశ్రీవిష్ణునకును గలవు గావున అతఁడు గాదనుటకై 'యీలోకంబున' ననియు, ఈలోకంబునందును గాలాంతరముల నరసింహాదులకును నిట్టి గుణములుగలవు గాన వారు గాదనుటకై 'యిక్కాలంబున' అనియుఁ జెప్పఁబడినవి.

శాస్త్రజాలము సకలమును గరతలామలకము? ఇతరుల కలవి కానియెట్టి కడింది కార్యము నేని యొడఁగూర్పఁ జాలువాఁ డెవఁడు? చూడంజూడ నింపై యీడుం జోడు లేక యుండు చక్కఁదన మెవ్వానియందుఁ జూపట్టు? చలింప రాని ధైర్యమును గొలందికి మీఱని కోపమును, గామాదుల గెలుచుటయు నెవ్వానియందుఁ బొలుచు? తులకించు మేనికాంతి యెవ్వనికిఁ దళుకొత్తుచుండు? ఒకరియొప్పులను సైతము తప్పులుగాఁ జేయున సూయవలన నెవండు వాయు? కోపము గలిగెనా దేవతలేని యెదిరింప వెఱచునట్టివాఁ డెవఁడు? ఎవ్వఁడు యుద్ధమున బొమలు ముడివడఁ గన్నెఱ్ఱ జేసి పాఱఁజూచెనా, పగవారగు రాక్షసులే కాదు, అనుకూల రగు దేవతలు సైతముఁ దేఱిచూడ వడఁకుదురో యట్టివాఁ డెవండు? *ఇట్టి మాననీయగుణములు గలవానిని దెలిసికొనవలయు నను కుతూహలము నాకు మిక్కిలి కలదు కాన యట్టివాఁ డెవ్వఁడో విన గోరెద ఇది నినుబోఁటికిఁ దెలియరాదనవచ్చునా? నీవు జ్ఞానవంతులలో నెల్ల మేటివి కాన యీపాటి పురుషుం డెవఁడో యెఱుంగ నేర్తువు దయసేసి యట్టివానిని వినిపింపుమీ' యని యె ముల్లోకముల సకలవృత్తాంతములఁ దెలిసియున్న నారదుఁడు వాల్మీకి చెప్పిన యుప్పలుకులు విని తనలో 'ఇట్టి కల్యాణగుణము లన్నియు నిం దెట్టి సార్వభౌమున కేని కలుగునా? ఇవియెల్ల నెల్లజగములను గావ మనుష్యరూపమున నవతరించిన పరమపురుషునికి రామున కొక్కనికిం దగుఁ గాక ఆ! నాభాగ్యము! ఈనెపమున దైవికముగా నామహాపురుషుని వర్ణింపఁగలిగె. మఱియు నే

* వాల్మీకి రామవృత్తాంతము సర్వమును పూర్వమే తెలిసియున్నవాఁడు 'ఇతి సీతా చ రామశ్చ లక్ష్మణశ్చ కృతాఞ్జలిః। అభిగమ్యాశ్రమం సర్వే వాల్మీకిమభివాదయన్' అయో-కాం, ఇత్యాదులవలనను 'రామో రామో రామ ఇతి ప్రజానామభవన్ కథాః। రామభూతం జగదభూద్రామే రాజ్యం ప్రశాసతి' అని సామాన్యజనులకుఁగూడ రామవైభవము విదితమై యుండుటవలనను రామవిషయమధ్యవర్తి యగు వాల్మీకికి నతనిగుణంబులు దెలియకుండునా? కాన యతఁడీప్రశ్న రాముని గుఱించి యడిగినవాఁడు గాఁడు, వేదాంతములందలి నానావిద్యలందుఁ బ్రతిపాదితము లైన యాయాగుణములతో నెల్లఁ గూడియున్న పరతత్త్వ మెద్ది? యని యడిగినవాఁడని గ్రహింపవలయును. కావుననే నారదుఁడు 'తెలిసి' చెప్పెదనని చెప్పి యట్టి కల్యాణగుణములతోఁ గూడిన పరతత్త్వమే రాముఁ డని నిర్ణయించెనని రహస్య మూహ్యము లేకున్న బ్రహ్మచే ననుజ్ఞాతుండై రామచరితము నే యుపదేశింప వచ్చిన నారదుఁడు, తన్ను వాల్మీకి యట్టిగుణములు గలవాఁడు రాముఁ డని తెలియక యడిగెనేని యట్టివాఁడు రాముఁడని తోడనే చెప్పునుగాని 'తెలిసి' చెప్పెద ననునా? తా నుపదేశింపవచ్చినదానినే వాల్మీకి యడిగెనేని తోడనే చెప్పియుండును. అట్లు చెప్పక 'తెలిసి' అనఁగా ఆలోచించి, చెప్పెదననుటచే వాల్మీకి రాముని గుఱించి తన్నడిగినవాఁడు గాఁ డనియు, నానావేదాంతోపపాదితగుణగణసంపన్నుఁ డెవ్వఁడని యడిగినవాఁడనియు, కావుననే తాను 'తెలిసి' చెప్పునట్లు చెప్పెననియు, ప్రశ్న మఱొక్కరిని గుఱించిన దయ్యు ఆప్రశ్నయందు రూపింపఁబడిన కల్యాణగుణగణములతోఁ గూడిన పరమపురుషుఁడు రాముఁడే యైనందున తుదకుఁ దా నుపదేశింపవచ్చిన యారాముని చరితనే యుత్తరముగాఁ జెప్పఁగలిగినవాఁ డయ్యె ననియు నెఱుంగునది.

నుపదేశింపవచ్చెనవిషయమునే యీతఁడు నడిగినవాఁడయ్యె. నాకోర్కి యీడేరఁ గంటి మంటి' యనిమిక్కిలియు నుప్పొంగినవాఁడై వాల్మీకిని జూచి 'యాలించివినుము' మనుచుఁ జక్కఁ దనయెఱుఁగు మునిచంద్రుని యుల్లము చెప్పుచున్నాఁడు 'మునివరా' నీవు గోరినగుణకల్యాణగుణములలో కొన్ని కొంటయు బెక్కుగుణగణములకు మూలమైనయాగుణములను జెప్పఁజాలుదు నన్నాఁడు ముఖ్యమైన గుణగణములను జెప్పఁ దీఱదు గాన యవి యన్నియుఁ జేర లెక్కకు మిక్కిలి యగుచున్నవి మఱియు నవి ప్రాకృతులైనవారికిఁ గానఁగుట యరుదు. అట్టిగుణములతోఁ గూడినవానిని * దెలిసి చెప్పెదవినుము. † ఇక్ష్వాకువంశమున జనించి ‡ రాముఁడను పేరు గాంచినపురుషుఁడలా ముందు గలఁడు. అతనిని, నినుబోఁటివారే కాదు, సామాన్యులగు సకలజనులు § విని యెఱింగి యున్నవారు. నీయడిగినసకలగుణము లాతనియందుఁ గలవు. ఆతండు ¶ నియ

---

* నారదుఁడు రామునిచరిత్రచెప్పుటకై వచ్చినవాఁడే కావునను, వాల్మీకిప్రశ్నమునకు రాముఁడే యుత్తరముగాఁ జెప్పదగినవాఁ డయ్యెంగావునను, రాముని తోడనే చెప్పనుగాని 'తెలిసి' చెప్పెద ననుట యొప్పదని కొందఱు వ్యాఖ్యాతలాక్షేపించి 'తెలిసి' యనఁగా వాల్మీకి యడిగినట్టి వాఁడు దైవికముగాఁ దా నుపదేశింపవచ్చినరాముఁడే యగుటచే నాతనికల్యాణగుణముల స్మరించి యొక్కింతసేపు మైమఱచినవాఁడుగాన 'తెలిసి' అనఁగా పరవశమైన మనసును దేర్చుకొనిచెప్పెదనని చెప్పినాఁడని యర్థము గ్రహింపఁ దగునని యు వ్రాసియున్నారు. ఇదియు సరసముగానే యున్నది.

† జనకాదిమహారాజులను లుండఁగా నిక్ష్వాకుకులంబున నవతరించుటకుఁ గారణ మేమనఁగా తొల్లి యిక్ష్వాకుండు చిరకాలము హరి నారాధించి తన్మూర్తివిశేష మైనరంగనాథుని లభించెనని పురాణకథితము. అతనిసంతతివారికి నామూర్తి యారాధనవిషయమై యుండె. అట్టియిక్ష్వాకుని యందలి పక్షపాతముచేతను తద్వంశీయుల యారాధనములకు ఫలముగాను నిక్ష్వాకువంశమునందవతరించినవాఁడయ్యె. కాఁబట్టి తత్సూచకముగా 'నిక్ష్వాకువంశంబున జనించి' యనఁబడియె.

‡ రాముఁడనుట యౌగికపదము 'రమయతి సర్వాన్ గుణైరితి రామః'-'అందఱిని గుణములచే రమింపఁజేయువాఁడుగాన రాముఁడు'. 'రమన్తేఽస్మిన్ సర్వేజనా (యోగినోవా) గుణైరితి రామః'- గుణములనుబట్టి యితనియందు సకలజనులును (లేక యోగులు) రమించుచున్నారుగాన రాముఁడుఅని యోగార్థములు.

§ 'విని యెఱింగియున్నవా' రనఁగా 'తాటకామారీచవధ, విశ్వామిత్రయాగసంరక్ష, ణా హల్యాశాపవిమోచన. శివధనుర్భంజన, పరశురామనిగ్రహాదులచే నారాయణుండని నిర్ణయించినా'రని విశేషము తెలియునది.

¶ ఈవిశేషములకు లౌకికసామాన్యమైనయర్థమును, వేదాంతప్రతిపాదితమైన విశేషార్థమును గలవు. సామాన్యార్థమెట్లన:-నియతాత్ముండు గ్రహించిన యంతఃకరణముగలవాఁడు, మనోనిగ్రహముగలవాఁడనుట. మహావీర్యుఁడు=గొప్పవీర్యముగలవాఁడు. తానుకసుగందకయేపరులను గెలుచు శక్తి వీర్యము-అట్టి వీర్యముగలవాఁడు. ద్యుతిమంతుండు=కాంతిగలవాఁడు. ధృతిమంతుఁడు=ధృతి యనఁగా ఆపదయందుఁగాని సంపదయందుఁగాని మనస్సు వికారపడకుండుట-అట్టిధృతిగలవాఁడు. వశీ=బహిరింద్రియములను వశపఱుచుకొన్నవాఁడు. నియతాత్మశబ్దముచే అంతరింద్రియవశము చెప్ప

బలుపున నిమ్నగా మఱేఁగియెమ్ములు చూపుచుండును. పగతురంబోలెఁ బాపములను నడంచువాఁడగుటం జేసి యెంతయుఁ బాపరహితుండు; కానకర్మబద్ధుండుగాక కృపచేఁ దనయిచ్ఛ నవతరించినవాఁడు; ఆజానుబాహుఁడు. నలుగడ గుండ్రనై గొడుగువలె బెడఁగారుశిరమును, అరచందురునివలె సుందరమైన *లలాటమును, మదపుటేనుఁగువంటిమురిపెంపునడయు నాతని కమరు ఒడ్డుఁబొడువు నెక్కువయుఁ దక్కువయు లేక సమముగానుండును. అవయవములు వీడియుండొంటికి సరిగానమరి కొమరారు. మేనిచామనచాయ నిగనిగమని మెఱుఁగు దేఱుచుండు. రూపము, మిక్కిలి తేజమును నక్కజంపుఁబౌరుషమును, జూపుచుండు. కండబలుపు గలఱొమ్మును, విశాలములైన కన్నుఁదమ్ములును, జిగి దళుకొత్తునవయవముల యొప్పిదమును మఱియుఁ దక్కుశుభలక్షణములును రాణించుచుండు. †మఱియు ధర్మజ్ఞుండును, శరణాగతరక్షణచణుండును, సత్యసంధుండును, ప్రజాహితరతుఁడును, గీర్తిమంతుండును,

---

*'సమవృత్తశిరాశ్చైవచ్ఛత్రాకారశిరాస్తథా। ఏకచ్ఛత్రాంమహీంభుఙ్క్తే' అనిశిరస్సుయొక్కయు, 'అర్ధచన్ద్రనిభంతుఙ్గంలలాటంయస్యసప్రభుః' అనిలలాటముయొక్కయు 'సింహర్షభగజవ్యాఘ్రగతయోమనుజామునే । సర్వత్రసుఖమేధంతే' అని నడకయొక్కయు, 'భ్రువౌనాసాపుటౌనేత్రేకర్ణావోష్ఠౌచమాచుకే। కూర్పరౌమణిబన్ధౌచ జానునీవృషణౌకటీ । కరౌపాదౌస్ఫిజౌ యస్యసమౌజ్ఞేయస్సభూపతిః' అని అవయవములయొక్కయు 'త్వచస్స్నేహేన శయ్యాచ' అని మేనిచాయయొక్కయు 'రక్తాన్తైః పద్మపత్రాభైర్లోచనైః సుఖభోగినః, అని కన్నులయొక్కయు లక్షణములును ఫలములును దెలియునది.

† ఆశ్రితు లనుభవించుటకుఁ దగినదివ్యమంగళవిగ్రహముయొక్క లక్షణములను జెప్పి యిప్పుడాశ్రితలక్షణమున కుపయోగించు గుణములను జెప్పుచున్నాఁడు.

‡ సత్యమైన సంధ అనఁగా ప్రతిజ్ఞకలవాఁడు సత్యసంధుఁడు-ప్రతిజ్ఞ తప్పనివాఁ డనుట. ఇదియె 'అప్యహంజీవితంజహ్యాం త్వాంవాసీతేసలక్ష్మణాం। నహిప్రతిజ్ఞాంసంశ్రుత్య బ్రాహ్మణేభ్యోవిశేషతః' అనుటవలనఁ దెలియఁదగు. గీర్తిమంతుఁడనఁగా ఆశ్రితరక్షణముచేనైన కీర్తిగలవాఁడని భగవత్పరముగాను రావణాదుల వధించుటచేఁగలిగినకీర్తిగలవాఁడని రామపరముగాను గ్రాహ్యము. జ్ఞానసంపన్నుఁడనఁగా 'సర్వజ్ఞస్సర్వవిత్' అన్నట్లుసర్వవిషయజ్ఞానమునుగలవాఁడనికాని, లేక, బ్రహ్మజ్ఞానముగలవాఁడనికాని యర్థము. రామునికి బ్రహ్మజ్ఞానమెట్లన జటాయువునకు 'మయాత్వంసమనుజ్ఞాతో గచ్ఛలోకాననుత్తమాన్' అని అనుత్తమలోకములకుఁబోవ ననుజ్ఞయిచ్చినాఁడు. దేనికంటె నుత్తమములైనవి లేవో యవియే యనుత్తమలోకములు అట్టిలోకములు బ్రహ్మోపదేశములేక కలుగవు గాన జటాయునకు బ్రహ్మోపదేశమును దానిని జేయుటకు రామునికి బ్రహ్మజ్ఞానమును నుండి తీరవలయును. 'ఆత్మానం మానుషంమన్యేరామందశరథాత్మజమ్' ఇత్యాదులుచెప్పుట మాయామాత్రమని తెలియునది-వశ్యుఁడనఁగాఆశ్రితులకు వశ్యుఁడు; అనఁగా పరతంత్రుఁడనియర్థము. కేవలరామపరముగా, తండ్రిగురువు మొదలైనపెద్దలకులోనైనడచుకొనువాఁడవియర్థము. సమాధియనఁగాచింతయుంయోగనిష్ఠచేనగుమనోలయమునుఅర్థములుగానఆశ్రితచింతాపరుఁడనియు నిజతత్త్వము సమాధి చేఁపరికించువాఁడనియు నర్థము లూహ్యములు. రాముఁడే బ్రహ్మమైయుండఁగా బ్రహ్మముతో సాటిగా చెప్పుట యెట్లు? అన్నయెడల, మాయాప్రయుక్తములైన శోకమోహాదిమనుష్యధర్మములు గలిగియుండుటఁబట్టి రాముఁడు

జ్ఞానసంపన్నుండును, బరిశుద్ధుండును, వశ్యుండును, సమాధియుతుండును నై విలసిల్లు. అతండు బ్రహ్మసమానుండు, శ్రీమంతుండు, జగముల ననుపం బెనుపం జాలినవాండు; తనయాశ్రితులను విరోధించువారి కాపర మడంచునట్టివాండు; * వీరు వారనక సకలప్రాణులను గాచుచును, సర్వధర్మములు మేరదప్పనియట్లు నడపుచును, నిజధర్మమును బరిపాలించుచును, స్వజనంబులను బ్రోచుచును నుండువాండు. వేదవేదాంగములం గలరూపున నెఱింగినవాండును; ధనుర్వేదమునం గడుంబరిశ్రమము గలవాండును, సకలశాస్త్రములందు నిగూఢము లైన సారార్థములం దెలిసినవాండు నై కన్నవిన్న విషయములందుం గొంచెమేని మఱపులేక మెఱుపువలె నతితీవ్రముగా స్ఫురించుచుం బయింబయి వికసించుచుండు మతియుం గలిగి యుండు. సర్వలోకములు నతనికిం బ్రియములు; సర్వలోకములకు నంతండును బ్రియుండు. మిక్కిలియు సాధునై, దీనము గాక యతిగంభీరమైన ప్రకృతి గలిగి, విచక్షణుండునై, యావిన్నాణో రాణించు, †నదులు సముద్రమునుంబోలె, సజ్జను లెప్పుడు నాతనిని బలసి కొలుచుచుందురు. ఏలన, నతండు పూజ్యుండుగాన యందఱికిం గొలువందగియుండువాండు; శత్రుమిత్రాదిభేదములను గాని జాతిగుణాదులవలని తారతమ్యములను గాని పాటింపక యందఱికి సముండై యుండువాండు. మఱియు నెప్పుడుగాని యతండు చూడం జూడం బయింబయిం గన్నులపండువుగాం బొడసూపుచుండు. ఇట్టి వాండెట్టివాండన

---

మనుష్యుండుగా నౌపాధిక భేదమును గ్రహించి బ్రహ్మతోసాటిగా చెప్పంబడియె. పరశురామలోకము నడ్డగించుట, జటాయువునకు మోక్షమిచ్చుట, అయోధ్యాజనులను దనతోంగూడ దేహముతోనే బ్రహ్మలోకమునకుం గొనిపోవుట మున్నగువానిచే బ్రహ్మసామ్యము తెలియునది.

* అవతారములకు మాత్రము చెల్లునట్టిగుణములిది మొదలుగా చెప్పుచున్నాండు. నిజధర్మమనంగా శరణాగతరక్షణమనెడి విశేషధర్మమని యర్థము. లేక ధర్మములొకరి కుపదేశింపంగూడును గాని తామాచరించుట కలుగదు గనుక నట్లుగాక తనకు సయితమైయుండు క్షత్రియధర్మము ననుష్ఠించువాండని కాని యజనాధ్యయనదానరూపమైన ధర్మమని కాని కేవలరామపరముగాం దెలియునది. స్వజనులనంగా భక్తజనులు, సర్వజనులను రక్షించువాండు గూడ సొంతజనులను రక్షింప నేరకుండుట గానంబడుచున్నది. రాముండట్లుగాక స్వజనులను సైతము రక్షించువాం డనియునర్థము. గంభీరప్రకృతి యగుటచే ఎట్టివ్యసనంబులందు కలంతనొంది పేదపడునట్టి ప్రకృతిలేనివాండనుట. విచక్షణుండనంగా వివిధవిషయముల నుపదేశించువాండని కాని ఆయాకాలమునకుం జేయందగినదాని నెఱుంగ నేర్పుగలవాండని కాని తెలియనగు.

† సత్పురుషులచే నుపాసితుండగుట నిది మొదలుగాం జెప్పుచున్నాండు. ఎల్లప్పుడు అనంగా 'జ్ఞానవృద్ధైర్వయోవృద్ధైః శీలవృద్ధైశ్చ సజ్జనైః। కథయన్నాస్త వై నిత్య మస్త్రయోగ్యాన్తరేష్వపి' అన్నట్లు అస్త్రాభ్యాసకాలములందును సజ్జనులు గొలుచుచుందురనుట. లేక హోమము, దేవపూజ, కొలువు మొదలగు కాలములందెల్లను సాత్త్వికస్వభావులైన పురోహితులు, బ్రాహ్మణులు, మంత్రిప్రధానులు మొదలైనవారిచే సేవింపంబడువాండని కాని భగవత్సేవకు కాలనియమము లేమిచే ఎప్పుడేనియు సేవయొసంగువాండని కాని యర్థము.

నేల, అతండు సర్వకల్యాణగుణముల కాటపట్టు. * వాఁడె కౌసల్యాదేవికిఁ గడుపు చల్లగాఁ బుట్టి యానందము నించుచుండువాఁడు. అప్రమేయుండు సముద్రుని వలె మహాగంభీరుండు, హిమవంతునివలె నతిధీరుండు; వీర్యమున విష్ణుసమానుండు, చంద్రునివలెఁ గన్నుల విందుగాఁ బొడసూపువాఁడు; కోపమునఁ గాలాగ్ని తుల్యుండు; క్షమయందు భూదేవిసమానుండు; దానమునందు కుబేరసదృశుండు; సత్య మున మఱియొక ధర్మదేవతయునగు వాఁడు. ఇట్టి యసామాన్యములైన సకలకల్యాణ గుణములు గలిగి, శౌర్యపరాక్రమమున వెలుఁగుచు, నీతిశాస్త్రవిహితములై మిక్కిలియు నొప్పిదములైన సంధివిగ్రహాదిషడ్గుణముల చేత రాణించుచు, ప్రజలకు హితములాచరించుచు, అత్యంతప్రియుండై యున్నతన పెద్దకుమారుని రాముని దశరథమహీపాలుండు, ప్రకృతిజనులకు హితము సేయఁగోరియుఁ, దనకుఁగల ప్రీతినిబట్టియు, యౌవరాజ్యమునకుఁ గూర్పఁదలంచినవాఁడయ్యె. పిదప నాతని యభి షేకమునకై నానామంగళసంభారముల నొడఁగూర్చుటను దశరథుని భార్య యగు కైకేయి గనుఁగొని పూర్వ మారాజు చేత వరములు వడసియున్న కారణమున నప్పుడు రాముని నడవికిఁ బంపుటయుఁ దనసుతుఁడైన భరతునికిఁ బట్టాభిషేకము సేయుటయు ననియీ రెండు వరము లిమ్మనట్లు లాతనిని వేఁడెనయ్యె. ఆ రాజు మంత్రి మొదలగువారితోఁ గూడి యాలోచించి రామునికి రాజ్యము నిట్టునట్లు పూనినవాఁ డయినను దానుదొల్లి కైకేయి కిచ్చిన వరముల దలంచి యాడి తప్పనివాఁ డగుటం జేసి ధర్మపాశమునకుఁ గట్టువడి యేమియు సేయలేక తనగారాబుపట్టైన రాముని రాజ్యంబు వెడలఁ బంపినవాఁడయ్యె, రాముఁడో రాజ్యమునెల్ల నేలఁజాలువాఁడు. అయినను దనతండ్రి కైకేయికి ప్రియము సేయుకొఱకు నడవికిం బొమ్మనట్లు తనకానతిచ్చుట వలన నతండు కైకేయికిఁ జేసిన ప్రతిజ్ఞయుఁ దాను నామాటయు గడవక తండ్రి చెప్పినట్లు

* దశరథునికిఁ జెప్పక కౌసల్యకుఁ జెప్ప నేలయన దశరథునికి రాముని గనుపట్టి మహాఫలము కౌసల్యవలననే లభించుటచే నామెకు చెప్పఁబడినది. లేక, రాజ్యాభిషేకమునకుఁ దగునట్టి పట్టమహిషికిఁ బుట్టినవాఁడని తెలుపుటకై యామె చెప్పఁబడెననియు గ్రాహ్యము.

ఇట్లు వేదాంతోదిత సకలకల్యాణగుణసంపన్నమైన పరమాత్మ రాముఁడేయని నిరూపించు టకై యాగుణము లెల్ల నతనియందు నున్నటుల చెప్పఁబడిన యాగుణములను మఱి చెప్పఁబడకున్న గుణములను గూడ నతని చరిత్రమూలమునఁ బ్రకటించుటకై తచ్చరిత్ర యయోధ్యాకాండకథ మొదలుగాఁ జెప్పఁబడుచున్నది. బాలకాండకథయు నేలఁ జెప్పఁబడకుండుట యేలన నది యిదివఱకే సంక్షిప్తముగాఁ బ్రతిపాదింపఁబడియున్నది. ఎట్లన 'ఇక్ష్వాకువంశంబున జనించి' అనుటచే రాముని యావిర్భావము, 'మహావీర్యుఁడు' 'శత్రునాశకుఁ' డనుటచే తాటకాదిసంహారము, 'ధనుర్వేదమునఁ గృతశ్రముఁ' డనుటచే విశ్వామిత్రునిచే దివ్యాస్త్రములు వడయుట, 'శ్రీమంతుండు' 'లక్ష్మీవంతుఁ' డనుటచే సీతాపరిణయము, 'విష్ణువోలె పరాక్రమము గలవాఁ' డనుటచే భార్గవలోకప్రతిబంధము మొదలైన బాలకాండకథలు ప్రతిపాదితములు.

చేసెద'నన్న ప్రతిజ్ఞయు రెంటిని బరిపాలించువాఁడై యడవికిం జనియె. సుమిత్రాదేవికి నింపుసొంపారఁ జేయుపుత్త్రుం డగులక్ష్మణుండు రామునికి గారాముతమ్ముఁడు. అతఁడు రాముని కెప్పుడును మిక్కిలి యడఁకువతోడఁ బరిచర్య సేయుచు నాతనియెడఁ జాలఁ బ్రీతి గలవాఁడై యుండు. కావున నతండు రాముఁ డడవికిఁ బోవుచుండఁగా నాతనిని విడచి యుండఁజాలక తనదట్టంపుఁదోఁబుట్టుతనము నెఱపుచుఁ దాను నాతని వెంటఁబోయె. రామునికి సీత మిక్కిలియు మక్కువయిల్లాలు ఆసతి జనక మహారాజ కులమున జనించినది. ఆమె రాముని చెట్టఁబాయక యాతనికిఁ బ్రాణంబులకు నెనయై యుండు. సుందోపసుందుల మోహింపఁజేయ దేవతలు పుట్టించిన తిలోత్తమవలెను, అమృతము పంచునపుడు రాక్షసులకొఱకు విష్ణుండు నిర్మించుకొన్న మాయాకారమణిసరణిని, విష్ణుని యాశ్చర్యశక్తి యేమూర్త్తీభవించినసంచునను, అమృతకాశిని ప్రకాశించుచు సర్వశుభలక్షణలక్షితయై, రాముండు పురుషోత్తముం డగుటకు సరిగాఁ దాను నారీమణులయందుత్తమురాలై యెప్పుడును పతివ్రతాచరణశీలయై యొప్పుచుండు. ఆరమణి, రోహిణీదేవి చంద్రుని నట్లో, యట్లే తాను రాముని విడిచియుండ నేరక యాతని వెనువెంటఁబోయినదయ్యె. పురజనులు నాతనిఁ బాయఁజాలక చాలదూరము కూడఁ బోయిరి. తండ్రి యగుదశరథుండును దనముద్దుకొడుకును విడువనొల్లక యరియాడుచుఁ బురద్వారంబుదాఁక వెంబడించి యంతట మఱలె. రాముఁడు పౌరుల వీడుకొలిపి శృంగిబేర మనుపురమున గంగాతీరమునొద్దఁ గాఁపున్నబోయలరాజగు గుహుఁడు దన్ను మిక్కిలి ప్రేమింపఁగా వానింగూడి తన్నుఁ బంపుటకు వెంటవచ్చిన సూతుని సుమంత్రునిఁ బురికి మరలునట్లు వీడుకొలిపె. అంత లక్ష్మణుఁడును సీతయుఁ దోడరా, రాముఁడు గుహునిఁగూడి సూతునివిడిచి యాబోయమిన్న సహాయంబున నానదిం దాఁటినపిదప నారు మువ్వురును కాలిచాకులై యుడువులం బడిపోవుచు నడుమ నీళ్లు నిండరి యున్న పెక్కునదులను దాఁటి భరద్వాజుని గాంచి యతఁడు నియమించినచొప్పునఁ జిత్రకూట మను పర్వతముం జేరి యందు మిగుల రమణీయంబైన యొకపర్ణశాలను గట్టికొని మనోహరము లగువనములజలాశయములనిచ్చలుఁ గ్రీడలాడుచు దేవతలవలెను గంధర్వులవిధమునను మిక్కిలి సుఖముగా వసించి యుండిరి. రాముండు చిత్రకూటమునకుఁ బోవఁగా దశరథుఁడు పుత్త్రునిఁ జూడలేమిం జేసి పెల్లువగల దురపిల్లుచు 'నాపట్టి'యని విలపించుచు నసువులకుంబాసి స్వర్గంబును బొందె. ఆభూపతి మృతుండగుటఁ జూచి యందు వసిష్ఠుండు మొదలుగాఁగల బ్రాహ్మణులు భరతుని రాజ్యంబు సేయ నియోగించిరి. ఆపిన్నవాఁడో రాజ్యం బేలఁజాలునట్టిమహాబలుఁడయ్యును, రాగాదులజయించుకడిమిగలిగి విషయంబులకు లోఁబడని మనంబు గలవాఁడు గాన తనయన్నవలని నెయ్యంబు పెంపున నతఁడు విడిచిచన్న యాపుడమిరాజ్యంబుఁ జేకొన నొల్లక పూజ్యుండగు రాముని యడుగులం గొలిచియతనిని ప్రసన్నునిం జేసికొనుటకై యాతఁడు పోయినయడవికిఁ బయనం బయ్యె. పోయిన

నేమి! రాముఁ డాశ్రితులయెడ నెప్పుడుఁ బ్రసన్నమైన మనస్సుకలవాఁడైనను, దాను
బూనినసత్యంబునునిత్యంబువాఁడిమితో నడపునేకాని దానినివీడునా? భరతుఁ డట్లు
పోయి తనయన్నను రాముంజూచి తద్దయువినయంబు సందడింపఁ బూజ్యభావంబు
మునుకొన 'అన్నా! పెద్దవాఁడుండఁ జిన్నవాఁడు రాజ్యంబు గట్టికొననర్హుండుగాఁ
డను ధర్మమునీవే యెఱుంగుదువు కాఁబట్టినీవే రాజ'వని మిక్కిలియు వేఁడుచు విన్న
వించె. రాముఁడు తనయాశ్రితులమనంబులను దనరూపగుణంబులచే రంజించునట్టి
వాఁడేయగుం గాని వేఱు గాఁడు; మఱియుఁ దన్నేయడిగిన నిచ్చునట్టి మిక్కిలియుదా
రుఁడు; యాచకులు తనకడకు వచ్చిన మెచ్చులు గులుకునవ్వు మొగంబుదాల్చియుండు
వాఁడు; ఇంతేకాక యేయర్థులుగాని కాకుత్స్థవంశమువారికడకుంబోయి కోరికయీడే
రక మరలిపోయినవారు లేరని వంశపుఁగీర్తియు మిక్కిలి గలవాఁడు; మఱియునాశ్రి
తుల మనోరథములెట్టివేసియునొనగూర్పఁజాలు దిట్టయైనవాఁడు. తానట్టివాఁడయ్యు
నేమిచేయవచ్చు? తండ్రియాజ్ఞ గడవరాని ప్రతిబంధకమయ్యెనే! కానయతఁడు
భరతుఁ డెంతవేఁడినను రాజ్యమునొల్లఁడయ్యె. అయినను దనకుమాఱుగా రాజ్యంబు
సేయుటకై తనపాదుకలను భరతునకు నిల్లడగా నొసంగి తన్నువిడనాడనొల్లక
చింతిలుచున్నయాతమ్ముని మాటిమాటికి నూఱటఁ జెప్పి యచటనుండి మరలించె.
భరతుండు 'రాముని దెచ్చి పట్టంబు గట్టెద. అతనికిఁ బరిచర్యలు సలిపి చరితార్థుండ
నయ్యెద'నని యుబ్బిపోరుచు వచ్చినతనకోరిక యీడేఱకపోఁగాఁ జేయునది లేక
రామునిచరణంబుల కెరంగి యతనిపాదుకలం బ్రసాదంబనికైకొని యహరహంబుఁ
బూజించుచు రాముండు విడిచినయయోధ్యం జొరనిచ్చగింపక దానికిసమీపంబున
నిలిచి రాముండెపుడువచ్చునాయని కోరుచుఁ బాదుకలపై రాజ్యభరము మోపి
పాలించుచుండె తమ్ముండింత నిర్బంధించియుఁ దనచేసినప్రతిజ్ఞనుండి రాముండు చలిం
చనే! ఇంతేల! అనుంగుఁదల్లులు దన్ను వేఁడికొన్నను వనంబు వీడియు రాజ్యభోగంబున
కాస పడనట్టిజితేంద్రియుండు రాముండుగాక మఱెవఁడు? రామప్రసాదంబు పెంపున
సొంపు దళుకొత్తుచు భరతుండు తరలిపోఁగా రాముం డచటికి నగరజనులు మఱి
యెవ్వరేని వచ్చి తన్ను గమ్మని బలాత్కరింతురో యని యాలోచించి తండ్రిమాట
పరిపాలించుటయందే మనంబు నిలిపి బహువిధభూయిష్ఠంబైనదండకారణ్యంబు
జాగరూకుండై ప్రవేశించె. అట్లుసొచ్చి కుతూహలంబునఁ గన్నుదోయి దామరఱేకుల
వలె వికసిల్ల నందు మెచ్చులు గులుకువేడుకలఁ జూచుచుం బోయి యాయుత్సా
హంబున విరాధుం డనురాక్షసుని సంహరించివాని నివధించుటయె కానుకగాఁగొని
శరభంగమహామునిని దర్శించి యతనియనుజ్ఞ గొని సుతీక్ష్ణుండనుతపస్వినవలోకించి
పిదప నగస్త్యునినతనితమ్ముండైనసుదర్శనుని గాంచినవాఁడయ్యె. అంత నగస్త్యుండు
దన కింద్రుఁ డిచ్చినవిల్లునుఖడ్గమును నక్షయబాణంబులగు రెండుతూణంబులను గై
కొను మనిరామునికిం జెప్పఁగానతండును దనవీర్యంబునకుం దగినయాయుధంబులు

లభించెనని మిక్కిలియు సంతుష్టుండై వానిం గైకొనియె. పిదప నాశరభంగవనమున రాముఁడు వానప్రస్థులైన మునులతోడం గూడి వాసముచేయుచుండఁగాఁ జుట్టుఁ బట్టులం గలఋషులందఱును దమ్ముఁ గాఱియపెట్టుచున్న యసురులను రాక్షసులను జంపింపఁ బిలఁచినవారై రామునికడ కరుగుదెంచిరి అట్లువచ్చి, యతఁడు హింసానురూపంబు కానితాపసరూపంబు దాలిచియుండుట చూచియు, దానిని బాటింపక 'ఇతండు సర్వేశ్వరుండు గానదుష్టులనెల్లఁ జంపి రక్షించు'నని నిశ్చయించి రాక్షసవధార్థ మాతని శరణుఁ జొచ్చిరి. అంతఁ గ్రూరరాక్షసులకు నునికిపట్టగునయ్యాదండకాటవియందు రాముండామునులవేఁడికోలు నంగీకరించె. ఆఋషులో కేవలులుగారు; అగ్నికల్పులు. వా రనల్పమైనతమతపంబు తేజంబునం జేసియే యతిభయంకరమైనదండకారణ్యంబున వసించుచుండిరి. రాముండట్టిమహాఋషులసన్నిధియందే 'యుద్ధంబున రాక్షసులనెల్లవధించెద'నని ప్రతిజ్ఞ గావించె. పిదప నతండాదండకారణ్యంబున నేపంచవటియందు వసించియుండఁగా జనస్థానంబునందుఁ గాఁపున్న కామరూపిణి యగునొక రాక్షసి శూర్పణఖ యనునది రాఁగా నతండు దానిని ముక్కు చెవులు గోసి వికారరూపం గావించె. అదిపోయి యచటి రాక్షసులతోఁ గూయిడఁగా విని వారు రామునితోఁ గయ్యంబుసేయ నుద్యుక్తులై వచ్చుటయు, నావీరుండు వారిని వారికి ముఖ్యులైన ఖరదూషణత్రిశిరు లను రాక్షసులను వారి కనుచరులైనతిక్కుంగలరక్కసులను సమరంబున మార్కొని తుత్తుమురుగావించె. ఇట్లావనంబున నసహాయుండై రాముండొక్కరుండేయాజనస్థానంబున నివసించు ఘోరరాక్షసులఁ బదునాల్గువేవుర నొక్కుమ్మడిఁ జక్కాడె. రావణుండు తనజ్ఞాతులైన ఖరాదులు వధింపఁబడుట విని పెనుఁగోపంబు దీపింపమతిదూలి రాముని నిర్జించుటకై మారీచుం డనురక్కసుని సహాయంబుఁ గోరఁగా వాఁడు రావణుం జూచి 'ఓయీ! ఖరదూషణాదుల నవలీలం దునుమాడిన మహాబలవంతుం డగు నా రామునితోఁ బగ పూనుట తగదు తగ'దని పెక్కుమాఱులు పరిపరి విధముల వారించె. వారించిన నేమి! మృత్యువుచేఁ బ్రేరితుండైన వానికి హితములు చెవిఁ దూఱునా? వాఁ డమ్మారీచుమాటలు పీటఁబుచ్చి వానితోఁ గూడి ఖరాదివిజయాభిరాముం డగు రాముండున్న యాశ్రమప్రదేశంబునకు నప్పుడేబయలుదేఱిపోయెను. అట్లుపోయి మాయావి యగు మారీచుని 'ఓయీ! విచిత్రకనకమృగరూపంబు దాల్చి రాజకుమారులగు రామలక్ష్మణుల దూరముగా వంచించికొనిపొ'మ్మని నియమించి తన ప్రయత్నమున కడ్డపడిన జటాయువు మృతప్రాయునిఁ జేసి రాముని నెల్లపుడు బాయకుండు నతని యిల్లాలి నపహరించికొనిపోయె. అంత రాముండు మరలివచ్చి సీతం గానక వెదకుచు నొక్కయెడఁ గుత్తుకనుండి ప్రాణంబులు వెడలియు వెడలక పడియున్న గద్దలరాయని జటాయునిం జూచి వానివలన మిథిలాధిరాజసుతను సీతను రావణుండు గొనిపోవుట విని మిక్కిలియు శోకాగ్నిం దపించి యింద్రియములెల్లఁ దత్తఱిల్ల నిల్లాలిం దలఁచి పలవింప సాగెను. పిదప సీత యపహృత యగుటకన్నను జటాయువు మృతుం డగుటకు మిక్కి

లియు ముప్పిరిగొన్న శోకంబున యాగృధ్రనాయకునకు జటాయునకు దహనసంస్కారమ్ముసేసి సీతను వనమున నలుగడల వెదకుచుం బోవంగా నొక్కయెడ మిక్కిలి వికారరూపంబున ఘోరముగాఁ గనంబడుచున్న కబంధుఁ డనునొక రాక్షసుఁడుగానంబడియె. అంత నతండు మహాభుజబలాఢ్యుఁడుగాన వానిని జంపి వాఁడు వేఁడికొన్న రీతి నగ్నిసంస్కారము నొనర్పఁగా దానం జేసి వాఁడు దేవలోకప్రాప్తినొంది పోవుచు నడుమ నాకసంబున నొకింతనిలిచి 'రామా! శబరి యనునొక పరివ్రాజిక గలదు. అది, గురుశుశ్రూషాధర్మపరాయణురాలు; భగవద్ధ్యానాదిధర్మంబులం జలుపునది; యతిథిసత్కారధర్మంబును దక్కంగలసామాన్యవిశేషధర్మంబులను జతుర. దానిం బోయి గను' మని చెప్పి చనియె. అంత రాముండు ధర్మచారిణి యగు శబరరమణిం జూచు సొంపు దీపింప నాశ్రితజనులకుం గలయఖిలవిఘ్నంబుల నిర్మూలంబు సేయువాఁడుగాన దానిం గూర్చి పోవంగా నదియు రామునకి యథావిధిని మిక్కిలియుఁ జక్కఁగాఁ బూజలాచరించె. పిదప నా దశరథకుమారుండు పంపాసరస్తీరంబున హనుమంతుఁడను వానరునితోఁ జెలిమి వాటించి యాహనుమంతునిమాట చొప్పున సుగ్రీవునితోడం గూడినవాఁడై, యాకూటికవలని వేడుక చేత సీత నెడఁ బాసిన దైన్యంబు గప్పిపుచ్చియొకింత తెంపు దెచ్చుకొనియె. అయిననా నెఱదంట, తానొంటిగా సర్వకార్యంబులు నిర్వహించుకొనఁ జాలినబలవంతుఁ డయ్యు లోకరీతి ననుసరించి సహాయసంపదం గోరినవాఁడుగాన సుగ్రీవునికి మొదటినుండియు నంతవృత్తాంతంబును, అందును విశేషించి సీతావృత్తాంతమును, జరిగినరీతిని జెప్పె. వానరాగ్రణియగు సుగ్రీవుఁడును రామునివృత్తాంతమంతయు విని రామునికార్య మొనఁగూర్చుటవలన దనప్రయోజనము నెఱవేఱంగలుగుననియుఁ దనకు సమానదుఃఖంబు గల మహాబలవంతుఁడు సహాయంబుగా దొరికెననియు మిక్కిలియుఁ దుష్టిం జెంది యగ్నిసాక్షికముగా నతనితోఁ జెలిమిగావించె. పిమ్మట నావానరేంద్రుండు తనపూర్వదుఃఖములను దలంచికొని కనుల నీరు గ్రమ్మ దుఃఖించుచు వాలికిని దనకును గలిగిన వైరమును రాముం డడుగ వరుసగా నంతయు నంతయు నెయ్యంబునఁ దెలియం జెప్పఁగా రాముండును వాలినివధించెదనని ప్రతిజ్ఞ గావించె. అంత ఋశ్యమూకంబున నవ్వానరుండు వాలికిం గలబలంబు రామునికి నుత్సాహంబు చొప్పడం జెప్పె. అయిన నతఁడు తనలో రామునిం జూచినది మొదలుగా 'నితఁడు సఖ్యమునందు వాలిని బోలఁగలఁడా' యని నిత్యంబును శంకించి రామునికి వాలిబలం బెట్టిది యని నమ్మిక గలిగించుటకును, రామునిబలంబు దానెఱింగి నమ్ముటకును, బూనియపుడింక శిథిలముగాక వెనుఁగొండవలె నున్న దుందుభికాయంబును నమ్ములకూఁడై మిగిలియున్న దానిని రామునకుఁ జూపి 'ఇదె యీయెమ్ములబొందిని వాలి, కాలి మొనను మిక్కిలి మీఁదికెగఁ జిమ్మును జుమీ' యనెను. మహాబాహుండును నత్యంతబలవిలసితుండు నగు రాముండు నాయెమ్ములఁ గూటిం జూచి వెడనవ్వు నగి వాలి కాలంగొని యున్నాయువిండ్లపట్టు చిమ్మినదానిని దాను బొటనవ్రేల నెచక్కఁ

బదియోజనములదవ్వునంబడ నెగమీటె. దానిచేతను సుగ్రీవునకునమ్మిక యిమ్ముగాఁ గలుగదయ్యె. రాముం డది యెఱింగి మఱింతనమ్మిక గలిగించువాఁడై యొక్కబలుతూపు దొడిగి యేడుసాలముల నొక్కటనుచ్చిపోవ నేయఁగా నది యామ్రాఁకులనే కాక దాపున నున్నకొండను దూసికొని రసాతలంబునకుఁజనిమరలివచ్చె. రాముఁడు సప్తసాలాదుల భేదించినయతిమానుషకృత్యంబునుజూచి సుగ్రీవుఁ 'డితం డవశ్యము వాలిని జయింపఁజాలు'నని విశ్వాసము నొంది యచిరకాలమునఁ దనకు రాజ్యముఁ బడయఁ గలుగునని మదినంతయుసంతసిల్లి తన్నుఁగపిరాజుగా నన్నుకొనుచుఁ, బెనుఁగొండలనడిమిగుహావలెఁ బోలుచున్నకిష్కింధకు రామునితోడం గూడి యప్పుడు కదలిపోయి యుత్సాహం బుప్పొంగ, బంగరువంటిమేనిపసిమియున్న మఱింత కాంతిఁ దళుకొత్త, పెనుగొంతున సింహనాదంబు గావించె. మునుపటి దానికంటె మిక్కిలి వింతగా నున్నయాపెనుగర్జనంబును వానరేంద్రుం డగువాలి విని వానితో బోర నుద్యుక్తుండై యాగుహనుండి బయలువెడలఁగా నప్పుడు తార పోవలవ దని వారించియు వాఁడు దానికిం దగునూఱటఁ జెప్పి యయ్యాకొలిపి తాను సుగ్రీవునితో వచ్చి మార్కొనియె. వారిరువురు మాఱుకొని పోరునపుడు రాముం డావాలి నొక్కబాణమే యేసి ప్రాణములకుఁ బాపె. అట్లు సుగ్రీవుఁడు వేఁడికొన్నపగిది నాసమరంబున వాలిం బరిమార్చి యాసుగ్రీవునే వాలిరాజ్యంబున రాముఁడు ప్రతిష్ఠించె. ఆవానరవీరుఁడును రామునికయి జనకరాజసుతను జూడం గోరి నానాదేశముల నివసించుచున్నవానరుల సంకలించి రప్పించి'సీతను జూచివేగరం' డని నలుదిక్కులకుం బంపె. పిదప ముఖ్యుల రాజకుమారిని వెదకఁ బోయినవారలలో హనుమంతుఁడు సంపాతి యనుగద్దలవెలమిన్నఁ గాంచి యతఁడు సీత లంకయందున్నదని చెప్పఁగా దానిమాటఁ దొప్పిన మిక్కిలియు బలవంతుఁడుగాన శతయోజనవిస్తారంబు గలలవణసముద్రంబును గుప్పించి దాఁటి రావణుంపు పాలించుచున్నలంకాపురిఁ జేరి యందు రావణుని ప్రమదవనంబైన యశోకవనంబున రాముని నెప్పుడును మనంబునఁ దలంచుకొనుచుఁ జింతిలంగుందుచున్న సీతాదేవిని గాంచి యాపంచలాక్షికి రాముఁ డానవాలుగా నిచ్చినయంగుళీయకమును నొసంగి సుగ్రీవునితోఁ జెలిమిసేయుట మొదలుగా వానరుల నలుగడల వెదకింపంచుటవఱకుఁ గలసకలవృత్తాంతంబును దెలియంజెప్పి 'తల్లీ కొద్దికాలంబుననే రాముఁడు వచ్చి నిన్నుఁ గొనిపోవు'నని యావిదేహకుమారి నూఱడించి యంతట నూరకపోవుట పౌరుషముగాదని యాయశోకవనము వెలుపలి ద్వారమును గూల్చె. అది యెఱింగి తనపయిం దలపడ వచ్చినపింగళనేత్రుఁడు మొదలైనయేవురుసేనాపతులను జంపి జంబుమాలి యాదిగాఁ గలమంత్రికుమారుల నాఱుపురం బొరిపుచ్చి రావణుని రెండవకుమారుఁడును మహాశూరుండు నగునక్షునిం బట్టినీఱుసేసి పిదప నింద్రజిత్తుండు ప్రయోగించిన బ్రహ్మాస్త్రంబునకుఁ గట్టువడి చిక్కువడియె. అయినను నైదుగడియలవఱకు నాశరమునకుఁ లోఁబడియుండి పిదప

విడినడునట్లతనికి బ్రహ్మవరము గలిగియుండుటంజేసి తానాతూపువలన విముక్తుం డగుట దెలిసి తన్నుఁగట్టియలంచినరక్కసులనెల్లఁ జెల్లచెదరుగాఁదూఁటాడనంత మేటి వీరుండయ్యు, రావణునితో మాటాడవలయునను కార్యాంతరముంబట్టి యిచ్చమెయి వారిని బోరిగొనక మన్నించిమిథిలాపతిసుతయగుసీతం దప్పఁ దక్కినలంకాపురమం తయునగ్నిపాలుగా దహించి సీతాదర్శనము మొదలుగాఁగల ప్రియవృత్తాంతమును రామునికిం దెలుపుటకయి మరల సముద్రము దాఁటివచ్చె. అపరిమేయబలబుద్ధిపరాక్రమాదివిరాజమానుండైనయాకపినాథుండు మహాత్ముఁడగురామునికడకుం బోయి యాతనికి భయభక్తియుక్తముగఁ బ్రదక్షిణము గావించి ‘చూచితిని సీత’నని చెప్పె. అంత రాముఁడు రావణుని బోరిగొనఁ దలంచి సుగ్రీవుని గూడి మహాసముద్రంబు తీరంబునకుఁ బోయి యది తెరువీయక యూరకుండఁగాఁ జూచి యేచినకినుక వేఁడివెలుంగువలెఁ దుఱఁగలించువాఁడిబాణంబుల నాజలరాశిని బాతాళతలంబు వఱకుఁ బెండలివం డగునట్లు కలంచె. అంత నదీనాథుఁ డైనయాసముద్రుఁడు నిజ రూపమునఁ గాడసూపితనపయి సేతువుగట్టినయెడ దానిని దాను దాల్చునట్లు చెప్పఁగా వానిమాటచొప్పున రాముండు నలునిచే సేతువు గట్టించి దానిమూలమున జల రాశిని దాఁటి లంకాపురంబుఁ జేరి యుద్ధంబున రావణుం జంపి సీతను జేకొనియె. అయిన నామేటిమగఁడు ‘పగవానిని జంపి పడఁతిని మరలఁబడయుట పౌరుషముగా పాడుకొనుటకే కాని యొరునింట నుండినయిల్లాలిని మరలఁ గైకొనుట దగునా’యని యగ్గలంపుసిగ్గునకు లోనయి దేవతలు వానరులు రాక్షసు లాదిగా బలసియున్నకొలువున నా చెలువను వాఁడిములుకులవంటిపలుకు లాడఁగా నాపుఁబోఁడి యాపరుసములు నెఱకు లాడిన నోర్వం జాలక పాతివ్రత్యంబు దీపింప నగ్నిం జొచ్చెను. అంత నగ్నిభట్టారకుండు ‘రామా ! ఈసీత మహాపతివ్రత చేపట్టు,మని చెప్పగా రాముండును దనయిల్లాలు మనోవాక్కాయంబులందుఁ గొంచెమేనియుఁ బాపంబు లేనిదని యెఱింగి మిక్కిలియు నుప్పొంగి వెలింగె. దేవతలును ‘ఔరా! రామునిధర్మవాంఛ’యని మిక్కిలియు నతనిని బూజించిరి. అమ్మహాత్ముఁడు రావణుని జంపినయమ్మహనీయకార్యమునకు ముల్లోకములంగల * చరాచరంబులు దేవతలును ఋషిగణములును మిక్కిలియుఁ దుష్టిం జెందినవారైరి. అంత రాముఁడు రాక్షసేంద్రుడయినవిభీషణునికి లంకాపురియందుఁ బట్టాభిషేకంబు గావించి మున్ను రావణుని సబాంధవముగాఁ జంపి యాతనిఁ బట్టంబు గట్టునట్లు తా నాడినప్రతిజ్ఞ యొనగూడుటవలనఁ గృతకృత్యుం డయ్యె. ఇంతకుమున్ను రాముఁడు ‘భరతునివలెనీవిభీ

---

* జంగమములైన చేతనములకుఁ గలసంతోష చిహ్నములు తెలియంగూడునుగాని స్థావరములం దవియెఱుంగుటయెట్లు? అన్నయెడలచిగుర్చుట మొదలైన వానిచేఁ దెలియంగూడునని యెఱుంగునది. స్థావరములు జ్ఞానరహితములు గాని వానికి సంతోషము తెలియదనరాదు. ‘అన్తస్సంజ్ఞాభవన్త్యేతే’ అని విష్ణుపురాణంబున వానికి లోపలఁ దెలివియుండు నని చెప్పంబడియె.

షణుఁడును రాజ్యం బిపుడు వలదనునేని నా ప్రతిజ్ఞ చెల్లుట యెట్లు, అని చింతచే వివర్ణుఁడయి యుండి యతండు రాజ్యంబు గైకొనఁగాఁ దృప్తినొంది తనయెప్పటి రూపుం జెంది మనసునం దంతవఱకుఁ జింతచే నేపారుచుండిన తాపంబును డిగఁద్రావి మిక్కిలియు మోదంబునం బొదలుచుండె. లోకకంటకుం డగు దశకంఠుని గీటడఁచిన యామేటిదగ జెట్టిం జూడ దేవతలు రాఁగా వారివలనఁ బడసినవరమున రాముఁడు యుద్ధమున హతులైన వానరుల నెల్ల నిదురించి లేచినవారిం బోలె, మరల బ్రతికించి లేపి వారందఱును, సుహృదులగు సుగ్రీవవిభీషణాదులును, గొలువఁ జెలువారు పుష్పకవిమానంబు నెక్కి యయోధ్యకుఁ బయనంబయ్యె. ఇట్లు పయనంబై భరద్వాజాశ్రమంబును జేరి, యపుడు, పదునాలుగేండ్లు గడచిన నుండుట యెఱింగి, సత్యంబును వాఁడిపూనికతో నడపువాఁడు గాన భరతునకు దాఁ బదునాలుగవయేఁటితుదను వత్తు నని యాడినమాట దప్పకుండుటకై యాతని చెంతకుఁ దనరాకం దెలుప ముందు హనుమంతుని బుచ్చె. అంత నమ్మునియాశ్రమంబుననుండి కదలి పుష్పకం బెక్కి భరతుని వృత్తాంతమును సుగ్రీవునకును మఱియుం దక్కవృత్తాంతముల సీతకును జెప్పుచుఁ బోయి భరతుం డున్న నందిగ్రామంబున కరుగుదెంచె. ఇట్లు పితృవచన పరిపాలనంబునను సుగ్రీవవిభీషణభరతులకుఁ జేసిన ప్రతిజ్ఞలఁ బూరించుటవలనను దోషలేశంబును బొరయనివాఁడై రాముఁ డానందగ్రామంబున భరతాదులగు తమ్ములను గూడి, తాల్చియున్న జడలను బుచ్చి, జడదారివేషంబు వీడి, సీతాదేవిపాలుపునకుం దగిన భూపాలవేషంబునఁ బ్రకాశించుచు, నాదేవితోడం బట్టాభిషిక్తుండై మరల రాజ్యంబుఁ బడసి పాలించుచుండె. రాముఁడు రాజ్యంబు సేయుచుండ సర్వజనులు మేనం బులక లొత్త మనంబున సంతసము దొంతరలుగొన సమస్తకామితములం బడసి తుష్టిం జెందిరి. మఱియు వారు రాముని నెడఁబాసి కృశించియుండిన యవయవంబులు పుష్టిం బొంద, రామభక్తిపూర్వకంబులైన కర్మంబులాచరించుచును, సతతాభ్యుదయంబుకొఱకు నిష్టదేవతోపాసనయు న్యాగధర్మంబులు గావించుచును, నుండుటం బట్టి, ధర్మాత్ములై శరీరరోగంబులుగాని మనోవ్యాధులుగాని లేక కఱవు మొదలైనయుపద్రవంబులభయంబు మాని సుఖంబుండిరి. పురుషులకపు డెయ్యెడలంగాని తాము బ్రతికియుండఁగా * పుత్రమరణంబు గలుగదు.

* 'కలుగదు' అని భవిష్యదర్థకమును బ్రయోగింపనేల యనఁగా 'ప్రాప్తరాజ్యస్యరామస్య వాల్మీకిర్భగవానృషిః। చకారచరితంకృత్స్నంవిచిత్రపదమాత్మవాన్' అన్నట్లు రావణుం జంపి రాముండు రాజ్యము సేయుచుండు కాలముననే వాల్మీకి రామాయణము రచించెనని తెలియుచున్నది. కాఁబట్టి యతఁడు రామాయణము రచించునపుడు రాముని రాజ్య మారంభించియుండుటచే నిఁకనతని రాజ్యంబునం గలుగవలసిన ప్రజాక్షేమము పుత్రమరణాదులు గలుగమి మొదలైనవిషయములను భవిష్యదర్థకక్రియచేఁ దెలిపినాఁడు. అనఁగా తాను రామాయణము రచియించునపుడు కలుగక యుండి కలుగనున్న యుత్తరకాండకథను జెప్పినాఁడని తెలియునది.

పడంతుకలును * వితంతువులు గాక యెప్పుడును బతివ్రతలై యుండఁగలరు. అగ్ని
† భయం బేమియుఁ గలుగదు. ఏప్రాణులైనను బ్రమాదంబున జలంబుల మునింగియు
నపాయంబుఁ బొరయరు. వాయువువలనఁగాని భయము గలుగదు. జ్వరముచేతను వెఱపు
లేదు. ఆఁకలిదప్పులవలనను దిగులుపుట్టదు. దొంగలమూలమునను దెంపుగుందరు.
పురంబులును జనపదంబులును ధనధాన్యంబులం బొదలుచుండు. కృతయుగంబునం
బోలె నందఱును నిత్యమును ముదంబునం బొదలువారు. ఇట్లు రాముండు క్షత్రియుల
కసాధారణం బయిన ప్రజాపాలనధర్మం బాచరించి బ్రాహ్మణధర్మానుసారము గాఁ
దనకీర్తి నలుగడలం బూర్తినొందఁ బెక్కు లశ్వమేధంబులును బహుసువర్ణకంబుల నెడి
యజ్ఞములును యజించి బ్రాహ్మణులకుఁ బదివేలకోట్లగోవులును గొలఁది యిడరాని
ధనమును నొసంగి బ్రహ్మలోకంబునకుం జనఁగలవాఁడు. మఱియు రాజవంశ్యుల
నూఱుమడుంగులెక్కుడుగ నెల్లఁగావించి యాయా రాజ్యంబులందు వారిని నెలకొలుప
గలవాఁడు. నాలుగువర్ణములవారిని దమతమవర్ణాశ్రమధర్మములు దగముగా నడుపునట్లు
నియోగించును, ఇట్లు పదునొకండు వేలసంవత్సరంబులు రాముండు రాజ్యంబును, గొలువు
గొలుచునట్టు, లక్కుఱితోడను జాఁగరూకతోడను నెడతెగక పరిపాలించి బ్రహ్మ
లోకంబును బొందును. ఈ రామచరితంబు వేదసమ్మతంబై సదగానదన్ను నుపాసించు
వారిని బరిశుద్ధులనుగావించి వారిపాపంబులఁ దూలించి పుణ్యంబులం గలిగించునదియు
నగును. కాన దీని భక్తిమెయిం బఠించువాఁడు సకలపాపములనుండి విడివడినవాఁడ
గును. ఆయుర్వృద్ధికరంబై యాఖ్యాయికారూపంబున నున్న యీ రామాయణం
బును నరుఁ డెవ్వండేనియుఁ బఠించునేనివాఁడు మృతినొందినపిదపఁ బుత్రులతోడను
బౌత్రులతోడను బంధుభృత్యజనంబులతోడను స్వర్గంబుఁ బ్రాపించి యందు మిక్కి
లియుఁ బూజితుండై రాజిలుచుండును. బ్రాహ్మణుండు దీనిని బఠించి వేదవేదాంతవిదుం
డును శబ్దబ్రహ్మపారగుండును నగు. క్షత్రియుండు పఠించి సామ్రాజ్యముం బడయు.
వైశ్యుండు పఠించి బేరంబులు తోరంబులై బహుధనసమృద్ధి గాంచు. శూద్రుండును
‡ పఠించి కులమువారిలో మిక్కిలిఁ బేరిమిం గొమరారుచుండును. మొదటిసర్గము.

---

* పడతులు విధవలు కారన్నయెడల పురుషులకు మరణమే కలుగదని యసంగతి సిద్ధించు
చున్నది. కాఁబట్టి పడఁతులు భర్తతోడ సహగమనము చేయుటచేతను, సహగమనము చేయక బ్రతికి
యుండినను భర్తయొక్క యంశమే యైన సత్పుత్రులు గలిగియుండుటచేతను, విధవలు కారని యూహించు
నది. విధవాత్వముగల కౌసల్య మొదలైనవారు రామాదిపుత్రులు గలవారుగాను మిక్కిలి వృద్ధలుగాను
నుండుటచే, విధవలుగా గ్రహింపఁబడరైరని కొందఱిమతము.

† అగ్ని జలవాతములచేనగునది ఆధిదైవికభయము; జ్వరాదులచేనగునది ఆధ్యాత్మికభయము;
దొంగలు మొదలైనవారిచేఁ గలుగునది ఆధిభౌతికభయము. ఈ తాపత్రయంబును లేమి చెప్పంబడెను.

‡ శూద్రులకుఁ బఠించుటకధికారము లేమింజేసి పఠించుట యనఁగా బ్రాహ్మణాదులవలన వినుట
యని యర్థ మూహ్యము.

## బ్రహ్మ ప్రత్యక్షమై వాల్మీకి ననుగ్రహించుట.

ధర్మస్వభావుఁ డగువాల్మీకిమునీంద్రుఁడు తా నడిగినదానికిం దగును త్తరముగా నారదుఁడు వచించినయవ్వాక్యమును విని వాక్యనులపన నెఱింగినవిద్వాంసుఁడు గాన యాఋషితిలకుని శిష్యులును దానును గొనియాడినవాఁడయ్యె. ఆ దేవర్షియు వాల్మీకిచే యథావిధిగాఁ బూజితుఁడై యపుడు 'పోయివచ్చెద' నని యాతనిచే ననుమతిగొని మింటిదారిని బోయెను. అతఁ డొక్కింతసేపున దేవలోకమునకుఁ బోవఁగా నపుడు వాల్మీకియు గంగానదికి దాపున నున్నతమసానదీతీరమునకుఁ బగటిపూఁట జలకమాడుటకై పోయె. అమ్మహాతపస్వితమసానదీతీరమును జేరి యందు బురద లేక తేటగా నీటు గులుకుచున్న రేవును జూచి ప్రక్కనున్నశిష్యునితో 'భరద్వాజా! మంచివానిమనస్సువలెఁ బంకరహితమై ప్రసన్నజలమై రమణీయముగా నున్న యీ రేవును జూచితివా. నాయనా! జలకలశము నిట యుంచి నా నారచీర నిమ్ము. గంగదాపుననే యున్నను వేళ మించుచున్నదిగాన యుత్తమమైనయీతమసానదితీర్థంబు ననే స్నానంబు చేసెద' ననియె. గురుపరతంత్రుఁ డగుభరద్వాజుండును నారచీర యొసంగె. అమ్మునియు వానికేలనుండి యావల్కలమును గొని పిదపఁ దా నెంత జితేంద్రియుఁ డయ్యు దైవికముగా నవ్వనమును జూచువేడుకం దగిలి విశాలంబై యున్నదానియందు నలుగడలఁ గలయఁ గ్రుమ్మఱువాఁడయ్యె. అమ్మహాత్ముఁడో శపింపను ననుగ్రహింపనుం జాలినట్టిమహిమ గలవాఁడు. అట్లతఁడు తిరుగునపుడా వనమున నాతీర్థమునకు సమీపంబున నాలుమగలైనక్రౌంచపిట్టలు రెండు నొండొంటిని వీడక కవగూడి మరులుకొని క్రొలక్రోలమని కలరవములు సేయుచు చరించుచుండఁగాఁ జూచెను. అపు డచటికి నొకబోయవాఁడును వచ్చె. ఏపాపమును జేయునిపులుఁగులఁ దెగఁ జూచుటయే వానిబ్రతుకు గదా. కాన వాఁడు నా రెంటిని జంపుపాపంబునకు నొడిగట్ట నిశ్చయించి యమ్మునిచూచుచునుండఁగానే సరకుసేయక యాజతలో పోతుపిట్టను జంపఁగా నదియు నేలంగూలి విలవిలం దన్నుకొనుచు నొడలెల్ల నెత్తుటను దోఁగియుండె. సొగసు గులుకు నెఱ్ఱనిసిగయు, సిగులు చూపునవకంపుగఱులుఁ గలయాఁడుఁబిట్టయు నాగిట్టినపులుఁగుం జూచి, కిట్టా! యింతదాఁక మరుకేళిని జాలిగొని తన్నుంగవిసి చొక్కుచున్నసంగడికానిని దనమగని నెడఁబాసి యతిదీనముగాఁ గూయిడసాఁగెను. అంత పరమధార్మికుఁ డైనయామునివరునకు, నిషాదుండు పడఁ గూల్చినయాపక్కిని జూడఁగా మిక్కిలియు జాలి పుట్టె. ఇటు లాక్రౌంచపెంటి వాపోవుచుంట విని మిక్కిలియుఁ గరుణ మునుకొనఁగా నా

విప్రేంద్రుడు నిషాదునిఁజూచి 'ఓరీ! *నిషాదుఁడా! మరువికారంబున మతి మఱచియున్న క్రౌంచపిట్టల జతలోనొక దానిని జంపితివిగాన నీవుకడలేని

---

* ఇందులకు సంస్కృతము.

'మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్ క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితమ్'

దీనికి నిషాదశాపపరమైనయర్థము పూర్వమేస్పష్టము. కొందఱు 'వాల్మీకిముని ముఖమునుండి మొట్టమొదటఁబొడసూపిన యీశ్లోకము కేవలశాప మగుటతగదు వాల్మీకి భగవంతుని దీనిచే మంగళాశాసనము చేయుచున్నాఁడు' అని మంగళాశాసనపరముగా నర్థము చేయుచున్నారు. అది యెట్లన:— నిషాద శబ్దమునకు 'నిషీదత్యస్మిన్నితి నిషాదః' అనువ్యుత్పత్తిచే నివాసమని యర్థము. 'మా' అనఁగా లక్ష్మి, కాఁబట్టి (మానిషాద) లక్ష్మికినివాసమైనవాఁడా-ఓ శ్రీనివాసా యని సంబుద్ధి. (యత్) ఎందువలన, (క్రౌంచమిథునాత్) రాక్షసమిథునమునుండి - రావణమండోదరులనుండి యనుట, (కామమోహితం) మన్మథునిచే మోహితుఁడైన - మన్మథప్రేరితుఁడై సీతను అపహరించిన యనుట, (ఏకం) ఒకరిని - రావణుననుట, (అవధీః) చంపితివో - త్రిలోకకంటకుఁడైనరావణునిఁ జంపి త్రిలోకమును గాపాడితివో యనుట, (శాశ్వతీఃసమాః) కలకాలము, (ప్రతిష్ఠాం) 'ప్రతిష్ఠాస్థితి మాహాత్మ్యే' అన్నట్లు మహిమను, (అగమః) పొందుము. ఇట్టిశ్లోకముచే నిష్టదేవతాస్మరణరూపమైనమంగళమును ఆచరింపఁబడినది. ముని భగవంతునికిఁ జేయు మంగళాశాసనము నైనది. 'కావ్యార్థసూచనం కైశ్చిన్నాన్ద్యామేవ నిరూప్యతే' అనువచనమును బట్టి యీశ్లోకమున నిఁకఁ జెప్పఁబడు కావ్యార్థము సంక్షేపముగాఁ దెలుపఁబడియున్నది - ఎట్లన 'మానిషాద' అనుటచే సీతాపరిణయమును జెప్పు బాలకాండకథ చెప్పఁబడినది. 'ప్రతిష్ఠాంత్వమగమః' అనుటచే పితృవచనపరిపాలన ప్రతిజ్ఞను దెలుపునయోధ్యాకాండకథ నిరూపితమైనది. 'శాశ్వతీస్సమాః' అనుటచే రాముండు ఋషులకుఁ జేసినప్రతిజ్ఞను నిర్వహించుటకు నడవుల బహుకాలముండుటను దెలుపు నరణ్యకాండకథయు సూచితము. 'క్రుంచగతి కౌటిల్యాల్పీభావయోః' అని 'క్రుంచ్' ధాతువునకు గతి కౌటిల్యము అల్పీభావమును వాచకములగుటచే (క్రౌంచయోః) అనఁగా కుటిలములైన-అనఁగా తిర్యక్కులైన - తారావాలు లనుమిథునమున, (ఏకం కామమోహితం) అనుటచే సుగ్రీవునిభార్యను హరించిన వాలిని, (అవధీః) చంపితివని కిష్కింధాకాండకథయుఁ బ్రతిపాదితము. క్రౌంచము లనఁగా అల్పీభూతములనియు నర్థముగాన ('క్రౌంచమిథునాత్') అనఁగా నొండొరుల నెడఁబాసి కృశించిన సీతారాములమిథునమునందు, (ఏకం) సీతయనునొక్కరిని, (అవధీః) వధింతివి-అనఁగా చంపునంత మిక్కిలియుఁ బీడించితి వని సుందరకాండకథయు సూచితము. క్రౌంచ యనుట కుటిలులైన రాక్షసులకును వాచకముగా వచ్చును గాన రాక్షసులైనరావణమండోదరు లనెడిమిథునము నుండి సీతయెడఁ గామమోహితుఁడైన ఒకనిని రావణునిఁ జంపితి వని యుద్ధకాండకథయు సమర్థితము. కామశబ్దమునకు నభిలాషయు నర్థముగాన 'కామమోహితమ్' అనఁగా దండకారణ్యవాసినులైనఋషిపత్నులఁ జూచునభిలాషచే మోహితయైన సీతను, (అవధీః) పీడించితి వని యుత్తరకాండకథయు నంతర్భావితము.

కావ్యార్థము మఱొకవిధముగా నిందు క్రౌంచశబ్దముచే సూచితమైయున్నది. ఎట్లన 'నితరాంసాదయతి పీడయతీతి నిషాదః' అనువ్యుత్పత్తిచే ముల్లోకముల మిక్కిలిపీడించు రావణునకిది సంబుద్ధి. ఓరావణా,

పెక్కుసంవత్సరము లెందును నిలుకడ నొందకుండుదువుగాక' యనియె. క్రౌంచ వెంటనిజూచి యిట్లుచెప్పుచున్న యమ్మునికి 'నీపిట్టవలనిశోకంబు నన్నుం బీడిం

---

(క్రౌంచమిథునాత్) అల్పీభూత మైనమిథునమునుండి - అనఁగా రాజ్యభ్రంశవనవాసక్లేశాదులచే మిక్కిలి డిందుపడిన సీతారాములనెడిమిథునమునుండి. (ఏకం) సీతయనెడి యొకరిని, (యస్మాద వధీః తస్మాత్) వధించినంతటి యెక్కుడుపీడను గలుగఁజేసితివి గాన. (ప్రతిష్ఠాం) లంకాపురియందు పుత్రపౌత్రభృత్యులతోఁగూడి విభవముతో నుండునట్లు బ్రహ్మ యొసఁగినస్థితిని, (మాగమః) ఇఁక మీఁద పొందకుము, అని కావ్యార్థమును సూచించునట్లుగాను త్రిలోకకంటకుఁ డగురావణుని ఇట్లు అడంచుటచే త్రిలోకపరమమంగళముగాను సత్యసరస్వతిచేఁ బుట్టింపఁబడిన దని కొందఱిమతము.

మఱికొందఱి యభిప్రాయము దీనికి విరుద్ధముగానున్నది. ఎట్లన రావణుని సంబోధించి చెప్పినట్లుగా అర్థముసేయుట పొసఁగదు. రావణునిఁ జంపి రాముఁడు రాజ్యమును బ్రాపించినయనంతరమే నారదునిగూర్చి వాల్మీకి ప్రశ్నచేసినాఁడు. ఆప్రశ్నమునకుఁ బిదప నీశ్లోకము నతఁ డుచ్చరించెను. రావణవధానంతరము చెప్పఁబడిన యీశ్లోకమునందు చంపఁబడి రావణుఁడు జగత్తునకుఁ మంగళముగా శపింపఁబడినాఁ డనునర్థము నిబంధించుట యాభాసమగును. సర్వజ్ఞయైన సత్యసరస్వతి జరిగిపోయిన విషయమును ఇఁక జరుగునట్లుగాఁ గోరి చెప్పుటయెప్పుడు మఱియిందు కావ్యార్థమును కవిసూచించె ననుటయుఁ బొసఁగదు. అట్లు వాల్మీకి బుద్ధిపూర్వకముగా నిందు కావ్యార్థము సూచించినవాఁడేని 'కిమిదం వ్యాహృతం మయా - ఇది యేమి నేను చెప్పితిని' అనునా? తెలిసిచెప్పిన దానిని 'యేమిది'యని వితర్కించుటవగదు గావున నిందు కావ్యార్థము కవి సూచింపలేదు. 'ఇది యేమి' అనఁగా 'ఇది గద్యమా పద్యమా' అని వితర్కించినాఁడుగాని తాను సూచించిన కావ్యార్థమును బట్టికాదు అని చెప్పుటయుఁ దగదు 'తద ప్యేషశ్లోకోఽభిగీతోపరుతః' అని శ్రుతులందును శ్లోకము ప్రస్తావింపఁబడియుండుటచే వేదజ్ఞుఁడైన వాల్మీకి అట్టిపదసన్నివేశము శ్లోకమా యని తెలియక వితర్కించినాఁడనుట తగదు. శ్లోకమిట్టిదియని తెలియనివాఁడేని నారదునిసంవాదము శ్లోకరూపమగుటచే దానిని విన్నపుడే 'ఇదియేమి' యనిసందేహపడియుండునుగదా. అయితే నారదుని సంవాదము మొదటవాక్యములుగానే యుండెననియు నీశ్లోకము కలిగిన పిమ్మటనే యది శ్లోకరూపముగా రచింపఁబడెననియుఁ జెప్పినయెడల నిదియూహయేకాని స్థాపించుటకుఁ బ్రమాణమేమియు లేదు. ఇఁకమీఁద బ్రహ్మవచ్చి యుపదేశించుపిదపనే కవికి నీకావ్యమును జేయుబుద్ధి పుట్టినదిగాని యీశ్లోకముచెప్పునప్పు డిట్టిబుద్ధియే లేదు. కాన కావ్యార్థమునిందు సూచించె ననుటయుఁ, బొసఁగదు. బోయవాఁడు చేసినది అధర్మ మనెడిబుద్ధితో చెప్పబడిన యీశ్లోక మిటువంటియర్థమునందు పర్యవసించుటయు సంభవింపదు. కాన దీని యథార్థ మైనభావమిది. వాల్మీకి నారదునివలన రాముని గుణములను విన్నపిదప వానిని అతఁడు వర్ణింపఁగోరుట భగవంతుఁడగు రాముఁ డెఱింగి తనచరిత్రము కరుణరసమయ మగుటంజేసి యతికరుణచిత్తుఁడే యట్టిదానిని రచింపఁ జాలుదురు గావున వాల్మీకిఁ కట్టికరుణచిత్తత్వము గలదాయని తెలియఁగోరియుఁ, దనకు మున్ను భృగువొసంగినశాపమును వాల్మీకిచేతఁ గూడఁ జెప్పించి దృఢపఱుపఁగోరియు, రాముఁడే నిషాదరూపమునుదాల్చి యమ్మునిని చూచుచుండుటను సరకుసేయక క్రౌంచరూపమున నున్నరాక్షసుని జంపినవాఁ డయ్యె. అప్పుడు వాల్మీకికి బుద్ధిపూర్వకముగాను నంతర్యామి యగుభగవంతుఁడు ప్రేరేపించుటచేతను 'వీఁడు గొప్పయధర్మమును జేసినాఁ'డని కోపముపుట్టి యట్లుశపించెను. కాఁబట్టి శ్లోకార్థ మెట్లనఁగా ఓరీ నిషాదా! కామమోహితమైయున్న క్రౌంచపిట్టలజంటలో నొక్కటిని జంపితివి గాన, (శాశ్వతీః

వంగా నేను జెప్పి నదిది యేమి? 'యని మనంబునఁ జింత గలిగెను. అమ్మునివరుఁడు మహాప్రాజ్ఞుఁడును మతిమంతుఁడునుగాన యది యిట్టిదని తనలో నిశ్చయించి శిష్యుని జూచి 'క్రౌంచపిట్టయెడ శోకమువలనఁ గుందునపుడు నావలననుండి వర్తిల్లినయీ పదసందర్భము నాలుగుపాదములు గలదై ప్రతిపాదమునకును సమముగా నక్షర సంఖ్యగలిగి వీణియతంత్రులం దాలపించి లయతోఁ గూడఁ బాడుటకుఁ దగి యున్నది గాన * శ్లోకంబగుఁగాని మఱొకటి గా' దనియె. ఇటు లాముని పలుకుచుండఁగా శిష్యుండును బరమహర్షంబున నిరుపమాన మైనయతనివాక్యంబును 'ఓరీ నిషాద'

---

సమాః) నీ వికఁ బ్రతికియుండఁగల బహుసంవత్సరములు, (ప్రతిష్ఠాం) నీకాంతతోఁడఁగూడినయునికి యాలోకమునందుఁ బొందకుందువుగాక. అల్పకాలమే పొందియుందువు' అని ముని శపించినవాఁ డయ్యె. క్రౌంచము రాక్షసుఁడగుట యెట్లన బ్రహ్మవలన సకలరామవృత్తాంతము దెలియునట్లు వరమునొందినపిదప రచితమైన 'తస్మాత్తు మిథునాదేకమ్' అనుశ్లోకమున 'వైరనిలయః' అనువిశేషణమువలన రాక్షసుఁడగుట సూచితము. ఎట్లన లౌకికదృష్టినిబట్టి చూడఁగా భగవంతునికి రాక్షసులయందే వైరముగాన వారినిబట్టియే వైరనిలయుఁ డనఁబడెను. నిషాదులకుఁగూడ పక్షులనుజంపుట యాహారార్థమే కాని వైరమునుబట్టి కాదు. కావున కేవలక్రౌంచమునుబట్టి కేవలనిషాదుని వైర నిలయుఁడనుట యొప్పదు. క్రౌంచము రాక్షసుఁడును, నిషాదుఁడు రాముఁడును అగుటచేతనే వైర నిలయుఁడనుట పొసఁగును. కనుక క్రౌంచము, రాక్షసుఁడగుట తెల్లము. ఇంతవఱకుఁ జెప్పఁబడిన విషయమే పాద్మపురాణమున శివశివాసంవాదఘట్టమున 'ఆహూయ లక్ష్మణం ప్రాహ రామో రాజీవలోచనః। శృణు మే వచనం గుహ్యం సీతాసన్త్యాగకారణమ్॥ వాల్మీకినాథ భృగుణా శప్తో౽స్మిన్కిల లక్ష్మణ। తస్మాద్దేనాన్త్యజామ్యద్య జనో నైవాత్ర కారణమ్' అనుచో సీతాపరిత్యాగము నకు భృగువును వాల్మీకియు శపించుటయే కారణముగాని జనవాదముగాదని చెప్పియున్నాఁడు. ఇట్లే స్కాందమున పాతాళఖండమున 'శాపోక్త్యాహృది సంతప్తం ప్రాచేతసమకల్మషమ్। ప్రోవాచ వచనం బ్రహ్మా తత్రాగత్య సుసత్కృతః। న నిషాద స్సవై రామో మృగయాం చర్తుమాగతః। తస్య సంవర్ణనేనైవ సుశ్లోక స్త్వం భవిష్యసి। ఇత్యుక్త్వాతం జగామాశు బ్రహ్మలోకం సనాతనమ్। తత స్స వర్ణయామాస రాఘవం గ్రన్థకోటిభిః 'అని బ్రహ్మ' నిషాదుని శపించుటచే సంతాపము నొంది యున్న వాల్మీకికి నిషాదుఁడు రాముఁడని తెలిపినట్లు చెప్పఁబడియున్నది. కాన యీభావమే సమంజస మని గ్రాహ్యము.

ప్రబంధము తొలుత శాపోక్తి గూడదని హితోపదేశపరముగా మఱియొక వ్యాఖ్యానము చూపట్టుచున్నది. ఎట్లన:—(హే నిషాద) ఓనిషాదుఁడా, (త్వం శాశ్వతీస్సమాః ప్రతిష్ఠామగమః) నీవు బహుసంవత్సరములుగా ఉనికిఁ బొందినవాఁడవు - అనఁగా మిక్కిలి వయోవృద్ధుఁడ వనుట. కాఁబట్టి (క్రౌంచమిథునాదేక మవధీః ఇతి యత్) క్రౌంచపిట్టజంటలో నొకటిని జంపితివనునది ఏదియో, (తత్ మాఽస్తు) అది యిఁకమీఁద లేకుండుంగాక ఇఁక నిట్టిపనులు సేయకుమా యని భావము.

* శ్లోకశబ్దమునకు 'పద్యే యశసి చశ్లోకః' అని యశస్సు అర్థమగును. కాఁబట్టి 'శోకముచే అనుచితమైన శాపకార్యమునం బ్రవర్తించిన నాకిది యశస్సగును గాక. మఱొకటి-అనఁగా అపయశస్సుగాకుండుఁగాత' మని యర్థాంతరము గొందఱిమతము.

యిత్యాదిక మైనదాని బరిగ్రహించినవాఁ డయ్యె. గురుండు నది వాఁడు గ్రహించి నందులకుఁ దృప్తుఁ డయ్యె. పిదప నాజడదారి యథావిధిగా నాతీర్థంబున మాధ్యాహ్నికస్నానము సేసి యాశ్లోకము పుట్టుటయే చింతించుకొనుచు నాశ్రమంబునకు మరలఁగా నంత నాతనిశిష్యుఁడగుభరద్వాజుఁడు వినయసంపన్నుఁడును శాస్త్రజ్ఞుఁడు నగుటం జేసి యాశ్లోకంబును గట్టిగా బుద్ధియందు నెలకొలిపి జలపూర్ణమగు కలశంబుగొని యాతని వెనువెంటఁ జనియె. ఇట్లు శిష్యుఁడును దాను నాశ్రమముఁ బ్రవేశించి దేవపూజాదిధర్మంబు లొనర్చి సుఖంబుగాఁ గూర్చుండి తనంత నుప్పతిల్లిన యాశ్లోకమును లోపలఁ జింతించుచునే వెలికి నితరములైన పురాణాదులఁ బారాయణము సేయుచుండె. అంత సకలలోకంబుల నిర్మించుప్రోడయు సర్వంబునకుఁ బ్రభుండును, మహాప్రభావభాసితుండు నైననలుమొగంబువేలుపు బ్రహ్మ యమ్మునివరునిఁ జూచి యాతనిచింతను బాపునాదరాతిశయమున నచటి కరుగుదెంచె. వాల్మీకియు నవ్యయుం డగునద్దేవునిఁ జూచి తోడనే లేచి మిక్కిలి యచ్చెరువు గదుర నియతవచస్కుఁడై మనస్సును సమాహితంబు గావించుకొని కేలు మొగిచి నిలువంబడి విధివిధానంబున మ్రొక్కి కుశలం బడిగి యర్ఘ్యపాద్యాసనము లొసఁగి స్తుతిపూర్వకముగాఁ బూజించె. పిమ్మట నాభగవంతుఁడును దనకై వాల్మీకి మిక్కిలియు నర్పించినయొకయాసనంబుఁ బెట్టఁగా నందుఁ గూర్చుండి యనంతరము వాల్మీకినిఁ గూర్చుండ నియోగించుటయు, నాయనుజ్ఞం జేసి యాతండును దగ్గగా నుండునొక పీఠంబునఁ గూర్చుండె. ఇట్లు లోకపితామహుం డపుడు ప్రత్యక్షమై కూర్చుండియుండఁగా వాల్మీకి క్రౌంచపిట్టగిట్టుటయందే మనస్సు తగిలి 'కట్టా! పగఁ బూని పట్టుకొనుతలంపుతో నాకట్టిఁడిబోయ మరులు వెల్లునఁ గొలకొలమని యింపారఁ గూయుచుండినయాక్రౌంచపిట్ట నకారణముగాఁ జంపి యెట్టికుచ్ఛితంబున కొడిగట్టినాఁ'డని మదిలోఁ జింతించుకొనుచు నాపోతుపిట్టకై మిక్కిలియు దురపిల్లుచుఁ గవఁబాసి పొగలుచున్న పెంటిపులుఁగునందు మరల మనంబుఁ జిక్క, దాని దుర్దశకును దపంబుపస గుందించునట్టిశాపంబును దాను బలుకుటకును, మాటికి మాటికివగచుచు నా శ్లోకమును మదిసిల్పి పాడినవాఁడయ్యె. అంత బ్రహ్మయుఁ దనలో 'నీతండు నానియోగంబున సరస్వతి తనజిహ్వను శ్లోకరూపంబున నవతరించినదని యెఱుంగక యిట్లు తించుచున్నాఁడుగదా'యని నవ్వుచు నామునివరున కిట్లనియె 'నీవు శ్లోకమేరచించితివి. దీనినిగుఱించి విచారమువలదు. నీచేఁ బ్రబంధరూపముగా రామాయణమును బ్రవర్తింపఁజేయవలయునని నేను సంకల్పము గొనుటవలననే 'ఓరీ నిషాదుఁడా' యిత్యాదిరూప మైనయీసరస్వతి నీయెడఁ బ్రవర్తించినది. ఋషివరా! యిట్టిశ్లోకములచేతనే రాముని చరిత్రమంతయు నీవ

రచింపుము. ఇందులకు నీవే సమర్థుఁడవు. * ధార్మికుఁడును లోకులయందు గుణవంతుఁడును మహాబుద్ధిమంతుఁడును ధీరుఁడు నగు రామునివృత్తంబును నారదునివలన విన్నరీతిని సంగ్రహముగా రచింపుము. ఇంతియకాదు. ధీమంతుఁ డగు రామునియు, లక్ష్మణునియు, రాక్షసులయు, భరతాదులయు, సీతాదేవియుఁ బ్రకాశరహస్యంబులైన సకలవిధచరితంబులును దప్పక నీకుఁ దెలియవచ్చు. నారదుం డెఱింగింపనివియుఁ గూడ నీకుఁ దేటతెల్లముగాఁ గలదు. నీవు రచింపఁగల యిక్కావ్యంబునందు నెయ్యెడ నేని నీవాక్కు దుష్టముగాని యనృతముగాని కాదు. రామచరితంబు సకలపాపహారం బగుటం జేసి పుణ్యంబై, విన్నంతనే యానందము వెల్లిగొలుపున దగుటం జేసి యతిమనోహరంబై యొప్పు. కాఁబట్టి దానిని శ్లోకరూపంబున నిబంధింపుము. ఇప్పుడమియందుఁ బర్వతములును నదులు నెంతకాలము నెలకొని యుండునో యంతకాలము రామాయణకథయు సప్తలోకంబులను బ్రచరింపఁగలదు. ఇట్లు నీరచించిన రామాయణకథయు నెంతకాలము ప్రచరించునో యంతకాలము నాచే మీఁదఁగాని క్రిందఁగాని నిర్మితంబులైన యెల్ల లోకములం దప్రతిహతగతిని నీవు చరించుచు నుండి పిదప నాలోకంబును బ్రాపించి నాతోడ ముక్తిని జెందుదువు.' ఇట్లు భగవంతుం డగుపితామహుం డానతిచ్చి యచ్చటనే యంతర్హితుం డగుటయు నమ్మునియు నతనిశిష్యులును మిక్కిలి విస్మయంబు నొందిరి. + ఆతనిశిష్యు లందఱును సంతసంబు దొంతరలుగా మరల నాశ్లోకమును మాటిమాటికిఁ బాడుచు మిక్కిలివిస్మితులై 'ఇది యేమి యద్భుతం' బని యొండొరులకుఁ జెప్పుకొనుచుండిరి. మహర్షి మున్ను సమాక్షరములు గలనాలుగు పాదములచేఁ బాడుటం జేసి శ్లోకంబైనయదియె శిష్యులు మరలమరలఁ బాడుటం జేసియు మరల శ్లోకం బయ్యె. క్రౌంచపిట్టం గుఱించి శ్లోకం బుప్పతిల్లినపిదప సమాక్షరంబులగు నాలుగుపాదంబులతో నాఋషి పాడుటం జేసి యామిక్కుటంపుశ్లోకమే శ్లోకం

---

* 'మహాకులీనతౌజ్జ్వల్యం మహాభాగ్యముదారతా। తేజస్వితా విదగ్ధత్వం ధార్మికత్వాదయోఽపిచ' అనెడి యీనాయకగుణంబులే తత్కావ్యనాయకుం డగు రామునియందు నిచటఁ బ్రతిపాదింపంబడినవి. ఎట్లన ధార్మికుం డనుటచే ధార్మికత్వమును, గుణవంతుఁ డనుటచే ఉదారతయు ఔజ్జ్వల్యమును, బుద్ధిమంతుఁ డనుటచే పాండిత్యమును, ధీరుం డనుటచే భూధురంధరత్వరూపమైన మహాభాగ్యమును, గుణవంతుఁ డనుటచే తక్కిన యితరగుణములును బ్రతిపాదితములు.

+ 'తస్యశిష్యాః... ప్రీయమాణాః ప్రాహుశ్చభృశవిస్మితాః॥ సమాక్షరైశ్చతుర్భిర్యః పాదైర్గీతో మహర్షిణా। సోఽనువ్యాహరణాద్భూయః శోకః శ్లోకత్వమాగతః' అని యిందులకు మూలము. 'శ్లోకః శ్లోకత్వమాగతః' 'శోకః శ్లోకత్వమాగతః' అనియుఁ బాఠద్వయము. మొదటిపాఠమున, ఋషిచే శ్లోకలక్షణములతో రచింపఁబడుటచే మొదట శ్లోకమైనది; శిష్యులచే శ్లోక్యమానము. (శ్లోకముగాఁ బొగడఁబడునది) అగుటచే మరల శ్లోకమైనది యని భావము. రెండవపాఠమున 'శోకః శ్లోకత్వమాగతః' అనుటకు '(ఇతి) ప్రాహుః' అని శిష్యకర్తృకముగా పూర్వశ్లోకముతో నన్వయము. ఈ రెండుయోజనలకు నర్థంబులు రెండును వరుసగా వాక్యద్వయమున వివృతములు.

బుగా నయ్యెంగాఁబోలు నని వాకొండొరులకుఁ జెప్పుకొనుచు నచ్చెరుపడుచు నుండిరి. అంత నామునివరుఁడు మంగళార్థంబు మనంబున, బరమాత్మను జింతించుచుఁ 'బ్రాయికముగా నిట్టిశ్లోకంబులచేత రామాయణం బనెడికావ్యంబు నంతయు రచియింతు'నని బుద్ధిగొన్న వాఁ డయ్యె. పిదప నాకీర్తిమంతుఁ డుదారబుద్ధి గాన యుదారంబులై రసంబులఁ జిప్పిలువృత్తంబులచేతను, ద్రాక్షాదిపాకంబులఁబోలుచు నర్థంబులచేతను, మృదుమధురగుంభితంబు లైనపదంబులచేతను, మిక్కిలియు మనోహరములై సమాక్షరములై వఱలు నూఱులకొలది శ్లోకములచే మహనీయమగు రామునిచరితమున వర్ణించుచు మహాయశస్కుఁ డగునతనికి మఱియు యశంబు నాపాదించునక్కావ్యంబును రచించినవాఁ డయ్యె. ఇట్లు సమాసంబులును సంధులును బదంబులును లక్షణానుగుణంబుగాఁ గూడి రాణింప, నెక్కువ తక్కువలు లేక తులదూఁచి తీరిచినట్లు సమముగా నమరి, తీయనై, తేటఁదనము నీటుగులుకునర్థములు గలిగి, సకలజనసమాదేయమై, యాసాంద్రైకరసతుందిలమై యెప్పుడు సాక్షాత్కరించు రామపరబ్రహ్మమును బ్రతిపాదించువాక్యములు వెలయ దశశిరస్కుఁడగు రావణునివధముం బ్రతిపాదించుచుం దా రచియించినరఘురాముని చరితమును వాల్మీకిముని శిష్యులకు వినిపించినవాఁ డయ్యె. అట్టి కావ్యమును నిరీక్షింపుఁడు. ఇది రెండవ సర్గము.



## రామాయణవిషయసంగ్రహము.

ధర్మాత్ముఁ డైనయమ్మునివరుఁడు ధర్మయుక్తమైన రామునిచరిత మంతయు నారదునివలన వినియు నాధీమంతునివృత్తాంత మంతకంటె నధికముగా నేదిగలదో దానినిగూడ విస్తరించి రచింప వలయు'నని తలంచె. కాన యావృత్తాంతము సాంతముగా తనకుఁ దేటతెల్ల మగువిధమును మది నాలోచించి విచారించుచు విధ్యుక్తముగా జలముల వార్చి తూర్పుదెస మొనలు గలదర్భలపయి నెలకొని నిజగురునిఁ గూర్చి కేలు మోడ్చి బ్రహ్మప్రసాదంబుఁ బడయుటకై రామవృత్తంబు మదిని వెదకఁగా రామలక్ష్మణులకును, సీతాదేవికిని, రాజగుదశరథునకును, నతనిభార్యలగు కౌసల్యాదులకును, దదీయరాష్ట్రమునకును గలిగినవృత్తాంతంబులంతయును, వారినవ్వులును మాటలును బోకడలును మఱియుం దక్కుచేష్టితములు సర్వంబును బ్రహ్మవరప్రసాదమహిమం జేసి కలయూపునఁ దేటతెల్లముగా నాతనిమనంబునకుఁ గానిపించె. ఇట్లు రాముఁడు పురంబున వసించియున్నప్పటి చరితంబు గనుంగొనుటకాక యతండు తనపట్టినప్రతిన సత్యంబు గావింపఁ బూని తనతో మూఁడవదిగా సీతను దోడ్కొని యడవిని దిరుగునాఁడు జరిగినదియు నాతండుగాంచె. ఊరక చూచుటయేకాదు. కలయుందుంబోలె

గనుటయుఁగాదు. అట్లు చూచినపిదప నాధర్మాత్ముఁడు బ్రహ్మవరదానగరిమం జేసియు సమాధిని బూనియు రాముఁడు మున్నగువారి యందు మున్ను జరిగినదియు నిఁక జరగఁగలదియు సకలంబును నరచేతియందలియుసిరికవలె మిక్కిలియు విశదంబుగ దర్శించినవాఁ డయ్యె. ఇట్లు రామకల్యాణగుణానుభవము వలనం గలిగినసొంపు పెంపున నెంతయుఁగాంతి దళుకొత్తుచున్న యామునిమిన్న, సర్వమును నున్నరూపునఁ బొడఁగాంచి యంత నత్యంతమనోహరుఁ డగు రామునిచరితము రచింపఁబూనె. అట్లు పూని యర్థకామంబుల నందంద యప్రధానంబులుగాఁ గూర్చియు ధర్మమోక్షంబులనతిశయంబుగా విస్తరించియుఁ గామంబునొడఁగూర్చు గుణంబులం బ్రతిపాదించుచును, ధర్మార్థములకుపయుక్తము లగుగుణంబుల విఱివిగా వర్ణించుచును, రత్నపరిపూర్ణంబునుంబోలెఁ దులకింప, మృదుపదగుంభితంబులు వీనులవిందు సేయ, లలితార్థవిలసనంబుల మది కానందంబుఁ గూర్ప సర్వోపనిషత్సారసంకలితముగా నారదమహర్షి దనకుఁ దొల్లి యుపదేశించిన ప్రకారమున రఘువంశలలాముం డగు రామునిచరితంబు రచించె. మఱియు దశరథతపోమహత్త్వఫలితంబును విష్ణ్వవతారభూతంబు నగుటచే నతిమహనీయ మైనరాముని జన్మమును, నతండు తాటకాదుల రూపుమాపినవీర్యమును, సర్వజనముల కనుకూలుండై వర్తించుటయు, లోకులప్రేమకుఁ బట్టయి యునికియుఁ, బరుసములాడినను నపరాధములు సేసినను మన్నించునోరుపును, జల్లనై కన్నులపండువై యగపడు రూపంబును, సత్యస్వభావంబును, రాముఁడును లక్ష్మణుఁడును విశ్వామిత్రునితోడం గూడునప్పుడు జరిగిన లెక్కనానావిధవిచిత్రకథలును, సీతాదేవియు నూర్మిళాదులయు వివాహంబును, శివునివిల్లు విఱుచుటయు, రామునకును బరశురామునకుఁ గలిగినవివాదమును, రామునిగుణంబును, నతనికిఁ బట్టాభిషేకంబుఁ దొడఁగుటయుఁ, గైకేయి దుష్టహృదయయై వర్తించుటయు, దానం జేసి పట్టాభిషేకంబు చెడుటయు, రాము నడవికిఁ బంపుటయు, రాజగుదశరథుని దుఃఖప్రలాపమును, నతని పరలోకప్రాప్తియుఁ, బ్రకృతిజనులదుఃఖంబును, రాముండు వారిని వంచనమెయి విడిచి పోవుటయు, బోయఱేఁ డగుగుహునితోడిసంవాదంబును, సూతుఁ డగుసుమంత్రుఁడు మఱలుటయు, గంగానదిని దాటుటయు, భరద్వాజదర్శనంబును, భరద్వాజునియనుజ్ఞవలనఁ జిత్రకూటంబుగాంచుటయు, నచట శాస్త్రోక్తవిధానంబున గృహంబుఁ గట్టికొనుటయు, నందుఁ బ్రవేశించి కాఁపురముండుటయుఁ, భరతుండు వచ్చుటయు, నతండు రామునిఁ దేర్చుటయుఁ, దండ్రికి నుదకంబిచ్చుటయు, భరతుండు శ్రేష్ఠములగు రామపాదులకు రాజ్యాభిషేకంబుగావించుటయు, రాముండు దండకారణ్యముఁజొచ్చుటయు, విరాధవధమును, శరభంగదర్శనమును, సుతీక్ష్ణసమాగమమును, సీత యనసూయతోడ వసించియుంటయు, ననసూయ యంగరాగము నర్పించుటయు, నగస్త్యదర్శనంబును, జటాయు సంగమంబును, బంచవటీగమనంబును,

శూర్పణఖాదర్శనమును, శూర్పణఖతోడి సంవాదంబును, దానిని విరూపం జేయుటయు, ఖరదూషణత్రిశిరులవధించుటయు, రావణుఁడు సీతాహరణమునకై చెలరేఁగి వచ్చుటయు, మారీచవధంబును, సీతాహరణంబును, రాముని విలాపంబును జటాయువధంబును, కబంధదర్శనంబును, పంపాసేవనంబును, శబరిం గాంచుటయు, హనుమంతునిఁ జూచుటయు, ఋశ్యమూకగమనంబును, సుగ్రీవసమాగమంబును, సాలభేదాదులచే విశ్వాసంబుఁ బుట్టించుటయు, రామసుగ్రీవుల సఖ్యమును, వాలి సుగ్రీవవైరకథనమును, వారలయుద్ధమును, వాలివధమును, సుగ్రీవునకు రాజ్యంబు గూర్చుటయుఁ, దారావిలాపమును, శరత్కాలమున సీతాన్వేషణమును దండయాత్రయుఁ జేయునట్లు సంకేతము సేసికొనుటయు, వర్షదినంబులు మిన్నక వసించి జరుపుటయు, రఘువంశసింహుఁడగు రాముఁడు సుగ్రీవునియెడం గోపంబుఁ దాల్చుటయు, వానరబలములఁ గూర్చుటయు, దిక్కులకుఁ బంచుటయు, బుడమిం గలనదీద్వీపసముద్రాముల తెఱంగు లెఱింగించుటయు, రాముఁడు హనుమంతున కంగుళీయక మిచ్చుటయు, జాంబవంతుఁడు స్వయంప్రభయున్నబిలము గాంచుటయు, సంపాతిదర్శనంబును, సముద్రము దాఁట మలయపర్వతము నారోహించుటయు, హనుమంతుఁడు సముద్రంబు దాఁటుటయు, సముద్రవచనము విని పైకి లేచిన మైనాకుని గాంచుటయు, సింహికావధమును, లంకయందలి *మలయగిరిని గాంచుటయు, రాత్రి హనుమంతుఁడు లంకను బ్రవేశించుటయు, నొంటిమెయిం జింతించుటయు, రావణుని గాంచుటయుఁ, బుష్పకదర్శనమును, మద్యపానభూమికిఁ బోవుటయు, నంతఃపురదర్శనంబును, నశోకవనమునకుం జనుటయు, సీతను జూచుటయు, ఆనవాలగు నంగుళీయక మొసఁగుటయు, రావణుని మఱలం జూచుటయు, రాక్షసాంగనలు సీతను బెదరించుటయుఁ, త్రిజట స్వప్నముఁ గాంచుటయు, సీత చూడామణి నొసఁగుటయు, నశోకవనవృక్షభంగంబును, రాక్షసస్త్రీలు పలాయితలగుటయు, రావణుఁడు పంచినభటుల నెల్లఁ జంపుటయు, హనుమంతుఁ డింద్రజిత్తునిచేఁ బట్టువడుటయు, లంకాదహనమును, అందలిజనుల యాక్రందనధ్వనియు, మరల సముద్రమును లంఘించుటయు, మధువనమునందలి తేనియల వానరులు గొల్లగొనుటయు, రాము నూఱడించుటయు, సీత యిచ్చినచూడామణి సమర్పించుటయు, సముద్రముకడకుఁ బోయి చేరుటయు, నలుఁడు సేతువును గట్టుటయు, సముద్రము దాటుటయు, రాత్రి లంక ముట్టడించుటయు, విభీషణుతోడఁ గూడుటయు, నతఁ డింద్రజిదాదుల వధించు నుపాయము నెఱింగించుటయు, కుంభకర్ణవధమును, మేఘనాదహననమును, రావణువినాశమును, ఆ పగతుని పురిలోన సీతం

---

* ఈమలయము లంకాపురి కాధారభూతమై యున్న పర్వతమునందలి యొకభాగము. సముద్రము దాఁటునప్పుడు హనుమంతుఁ డెక్కినమలయము వేఱైనది. 'మలయః పర్వతాన్తరే పర్వతాంశే' అని రత్నమాల.

ప్రాపించుటయు, విభీషణుపట్టాభిషేకంబును, పుష్పకదర్శనంబును, నయోధ్యకు బోవుటయు, *(భరద్వాజునిం జేరుటయు నాంజనేయుం బంపుటయు), భరతునిగూడుటయు రామపట్టాభిషేకోత్సవంబును, సర్వసైన్యంబులం దమతమపట్టులకు విడిచి పుచ్చుటయు, (నిజరాష్ట్రంబునందలి ప్రజల రంజించుటయు, సీతాదేవిని ద్యజించుటయు), భగవంతుండగు వాల్మీకిమహర్షి రచించె. రాముని కిక భూతలంబునం గలుగ నున్న † యొక్కింతయు నమ్మహనీయుం డుత్తరకాండంబున నిబంధించిన వాఁడయ్యె. ఇది మూఁడవసర్గము.

---

## కుశలవులు రామాయణమును గానము సేయుట.

‡ రాముఁడు రాజ్యంబు వడసి పాలించుచుండఁగా నతనిచరిత్రమును వివిధ చిత్రశబ్దార్థాలంకారకలితముగా బ్రహ్మప్రసాదలబ్ధదివ్యజ్ఞానుండును గావ్యనిర్మాణనిపుణుండు నగువాల్మీకి యవహితచిత్తుండై పూర్ణముగ రచించె. ఆప్రబంధంబున నిరువదినాలుగువేల శ్లోకములును, నేనూఱుసర్గములును, నాఱుకాండములు, నుత్తరకాండము మఱియొకటియుం గలవు. మహనీయుండై నయాప్రాజ్ఞుం డమ్మహాకావ్యమును రామపట్టాభిషేకమునకుం బిదపజరిగినయుత్తరవృత్తాంతముతోడను, నశ్వమేధానంతరమునను సీత భూప్రవేశముం గావించిన తరువాతను జరిగినభవిష్యచరితముతోడను రచించి యంత 'దీని నెవ్వఁడు పఠింపఁ జాలువాఁడో' యని చింతింపసాగెను. ఇట్లనుకూలుం డగుశిష్యుం డెవ్వండేని దొరకునా యని పరమాత్మ మదిం జింతించుచు రామచరితవర్ణనంబునఁ బరిశుద్ధాంతరంగుండై యమ్ముని దనలో విచారించుచుండె. అపు డయ్యాశ్రమమునఁ గుశలవు లనువా రిరువు రుండిరి. వారు రాజకుమారులయ్యు నాశ్రమంబున నునికిం జేసి ముని వేసంబులు దాల్చియుండిరి. వారు వాల్మీకినిం జూచి 'మునీంద్రా! మేము వల్లింతు' మనుచు రామాయణంబు గ్రహించుకొఱకు నమ్మునివరునియడుగులం గొలిచి యనువర్తించుచుండిరి. ఇరువురును గురుశుశ్రూషాధర్మవిదులై విద్యాపటిమం బొగడుగాంచినవారు. ఇద్దఱును దోఁబుట్టువులు గాన వారికి స్వరం బొక్కటియై యతిమధురం బగుశారీరంబుతోఁ గూడియుండు. మఱియు వారు వాల్మీకిఁ యాశ్రమంబున వసించి యుండుటం జేసి యమ్మునినెయ్యంబునకును బాత్రులై

---

* ఈ కుండలీకరణములోనిపాఠ మొకవ్యాఖ్యానమునఁ జూపబడెడి.

† 'ఒక్కింత' (యత్కించిత్) అనుటచే సీతను విడుచుటకుఁ బూర్వమైనకాలము మిక్కిలి యైనదనియుం బిమ్మటికాల మత్యల్పమైనదనియుం దెలియనగు.

‡ 'రాముఁడు రాజ్యంబు వడసి పాలించుచుండఁగా నతనిచరితంబు(ప్రాప్తరాజ్యస్యరామస్య) అనుటచే రాముఁడు రాజ్యము సేయుచున్నకాలముననే రామాయణము రచింపఁబడెనని తోఁచుచున్నది.

యొప్పుదురు. కావున వాల్మీకి యారాజపుత్త్రుల నుపదేశార్హులుగాఁ * గాంచిన వాఁడయ్యె. ఏకరణి ధారణాశక్తియుక్తంబైన బుద్ధిగలిగి వేదవేదాంగంబులఁ బరిపూర్ణంబుగ నధిగమించియున్నవారిం జూచియాచతురుఁడు వేదార్థంబుల వ్యక్తంబుగాఁ దెలుపంగోరినవాఁడై యాయిరువురును గైకొని యంత రాముని చరితంబుఁ బ్రతిపాదించునదై ముఖ్యముగా మహనీయంబైనసీతాచరిత్రమైయై † రావణవధంబను పేరఁ దనచే రచింపఁబడియున్న రామాయణమును వారిని వల్లింపఁజేసెను. వారును గానశాస్త్రంబునఁ గుశలులు; షడ్జము మొదలగుస్వరములు పూర్ణముగా హవణించునట్లు వీణాదుల వాయించుటయందును మంద్రాదులైనమూఁడుస్వరస్థానములందును బ్రవీణులు. తోఁబుట్టువులుగావున వారికి శారీరంబు నొక్కతెఱంగై మృదుమధురంబుగా నుండు. గంధర్వులవంటి చెలువంపురూపంబులును గానానుకూలంబుగ నభినయించుటకు వలయునాటకలక్షణ పరిజ్ఞానమును వారికిఁ బొలుచు. ఇట్లు మధురస్వరంబున వీనులవిందును, రాముని దేహమను బింబమునుండి కలిగిన మాఱుటబింబులవలెఁ దులకించమూర్తివిశేషములఁ గన్నులవిందును. గావించు నాయిరువురును, జదువుటకుఁ బాడుటకును మిగుల నింపై, త్ర్యశ్ర చతురశ్ర మిశ్రంబు లనుమూఁడు ప్రమాణంబులతోఁ గూడి రాణించుచు, షడ్జమధ్యమాది సప్తస్వరజాతులచే నిబద్ధమై, తంత్రీలయం దాలపించి లయకుం దగునట్లుగాఁ బాడఁదగినదై యొప్పుచు, శృంగారవీరకరుణరౌద్రభయానకాదిరసంబులు చిప్పిలుచున్నయక్కావ్యంబును బాడిరి. అనిందితులును, మహాబుద్ధిమంతులును, మహాభాగ్యసంపన్నులును, సర్వలక్షణలక్షితులు నైన యారాజకుమారులు ధర్మయుక్తమై యత్యుత్తమమై పూర్వవృత్తాంతకథనరూపమైనయక్కావ్యంబునంతయు వాక్కునకు వశమై యుండునట్లు వల్లించి ఋషులును బ్రాహ్మణులును సాధుజనులును గూడునట్టి సదస్సులయందుఁ బాఠశుద్ధిని దెలిసి యొక్కటియు మఱపునకు రాకుండునట్లు హెచ్చరికలు గలిగి యుపదేశింపఁబడినరీతిని గానముసేసిరి. అంత నొకనాఁడు రామాశ్వమేధమునకుఁ బరిశుద్ధాత్ములగు మునులందఱును వచ్చి కూడి యజ్ఞక్రియాకలాపములు ముగిసినంత సుఖాసీనులై యుండఁగా నాయిరువురును వారలయొద్ద నిక్కావ్యమును గానముచేసిరి. దాని నమ్మునులందఱు వీనుల విందుగావిని మిక్కిలియు నచ్చెరువడి కన్నుల

* ఈసర్గము మొదట రాముఁడు రాజ్యంబు సేయునపుడు—అనఁగా పట్టాభిషేకమునకుఁ బిదప రామాయణంబు రచితంబైనదని సూచితమయ్యె. అరదనకుఁబిదప కుశలవు లుత్పన్నులైరని యిట సూచితమగుచున్నది. రాముఁడు దీనినెఱింగియే వాల్మీక్యాశ్రమమున సీతనువిడిచెననుటయూహ్యము.

† మాఘకావ్యము శిశుపాలవధ మనుపేర కృష్ణచరితమును వర్ణించున దెట్లగునో యట్లే యిదియు రావణవధ మనుపేర రామచరితమును అప్రధానముగాను సీతచరితమును ప్రధానముగాను వర్ణించునది యగును.

నానందబాష్పములురుల 'బాగుబా' గనిమెచ్చిరి. అమ్మునులో ధర్మరతులు ; కావుననే మత్సరములేని వారు. అట్టి వారలెల్ల, మిగుల బొగడఁ దగినవడువునఁ బాడుచున్న యాగాయకుల యెడమది మిక్కిలియుఁ బ్రీతినొంది 'ఔరా' పాటయందలితీయందనము ! శ్లోకంబులో యంతకంటెను దీయనై యెక్కుడు ముద్దు గులుకుచున్నవి. ఇది చిరకాలముగా జరిగియున్నదయ్యు నిప్పుడు కన్నుల యెదుటఁ గనుపట్టుచున్నట్లుగాఁ జూపంబడియె. వీ రిరువురును గవిహృదయంబును భావంబులును జక్కఁగా నెఱింగి తన్మయులై లయాదులుసమంబుగా నొడఁగూడి గసఁగూడ స్వరంబులు సొంపుమీఱ రాగంబు దయివాఱ నింపుఁబెంపార విను వారికి గసంబులు చిప్పిలునటు లెంత యొప్పిదముగాఁ బాడి !' రని ప్రశంసించిరి. ఇట్లక్కజంపుఁదనంబు పెంపునఁ బొగడ్త గాంచి మహాబుద్ధికుశలులై యనసూయువులై వెలుంగునమ్మునులు గొనియాడుచుండఁగా వారిరువురు నుత్సాహం బతిశయించి మఱిమఱి రాగంబుమీఱ మిక్కిలియుండీయన దయివాఱఁ బాడిరి. అంతదానికిఁ బ్రీతినొంది యందుండిన యొకముని లేచి వారికి నొకకలశముఁ బారితోషికముగానొసఁగె. గానశాస్త్రంబున మిక్కిలిపొగడుగన్నమఱియొకతె బిసిమిన్న ప్రసన్నుఁడై నారచీరయొకటియిచ్చె. (మఱియొకముని కృష్ణాజినంబును నింకొకమహర్షి ముంజయు నిచ్చిరి. ఒకఁడు కమండలువును వేఱొకఁడు జందెమునొసంగిరి. మఱియొకఁడు నత్త్రిమానితోఁ జేయఁబడిన బ్రుసీయు (బుష్యాసనమును) నింకొకఁడు జపమాలయు నిచ్చిరి. మఱియు నందుఁ గలపెక్కనమహర్షులు ముదమంది యాయువు గలుగునట్లు దీవించిరి. సకలజనులును వారిని జూచి 'వాల్మీకిమునిచే సవిస్తరంబుగా రచితమై, కావ్యలక్షణముల నిర్మాణప్రక్రియలఁ దెలియఁగోరుకవులకు మిగుల నాధారమై మీ రెడి యీయితిహాసము యథాక్రమముగా సమాప్తము గావింపంబడియెఁ గదా. ఇది యెంతయు నాశ్చర్యకరము. సకలగీతవిశారదులారా! మీరాయుష్కరమును నభ్యుదయకారణమును బుష్టికరము నగునీపూజ్యచరితమును సకలజనులకు వీనుల విందుగా నుతులన్నియుఁ బొందుగాఁ బాడితి' రని యాయజ్ఞశాలను బెనువీదులను రాజమార్గంబులను మఱియుఁ దక్కినయెల్ల యెడలను బొగడుచుండిరి. ఇట్లుల్లసిల్లుచున్నయాగాయకులఁ గుశలవుల నొకప్పుడు భరతునిమూలమున రాముఁడు గాంచినవాఁడయ్యె. పగతుర నూటాడించి గీటడంచునమ్మేటి యట్లు గాంచి యాయన్నదమ్ములఁ గుశలవుల నిజగృహమునకు రప్పించి యాపూజ్యులను మిక్కిలియుఁ గొనియాడె. ప్రభులలాముఁడును బ్రతాపధాముఁడు నగురాముఁడు సౌవర్ణ దివ్యసింహాసనాసీనుఁడై యుండి చుట్టును దమ్ములును మంత్రులును బలసి కూర్చుండఁగా రూపసంపన్నులగు నక్కుమారుల నిరువురనుజూచి లక్ష్మణునితోను భరతశత్రుఘ్నులతోడను నప్పుడు దేవతలంబోలె దివ్యతేజమున రాజిల్లువీరు విచి

త్రార్థపదవిఖ్యాతం బైనయీ యాఖ్యానంబును బాడెదరు వినుం డని చెప్పి యాకుమారులకు బాడునట్లు పురికొలిపె. వారును దేనియ లొలుకుతీయని రాగంబులఁ దలఁచినవడువున నెడ తెగక నిడుపిగాఁ జాఁగునటు లాలపించుచుఁ దంత్రులయం దారోపించి లయుతోడంగూడఁ గడుం దేట లగునర్థంబులు నీటు గులుక గానముసేసిరి. ఆగానము నాసభయం దెల్లవారి యవయవములను బులకితములఁ గావించుచు వారిమనంబులకును దదాశ్రయములైన హృదయంబులకును నిరతిశయసుఖంబుఁ గూర్చుచుఁ జెవులపండువై ప్రకాశించిన దయ్యె. ఇయ్యిరువురు మునివేషులయ్యు రాజలక్షణలక్షితులును గాయకులయ్యును మహాతపస్సంపన్నులు నగుదురు. రాముండును సభ్యులంజూచి * యీచరితమో సీతావృత్తాంతముకలిమింజేసి మహాప్రభావభాసురమై యాప్రియురాలిం బాసి నవయుచున్న నాకుఁ బ్రాణముల నిలువంబెట్టుదిట్టంపుమే లొడఁగూర్చు నదియునై యొప్పను. అట్టిమహాత్ము లిట్టిమహనీయచరిత్రము చెప్పెదరు కాన వినుం డని వారి కుత్సాహముఁ గలిగించె. ఆపలుకులకు నుల్లసిలి యీయిరువురు మార్గమనెడి రాగప్రకారము నొడఁగూర్చునిందుపరికరముతోడ వీనులకు హాయిగాఁ బాడిరి. రాముఁడు దాను దోడనే సింహాసనము డిగినచో వినుచున్నసభ్యులందఱును లేతు రనియు దానివలన గానరసభంగము గలుగుననియుఁ దలఁచి తోడనే లేవక యల్లల్ల లేచి వచ్చి యాసభనడుమం గూర్చుండి తద్గానామృతము ననుభవించుసొంపున మనంబు దగులువడినవాఁ డయ్యె. ఇది నాలుగవసర్గము.

——·✧·——

## అయోధ్యాపురవర్ణనము

ఇక్ష్వాకువంశజు లగురాజులు మిక్కిలియు మహాత్ములు. ఈమహాధారుణి యంతయు నితరభూరమణులకు లభ్యము గాక యావంశమునందలి వైవస్వత మనువు మొదలుగాఁ గలజయశీలు రగుమహీపాలురకు లోనై యెప్పుడుఁ గ్రొత్తయగుదాని వలెఁ బొలుచుచుండును. తనపేరంజెలువారు సాగరంబును ద్రవ్వించి యఱువదివేవురు కొడుకులు దనుఁ జుట్టి రాఁగా దండయాత్రలను జలిపి వెలసినసగరుఁడు నాయిక్ష్వాకు వంశీయులలో నొక్కండే యగు. మహనీయు లగు నాయిక్ష్వాకురాజులవంశమునకు రాముఁడు లలామభూతుఁడు.

---

* ఈచరితము సీతావృత్తాంతప్రతిపాదకమగుటంజేసి మహాప్రభావమైదని రాముఁడుచెప్పె. కావుననే 'ప్రధానముగా సీతాచరితము ప్రతిపాదించునదై' యనిపూర్వము చెప్పఁబడెను. రాముఁడు స్వచరిత్రమగుటచే మహాప్రభావమైనదనిరా నని కొందఱు చెప్పెదరు గాని యప్పుడు ధీరోదాత్తనాయకుఁ డగురాముఁ డాత్మప్రశంసాదోషమునకుఁ బాత్రుఁడగును. సీతాచరితమగుటంజేసితద్విరహకృశుం డై యున్నతనకు నది మేలొడఁగూర్చునది యనిచెప్పె. ప్రియావృత్తాంతము విరహిజనులకుఁ బ్రీతికరము కదా. తనచరితమేని తనకు మేలొడఁగూర్చునని చెప్పఁబడు అని తెలియునది.

ఆరామునిఁగూర్చి రామాయణమని పొగడు గాంచి నెగడునిమ్మహనీయ మైన యాఖ్యానము బ్రహ్మప్రసాదమునఁ బొడమిన దయ్యె. నేనిందులకు నిమిత్త మాత్రుఁడనై దీనిఁ బ్రవర్తింపఁ జేయుచున్నవాఁడ. కాఁబట్టి యిది నాచే రచింపఁ బడిన దనియైనను లేక బ్రహ్మకృతమని తలఁచి భక్తితోఁగూడ ధర్మార్థకామఫల ప్రద మైనదీనిని రాముఁడవతరించుట మొదలుగా నేదియుఁ గొఱవడనటులం తయు వినఁ దగును. సరయూనదీతీరమున సతతసంతుష్టబహుజన సమృద్ధమును నపరిమితధనధాన్యసంపన్నమును నతివిశాలము నైనకోసలమను దేశము గలదు. అందు జగములనెల్లం బొగడ్తగాంచి మించునయోధ్య యనుపురము విలసిల్లు అది తొల్లి మానవనాథుఁ డగుమనువు సంకల్పించి నిర్మించెను. మఱియు నమ్మహాపురము పండ్రెండుయోజనముల తనరుపును మూఁడుయోజనముల విఱివియుఁ గలిగి కాంతి దళుకొత్తుచుండును. నానాజనపదములకుఁ బోవునందలి పెనువీథు లన్నియుఁ జక్కఁగా నేర్పఱుపఁబడి యుండును. అందలిరాజమార్గము పెద్దదియై తద్దయు సొగసుగాఁ దీరి యెప్పుడును విడిపూవులు జల్లంబడియు, జలంబులఁ దడుపఁబడియు, నాపురమున కెంతయుఁ బొలుపుఁగూర్చుచుండును. ఆపెనురాష్ట్రము ధర్మమార్గమునఁ బాలించి వర్ధిల్లంజేయువిన్నాణి యగుదశ రథుఁ డనుమహీజాని యప్పురమును, దేవేంద్రుఁడు స్వర్గంబునుం బోలె, నెలకొలి పినవాఁ డయ్యె. అందు బహిర్ద్వారములు మీఁదైనకవాటములచేఁ జెలువారు చుండును. అంగడు లొండొంటి కెడ కలిగి చెలువుగా నమరి యుండును. లోక మునఁ గలయన్నియంత్రములు నఖిలాయుధములు నందుఁ గనుపట్టు. నానావిధ శిల్పులును బెక్కండ్రు వసింతురు. రాజులను గయివారములు సేయువందిజను లును, నిదురమేలుకొలుపు మాగధబృందమును నందుఁ గ్రిక్కిఱిసియుండు. ధనధాన్యంబులపెంపు పొంపిరి వోవుచుండు. ఎటుసూచిన నందు తులలేనికాంతి తులకించుచుండు. పొడవులైనయట్టళ్లును వానిమీఁదఁ బడగలును బెడఁగారు చుండు. వందలకొలఁదిని బిరంగులు ప్రాకారంబుల రంగారు. ఎటు చూచి నను జెలువలకు నాట గఱుపునట్టువలగుంపును, ఎలదోఁటలును, నచ్చంపుమావి తోపులును నేపారు. మొలనూలివలెఁ జుట్టి యున్న పెనుప్రాకారంబును విఱి వియు లోఁతును గలదై పగవారికిని జొరరానట్టిబలుదుర్గ మని పొగడ్త గన్న పెన్నగడ్తయుఁ గలదు. మఱియునందు మేలిగుఱ్ఱములును, మత్తిల్లినయేనుగులును, బలుపు గొన్నగోవులును, దిట్ట లగులొట్టియలును, బటుతరంబు లగుఖరంబులును లెక్కకు మిక్కిలియై యుండు, కప్పంబు లర్పింప నచ్చిన సామంతరాజసమూహ ములును చేరమునకై వచ్చి యున్న నానాదేశవాసులగువర్తకులు నందునెఱసియుం దురు. విశేషించి మణులచే నిర్మితములైన నగళులును, క్రీడార్థము రచింపఁబడిన కృత్రిమపర్వతములును, సుందరము లైనవలభీసందోహములును నందము మీఱ

నది యింద్రునియమరావతింబోలెఁ బొలుపారుచుండు. మఱియు నానారాజగృహవిచిత్రితముగాన, నెత్తపలకను బోలినయాకారసన్నివేశముగలిగి వెలుఁగుచుండు. సుందరులగునారీజనులెయ్యెడనొయ్యారము గులుకుచుందురు. అన్నివిధములరత్నములందు నెఱసియుండు. విమానములనియెడిగృహవిశేషములు భాసిలుచుండు. గృహస్థులగృహములేచక్కని జూచినను గ్రిక్కిఱిసియుండు. ఇట్లే నెఱనును లేక మెఱయుచు నెగ్గుతగ్గులు గానిసమభూతలమునఁ గట్టఁబడి యాపట్టణము డంబు మీఱుచుండు. అందు శాలితండులములు నిండారియుండు. జలములు చెఱకురసమునుంబోలెఁ దీయనై యుండు. భేరులు, మద్దెలలు, వీణియలు, నుడుకులునం దెప్పుడును మిక్కిలియు బోరుకొనుచుండు. ఇట్లాపురంబు పృథివీతలంబునం దెందు నీడు జోడు లేక, దివంబున సిద్ధులు తపంబుచేఁ బడసినదివ్యవిమాన సమూహంబునుంబోలెఁ బొలుపారుచు. నలుగడల సువినిర్మితంబులైనగృహంబులు గలిగి వెలుఁగుచుండు. అందు విద్వాంసులు వేనవేలుగలరు. శస్త్రవిద్యయందారితేరినమహారథులు పలువేవు రావీట రాజిలుచుందురు. వారు సమర్థులైయుండియు, నొంటిసహాయుఁడైన వానిని గాని, తనకుఁ బెద్దలైనతలిదండ్రులు మున్నగువారేని పిన్నలగుకొడుకులు మొదలగు వారేని లేక వంశమునకెల్ల నొంటిపాటుగా మిగిలియున్న వానినిగాని, యెదురుగా మాటొక్కనికి శబ్దంబు గుఱిచేసియొండొరులం జూడక (అనఁగా మాటునుండి) యమ్ము నాటందగిన వానినిగాని, పలాయితునింగాని బాణంబుల గాఁడ నేయరు. మఱియుఁ దమదేశంబునవనంబుల మత్తిలి గర్జిలుచున్న సింహశార్దూలవరాహంబులఁ దెంపు బలిమిం జేసియు మహాబలంబునను వాఁడిబాణంబులఁ గీటణంతురు. పేగ తేకాక యాహితాగ్నులును, సకలగుణసంపన్నులును, వేదవేదాంగపారంగతులును, బహుళార్థప్రదులును, సత్యనిరతులును, గేవలఋషులును, వసిష్ఠాదిమహర్షికల్పులును, మహాత్ములు నగుబ్రాహ్మణోత్తములు నందురాజిలుచుందురు. ఏవంవిధలక్షణవిరాజమానమైన యప్పురరాజమును రాజగుదశరథుండు పట్టుకొల్పినవాఁ డయ్యె. ఇది ఐదవ సర్గము.

---

## దశరథుని నతనిప్రజాదులను వర్ణించుట.

ఆపురమున, దశరథుం డనుభూనాథుండు వసించియుండు. అతఁడుసకలవేదార్థవిదుఁడు, సర్వజ్ఞుండు; సర్వవశీకరణకుశలుండు, అమ్మహాతేజుండు వైవస్వతమనువు లోకమును రక్షించునట్లు తానుజగతీతలమును బరిపాలించుచు, ధనాదులవ్వారిగా నొసంగిసకలవీరులనువిద్వాంసులను బ్రాపయికూర్చుకొనుచుండును. మఱియునతండు చిరకాలంబునకుఁ గలుగనున్నవిషయమునైనను దవ్వులఁ గనుఁగొనునట్టిమతిచారవ గలిగి, మహాప్రతాపవంతుఁడును, పౌరులకును జానపదులకును బ్రియుఁడును, ఇక్ష్వాకువంశీయులలో నెల్లనతిరథుండును, విధ్యుక్తముగాఁ బెక్కుయజ్ఞంబులుయజిం

చిన వాఁడును, నానాధర్మ కార్యనిరతుఁడునై విలసిల్లు. ఇంతేకాక, యెల్లవారినిలోఁ బఱచుకొనునట్టిశక్తిగలిగి, మహర్షి సమానుండై, రాజరూపుండైనఋషి యనం బరఁగి, ముల్లోకములంబొగడ్తగాంచి మించుచుండు. అపారంబులైనచతురంగబలములకలిమిం జేసి యతండు సకలశత్రుల రూపుమాపితనగుణములకు మెచ్చివచ్చిన మహనీయులఁ బెక్కండ్రు మిత్రులం బడసి బెడఁగారుచుండు. మఱియు నాజితేంద్రియుఁడు సువర్ణమణిదివ్యాంబరాభరణవిభవంబున సురవిభునితోఁ దులదూఁగు; భూరినిధిసంగ్రహమునఁ గుబేరునిఁ బురుడించు. ఇవ్విధమున నాభూనాథుండు సత్యసంధుండై ధర్మార్థకామంబుల నుద్దేశించి యప్పురీలలామంబును నింద్రుం డమరావతిం బోలెఁబరిపాలించె. ఇట్టిసారాజ్యంబుమహిమం జేసి యప్పురవరంబునఁగలవారందఱు సుఖవాసంబున సంతుష్టులై నానావిధధర్మంబు లెడతెగక యాచరించుచు, బహుశాస్త్రశ్రవణపరిణతులునై, తమతమవిత్తంబులఁదృప్తినొంది, పరధనాభిలాషులుగాక లోభములేక దానము లొసఁగుచు, సత్యవాదులై పొదలుచుండిరి. మఱియు నందెచ్చటనేనియు మిగులఁ గామైకలోలుం డగువాఁడుగాని, తల్లిదండ్రులను దారపుత్త్రాదులను లోభంబునఁ బీడించి వంచించునట్టివాఁడు గాని, క్రూరుండుగాని, పండితుండు గానివాఁడుగాని, నాస్తికుండుగాని కనఁబడుటయరిది. మఱియునల్పధనసంచయుఁడైనవాఁ డెవ్వఁడు నప్పీటఁ గలుగఁడు. కావుననే ద్రవ్యాదులచేఁ దాను గోరినయర్థముల నొడఁగూర్చుకొననివాఁ డేని, గోవులు నశ్వములు ధనధాన్యములు మున్నగునవి లేనివాఁ డేని కానిపింపఁడు. అందలిపురుషులును బడఁతులు నెల్లవారు ధర్మపరాయణులును, నియతేంద్రియులును, సహజసుస్వభావులును, సదాచారయుతులును, మహర్షులుంబోలె విమలాంతరంగులు నై రంగారుచుందురు. చెవిపోగులు లేనివాఁడును, దలమకుటముఁదొడుగనివాఁడును, మేనఁబూదండలు దాలుపనివాఁడును, నందుఁ గలుగఁడు. అల్పభోగుఁడును, నభ్యంగస్నానములచే శుద్ధుండు గానివాఁడును, గందము లలందుకొననివాఁడును, కస్తూరి కుంకుమము మొదలైనసుగంధిద్రవ్యములఁ బూసికొననివాఁడును లేఁడు. అన్నాభావంబునఁ గడుపారఁ గుడువనివాఁడును, నన్నము వెట్టనివాఁడును, బాహుల భూషణంబులను వక్షంబున హారాదులను దాల్పనివాఁడును, జేతఁ గడియములు లేనివాఁడును, నంతఃకరణము జయింపనివాఁడును గానరాఁడు. ఎడతెగక యగ్నిహోత్రము వేల్వనివాఁడుఁ గాని, యాగము లొనరింపనివాఁడు గాని, యల్పము లగువిద్యయు నైశ్వర్యమును గలవాఁడుగాని, చోరుఁడుకాని, వర్ణసంకరము గావించువాఁడు గాని యాయయోధ్యయం దెవ్వఁడునుగలుగఁ డయ్యె. అందలిబ్రాహ్మణు లెప్పుడును దమకునియతములై యున్నకర్మంబులఁ దప్పక యాచరించుచు, జితేంద్రియులై శిష్యులకు విద్యాదానంబులు సేయుచును, జపములుసలుపుచును బొలుపారుచుందురు. వారు ప్రతిగ్రహంబులఁ దీయవెనుదీయుదురు. పురజనులిట్లుండ నిఁక జానపదులగువారియందో

నాస్తికుఁడును; నసత్యవాదియుఁ, బెక్కుశాస్త్రములు విననివాఁడు, నసూయా యుక్తుండును, బురుషార్థములు సాధించుటయం దశక్తుఁ డైనవాఁడును, అపండితుండును నెవ్వఁడుఁ గానరాఁ డయ్యె. మఱియు శిక్షావ్యాకరణాదిషడంగపారంగతుండుగానివాఁడును, జాంద్రాయణాదివ్రతంబు లాచరింపనివాఁడును, హిరణ్యాదిదానంబులు పెక్కు లొనరింపనివాఁడును, దీనుండును, వ్యాకులచిత్తుండును, వ్యాధిప్రభృతిపీడితుండును నొక్కండేనియు లేఁ డయ్యె. పురుషులయందును బడఁతులయందును నెవ్వరేని కాంతిరహితులుగాని సౌందర్యహీనులుగాని రాజభక్తిహీనులుగాని యందుఁ గాంచుట యెంతయు నశక్యము. బ్రాహ్మణులు మొదలుగాఁ జతుర్వర్ణములవారును, దేవతలను నతిథులను బూజించుచు నుపకారంబు మఱవక ప్రత్యుపకారంబుఁ గావించుచునుందురు. అందు బ్రాహ్మణులు దానశీలురై, యధ్యయనశూరులై, వాదంబులవిక్రమంబు నెఱపుదురు. తక్కిన వర్ణములవారును దాతృత్వశౌర్యపరాక్రమముల రాజిలుచుండిరి. వేయేల? అందుఁ గలజనులందఱును, దాము పూనినధర్మమునను సత్యమునను దీర్ఘాయుష్మంతులై యెప్పుడు నాలుబిడ్డల మనుమలను గూడి యింపు సొంపారుచుందురు. క్షత్రియులు బ్రాహ్మణులఁ దమకు ముఖ్యులుగా వరించి వారియాజ్ఞ నొప్పున వర్తింతురు. వైశ్యులు క్షత్రియుల నను వర్తింతురు. శూద్రులును దమతమధర్మములందుఁ దప్పక నెలకొని తక్కినమూఁడు వర్ణములవారికి నుపచరించుచుందురు. ఇట్లాపురీమతల్లి తొల్లి మానవేంద్రుండును మతిమంతుండు నగు మనువు పురరక్షించిన ట్లిప్పు డిక్ష్వాకుకులతిలకుం డైనయాదశరథభూనాథుచేతఁ బరిరక్షితమగుటం జేసి యేవంవిధసకల సౌభాగ్యలక్షణలక్షితంబై, డంబు మీఱు. ఒప్పిదంపునడవడియు, మొప్పులు గులుకుముఖవర్చస్సును గలిగి శౌర్యాతిశయమున నగ్నింబోలెఁ గ్రాలుచున్నవీరు లందు నిండి యుండుటచే నది సింగములు నిండి యున్న పెనుగుహారీతిని బగవారి కెదిరింపరానిదై యుండు. మఱియుఁ గాంభోజదేశజనితములును, బాహ్లీకములును, వనాయుజములును, సింధుసంభవములు నగునశ్వము లుచ్చైశ్శ్రవములంబోలి యందు లెక్కకు మిక్కిలిగా నుండు. వింధ్యపర్వతసంభవములును, హిమవన్నగసముత్పన్నములును, నైరావతకులమునఁ బుట్టినవియు, పుండరీక నను దిగ్గజమువంశమునఁ బొడమినవియు, వరుణదిగ్గజ మగు నంజనమువలన జనించినవియు, యామ్యదిగ్దంతి యగు వామనమువలన నుప్పతిల్లినవియు నగు నేనుఁగులపిండు లతిబలవంతములయి మత్తిలి నడగొండలవలె గండుమీఱుచు నందు మెండుకొనియుండు. మఱియు భద్రములు, మంద్రములు, మృగములు నను *మూఁడుజాతుల గజములును, భద్రమంద్రమృగములును, భద్రమంద్రములు, భద్రమృగములు,

---

* అంగప్రత్యంగభద్రత్వం సంక్షిప్తం భద్రలక్షణమ్। పృథుత్వం శ్లథతా స్థౌల్యం సంక్షిప్తం మంద్రలక్షణమ్। తనుప్రత్యంగ దీర్ఘశ్చ ప్రాయో మృగగణో మతః॥ అని భద్రమంద్ర మృగజాతుల

మృగమంద్రములు ననుసంకీర్ణజాతు లగుగజములునందు నెప్పుడు మత్తిలి పెను గొండలవడువునఁ బొడువులై యొడతెగక యుల్లసిల్లుచుండు. చతురంగ బలసంపత్తిం జేసి యానగరము తనయంతఃమాత్ర నెట్టిశత్రునకు మార్కొనరానిదై యుండుటయే కాక తనచుట్టు రెండుయోజనముల మట్టునకును నట్టిదయై యయోధ్య యనునిజనామము సార్థకముఁ జేయుచుఁ బ్రకాశించు చుండును. అందు రాజై దశరథుఁడు వసించి జగము పాలించుచుండఁగా నది యట్టిదగుట యేమిచోద్యము? అమ్మహారాజు నిజతేజమున నఖిలశత్రురాజి నడంచి యప్పురరాజమును, జంద్రుఁడు నక్షత్రములంబోలెఁ, బ్రశాసించినవాఁ డయ్యె. ఇట్లన్వర్థనామము గలిగి యతిదృఢంబైనబహిర్ద్వారంపుగడియం జేసి యెట్టివారికిఁ జొరరానిదై విచిత్రము లైనగృహముల వెలుంగుచుఁ బరమమంగళవిలసితమును బహుసహస్రజనసంకులము నై యరిజనాయోధ్య యగు నయ్యయోధ్యాపురము శక్రసమానుం డగునాభూనాథుండు శాసించె. ఇది ఆఱవసర్గము.

---

## మంత్రిపురోహితాదివర్ణనము.

ఇక్ష్వాకుకులప్రసూతుం డగునమ్మహామతికి మంత్రు లెనమండ్రు గలరు. వారు కార్యవిచారనిపుణు లగుటచే మంత్రజ్ఞులును, ముఖవికాసాదులచేఁ బరాభిప్రాయముల నెఱింగికొనఁజాలు వారగుటచె నింగితజ్ఞులు, ననఁదగి ప్రియుం డగురాజున కెప్పుడును హితము లాచరించుచు మంత్రులకు వలయుసకలగుణములచే రాణించుచు నుందురు. ఆయెనమండ్రును మిక్కిలికీర్తిమంతులై రాజుదెస నేనెఱనును లేక నిర్మలాంతరంగములతో మెలఁగుచు నతనికార్యముల మిక్కిలి యనురక్తితో నెప్పుడును నిర్వహించుచుందురు. వారలు, దృష్టియు, జయంతుఁడును, జయుఁడును, సిద్ధార్థుఁడు, నర్థసాధకుఁడు, నశోకుఁడును, మంత్రపాలుఁడు ననఁబడుదురు. ఎనిమిదవవాఁడు సుమంత్రుఁ డనఁబడు. ఆరాజవరునకు వసిష్ఠుడును వామదేవుఁడు ననునిరువురు పురోహితులును బ్రధానులై యుండిరి. అట్లె *జాబాలి మొద లగునితరులును మంత్రులుగాను బురోహితులుగాను నుండిరి. వీరందఱును సకలవిద్యలందును సుశిక్షితులయినను గర్వము నూలి వినయసంపన్నులై, అకృత్యము లాచరించుటయం దెంతయు సిగ్గు గలిగియుందురు. మఱియు వారు నీతికుశలులును, నియతేంద్రియులును, లక్ష్మీసంపూర్ణులును, మహాబుద్ధ

---

లక్షణములును, 'భద్రమంద్రో భద్రమృగో భద్రమంద్రమృగోఽపిచ। మృగమంద్రాదయోఽప్యేవమితి సంకరజాతయః' అని యామూఁటిసంకరముచే నైనజాతులును దెలియునది.

* ఇతరులు 'సుయజ్ఞోఽప్యథజాబాలిః కాశ్యపోఽప్యథగౌతమః। మార్కండేయస్తుదీర్ఘాయుస్తథాకాత్యాయనో మునిః। ఏతైర్బ్రహ్మర్షిభి ర్నిత్య మృత్విజస్తస్య పౌర్వకాః' అని తెలియునది.

మంతులును నీతిశాస్త్రజ్ఞులును, అప్రతిహత పరాక్రమవంతులునై, మంత్ర నైపుణ్యమున నగణ్యమగుకీర్తినార్జించి, యెల్లకార్యములం దెచ్చరిక గలిగి, యాడి నట్లు తప్పక చేయుచుఁ, దేజమునను క్షమం జేసియుఁ బొగడ్తకెక్కియుండిరి. వారు గొఱకొఱ లాడుచుండక యెప్పుడును జిఱునవ్వు మురువుసూప మాటాడుదురు. కోపమునఁగాని కామమునఁగాని మఱియేయర్థముంబట్టికాని వారనృతంబుఁ బలుకు వలుకరు. స్వరాష్ట్రములందును బరరాష్ట్రములందును జరుగుచున్న దియు జరుపఁబడినదియు నిఁక జరుపఁగోరఁబడియున్నదియు నేది గాని చారుల మూలమున వారికిఁ దెలియనిది లేదు. వారు సర్వవ్యవహారములందును గుశ లులు. వారిమిత్రభావములో మిక్కిలియుఁ బరీక్షింపఁబడి యూర్జితము లైన విగాఁ దెలియఁబడినవి. ఒకఁడపరాధము సేసిననాఁడు వాఁడు గన్నకొడుకేనియు దండింపక తప్పరు. ఊరక యెట్టివారిని దండింపరు. బొక్కసమునం దర్థము సేకరించుటయందును ద్రవ్యాదు లొసంగి చతురంగబలములఁ గూర్చుట యందును జాగరూకులై తమ కహితుం డయ్యును నపరాధము సేయని వాని నావంతయు హింసింపరు. మఱియుఁ బగతుర వారించునట్టి వీర్య మును, గెలుపుఁగొనునట్టి యెడతెగని యుత్సాహమును, నీతిశాస్త్రము దప్పని యనుష్ఠానమును, స్వరాజ్యమున వసించుసాధుజనుల రక్షించుటయుఁ గలిగి వెలుఁగుదురు. బ్రాహ్మణులను క్షత్రియులను నపరాధము లేనిచోఁ హింసించి వారిసొమ్ము లపహరింపరు. వారెవ్వఁడేని యపరాధము సేసినయెడల వానియప రాధమున నెక్కువతక్కువలు చక్కఁగాఁ బరిశీలించి దేశకాలవయశ్శక్తుల నెఱింగి తదనుగుణముగా మిక్కిలి యుగ్రముఁగాని మృదువుగాఁగాని దండము విధించుచు బొక్కసము నించినవారైరి. ఈ రీతిని త్రికరణశుద్ధులై యేకమత్యబద్ధులై మంత్రు లందఱును రాజ్యతంత్రమును విచారించుచుండుటం జేసి యప్పురమునను దదీయ రాష్ట్రమునను నెయ్యెడ నేనియు, నసత్యవాదిగాని, దుష్టుఁడుగాని, పరదారరతుఁడు గాని యొక్కరుఁడును గలుగఁడయ్యె. పురమును రాష్ట్రమును నేబాధయు లేక నిమ్మళపాటు నొంది యుండు. అందఱిజను లన్యాయమునకు నధర్మమునకు దూరులై వర్తిలుచుండిరి. మఱియు నయ్యమాత్యు లెల్ల శుభ్రవస్త్రములు గట్టి శోభనా లంకార విరాజితులై సమంజసవృత్తులై తమస్వామి యగు రాజలలామునికి హితము సేయఁగోఱకును నెప్పుడు నీతిదృష్టితో నెచ్చరిక గలిగి గుణాగుణగ్రహణనిపుణులై రాజువలన మన్నన వడసి పెద్దలయందలిదోషమును జాటింపక గుణమాత్రము గ్రహించుచుఁ బరాక్రమమునఁ బొగడ్తకెక్కి సకలవిషయముల నిశ్చయించు బుద్ధివిశేషవైదుష్యమునం జేసి తమ దేశముననే కాక పరదేశములయందును మిక్కిలి ప్రసిద్ధిగాంచి మించుచుందురు. వారికి సంధివిగ్రహాద్యుపాయములతత్త్వము లన్నియుఁ దెలియు. సంపద యుండినను లేకున్నను నెప్పుడును సంపన్నులవలెనే

నడచుకొనునట్టి స్వభావముగలవారు. కావున సంపద లేకున్నను గలిగినను దానికై యన్యమార్గముఁ ద్రొక్కునట్టివారు కారు. ఇంతేకాక యామతిమంతులు రాజకార్యాలోచనముల రహస్యముగాఁ గాచియుంచుకొనుశక్తిగలిగిన సూక్ష్మార్థవిశేషములను విచారించుటయందలి బుద్ధిస్ఫురణంబున బురణించుచు, నీతిచేఁ బ్రజలఁ బరిపాలించువిశేషములందారి తేఱి రాజున కెప్పుడు హితము లగుప్రియములు వలుకుచు నుండిరి. ఇట్టిగుణగణంబులుగల యమాత్యశిఖామణులం గూడి రాజగు దశరథుండు వ్యసనం బేమియు లేక చారులచే సకలవృత్తాంతములు నరయుచుఁ, బ్రజల ధర్మంబుచే రక్షించుచు, వారి యనిష్టములం దొలంచి యిష్టములఁ బూరించి పరిపాలించుచు, అధర్మము మాని, నిజవిక్రమాదులచే ముల్లోకములను బొగడు వడి, దానశీలుఁడును సత్యసంధుఁడునై యఖండవసుంధరాతలంబు నేలుచు నప్పురిలలామంబున వసించి యుండెను. అతండు దనకధికుండుగాని సముండుగాని యగుపగతుని నెఱుఁగఁడు ఏలన నతనికిఁ బ్రశస్తు లగుమిత్రులు గలరు. సకల సామంతు లతనికి గడగడ వడఁకుచుందురు. కాన నతని ప్రతాపంబున సకల శత్రువులును రూపుమాసినవారైరి. అట్టివాని కీడు జోడుగాని యధికుఁడుగాని కలుగునే? కాన యారాజేంద్రుఁడు దేవేంద్రుఁడు స్వర్గమునుంబోలె సకలభూవలయమును బరిపాలించె. ఇట్లు తనదుకార్యాలోచనంబులందును, హితంబులందును నియుక్తులై తన కనురక్తులై బుద్ధికుశలులై కార్యసమర్థులై యొప్పునష్టమంత్రివరులు దన్నుఁ జుట్టికొలువఁగాఁ దేజోమయములైన కిరణములు చుట్టి వెలుంగు బాలార్కునింబోలె నాభూపాలుఁడు దీప్తినొందినవాఁ డయ్యె. ఇది యేడవసర్గము.

---

## దశరథుఁడు పుత్రకామేష్టి సేయఁ బూనుట.

ఇట్టి ప్రభావములు గలిగి యఖిలధర్మముల నెఱింగి వెలుంగుచున్న యమ్మహాత్ముఁడు కొడుకును బడయఁగోరి తపం బెంతయు నాచరించుచుండెను. కాని వంశకరుం డైన కొమరుం డాతనికిఁ గలుగఁడయ్యె. అందుల కారాజును చింతించుచుండఁగా నొకప్పు డాతనికి 'బిడ్డకొఱ కశ్వమేధయాగము నేనేల చేయనైతి' నను బుద్ధిపుట్టెను. అంత నారాజు బుద్ధిమంతుండుగాన మంచిబుద్ధి చొరవయం దారితేఱినధర్మాత్ములగు తనమంత్రులతోఁగూడి యాలోచించి యవశ్యము యజ్ఞము సేయవలయునని మనమున నిశ్చయించి మంత్రిసత్తముఁడగు సుమంత్రునిఁజూచి 'మంత్రీ! నీవుపోయి నాగురుపులను బురోహితులను నందఱిని త్వరితముగాఁ బిలుచుకొని ర'మ్మని చెప్పె. అంత సుమంత్రుం డప్పుడే కదువడిం జని వేదపారంగతులైనసుయజ్ఞుఁడు, వామదేవుఁడు, జాబాలి, కాశ్యపుఁడు, పురోహితుండైన వసిష్ఠుఁడు, మఱియుఁ దక్కుంగల బ్రాహ్మణోత్తముల నందఱిని గూర్చి రాజగృహంబునకుఁ గొనివచ్చె. ధర్మాత్ముఁడగు నాదశరథుఁడును వారలనెల్ల నపుడు పూజించి

ధర్మార్థయుక్తముగను మధురముగను వారలతో 'మహాత్ములారా ! పుత్రులఁ బడయఁగోరి నే నెంతయు విలపించుచుండియు నాకు బిడ్డలిం గాంచునట్టి పరమ సుఖము గలుగదయ్యె. కావునఁ బుత్రునికొఱకు నశ్వమేధము సేయవలయు నని నాకు మతి గలుగుటవలన నేను శాస్త్రోక్తమైన విధానమునఁ గ్రియాకలాపముఁ గయికొని యజ్ఞము సేయఁగోరెద. నేనుగోరుచున్న యీ యజ్ఞము నెట్టు లొడఁగూర్చుకొందునో యట్టియుపాయము మీరు విచారించి చెప్పుఁ' డనియె. అంత వసిష్ఠప్రభృతు లైన బ్రాహ్మణు లందఱును రాజాకరిబోధనచేఁ గాక తానై చెప్పిన యవ్వాక్యమును 'బాగు బా' గని మెచ్చి సంతోషించి దశరథుని జూచి పరమ ప్రీతులై 'రాజా! యజ్ఞమునకు వలయుసంభారము లన్నియు నొడఁగూర్పం బనుపుము. అశ్వమును విడువుము. పుత్రులకొఱకు నీకు ధర్మాత్మక మైన యిట్టి బుద్ధి గలిగినది. కాన సర్వవిధముల నీవు గోరినపుత్రులను బడయుదు' వనిరి. అంత రాజును నాబ్రాహ్మణులపలుకులకు మిక్కిలియుఁ బ్రీతుం డై సొంపు పెంపునఁ గనుఁదమ్ములు విరియఁబాఱ మంత్రులఁ జూచి 'నాగురువులు చెప్పినచొప్పున సకల సంభారములను సమకట్టుఁడు. రక్షించుటకుఁ జాలిన వారిని గాపుగా నుంచి యశ్వమును నధ్వర్యుప్రముఖు లైనఋత్విజులతోడఁ గూడ విడుచు నది. సరయూనది కుత్తరతీరమున యజ్ఞభూమిని గావింపుఁడు. క్రమము దప్పక శాస్త్రప్రకారమున శాంతికర్మములను మీఁదుమిక్కిలి చేయింపుడు. అత్యుత్తమం బైన యీ యజ్ఞంబునఁ గ్లేశకరంబుగ నపచారం బేదియుఁ గలుగనియెడ సామాన్యు లగురాజుల కెల్ల వారికిఁగూడ నిది చేయుటకు శక్యమే యగు. ఈ యజ్ఞస్వరూపము నెఱుంగు బ్రహ్మరాక్షసులు దీనియందు రంధ్రమును వెదకు దురు. వారు రంధ్ర మేదేని కలిగి యజ్ఞమును జెఱుపుదు రేని తోడనే దానిని జేయుకర్త నశించును. కావున యజ్ఞానుష్ఠానముల సమర్థుల రగుమీ రీయజ్ఞము విధిపూర్వకముగా సమాప్త మగునట్టి ప్రయత్నము సేయవలయు' ననియె. మంత్రు లెల్ల నమ్మహారాజు చెప్పినవాక్యమును విని 'దేవర యానతిచ్చినట్లు చేసెద మని పలికి యాతని యీ మేలిపూన్కికి మిక్కిలియు సంతుష్టిఁ జెందినవా రైరి. ఆ రాజలలాముని కాశీర్వాదాదులచే మంగళాభివృద్ధి సేయుచున్న ధర్మాత్ము లగు బ్రాహ్మణోత్తములు నట్లే కావించునట్లుచెప్పి సెలవుచ్చుకొని యందఱును దమ వచ్చిన దారిని బోయిరి. రా జావిప్రులను వీడుకొలిపి మంత్రులఁజూచి 'ఋత్విజు లుపదేశించినట్లు వలయు విధంబున యజ్ఞసంభారము లెల్ల మీరు సమకట్టుఁడు. అంతకు మీరు నాయీయజ్ఞకార్యములకుఁ జాలి మెలఁగు' డని చెప్పి చెంతనున్న యమ్మంత్రులనెల్లఁ బోవం బంచి మదిసొంపున నెమ్మేనఁ గాంతి పెంపు పొంపిరి వోవఁ దేజరిల్లుచు నిజగృహమునకుఁ జనియె. అట్లా రాజు వోయి మదికి మిక్కిలియుంగూర్చు తనపత్నుల నా కౌసల్యాదులను జూచి 'నేను బుత్రులఁగోరి

యజ్ఞముసేసెదను. కాన మీరుదీక్షఁబూనుఁ' డనిపలుకఁగాఁ జక్కఁదనంపుసొంపు నివ్వటిలుచున్న యాజవ్వనులకు మిక్కిలియు నింపైనయమ్మాట వినఁబడఁగానే, తామరలవంటివారి ముద్దుమొగములు, మంచు వీడఁగాఁ దామర లెట్లో, యట్లు ప్రకాశించినవి. ఇది యెనిమిదవ సర్గము.

---

### ఋశ్యశృంగచరిత్రము.

రాజు పుత్రులకొఱకు నశ్వమేధము చేయుదు నన్న వాక్యము విని సారథి యగుసుమంత్రుఁడు మహీకాంతున కేకాంతమున నిట్లనియె. "రాజేంద్రా! ఈయశ్వమేధాచరణము నీకు ఋత్విజులగువసిష్ఠాదు లుపదేశించిరి గదా. నేనో దీని నితిహాసరూపముగా మును పే విని యున్నవాఁడను. భగవంతుం డగుసనత్కుమారుఁడు నీకుఁ బుత్రుఁడు కలుగు విధమునుగూర్చి జరుగఁ గలవృత్తాంతమును ఋషులసన్నిధిని మున్ను చెప్పియున్నవాఁడు. అదిచెప్పెద వినుము. కాశ్యపునకు విభండకుఁడను పేరుగలపుత్త్రుఁడు గలఁడు. అతనికి ఋశ్యశృంగుఁ డనిపేరు గాంచిన కుమారుఁడు గలుగు. ఆముని వనముననే నిత్యమును బెరిఁగి యెడతెగక తండ్రి ననువర్తించుచు వనముననే తిరుగుచుండును. కాన యాబ్రాహ్మణోత్తముఁడు వనముదప్ప మఱియొక గ్రామమునుగాని గ్రామీణులనుగాని యెఱుంగఁడు. అమ్మహాత్ముఁ డట్లాచరించుచున్న * బ్రహ్మచర్యము భంగము నొంది తాను గృహస్థుం డగు. కాన యతని బ్రహ్మచర్యము లోకమునఁ బ్రసిద్ధమైయున్న యజిన దండాదిధారణరూప మగునొక తెఱంగుగాను, స్మృతికారులైన విప్రులువచించు నట్లు వివాహంబాడినపిదప నియతకాలమున భార్యను బొందురూపమును మఱొక తెఱంగుగాను, నిట్లు రెండు దెఱంగులై తుఱుంగలించు. అతఁ డిట్టు లగ్నిహోత్రమునకును మహాయశస్కుం డగుతనతండ్రికిని శుశ్రూషసేయుచుఁ బ్రథమబ్రహ్మచర్యమున వర్తిల్లుచుండఁగాఁ గొంత కాలము జరుగు. ప్రథమబ్రహ్మచర్యమం దతి డుండు కాలమునఁ బ్రతాపవంతుండును మహాబలుఁడు నైనరోమపాదుఁ డనువా డంగదేశమునకు రాజు నాఁ బరఁగుచుండు. ఆ రాజు ధర్మము నతిక్రమించుటం జేసి యనావృష్టికలుగును. అది చిరకాలము నెలకొనియుండుటం జేసి యతిదారుణమై యతని రాజ్యమునెల్ల ఘోరముగాఁ వ్యాపించియఖిల భూతభయంకరముగా నుండును. అయ్యనావృష్టి గలుగుటకు రాజెంతయుఁ జింతాక్రాంతుఁ డై బహుశాస్త్రంబుల వినియారితేఱియున్న బ్రాహ్మణులరావించి 'మహనీయులారా! మీరలు సకల ధర్మముల వినియున్నవారలు లోకమునందలి యాచారము

---

* బ్రహ్మచర్యము ద్వివిధము. వివాహమునకుఁ బూర్వము అజినదండాదులను దాల్చివనమునఁ జరించుట యొకవిధము. వివాహానంతరము భార్యను ఋతుకాలంబుల మాత్రము పొందుట మఱియొక్క విధము. కావున ఋతుకాలభార్యాసంగమముగూడ బ్రహ్మచర్యమే యనఁబడును.

లన్నియు నెఱింగినవారలు. కావున మిమ్ము వేఁడెద. అనావృష్టిరూప మైన నా యీ పాపమునకుఁ బ్రాయశ్చిత్తముగలుగునట్టు లేనియుపాయము ననుష్ఠింపఁదగునో యది నాకుం దెలుపుఁ'డని యడుగును. వేదపారీణులైన యాబ్రాహ్మణులా భూపాలునిఁ జూచి 'రాజా ! విభండకునికుమారుఁ డగుఋశ్యశృంగుని బహువిధములైన యుపాయముల నిట రప్పింపుము. రప్పించి యాతనిఁ జక్కఁగా సత్కరించి నీకూఁతు శాంతను నిర్విచారముగా నాతని కొసంగు'మనిరి. రాజు వారలపలుకులు విని 'నియతబ్రహ్మచర్యుఁడగు నతని నేయుపాయమున నిచటికి రావింప నలవి యగునో' యని చింతాపరుఁడై మతిమంతుఁడు గాన మంత్రులతోఁ గూడి బ్రాహ్మణుఁడే బ్రాహ్మణుని దేఁగలఁ' డని నిశ్చయించి పురోహితుని నమాత్యులను సత్కరించి యద్దేశముననుండి బంపఁగలఁడు. వారు రాజువచనమువిని మదిలోన ఖిన్నులై తలవంచి 'రాజా ! విభండకునికి మేము వెఱతుము కావునఁ బోవ నేరము. అయిన నా మునిని గొనివచ్చునుపాయము విచారించి చెప్పెద' మనియా మహీశు నను నయింతురు. పిదప వా రాముని నగుఁదేరం జాలినయుపాయముల విచారించి 'రాజా ! మే మీయుపాయములచే నా విప్రుని రావింతుము సుమీ ! దీన నాతని బ్రహ్మచర్యమున కేదోషమును గలుగదు. విభండకుని వలన నేభయమును గలుగదు. ఈయనావృష్టివలని భయమును నుండ' దందురు. ఇట్లు సనత్కుమారుఁడు చెప్పె. అట్లే యంగరాజును వేశ్యలచే నాఋషికుమారుని ఋశ్యశృంగుని రప్పింపఁగాఁ బర్జన్యుండును వర్షము గురిసె. శాంతయు నాతనికిచ్చి పెండ్లి సేయఁబడియె. *నీయల్లు డగుఋశ్యశృంగుఁడును నీకుఁ బుత్రులను గావించు సనత్కుమారుఁ డింతవృత్తాంతమును జెప్పె. దాని నేను నీకుఁజెప్పితిని". ఇట్లు మంత్రి చెప్పఁగా దశరథుఁడు మిక్కిలియుహర్షము నొంద 'మంత్రీ! ఋశ్యశృంగుని దోడి తెచ్చిన విధమునంతయు విస్తరించి నాకుఁ జెప్పవలయు' నని పలికెను ఇది తొమ్మిదవ సర్గము.

---

## వారస్త్రీలు ఋశ్యశృంగుని వంచించి తోడి తెచ్చుట.

రా జట్లడుగఁగా సుమంత్రుఁడు "ధరణీనాథా ! మంత్రు లాఋశ్యశృంగుని దోడితెప్పించిన విధమును వినుము. దాని నంతయు సవిస్తరముగఁ జెప్పెద. పురోహితుఁడు మంత్రులతోఁ గూడి రోమపాదున కిట్లనియె. 'మనుజేంద్రా! మేమా ఋశ్యశృంగుఁ దోడితెచ్చుటకు నిరపాయం బైనయుపాయంబు చింతించితిమి. ఋశ్యశృంగుఁ డెప్పుడు నడవియందే తిరుగుచుండు వాఁడు. ఎల్లప్పుడును దపము సేయుచును వేదముల నధ్యయనము సేయుచునే యుండువాఁడు. కానపురాణంబుల

---

* దశరథునికి శాంత ఔరసపుత్రి, రోమపాదునకు నది దశరథునిచే దత్తయైనదిగావున నాతనికి దత్తకావున శాంతభర్తయగుఋశ్యశృంగుఁడు, దశరథునకును రోమపాదునికిని నల్లుండగు.

నితిహాసంబు లనేనియు నెఱుంగఁడు. కనుక స్త్రీలనఁగా నెవ్వరో తనంతఁగాని యా పురాణాదుల మూలమునంగాని యావంతయు నెఱుంగఁడు. విషయసుఖమును నెఱుంగఁడు. రూపరసాదులగు నింద్రియవిషయములు పురుషులకు మిక్కిలియు నభిమతములై వారిహృదయములఁ గలంచి యాకర్షించునట్టివి గదా. ఇట్టి విషయములచే నట్టివానిని, వశ్యునిఁగావించి యీపట్టణమునకుఁ దోడి తెప్పింతము. మాయీప్రకారమును మీరు శీఘ్రముగా నిశ్చయించి చెప్పుఁడు. చక్కఁదనమునఁ నిక్కుచు నానాలంకారములుగయి సేసిచూచువారిఁజొక్కించునట్టి వారకాంతలా ఋశ్యశృంగుని కడకుంబోవవలయు. వారట్లుపోయి యాతనిచే సత్కారములనొంది పలువిధములైనయుపాయముల వంచించియతని నిట దోడి తేఁగలరు' ఇటు పురోహితుఁడు చెప్ప రాజు 'నట్లే కానిం, డనియానతిచ్చె. పురోహితుఁడును మంత్రులకు నట్లే చేయ సెలవిచ్చెను. ఆమంత్రులునప్పు డవ్విధమునే కావించిరి. మంత్రులవాక్యము వారకాంతులు విని యా రీతినే చేయఁబూని ఋశ్యశృంగు డున్నమహావనమును బ్రవేశించిరి. ఇట్లువ్వనముఁజొచ్చి యతనియాశ్రమమునకు సమీపముననుండి యాతనిని దర్శించుటకుఁ దగిన, ప్రయత్నముఁ జేయసాగిరి. ఏలననతఁడు ఋషికుమారుఁడై యడవులందే తిరుగుచుండువాఁడు గాన నాగరుల చందం బెఱుంగఁడు. జితేంద్రియుండుగాన సులభముగా వశుండును గాఁడు. మఱియు నెప్పుడు నాశ్రమమునందే యుండువాఁడు గాన పోయి చూచుటకు ననువుగాదు. అట్టి వానిని దగునట్లు దర్శించుట కష్టము గాన దానికిఁ దగినయత్నములు వారికిఁ గావింపవలసి వచ్చె. మఱియు నతఁడుతండ్రికడ నేయెప్పుడును శుశ్రూష సేయుచు దానిచేత నే తృప్తుఁడై మఱెద్దియుఁ గోరక యుండు. కావుననే యాశ్రమమును విడిచి మఱొక్క చోటికిని బోవఁడు. ఇంతేకాక పుట్టుక మొదలుగా నా తపసియొక స్త్రీనిగాని పురుషునిఁగాని చూచి యున్నవాఁడును గాఁడు. నగరములఁగాని గ్రామములఁగానిపుట్టిన యేపదార్థమును నింతవఱకుఁగన్నవాఁడును గాఁడు. ఇట్లుండగా నొకానొకప్పు డావిభండకకుమారుఁ డాగణికామణులున్నయెడకు దైవవశమున వచ్చియా కాంతారత్నములఁ జూచినవాఁ డయ్యె. ఆ ముద్దుగుమ్మలును పలువగల యలంకారములం గయిసేసి తేనియలొలుకఁ దీయనియెలుఁగున బాడుచు నందఱు నాఋషికుమారునిం దఱియ నరుగుదెంచి 'బ్రాహ్మణోత్తమా! నీ వెవ్వఁడవు? భయంకరమైన యీయడవియందేల వర్తించెదవు? మఱియు నొంటి యిందుఁజరించెదవేల? ఇదిమేము తెలియఁ గోరితిమి. మా కెఱిఁగింపుమీ' యనిరి. మిక్కిలియుఁ గోరఁ దగినచక్కని రూపులు గలయా యొప్పులాండ్ర వంటి రూపముల నడవియం దత డెప్పుడును నింతకు మునుపు చూచినవాఁడు గాఁడు. కాన వారియెడ వానికి స్నేహము గలిగి తనతండ్రి మొదలగువారిని వారికిఁ దెలుపవలయు నను బుద్ధి వొడమఁగా వారింజూచి 'మాకు విభండకుండు తండ్రి.

అతనికి నే నౌరసపుత్రుఁడ. నా పేరు ఋశ్యశృంగుఁడు నాఁబడు. నా తపఃకర్మము నీయాశ్రమభూమియం దెల్ల సుప్రసిద్ధము. శుభదర్శనులారా! ఈవనమున సమీపమునందే మా యాశ్రమమున్నది. మీకెల్ల వారికి విధిపూర్వకముగఁ బూజ సేసెదఁ గయికొనుఁ' డనియె. ఆఋషిపలుకులు విని వారికెల్ల నతనియాశ్రమపదమునుఁ జూడ మతి గలిగి యందఱును వానితోడఁ గూడి యచ్చటికిఁ బోయిరి. అతండు నా వచ్చినవారి కెల్ల నర్ఘ్యపాద్యము లొసంగి కందమూలఫలంబు లిచ్చి పూజింపఁగా వా రాపూజల నెల్లఁ గయికొని యాతనితోడి సల్లాపాదులవలన నుల్లసిల్లుచు విభండకుఁ డేమి సేయునో యని వెఱచి వేగ నరలుటకు మదిఁ దలఁచి 'బ్రాహ్మణోత్తమా! మాయిచ్చు నీపండ్లు మిక్కిలియు మేలైనవి. కాన వీనిని గయికొనుము. నీకు శుభంబగు. ఆలస్యము లేక వీనిని భక్షింపు' మనిరి. పిదప వారందఱును వానిని బిగియఁ గౌఁగిలించుకొని హర్షంబున వానికిఁ గుడుములును మఱియుఁ బలువగల పిండి వంటలను బెక్కింటి నొసంగిరి. అతఁ డడవియందే యెప్పుడును వసించియుండు వాఁడుగానఁ దా నెన్నఁడును జవిచూచి యెఱుఁగని యాపదార్థములను గయికొని యాస్వాదించి తా నింతవఱకును జవి చూడనియొక తెఱంగు పండు లని తలంచెను. అంత నావారకాంత లాతనిఁ జూచి 'మాకొక వ్రత మాచరింపవలసియున్నది. కాన పనివిని యెద' మని యొక నెపంబిడి సెలవుపుచ్చుకొని యాతనితండ్రికి వెఱచి యచటు వాసిపోయిరి. వారందఱును బోయినపిదప విభండకసుతుం డగు నా ఋశ్యశృంగుఁడు మనస్సు కుదురుదప్పి నవయుచు నొకచోటను గాలూనక యిట్టటు దిరుగాడుచుండి తాళలేక మఱునాఁడు వారకాంతలు చక్కఁగా నలంకరించుకొని యతి మనోహరాకారంబులఁ దనకుఁ గనఁబడినచోటికి పోయినవాఁ డయ్యె. అతఁడు నియతబ్రహ్మచర్యుఁడు. అయినను వారకాంతలమాయ నతఁడు గెలుచు? అతఁడు వచ్చుచుండఁగా నామిండెఁబోఁడులు గనుంగొని మనంబున నెంతయు నుప్పొంగి యపు డందఱు నాతని డగ్గఱి యగ్గలంపునెయ్యంబున 'సౌమ్యా! మాయాశ్రమపదములకు రమ్ము. అది మా స్వదేశము. కాన యచ్చట నీ ఫలమూలభక్షణాది సత్కారవిధులు విశేషించి సమృద్ధముగా నీకు జరుగు' ననిరి. వారెల్ల నటు లింపారఁ జెప్పిన యొప్పులగు పలుకులు విని యతఁడును బోవఁ దలఁచె. వా రాతనిఁ గొనిపోయి గంగయం దున్న యోడ నెక్కించి యాప్రవాహమున నంగదేశమునకుం గొనిపోయిరి. ఆవిప్రుఁడు మహాత్ముఁడు గాన నంగదేశమునకు నతనిఁ దోడితెచ్చు చుండఁగాఁ బర్జన్యుఁడు జగములకెల్ల నుల్లాసము గలుగునట్లు వర్షము గురిసె. రోమపాదుఁడును దనదేశమునకు వర్షముతోఁ గూడ వచ్చుచున్న యాబ్రాహ్మణవరునిఁ జూచి వినయవినమ్రుఁడై యెదుర్కొని యమ్మునికి నేలం జాఁగిలి మ్రొక్కి సమాహితుఁడై యర్ఘ్యపాద్యముల యథావిధిగ నొసంగె. అంత నారాజు వెలయాండ్రఁ గొని తోడి తెచ్చినందుల కైయాతనికిని,

కొడుకును బెడఁబాపినందులకై యాతనితండ్రియగు విభండకునికిని, గోపము కలుగకుండునట్లుగా నాతనివలనం బ్రసాదంబు వేఁడె. పిదప రోమపాదుఁడు ఋశ్యశృంగుతోడ సంతగిపురమునకుం బోయి తనకూఁతు శాంత నతనికి యథావిధిగా నొసఁగి శాంతచిత్తుఁడై మిక్కిలియు సంతుష్టి నొందినవాఁ డయ్యె. ఇట్లు ఋశ్యశృంగుఁడు దనయనుంగుకాంత యగుశాంతం గూడి తేజంబు దీపింపఁ గోరిక లెల్ల నేపార నప్పురంబున నివసించి యుండెను.'' ఇది పదియవసర్గము.



## దశరథుం డంగదేశమునుండి ఋశ్యశృంగునిఁ దెచ్చుట.

"రాజేంద్రా! దేవప్రవరుం డగు నాసనత్కుమారుం డింకను జెప్పిన వృత్తాంతమును నీకుఁ బ్రియంబారఁ జెప్పెద వినుము ఇక్ష్వాకుకులమున శ్రీమంతుండును సత్యసంధుండు నగుదశరథుం డనునొకధార్మికుఁడు పుట్టు. ఆదశరథునకు నంగదేశపు రాజుతోఁ జెలిమి కలుగును. ఆయంగరాజునకు రోమపాదుఁ డనఁ బరగునొక కుమారుఁడు జనించు. ఆరోమపాదునకు మహాభాగ్యవంతురాలగుశాంత యనునొకకన్య యుదయించును. మహాకీర్తిమంతుఁ డగుదశరథభూకాంతుఁ డాయంగరాజునకుఁ బోయి యాతనిం జూచి 'ధర్మాత్మా! నేను సంతానహీనుఁడ. నీవు సెలవిచ్చితేని నావంశమునకు సంతానము గలుగునట్లు శాంతాదేవిమనఃకాంతుండగు ఋశ్యశృంగుఁడు నాయజ్ఞమును జక్కఁగా నెఱవేర్చు' నని చెప్పఁగలఁడు. రోమపాదుఁడు నారాజుపలుకు విని మతిమంతుఁడు గాన మనమున నాలోచించి ఋశ్యశృంగుఁడు పుత్రునిఁ గలిగింపఁజాలువాఁడుగాన యాతనిని దశరథునకు నియ్యఁగలఁడు. అంత నాభూకాంతుం డాబ్రాహ్మణునిఁ గయికొని మది తుందుడుకు మాని వేడుక మీఱ నాయజ్ఞమును జేయఁగలఁడు. ఆదశరథుఁడో ధర్మవిదుఁడు; కాన యాఋశ్యశృంగుని నూరక వరించినవాఁడు గాఁడు. ఆభూమిశత్రుఁడు పుత్రకామ యజ్ఞము యాజించుకొఱకును, దానివలన సంతానముఁ బడయుటకును, దన్మూలమున స్వర్గమునుఁ బ్రాపించుటకును, ఆబ్రాహ్మణపుంగవుని వరించును. ఆ రాజు నాబ్రాహ్మణోత్తమునివలనఁ దాను గోరినయాకామ్యక్రతువును జేయఁగాంచు. అంత నతని కమితపరాక్రములును వంశస్థాపకులును సకలలోకప్రసిద్ధులు నగుకొడుకులు నలువురు గలుగుదురు' ఇట్లు భగవంతుఁడును దేవప్రవరుఁడు నగుసనత్కుమారుఁడు తొల్లి కృతయుగమున నీకథను జెప్పినవాఁ డయ్యె. పురుషసింహమా! నీవును బుత్త్రార్థివి. కావున బలములు గొలువ నలు వైనవాహన మెక్కి సత్కారార్హుం డగునమ్మునిని నీవే పోయి తోడితె"మ్మని చెప్పెను. అయినను వసిష్ఠుఁడు కులపురోహితుఁడు. అతనిని విడిచి ఋశ్యశృంగునిఁ బురోహితుఁడుగా వరింప రాదు. తానై వరింపక సన

త్కుమారుని వృత్తాంతముంబట్టి యట్లు వరించుటగా వసిష్ఠునకుం దెలిపి పిదప నాతనియనుమతిని బొందుట యుచితము. కావున దశరథుండు వసిష్ఠునిసన్నిధి నీవృత్తాంతము సుమంత్రునిచే మరలఁ జెప్పించి యామునితోడం దానునువిని ఋశ్యశృంగునిఁబురోహితునిగా వరించుట కాతనియనుమతిని బొందె. పిదపఁ దాను నిండుమనంబున నాయల్లుని నుపలాలించి శాంతతోడఁ దోడితెచ్చుటకై తనయంతఃపురకాంతలనుం బిలుచుకొని మంత్రులతోడ నాబ్రాహ్మణుఁ డున్న రోమపాదపురంబున కరిగెను. ఇట్లరిగి వనంబులను నదులను వేడుకలు గనుఁగొన నెడనెడ నల్లనల్లన చూచుచు నమ్మునిపుంగవుఁ డున్నదేశముం దఱిసి దానిని జొచ్చి జ్వలించు చున్నయగ్నిహోత్రముఁబోలె వెలుంగుచు రోమపాదునియొద్ద నున్నయాబ్రాహ్మణపుంగవుని ఋశ్యశృంగునిభక్త్యతిశయంబునం జేసి తొలుతఁ జూచినవాఁ డయ్యె. పిమ్మట రోమపాదుఁడు తనకు దశరథుఁడు చెలికాఁ డగుటం జేసి యతనిరాకకు నెంతయు మది సంతసిల్లి తగురీతి నతనికి విశేషించి పూజ లొనరించి మహాబుద్ధివిరాజితుఁ డగు నాఋషితనయుఁ జూచి 'ఈదశరథభూనాథుఁడు నాయనుంగుఁజెలికాఁడు. ఇంతేకాదు. నీకాంత యగుశాంతకు నితఁడు జనకపిత. కావున నీకు నితనితోడ సంబంధము గల'దని చెప్పఁగా నాఋశ్యశృంగుఁడు నప్పుడు తనమామ యగుదశరథునిఁ బూజించె. ఇట్లు పురుషలలాముండగుదశరథుండు రోమపాదునిచే సత్కారంబులందుచు నతనితోఁగూడ నేడెనిమిది దినంబులందు వసించియుండి యంత నారాజునుంజూచి 'రాజోత్తమా ! నీకూఁతురగుశాంత తనకాంతునితోఁ గూడి నాపురమునకు రావలయును. వారిచే జరుగఁదగినపెనుకార్య మొకటి సంభవించియున్న' దని చెప్పఁగా నాతండు వల్లె యని యాఋశ్యశృంగునిఁ బంపువాఁడై యావిప్రవరునిం జూచి 'నీవు భార్యతోఁ గూడ దశరథునివెంటఁ బొమ్మ'ని చెప్పె. ఆ ఋషికుమారుఁడును నందులకు నియ్యకొని యయ్యవనీశుచే వీడుకోలు వడసి తనపడఁతితోఁగూడఁ బయనమయ్యె. దశరథుండును రోమపాదుండును బరస్పర మంజలి గావించి నెయ్యంబు మెండుకొన నొండొరులయురమ్ము లొరయ బిగియారఁ గౌఁగిలించుకొని యానందించిరి. అంత నారఘుకులతిలకుండు చెలికానిచే సెలవు పుచ్చుకొని పయనమై యయోధ్యాపురజనులకుఁ దమరాక తెలుపుటకై వేగముగాఁ బోవం జాలినదూతలను రావించి 'పట్టణమెల్ల వేగ చక్కఁగా నలంకరించి, ధూపవాసనలు నించి, నలుగడలఁ గల యంపిచల్లి, పిదప నూడ్చి, కలువడములను దోరణములను గట్టి సింగారింపవలయు నని పురజనులకుఁ దెలుపఁ బంపెను. పౌరు లందఱును రాజురాక విని మిక్కిలియు నుప్పొంగి యతండు చెప్పిపుచ్చినట్లెల్లఁ గావించిరి. పిదప నామేదినీపతి యావిప్రవరు మున్నిడుకొని శంఖభేరీధ్వనులు బోరుకొనఁ జక్కఁగా నలంకృత మైయున్న యన్నగరముఁ బ్రవేశించెను. పరాక్రమాదుల నింద్రునివలె వెలుంగునా నరేం

ద్రుం డట్లా బ్రాహ్మణశిఖామణిని బట్టణంబునకుఁ దోడి తెచ్చుటం జూచి నగర జను లందఱు నెంతయు సంతసిల్లినవా రైరి. రా జతని నంతఃపురంబునకుఁ గొనిపోయి శాస్త్రోక్తరీతిని బూజ లాచరించి యాతనిం దోడి తెచ్చినందులకుఁ దన్నుఁ గృతకృత్యునిగాఁ దలంచినవాఁ డయ్యె. అంతఃపురకాంతలందఱును వాలుఁగన్నులఁ జెన్నారు నాశాంత తనకాంతునితోఁ గూడ నట్లు నచ్చుటంగాంచి ప్రేమాతిశయంబున నానందపరవశ లైరి. ఇట్లు శాంతయు నంతిపురిలోనియింతులచేతను, విశేషించి యమ్మహీకాంతునిచేతను, బూజలందుచు ఋత్విజుం డగుతనపతితోడఁ గొంతకాలమందు సుఖముగా వసించియుండె. ఇది పదునొకండవ సర్గము.

---

## దశరథుండు యజ్ఞమునకుఁ బూనుట.

ఋశ్యశృంగునిఁ దోడి తెచ్చినపిదపఁ బెద్దయుం గాలము గడచె. అంత మిక్కిలియు నింపైనయొకవసంతసమయము రాఁగా రాజునకు దాను మున్ను సంకల్పించుకొన్న యజ్ఞమును జేయ మనను గలిగెను. అంత దేవతేజంబున రాజిలుచున్నయా బ్రాహ్మణవరునకు భూవరుఁడు సాష్టాంగనమస్కారము గావించి ప్రసన్నునిం జేసి నిజవంశాభివృద్ధికరముగా సంతానము వడయుటకై యజ్ఞము సేయుటకు నతని వరించెను. అతఁడును సత్కృతుఁడై వల్లె యని రాజును జూచి 'యాగంబునకు వలయు సంభారములన్నియు సమకట్టుఁడు. అశ్వమును విడువుఁ,' డనియె. రాజును మంత్రిశిఖామణి యగుసుమంత్రునిఁ జూచి 'సుమంత్రా! వేదపాఠకులును ఋత్విజులు నగు సుయజ్ఞుని, వామదేవుని, జాబాలినిఁ, బురోహితుఁ డగు వసిష్ఠుని, మఱియు దక్కుంగల బ్రాహ్మణోత్తములను, వేగముగాఁ దోడి తెమ్మని యానతిచ్చెను. అంత సుమంత్రుఁడు నప్పుడేయతిత్వరితముగఁ బోయి వేదపారంగతు లగునాసకలబ్రాహ్మణపుంగవులను దోడి తెచ్చె. ధర్మాత్ముఁ డగునాదశరథుఁడు వారలఁ బూజించి ధర్మార్థహితంబు లైనమృదుమధురవచనంబుల నుచితంబుగ వారలతో 'మహాత్ములారా! పుత్రులను గోరి పలవించుచున్న నాకుఁ బుత్రులఁ గాంచుసుఖంబు గలుగదయ్యె. కావునఁ బుత్రార్థంబశ్వమేధయాగము సేయ నాకు బుద్ధిపుట్టెను. కాఁబట్టి శాస్త్రవిహితవిధానమున నేను యాగము సేయఁగోరెద. ఋషికుమారుఁ డగునీ ఋశ్యశృంగుఁ డాచరించు యజ్ఞము మహిమం జేసి నా కోర్కులఁ బడయంగలవాఁడ'ననియె. అంత వసిష్ఠప్రభృతు లైనబ్రాహ్మణులందఱును రాజు తనంత వాక్రుచ్చినయవ్వాక్యము విని 'బాగు బాగని' సంతోషించిరి. ఋశ్యశృంగుఁడు మున్నగువారు రాజును జూచి 'సంభారంబు లొడఁగూర్పఁ బంపుము. గుఱ్ఱమును విడిచి పుచ్చుము. పుత్రార్థముగా నీకు యజ్ఞంబు సేయఁ దగు నని ధర్మాత్మక మైనయిట్టిబుద్ధి యుప్పతిల్లె. కాని కొలఁదిలేని పరాక్రమమున

వెలుఁగుకొడుకులు నలువురు సర్వవిధముల నీకుఁ గలుగుదు'రనిరి. అంత రాజు నావిప్రులవాక్యము విని మిక్కిలియుఁ బ్రీతుఁడై యతిహర్షమున మంత్రులనుజూచి 'నాగురువులవచనముచొప్పున యజ్ఞమునకు నలయు సకలసంభారములు సమకట్టుఁడు. రక్షించుటకు సమర్థులైనవారు చుట్టుఁ గొలువ నశ్వమును ఋత్విజులతోడ విడిచిపుచ్చుఁడు. సరయూనదియుత్తరతీరమున యజ్ఞభూమిఁ గావింపుఁడు. క్రమము దప్పక విధివిధానమున శాంతికక్రియలు పయింబయిం జేయఁబంపుఁడు. అనర్థకరమైన యపరాధ మేదియుఁ గలుగనియెడ నీయుత్తమక్రతువు సామాన్యముగా రాజులకందఱికిని జేయ నలవియైనదె కాని మఱి వేఱుగాదు. ఇది గావించుచో నేమియపచారము వచ్చునో యను వెఱపున నందఱును దీనిని జేయఁబూనరు ఈ యజ్ఞస్వరూపము నెఱింగినవారగు బ్రహ్మరక్షస్సులు దీనిని జెఱుపుటకై యిందేదేని యపరాధమును వెదకుచుందురు. కానజాగ్రత్తతో దీనినడపఁదగును. అట్లుకాక యజ్ఞము నెఱసుగలిగి వారిచేఁ జెఱుపంబడెనేని తోడనే దానికర్తయు నశించును. కాబట్టి యీయజ్ఞానుష్ఠానముల సమర్థులైనవారిచేత విధిపూర్వకముగా సమాప్తమగునట్టి ప్రయత్నమును జేయవలయు' ననియె. మంత్రులందఱును నట్లేయని యామహీవల్లభువాక్యమునకు మిక్కిలి సంతుష్టులై యతం డానతిచ్చినట్లు గావించిరి. పిదప బ్రాహ్మణులును ధర్మజ్ఞుఁడగు నాభూపతిని బొగడి యాతనిచే ననుమతి నొంది యందఱును దమవచ్చిన దారినిబోయిరి. బ్రాహ్మణోత్తములుఁ దన్నువీడుకొనఁగా నాజనపతి మంత్రులను వీడుకొలిపి మిక్కిలియుఁ గాంతి దళుకొత్త నంతఃపురమునకుఁ బోయె. ఇది పండ్రెండవసర్గము.

---

## యజ్ఞసంభారాదులను సమకట్టుట.

ఋశ్యశృంగుఁడు మొదలైనవారిని ఋత్విజులుగా వరించుట యాదిగాఁ గల యజ్ఞకలాపములు జరుగుచుండఁగా మరల వసంతము వచ్చెను. అంతకు * నొక సంవత్సరము నిండారె. అంత సంతానార్థమై యావీర్యవంతుఁ డశ్వమేధంబు గావింపఁ దొడఁగెను. అట్లు పూని వసిష్ఠునకు మ్రొక్కి న్యాయ ప్రకారంబునఁ దక్కుంగల పూజ లాతని కొనరించి వినయమున నవ్విప్రోత్తమునితో బ్రాహ్మ

---

* మొదటివసంతమునందు ఋశ్యశృంగాదులను వరించుట. యజ్ఞసంభారములు గూర్చుట, యజ్ఞభూమివిధానము, శాంతికర్మములు సేయుట, యశ్వమును సమర్థులగురక్షకులతోను నుపాధ్యాయులతోను విడిచి పుచ్చుట, వారుదానివెంటఁ బోవుచునందందసావిత్ర్యాది కర్మములాచరించుట మొదలైనవి యొక్క సంవత్సరమువఱకు జరుగఁగా మరల రెండవవసంతము వచ్చెననిభావము. 'అథ సంవత్సరాన్తే దీక్షిత,అన్నట్లు వసంతమునం దట్లశ్వమునువిడిచి మరల వసంతమువచ్చు వఱకునొక్క వత్సరము దీక్షఁ బూని పిదప యజ్ఞమారంభింపవలయును.

ణోత్తమా! మునితిలకా! సంతానార్థమై నే నారంభించిన యీయజ్ఞమును శాస్త్రక్రమము దప్పకయు యజ్ఞాంగములం దేవిఘ్నమును గలుగ కుండునట్లును గావింపుఁడు. మీరు నా కెడతెగనినెయ్యురు. ఎప్పుడును మనంబున నామేలు గోరుచుండువారు. మఱియు మీరు మాకు వామదేవాదులకంటె నతిశయించి యనుపమానులై యుండు గురువులరు. కాన నాయీయుద్యమించిన యజ్ఞంబు భారం బెల్ల మీరే భరింపవలయు, ననియె. ఆవిప్రవరుఁడును భూవరునిఁ జూచి 'నీవు వేఁడిన దంతయుఁ దప్పక గావించెద' నని చెప్పి పిదప యజ్ఞకర్మములం దారితేఱినవృద్ధు లగుబ్రాహ్మణులను, ఆ యాద్రవ్యముల రప్పించుట కొడయండ్లుగా నియమింపఁబడి యున్న పరమధార్మికు లగు వృద్ధులను, గూలివాండ్రను, గమ్మరులను. నిటికరాలు మొదలగు శిల్పములను జేయువారిని, స్రువము చమసము గ్రహము యూపము మొదలగుయజ్ఞ సాధనములను జేయు వడ్రంగులను, వాపీకూపాదులఁ ద్రవ్వువారిని, వ్రాయసకాండ్రను, జిత్తరువులు మొదలగు వానిని బన్నువారిని, నట్టువులను, నర్తకులను, నిర్మలులై బహుశ్రుతులై ప్రయోగశాస్త్రవేత్తలగు పురుషులనుఁ జూచి యిట్లనియె. 'ఋత్విజులారా! మీరు రాజానతిచ్చుటం జేసి యజ్ఞకర్మకలాపంబుల నిర్వహింపఁ బూనుఁడు. శిల్పకరులారా! ఇటిక ఱాలు పెక్కువేలు వేగ దెప్పింపుఁడు, పొడవు వెడలుపు మొదలగు పెక్కుగుణంబులచే రాణించునుప్పరిగలు రాజులకై రచింపుఁడు. మంగళములై బహుభక్ష్యాన్నపాన సంగతములై వాతవర్షాదులకు నసియాడనట్టు దిట్టములైన మనికిపట్టులు వందలకొలఁది బ్రాహ్మణులకై కావింపుఁడు. అట్లే పౌరజనులకొఱకును మిక్కిలి విఱివియై పలుదెఱఁగుల భక్ష్యములచే నొప్పి హార చందనాది సర్వకామిత పదార్థవిలసితంబులైనవాసస్థలంబులు నిర్మింపుఁడు. అట్లే గ్రామాంతరముల నుండి వచ్చిన జానపదులను మిక్కిలి చవులు గులుకునన్న మిడి యనాదరంబునఁ గాక విధ్యుక్తముగా సత్కరింప వలయును. వీరు వారన నేల? సకల వర్ణముల వారిని మిక్కిలియు సత్కరించి పూజితులఁ గావింపవలయును. చెలిమిచేఁ గాని, పగచేతఁ గాని యెవ్వరిని నవమానింపఁ దగదు. ఈ యజ్ఞ కర్మంబులఁ గరంబుఁ దగులు గలిగి యున్న పురుషులకును, వారివలె శిల్పులకును, విశేషించి మఱింత యాదరముతో వారివారి పిన్నపెద్దయంతరువు లెఱిఁగి పూజలు గావింప వలయును. వారును భోజనముచేతను ధనములచేతను మిక్కిలి తృప్తు లగుదురు. మీ రందఱును నెయ్యంబు లూరు నెమ్మనంబులతో నన్నియును జక్కఁగా ననుష్ఠితములై యొక్కటియుం గొఱవడకుండు నట్లుగాఁ జూచి కొనవలయు ననియె. అంత వారందఱును వచ్చి వసిష్ఠుం జూచి 'మహాత్మా! మీరు శాస్త్రప్రకారమున నొకటియు లోపింపకుండు నట్లు చక్కఁగా విధించితిరి. మీ రానతిచ్చినట్లె చేయుదుము. ఒకటియు విడిచిపెట్ట' మనిరి. పిదప వసిష్ఠుఁడు సుమంత్రుని రావించి

యతనితో 'భూతలమున ధార్మికులుగా నున్న రాజుల నందఱఁ బిలువుము. సకల దేశములందు నున్న బ్రాహ్మణులను క్షత్రియులను వైశ్యులను శూద్రులను సత్కరించి వేలవేలకొలందిని దోడి తెమ్ము. బీఱువ్రాని పరాక్రమంబు వలన శూరుఁడై సర్వశాస్త్రములందును వేదములందును నారి తేఱి యున్న మహాభాగుం డగు మిథిలాధినాథుని జనకునిఁ జక్కఁగా సత్కరించి దూతలను బంపక నీవేపోయి తోడి తెమ్ము. అతఁడు మనరాజునకుఁ జిరకాల సంబంధి యని తెలియుము. కాన యందఱకంటె మున్నతనిని దోడి తెమ్మని నీకుఁ జెప్పుచున్నాఁడను. కాశీరాజు నెయ్యంబు తియ్యంబుగలిగి యెప్పుడును బ్రియముగా మాటాడువాఁడై రాజసింహుఁ డగుదశరథునికిఁ జెలికాఁడు నై యుండు. కాన యామహీపతిని సయితము నీవే పోయి తోడి తెమ్మ. వృద్ధుఁడును బహు ధార్మికుఁడును మన రాజలలామునికి మామయు నైన కేకయరాజును సతనిపుత్రులను దోడి తెమ్ము. మహాభాగ్య వంతుఁడును, కీర్తిమంతుఁడును, మనరాజపుంగవునకు ననుంగుఁ జెలికాఁడు నైనయంగరాజును రోమపాదునిఁ బూజించి పిలుచుకొని రమ్మ. మఱియుఁ దూర్పుదిక్కునఁ గలరాజులను సింధుసౌవీర దేశముల రాజులను, సౌరాష్ట్ర రాజులను, దక్షిణ దిక్కునందలి రాజులను నందఱిని దూతల నంపిపిలిపింపుము. మఱియు మహీతలంబున మనకు నెయ్యులై యుండు తక్కిన రాజులను వారి యనుంగుల తోడను బందుగులతోడను వేగరాఁ బనుపు' మనియె. వసిష్ఠుఁ డిట్లు చెప్పఁగా విని సుమంత్రుఁడు త్వరితుఁడై యచటికి రాజులఁ దోడి తేరఁ దగిన యంతరంగులును గుశలులు నగుపురుషుల నపుడు నియోగించి, ముని విశేషించి తన కానతిచ్చిన రాజులను తానె తోడి తేర వేగ పయనమయ్యె. మున్ను చెప్పఁబడిన పని వాండ్రందఱును యాగనిమిత్తము దాము నిర్మించిన దంతయు మతిమంతుఁ డగువసిష్ఠునకు నప్పగించిరి. అంత నాభూసుర వరుఁడు ప్రీతుఁడై వారి నందఱిని జూచి 'ఎవ రేది యడిగిన ననాదరముచేఁ గాని వేడుకతోఁ గాని యీయరాదు; అక్కఱతోడను మెలపుతోడను నొసంగవలయును. అనాదరముతో నేదేని దానము సేయఁబడెనేని యదియే యాదాతం జెఱుపు ననుటకు సందియము లే' దనియె. అంతఁ గొన్ని దినములకు నలుగడలనుండి రాజులు దశరథభూనాథునకుఁ గానుకగా మణులు ముత్తియములు పగడములు వస్త్రాభరణములు మొదలగు మేలిపదార్థములను గొని యరుగుదెంచినవారైరి. వసిష్ఠుండు మిక్కిలియుఁ బ్రీతుఁడై దశరథునిఁ జూచి 'పురుషశార్దూలా! నీయాజ్ఞం జేసి రాజు లందఱు నరుదెంచిరి. రాజసత్తముల నెల్ల నేనును గొలందు లెఱింగి సత్కరించినాఁడ. యజ్ఞమునకు వలయు సకలపదార్థములను మిక్కిలి యెచ్చరికతో నాయాపురుషు లొడఁగూర్చిరి. యజ్ఞశాలయు నలుగడల సమస్తోపకరణములతోడం గూడియున్నది. కానసమీపంబున నున్న

యాగశాలను బ్రవేశింపుము. రాజేంద్రా ! మనస్సుచేతఁ గావింపఁబడెనో యన్నట్టు లతిశీఘ్రంబుగా నేర్పఱుపఁబడినయాగశాలను జూడం దగదే' యనియె. అట్లు వసిష్ఠుఁడును ఋశ్యశృంగుఁడు నిరువురు చెప్పఁగా నాజగతీనాథుఁడు శుభదినమున శుభనక్షత్రంబునను యాగశాలంగూర్చి బయలు దేఱినవాఁడయ్యె. అంత వసిష్ఠుఁడు మొదలగుబ్రాహ్మణోత్తములందఱును ఋశ్యశృంగుని ముందిడుకొని యజ్ఞశాలం జేరి వేదోక్తప్రకారమునఁ గల్పసూత్రానుసారముగా యజ్ఞకర్మములఁ జేయ నారంభించిరి. ఇది పదుమూఁడవ సర్గము.

---

## దశరథుం డశ్వమేధము సేయుట.

అశ్వమును విడిచిపుచ్చి యొకసంవత్సరము నిండఁగానే యాగుఱ్ఱము మరల వచ్చినదయ్యె. అంత సరయూనది యుత్తరతీరమున రాజగుదశరథుని యజ్ఞము ప్రవర్తిల్లె. బ్రాహ్మణపుంగవులును ఋశ్యశృంగుని ముందిడుకొని మహాత్ముఁ డగు నామహీకాంతుని పెనుయజ్ఞంబున వలయుకర్మముల నాచరించిరి. వేదపారజ్ఞు లగు ఋత్విజులు విధ్యుక్తముగా యజ్ఞకర్మముల జరుపుచు వేదోక్త ప్రకారమునను మీమాంసానుసారముగాను గల్పసూత్రంబులందుఁ జెప్పంబడినచొప్పునను నడచుకొనుచుండిరి. మఱియు వారు ప్రవర్గ్యకర్మమును నట్లేయుపసత్తనునిష్టిని యథాశాస్త్రముగఁ జేసి యుపదేశశాస్త్రంబునం జేసి యధికముగాఁ బ్రాప్తించుతక్కినసర్వకర్మములనును విధ్యుక్తముగా నొనర్చిరి. పిదప మునివరులందఱును సంతసంబు దొంతరలు గొన నాయాకర్మ దేవతలను బూజించి ప్రాతస్సవనము మొదలుగాఁ గలకర్మములను యథావిధిగాఁ గావించిరి. ఇంద్రునకీయఁ దగుహవిర్భాగ మింద్రునకు విధివిధానంబున నొసంగఁబడియె. నిర్దోషంబైన సోమలతయు స్తోత్రశతములచేఁ బొగడఁబడియె. మాధ్యందినసవనమును యథాక్రమముగా జరినది. అట్లే విప్రవరు లమ్మహారాజుకొఱకు శాస్త్రప్రకారము దెలిసి తృతీయసవనమునుం జేసిరి. ఆయాగమునందు మంత్ర ప్రకారమున వేల్వఁబడనిదిగాని, యట్లువేల్వంబడక తప్పిపోయినదిగాని, మఱివేఱువిధముగా వేల్వఁబడినదగాని యేదియుఁ గలుగదయ్యె. వారంతయు నిర్విఘ్నముగాఁ జేసిరి గాన యన్నియు మంత్రయుక్తముగానే కనఁబడినవి. ఆయాగదినములందు దప్పిగొన్నవాఁడుగాని, యాఁకలి గొన్నవాఁడుగాని కానరాఁడయ్యె. పండితుఁడగు బ్రాహ్మణుండైనఁడుగాని నూఱుగురు శిష్యులులేనివాఁడు దొరకఁడయ్యె. అందు నెప్పుడు నెడతెగక, బ్రాహ్మణులే కాదు, శూద్రాదులును, దాపసులును, సన్న్యాసులును, వృద్ధులును, వ్యాధిపీడితులును, స్త్రీలును బాలురును గడుపారఁ గుడుచుచుందురు. వారిటు లెడతెగక భుజించుచుండియు నన్నాదుల యగ్గలంపురుచులం జేసి వారికి

మఱిమఱి గుడువ మతి పొడముచుండెనే కాని తృప్తిగలుగదయ్యె. వారెంతఁగుడిచియు రాజునకును దృప్తిపుట్టినదిగాదు. కాన యతఁడు 'అన్నంబు పెట్టుఁడు; పలువిధములైన వస్త్రంబు లొసంగుఁ'డని పురికొలుపుచుండఁగా సత్యే రాజపురుషులు పెక్కు చందములఁగావించిరి. మఱియు నందుఁ బ్రతిదినమును శాకశాస్త్రపద్ధతిని సిద్ధము చేయఁబడిన యన్నరాసులు పెక్కు లప్పుడు కొండల పోడుపునఁ గానంబడినవి. అమ్మహాత్ముని యజ్ఞమునందు నానాదేశములనుండివచ్చిన పురుషులును స్త్రీలును నన్నపానంబుల నెంతయుఁ దృప్తులైరి. బ్రాహ్మణోత్తములు 'అన్నంబుపచారముతోఁ బెట్టఁబడినది. ఎంతయుఁ జవులూరుచున్నది. ఓహో! మాకెంతయుఁ దృప్తియైనది. రాజా! నీకు మంగళమగుఁగాక' యని కొనియాడిరి. ఇవియంతయు రాజును విన్నవాఁడయ్యె. కొందఱు పురుషులు చక్కఁగా నలంకరించుకొని బ్రాహ్మణులకు భక్ష్యభోజ్యాదులను వడ్డించుచుండిరి. మెఱుంగు పెట్టఁబడిన మణులు దాపిన కుండలములు దాల్చిన పురుషులు మఱికొందఱావడ్డించువారినిఁ దోడుగాఁ గొలుచుచుండిరి. అందలి సవనకర్మముల మధ్యకాలములందుఁ దీఱుపాటు గలిగియున్న యెడనిపుణముగా వాదింప నేర్చినవిద్వాంసులగుఋత్విజులొండొరుల జయింపఁ గోరి యుక్తవాదములు పెక్కులు వాదించుచుండిరి. ఆయజ్ఞంబున నాఁడు నాఁటికి వృద్ధులైన వారు యథాశాస్త్రముగా జేయించుచుండఁగా కుశలులైన ఋత్విజులు సమస్తకర్మములు చేయుచుండిరి. అందలి విప్రులలో వేదాంతముల నాఱింటి నెఱుఁగని వాఁడు గాని బ్రహ్మచర్యాది వ్రతము లాచరింపనివాఁడు గాని, బహుశాస్త్రముల నభ్యసింపని వాఁడు గాని, యెవ్వఁడును లేఁడయ్యె. ఆ మహారాజునసదస్యు లగుబ్రాహ్మణులలో వాదములం గుశలులు గానివా రెవ్వరును గలుగరైరి. అందు యూపస్తంభముల నిలుపునపుడు బిల్వయూపంబు లాఱును, వానికి దాపుగాఁ జండ్రయూపంబు లాఱును, మోదుగు యూపంబు లాఱును, విరిగి మ్రానియూపము నొకటియు, దేవదారు యూపంబును నిలిపిరి. ఆయూపంబులను నిలుపునపుడు వానినడుమ రెండేసి బార సాఁచి రెండు చేతులతోఁ దాఁకఁదగినంత యెడము గలిగి యుండునట్లుగా నేర్పఱచిరి. అవి యన్నియుయజ్ఞశాస్త్రంబునందారితేఱి యజ్ఞప్రయోగంబులఁ గుశలులైయున్న వారిచేఁ జేయింపఁబడినవై యాయజ్ఞశాల కలంకారముగానుండుటకొఱకు బంగరుపట్టెలచే సింగారింపఁబడియుండెను. ఆయిరువదియొక్క యూపంబులు నొక్కొక్కటియు నిరువదియొక్క మూరలపొడవై యొక్కొక్క వస్త్రముచే నలంకృతమయి యుండినవి. యూపములన్నియు నెచ్చుతక్కువలు లేక తగుకొలఁదిగా రచింపఁబడెను. అవి బాఱియ మున్నగునవి లేక మిగులగట్టిగా నేర్పరింపఁబడి, యెనిమిదంచులుగలిగి, యభ్యంజనముచే నునుపారినరూపులతోఁ గూడి విధ్యుక్తముగా నిలుపంబడినవి. మఱియునవి వస్త్రములచేఁ గప్పంబడి పుష్పగంధములచే నలం

కృతములై, యాకాశమునఁ గాంతిమీఱఁ బ్రకాశించు సప్తర్షులం బోలి విలసిల్లుచుండెను. శుల్బ మనుయజ్ఞకర్మమునందు నిపుణు లైనబ్రాహ్మణులు శాస్త్రప్రకారమునఁ దగుకొలతతో నిటికలం జేయించి వానితో నగ్నివేదినిగట్టిరి. ఆచిత్యాగ్నివేదిని దశరథునిఋత్విజు లగ్నిచయన నిర్మాణసమర్థులు గాన యథాశాస్త్రముగాఁ గట్టఁగా నది గరుడాకారము గలిగి *బంగారముచే నెరసిన ఱెక్కలు గలిగి సామాన్యముగాఁ గలిగియుండు నాలుప్రస్తారములకంటె † మూఁడింత లెక్కుడై కావుననే పదునెనిమిది ప్రస్తారములచేఁ బొలుపారుచుండెను. శాస్త్రవిహితము లైనపశువులు, సర్పములును, బక్షులు, ‡ నాయాదేవతల నుద్దేశించి యథావిధిగ నాయాయూపస్తంభములకుఁ గట్టిరి. పశ్వాదుల వధించుకర్మము రాఁగా నప్పు డశ్వమేధీయ మైనయశ్వమును, గూర్మము మొదలైన జలచరములను, మఱియు గ్రామ్యము లగుతక్కినపశుసమూహము, నంతయు ఋత్విజులు శాస్త్రప్రకారమున వధకర్మములకు నియోగించినవారైరి. ఆయూపంబులం దప్పుడు మున్నూఱుపశువులును దశరథభూనాథుని యశ్వరత్నమును బంధింపఁబడినవి. ఆవధప్రదేశమునఁ గౌసల్య యాయశ్వమునకుఁ బ్రదక్షిణముగా వచ్చి తానును దక్కిన రాజపత్నులతోడం గూడి మూఁడుకత్తులచే (§ బంగరు సూదులచే) సంతోషము నెలంగఁ గత్తివాట్లు వేసెను. అట్లు గావించిన పిదప ధర్మసిద్ధిని గోరి కౌసల్యాదేవి యాశవమును దాఁకవలయుటకుఁ గుచ్చించుకొనఁగ దిట్టమైన నమ్మనముతో నాయశ్వముతోఁగూడ నొకరాత్రి యంతయు వసించియుండెను. అప్పుడు దశరథుఁడు దక్షిణగా నొసంగఁగా హోతయు నధ్వర్యుఁడును, ఉద్గాతయు, బ్రహ్మయు ననఁబడుఋత్విజులు నలువురును రాజమహిషిని, బరివృత్తిని, వావాతను, దక్కిన నాలవది యగుపాలా

---

* 'సహస్రిం హిరణ్యశకలైః ప్రతిదిశమగ్నిం ప్రోక్షతి' అనుసూత్రముచొప్పున బంగరుతును కలచే నిండారిన ఱెక్కలు గలవని తెలియునది.

† 'షట్చితయోభవన్తి' అన్నట్లు సామాన్యముగా నగ్నివేది యాఱుప్రస్తారములుగల్గియుండును. అవియే అశ్వమేధమున 'త్రిస్తావోగ్నిర్భవతీత్యశ్వమేధే విజ్ఞాయతే' అన్నట్లు మున్మడుంగులుగావిధింపఁబడినవి గావున పదునెనిమిది ప్రస్తారములు గలిగియుండును, కావుననే యష్టాదశాత్మకమనఁబడియె.

‡ 'ఇంద్రాయరాజ్ఞే సూకరో వరుణాయరాజ్ఞే కృష్ణః' ఇత్యాద్యనువాకములం దాయాపశువులాయాదేవతలకుఁ బ్రతిపాదింపఁబడుట తెలియునది.

§ 'సౌవర్ణీభిః సూచీభిః పత్న్యోఽశ్వస్యాసిపథాన్ కల్పయన్తి' అనుటంజేసి కత్తులనఁగా నిచట బంగరుసూదులుగా గ్రహింపనగు.

కలిని క్రమముగాఁ బతులవలెఁ *బరిగ్రహించిరి. జితేంద్రియుండును బ్రయోగ చాతురీకలితుండును నైన యధ్వర్యుఁ డాయశ్వముబొడ్డుక్రింది క్రొవ్వు నత్తి శాస్త్రక్రమమునఁ బచనము సేసెను. అప్పుడు మహీపతియు నా వప యగ్ని యందు వేల్వఁబడుచుండఁగాఁ దనపాపంబులు దూల నాహోమకాలంబు తప్పక శాస్త్రంబుచొప్పున దాని పొగవాసన నాఘ్రాణించెను. మంత్రవంతు లగుఋత్త్విజులు పదునార్వురును నా యశ్వంబు నంగములన్నిటి నగ్నిహోత్ర మునందు యథావిధిగా వేల్చిరి. ఇతరయాగంబులందు హవిస్సు జువ్విఁకొమ్మల యందు నఱికి సంస్కరింపఁబడుచున్నది. అశ్వమేధయజ్ఞంబునందు పశువులవలని హవిర్భాగము ప్రబ్బలితీఁగచాఁపలయందు నఱికి సంస్కరింపఁదగును. కల్ప సూత్రముంబట్టియు, దానికి మూలభూతం బైనబ్రాహ్మణవాక్యములచేతను నశ్వ మేధము మూఁడుదినములయజ్ఞ మని లెక్కింపఁబడియున్నది. అశ్వమేధము మొదటిదినము చతుష్టోమమనియు, రెండవదిన ముక్థ్య మనియు, నవ్వలి మూఁడవది యతిరాత్రమనియు గణింపఁబడినవి. †ఇతరశాస్త్రములలో మఱి యును బెక్కుయాగములు విహితములై కానిపించుటం జేసి యవియును జేయింపఁబడినవి. అవి జ్యోతిష్టోమంబును, నాయుర్యాగంబును, నతిరాత్రంబు రెండుమాఱులును, నభిజిత్తును' విశ్వజిత్తును, నప్తోర్యామంబును. మహాయజ్ఞం బొకటియు, నామూఁడుదినముల కవ్వలి నాళ్లయందుఁ గావింపఁబడినవి. దాతృ త్వమునం బొగడ్తగన్నది యిక్ష్వాకుకులము. అట్టి దానిని వర్ధిల్లం జేయుదాత యగుభూనేత హోతకుఁ దూర్పుదిక్కునఁ గలదేశమును, నధ్వర్యునకుఁ బడమటిదెసయందలి దానిని, బ్రహ్మకు దక్షిణదిశలోని దానినియుద్గాతకును

---

*'కృతాభిషేకా మహిషీ పరివృత్తిరుపేక్షితా । వావాతా భోగినీ పాత్రప్రదా పాలాకలీ మతా' అన్నట్లు పట్టాభిషిక్తయైనభార్య మహిషి. రాజు భోగించి యుపేక్షించినదాని పరివృత్తి. రాజవేశ్య వావాత. రాజునకుఁ బాత్రయొసంగునది పాలాకలి. లేక రాజునకు క్షత్రియజాతిభార్య మహిషి, వైశ్య జాతిభార్య వావాత, శూద్రజాతిభార్య పరివృత్తి యని కొందఱిమతము. ఈనలు వురను హోత, అధ్వర్యువు, ఉద్గాత, బ్రహ్మ యనునలువురుఋత్త్విజులకు వరుసగా రాజు దక్షిణ యీయందగును. ఆఋత్త్విజులును నాకన్యకలకుఁ బ్రతినిధియగు ద్రవ్యమును రాజువలనం బుచ్చు కొని వారల మరల నిచ్చివేయవలయును.

† త్రివృత్తు, పంచదశ, సప్తదశ ఏకవింశములను నాలుగుస్తోమములతోఁగూడినది యగ్ని ష్టోమ మనఁబడును. దానిననుష్ఠించు ప్రథమదినమును చతుష్టోమమనఁబడియె. ఇరువదియొక్క ఉక్థ్య ములతోఁ గూడినదిగాన జ్యోతిష్టోమముయొక్క రెండవసంస్థ ఉక్థ్య మనఁబడును. దానినను ష్ఠించు రెండవదినమును ఉక్థ్యమనంబడియె. సర్వస్తోమ మతిరాత్ర మనంబడు. దాని ననుష్ఠించు మూఁడవదిన మతిరాత్రమనాఁబడె. ఇట్లు అశ్వమేధపు మూఁడుదినములందు వరుసగా నీమూఁడే చేయందగినవయ్యు శాస్త్రాంతరమున విధింపఁబడిన తక్కినక్రతువు లనేకములనుగూడ రాజు చేయించినాడు.

నుత్తరాశయందుఁ గలదానిని నొసంగె. ఈదానం బాతఁడు కల్పించినది కాదు. తొల్లి స్వయంభుఁడైనబ్రహ్మ గావించినయశ్వమేధ మహాయజ్ఞంబునందు నిట్టిదక్షిణ విధింపఁబడినది. ఇట్లాపురుషసింహుఁడు శాస్త్రవిధానమున యజ్ఞమును సమాప్తి నొందించి యాక్రతుఫలము వర్ధిల్లుటకై భూతలం బంతయు ఋత్విజులకు దానము సేసె. అట్లు చేయుటంబట్టి ఋత్విజులందఱును కల్మషదూరుండై యేపారుచున్నయాభూపాలునిఁ జూచి "రాజా! ఈమహీమండలమంతయు నీవొక్కండవె పాలింప నర్హుండవు. భూమితో మాకుఁ బని యేమి? మేము దానిం బాలింపఁజాలమే కదా. ఏలన మే మెప్పుడును వేదాధ్యయనంబులు సేయుటయందే యాసక్తులమైయుందుము గాన భూమిపాలనం బెఱుంగము. నీకో యది సహజము. ఈ భూమండలమునకు మాఱుగా దీనివెల యిమ్ము. 'అమూల్యం బైనభూతలంబునకుఁ బ్రతిగా వెలయేమి యిత్తు'నని శంకింపపలదు. నీవే దేనికొంచె మిచ్చినను జాలును. నరోత్తమా! మిక్కిలి మేలయినరత్నముగాని మంచిబంగారుగాని, గోవులనుగాని మఱి దగ్గఱ నాయితముగానున్న దేనినిగాని మాకు నొసంగుము. ఈ భూమిచే మాకుఁ బ్రయోజనమేమియు లే" దనిరి. వేదవిదు లగునావిప్రు లిట్లు సెప్పఁగా విని మనుజపతియు వారలకు గోవులఁ బదిలక్షలను, బదికోట్ల బంగారమును, దానికి నలుమడుంగుల (నలువదికోట్ల) వెండియు దానము సేసెను. అంతఋత్విజులందఱును జేరి తమకు మొత్తముగా వచ్చినధనమును బంచిపెట్టుటకై ఋశ్యశృంగమహామునికిని మతిమంతుఁ డగువసిష్ఠమహర్షికిని సమర్పించిరి. పిదప వారెల్ల ఋశ్యశృంగవసిష్ఠులమూలమున శాస్త్రవిహిత ప్రకారమున ధనమంతయుఁ బంచికొని మిక్కిలిసంతుష్టులై 'మాకెంతయుఁ బ్రీతియైన' దని చెప్పిరి. పిదప యజ్ఞదర్శనార్థము వచ్చిన యభ్యాగతు లగుబ్రాహ్మణులకెల్ల నపుడు మిక్కిలి యక్కఱతోఁ జంబేటిమేటిజాళువా బంగారును గోటులకొలంది నొసంగె. నిరుపేద యగునొక పాఱువాఁడు రఘుకులతిలకుఁ డగునాదశరథునుత్తమం బగు చేతికడియంబును యాచింపఁగా దానినే యతని కొసంగెను. ఇట్లు యథేష్టముగా దక్షిణల నొసంగుటచేత బ్రాహ్మణులందఱును బ్రీతులైరి. వారలను మిక్కిలియుఁ బ్రేమించునా భూమీశుఁడును నుబ్బువెల్లునఁ గన్నులు తబ్బిబ్బుగొన నందఱికి నమస్కారము సేసె. మిక్కిలియు దారుండును, మనుజులందెల్ల మహావీరుండును నై, తమకుం బుడమిపయిం జాఁగిలి పడియున్నయన్నరపాలునకా బ్రాహ్మణులు విధ్యుక్తముగా నాశీర్వాదములు సేసిరి. ఆయజ్ఞమో పుత్రోత్పత్తిప్రతిబంధకము లైనపాపముల నెల్లఁ దూలించునదియుఁ, బుత్రుని గలిగించి తన్మూలమున స్వర్గమును బ్రాపింపఁజేయునదియు, మహారాజులకేని చేయనలవిగానిదియు నీడుంజోడు లేనిదియునై విలసిల్లు. అట్టి యజ్ఞమునా రాజు చేయుంబడసి కడుం బ్రీతి నొందినవాఁడయ్యె. పిదప దశరథుఁడు ఋశ్యశృంగుని జూచి 'సువ్రతా!

మదీయవంశవృద్ధికరం బగుకర్మము నీవే చేయఁదగుదు' వనియె. నట్లేయని యాద్విజవల్లభుఁడు భూవల్లభుని జూచి 'రాజా! నీకుఁ గులోద్ధారకు లగుకుమారులు నలువురుగలుగుదు' రనియె. రాజేంద్రుండును నాతనిమధురవాక్యంబు విని యతనికి నక్కఱమెయిఁజాఁగిమ్రొక్కి మిక్కిలియు హర్షంబునఁ బొంది యాఋశ్యశృంగుని మరలఁ బుత్రార్థము పురికొలిపినవాఁ డయ్యె. ఇది పదునాల్గవసర్గము.

---

## దేవతలు విష్ణుదేవునితో రావణునిదుండగములు చెప్పుట.

ఋశ్యశృంగుఁడు మేధావియు నథర్వవేదవిశారదుండునగు. కాన తాను రాజునకుఁ బ్రతిజ్ఞ చేసినపిదప 'ఇతనికిఁ బుత్త్రుఁడుగలుగుటకై కర్మమేమియాచరింపం దగు'నని యొక్కింత సేపాలోచించి మతిమంతుండుగాన యంతలోఁ దగిన యుపాయము తలంపునకుఁ దెచ్చుకొని రాజునుజూచి 'నేను నీకుఁ బుత్త్రుఁడు గలుగుటకొఱకు శాస్త్రసిద్ధంబును బుత్రోత్పత్తినిమిత్తంబును నథర్వశిరంబునందలి మంత్రములచే నొడఁగూర్పఁ దగినదియు నైనయొకయాగంబును యథావిధిగఁ గావించెద' నని చెప్పి యంతఁ బుత్రోత్పత్తినిమిత్తమైనయాయజ్ఞమును నుపక్రమించి విధిదృష్టవిధానంబున నగ్నియందు వేలిమి గావించె. అంత దేవతలును, గంధర్వులును, సిద్ధులును, బ్రహ్మదేవుండును మహర్షులును నాయాగమునఁ దమ తమక్రమముచొప్పున హవిర్భాగములు పుచ్చుకొనుటకై యొక్కటిగాఁ గూడిరి. అటులాదేవత లందఱు నాయశ్వమేధయజ్ఞమున వరుసగా నితరుల కదృశ్యులయి కూడి లోకకర్తయగు బ్రహ్మను జూచి యీగొప్పమాటనుజెప్పిరి. "భగవానుఁడా! రావణుఁడనురాక్షసుఁడు నీప్రసాదమునం జేసి యెసలారు నవార్యవీర్యమున మమ్మందఱిని నొందలపఱుచుచున్నాఁడు. వాని మేము శాసింపఁజాలకున్నారము. తొల్లినీవు వానియెడఁజాలఁ బ్రీతుఁడవై మాచే నెల్లఁ జావులేకుండునట్లు వరమొసంగితివి. నీయొసంగినవరమును బూజించుచు మేమును వాఁడుపెట్టుచున్న కాఱియలన్నియు నోరుచుకొనుచున్నారము. వాఁడు మూఁడులోకములును జీకాకుపడ వెఱపించుచున్నాఁడు. ఉన్నతులగు లోకపాలురతో ద్వేషించుచున్నాఁడు. వీరిని వారి నననేల? దేవతలకెల్ల రాజగునింద్రునంత వానినే నిరసించి స్థానమునుండి తొలఁగింపఁజూచుచున్నాఁడు. నీవొసంగినవరమువలన మఱిమఱిచి యెదిరింపరానియురవడితో ఋషులను యక్షులను గంధర్వులను రాహుప్రముఖులైనయసురులను భూసురులను మీఱి కారించుచున్నాఁడు. వాఁడు క్రీడాపర్వతాదులందుఁ దిరుగాడునపుడు సూర్యుఁడువేడిగా నెండగాఁయడు. పూఁదోఁటలందు విహరించునపుడు వాయువు వీచినచోఁ బయిని బువ్వులు రాలునోయని వెఱచివానికెలన లెస్సగావీవఁడు. కరడులతండంబుల నలిరేఁగుచుండుసముద్రుం

డేనియు వానినిజూచి యసియాడకయు నూరకుండు. కడు బెడిదముగాఁ బొడ
సూపు నారక్కసునివలన మిక్కిలియు మాకు భయమయ్యె. కాన వానినిఁ జంపఁ
దగునుపాయము నీవుఁ జేయఁదగు" ఇట్లు దేవతలెల్లఁ జెప్పగా విని బ్రహ్మయు
నాలోచించి యంతవారితో "బలారె! దురాత్ముఁడైన యారావణునిఁ జంపుట
కుపాయం బిది నాకుఁ దోచినది. అది యెద్దియన, వాఁడు గంధర్వులకును, రాక్ష
సులకును, దా నవధ్యుఁడుగాఁ గోరి నాతోఁ జెప్పెను. నేను 'నట్లె కాని'మ్మంటిని.
ఆ రాక్షసుఁడట్లువర మడుగునపుడు తన కవమాన మగు నని తలఁచి మనుష్యు
లను జెప్పఁడయ్యె. కాన మనుష్యులకును నవధ్యుఁడుగా వరము వేఁడినవాఁడు
గాఁడు. కనుక వాఁడు మనుష్యునిచే చావందగునుగాని వానిని జంప మఱి
యొక్కఁడు లేఁ"డనియె. బ్రహ్మదేవుఁడు వాక్రుచ్చిన యీ ప్రియవాక్యము విని
దేవతలును మహర్షులును మిక్కిలియు హర్షమునొందిరి. ఇట్లు వారు రక్ష నపే
క్షించుచుండుట విష్ణుదేవుఁ డెఱింగె. సర్వాంతర్యామియై వ్యాపించి యుండునా
దేవునికిఁ దెలియరానిదేది? ఆశ్రితరక్షకుసమయము దొరకొనుట వలనిసంతసంబున
నెంతయుఁ గాంతి దీపింప రక్షణోపకరణములైన శంఖచక్రగదలను గేలందాల్చి
పచ్చనివలువంజుట్టి యాజగత్పతి వైకుంఠమునుండి దశరథుని యజ్ఞవాటమునకు
వేంచేసినవాఁడయ్యె. ఇట్లు విచ్చేసి యచ్చట నున్న బ్రహ్మతోఁ గలసియా శ్రిత
రక్షకై చేయఁగల కార్యంబునం దెచ్చరిక గలిగియుండ దేవతలందఱు నా దేవు
నెంతయుఁ బ్రస్తుతించి ప్రణతులై యిట్లనిరి. "విష్ణుదేవా! లోకములకుహితము
సేయుటకై నీవు నీయంతనే యెప్పుడు నాయితపడి యుండువాఁడవు. అట్టినిన్ను,
లోకరక్షణమునకై కఱపవలసినదేదియు లేదు గాని, యందులకై కేవలము పురి
కొలుపుచున్నారము. పురికొలుపు కార్యమేమనఁగా, సకలధర్మములనరసి మహా
దాతయై, మహర్షింబోలెఁ దేజరిల్లు ప్రభుండును, అయోధ్యావిభుండునైన దశరథ
మహీనాథునకు హ్రీశ్రీకీర్తులతో సరివచ్చునతనిమువ్వురిభార్యలయందు నీవు నిన్ను
* నాలుగువిధములు గావించుకొని నలువురుగొడుకులు గమ్ము. అట్లా దశరథుని
భార్యలయందు నీవు మనుష్యుఁడవై పుట్టి, వీర్యబలంబునఁ బయింబయిఁబొడలు
చున్నలోకకంటకుఁడును, దేవతల కవధ్యుఁడును నైన రావణుని రణమునం జంపుము.
మూర్ఖుఁడైన యా రాక్షసుఁడు వీర్యాతిశయ జనిత దుర్వారగర్వమున దేవతలను,
గంధర్వులను, సిద్ధులను, మునిప్రవరులను బీడించుచున్నాఁడు. మఱియు ఋషు
లను నందనవనమున దంపతులుగా విహరించుచుఁ గ్రీడించుచుండిన గంధర్వు
లను నప్సరసలను గ్రూరుఁడై కాఱియపెట్టెను. కాన వాని నవశ్యమును
జంపందగు. వానివధముకొఱకు యక్షగంధర్వసిద్ధులును, మునులును, మేమును

* నాలుగువిధములుగా ననతరింపు మనుట రావణుని, ఇంద్రజిత్తుని, లవణాసురుని, గంధర్వు
నిని వరుసగాఁ జంపుటకొఱకని తెలియునది.

నీకడకు వచ్చి యెంతయు నిన్ను శరణుఁజొచ్చితిమి. ‘బ్రహ్మరుద్రాదులుండ నన్నొక్కనినె శరణుఁజొరనేల’ యనవలదు. దేవా! నీవే మాకందఱికిని బరమ గతి. ఎట్టిశత్రునేని గ్రాఁచంజాలు నీకన్న మఱియు దిక్కు మాకుఁగలుగునే. కాన నీయాశ్రితులైన దేవతలకుఁ బగతురైన రక్కసులఁ జక్కాడ నరలోకం బున నవతరింప నవధరింపు’’ మనిరి. దేవత లిట్లు దన్ను బ్రార్థింప, దేవదేవుండును దేవతాశ్రేష్ఠుండును గావుననే సర్వలోక నమస్కృతుండునైన విష్ణుఁడు నచ్చట గుమి గూడివచ్చి తన్ను శరణుఁజొచ్చిన బ్రహ్మ మొదలగు దేవతలనెల్లఁ జూచి ‘దేవతలారా! భయపడవలదు. మీకు శుభంబగు. ఏలన నేను సకలహితార్థం బుగాఁ బూని క్రూరుండును, దురాత్ముండును, దేవతాభయంకరుండు నగు రావ ణుని వానిపుత్రులను పౌత్రులను మిత్ర మంత్రి జ్ఞాతిబాంధవులను యుద్ధమునఁ జంపి ధర్మసంస్థాపనంబు పొందెు నీపంటవలెఁ దిని బాలించుచుఁ బదునొకొండు వేల యేండ్లు వసించువాఁడ’ ననియె. సృష్టిస్థితిలయంబులఁ గ్రీడించుచు సకలాత్మ శేషియై వెలుంగు విష్ణున కిదియెంత! ఇట్లు దేవుఁడు దేవతలకు వరమొసఁగి వారు వేడినట్లు మనుష్య లోకంబునఁ దాను బుట్టుటకుఁ దగినపట్టు చింతించె. అట్లు చింతించి పిదప నప్పద్మదళాక్షుఁడు తనశరీరము నాలుగుదెఱంగులు గాఁ జేసి యపుడు దశరథమహారాజును దండ్రిగా నిచ్చగించె. అంత గంధర్వులు ఏకాదశ రుద్రులును, దేవతలును, నప్సరసలును, దివ్యాత్మ స్వరూప విషయ బంధురంబు లగు స్తుతి ప్రబంధంబుల నమ్మధుసూదనుని నిట్లని ప్రస్తుతించిరి. ‘దేవా! ఆరావ ణుఁడు పుట్టుక మొదలుగా మిక్కిలి దర్పించి యుండు వాఁడు. వేంద్రమైన వాఁడిమగఁటిమిచేఁ దీం, డ్రించుచునుండు వాఁడు. అటుమీఁద వరదానంబునం జేసి దర్పంబు మిక్కిలియుం బెరుఁగ సురవిభునంతటి వానిఁగోఁ బగఁగొని జగంబు లెల్లఁగుయ్యోయని మొఱయిడఁ గారించుచున్నాఁడు. ఎవరి నెట్లు చేసినఁ జేయుఁ గాక. అపవియం దాకులలములు మెసవియుబుసు పుచ్చుతాపసులను దూలించుచు దనపేరు చెప్పిననంతనే వారిని గడగడ వడఁకించు చుండునవ నిఁక వానిదుండగ మిట్టిదని చెప్పవలయునా? వాని నీకు దండింపకుండుఁ దగదు; కాన వాని మొద లంట రూపు మాపుము. దేవతాపతీ! వాఁడిమగంటి మిఁజేసి జగంబుల నెల్లఁ గారించు నారావణునే వాని బలగము తోను బంధుగుల తోను జమునివీటికి విందులు గావించి నిత్యమై మునుబోటుల కందరాని మాళ్లై రాగద్వేషాది పాపరక్షితమై యుండు నీలోకంబునకు మనంబు ముందుడుకు మాని మరల వేంచేయుము’ అనిరి. ఇది పదియేనవ సర్గము.

---

## విష్ణువు దేవతలు చెప్పినట్లు మనుష్య రూపంబునఁ బుట్ట నియ్యకొనుట.

అంత సృష్టిస్థితిలయములు లీలలుగాఁ గ్రీడించుచు నిఖిలాంతర్యామియై వెలుఁగు నావిష్ణుదేవుఁ డాశ్రితపరతంత్రుఁడు గాన సురవరులు తన్ను నియోగించి నందుల కియ్యకొని రావణు వధించునుపాయ మెఱింగినవాఁడయ్యు సురలను బహూకరించుటకై వారింగూర్చి మధురంబుగా 'దేవతలారా ! ఋషికంటకుఁడును దురాత్ముఁడునగురావణుని నేయుపాయముగొని చంపవచ్చు'ననియడుగఁగా నా దేవత లందఱు నవ్యయుఁ డగునాదేవునిఁ జూచి "దేవా! మనుష్య దేహముఁ దాల్చి రణమున రావణునిఁ జంపుము. 'మనుష్యదేహమే తాల్పనేల?' యన్నచో వాఁడు బహుకాలము బ్రహ్మనుగూర్చి యుగ్రతపము సేసె. బ్రహ్మలోకుల కెల్లఁ దొలుతంబుట్టి యాలోకుల నెల్లఁ బుట్టించుదిట్టయై యెట్టివరముఁ గోరిన నియ్యంజాలుసమర్థుఁడు గాన యా తపమునకు సంతసించి మనుష్యులు దక్కఁ బలువిధములైన తక్కిన భూతంబులవలన నీకు భయము గలుగదని యారక్కసునకు వర మొసఁగె. అట్లతఁడు తొల్లి వరమిచ్చునప్పుడు మనుష్యు లెంత మాత్రమని వారినిగూడ గణించినవాఁడు గాఁడు. ఇట్లు పితామహునివలన వరముపడసి వాఁడతి గర్వితుఁడై ముల్లోకములఁ జీకాకుపఱుచుచు మెఱుంగుఁ బోండ్లఁబట్టి బలిమింగొని పోవుచున్నాఁడు. పరంతపా ! అక్కారణంబునం జేసి వానికి మనుష్యుల వలననే చావు గనుపట్టుచున్న" దనిరి. ఇట్లు వారలు పలికిన పలుకులు విని సర్వాంతరాత్ముఁ డగునావిష్ణు దేవుఁడు మనుష్య రూపమునఁ దానవతరించుటకై యప్పుడు దశరథరాజును దండ్రిగా నిచ్ఛగించినవాఁ డయ్యె. అక్కాలంబున మహాకాంతిమంతుఁడును జితారియు నగునమ్మహీ కాంతుఁడును, అపుత్రకుఁడు గాన పుత్రులఁ బడయంగోరి పుత్రోత్పత్తికర మైనయజ్ఞ మొకటి యజించినవాఁడయ్యె. విష్ణుదేవుఁడును మనుష్య రూపమున నవతరింప నిశ్చయించి పితామహుతో 'పనివినియెద' నని సురలును మహర్షులును పూజ లొనరించుచుండ నంతర్ధానము నొందె. అంత యజించుచున్న దశరథుని యాహవనీయాగ్ని నుండి యొక పెనుభూతము కాంతివెల్లునఁ గన్నులు మిఱుమిట్లు గొలుపుచు బయలుదేఱె. అదియు నెంతయు వీర్యమును బలమును గలిగి, నలుపు నెఱుపును గలసినవలువ గట్టి; కట్టెఱ్ఱ మొగంబు తోడఁ జూపట్టె. మఱియు నదిభేరీధ్వనివంటి యెలుంగు సెలంగ, సింగంపునును వెండ్రుకలను బోలిన రోమంబులును మీసములును తలవెండ్రుకలును గ్రాల, శుభ లక్షణ లక్షితంబై, దివ్యాభరణ భూషితమై పర్వతశిఖరమువడువునఁ బొడువు గలిగి, మత్తిల్లిన బెబ్బులివలె వెఱపు గొలుపుచు, మేనలుగడల మెఱుంగులు దుఱంగలించుటం జేసి వేఁడివెలుంగుఁ బోలెఁ జూపట్టుచు; మండుచున్న యగ్ని సెగవలె మిగుల వేండ్రమై తీండ్రించె. ఇంతేకాక యది, వెండిమూఁత పయిఁ

గలిగి, దివ్యపాయసముచే నిండారి మాయామయంబో యన్నట్లు వింతగొలుపుచున్నదియొక యపరంజిపాత్రమును, గడుం బెద్దదిగాన రెండుబుజములచే మక్కువ యిల్లాలింబోలె చిక్కంబట్టికొని పొడతెంచి దశరథునిం జూచి 'రాజా! ఇట వచ్చిన నన్నుం బ్రజాపతి యొద్దనుండి వచ్చిన పురుషునిగా నెఱుంగు' మనియె. అంత నప్పుడు దశరథుండును గేలుమోడ్పుగీలించి 'భగవంతుండా! నీకు స్వాగతంబగుం గాక. నేను నీకేమిసేయం దగునో యానతి' మ్మనియె. పిదప నాప్రాజాపత్య పురుషుండు మరల రాజును జూచి "రాజా! నీవశ్వమేధము చేతను బుత్రకామేష్టి చేతను దేవతలనర్చించితివి. కావున నీకిపు డీపాయసము ప్రాప్తించినది. నృపోత్తమా! ఈ పాయసము విష్ణుదేవునిచే నిర్మితమైనది; సంతానకరము ధనప్రదమును నారోగ్యవృద్ధి కరమును నగు. కాన దీని గైకొని నీకు సజాతీయులై (క్షత్రియజాతలైన) భార్యలకు 'భుజింపుం' డని చెప్పియిమ్ము. ఇట్లిచ్చితివేని నీవెవరికొఱకు యజించెదవో యాపుత్రులు వారియందుం బడయుదు" వని చెప్పె. వల్లెయని యారాజును మది నుల్లసిల్లి దేవదత్తమును దేవాన్నపూర్ణము నైన యాసువర్ణపాత్రమును నొదలం గయికొని యద్భుతమును బ్రియదర్శనంబు నైన యా భూతంబునకు మ్రొక్కి మిక్కిలియు ముదంబు పొదల దానిని వలగొనియె. పిదప దశరథుండు దేవనిర్మితమైన పాయసమును బడసి పెన్నిధిం గన్న పేదపలెం జాలం బ్రీతి నొందినవాండయ్యె. అంత నద్భుతాకారంబై మిక్కిలియుం గాంతి వెంపారు నాభూతంబును బాయసంబు నొసంగుపని నెఱవేర్చి యాయగ్నియందే మఱుంగయ్యె. అమ్మహీకాంతుని యంతఃపుర కాంతాజనము నుబ్బు సొంపునం బెంపారు నునుంగాంతులం దళుకొత్తుచు, శరదృతువున నేకలంకయు లేని చెలువంపుం జందురుని కిరణంబులచేం బురణించు నాకాశమువలెం బ్రకాశించె. రాజు, నంతఃపురము సొచ్చి కౌసల్యాదేవిని జూచి 'నాకుం బుత్రోత్పత్తికరంబైన యీపాయసమును బుచ్చుకొను' మని చెప్పి యొప్పారుపుత్రులం బడయం గోరి యాపాయసంబులో సగము కౌసల్య కొసంగె. ఆమిగిలిన సగములో సగము (మొత్తమునందు నాలవపాలు) సుమిత్రకిచ్చె. సుమిత్రకియ్యంగా మిగిలిన దానిలో సగము (మొత్తమునం దెనిమిదవ పాలు) కైకేయి కిచ్చె. మిగిలి యున్న యెనిమిదవపాలు, మరల కైకేయి కిచ్చినచో నదియును సుమిత్రయును భాగములందు సమాన లగుటయు సుమిత్ర పెద్దదిగాన భాగమెక్కుడుగా నామెకుంచ వలయుటయు విచారించి యమృతమువలెం జవులు గొలుపుచుం జెలువారు నామిగిలిన పాయసంబును మరల సుమిత్రకే యిచ్చినవాండయ్యె. ఇట్లు రాజభార్యలకుం బాయసంబు వేఱువేఱ పంచి యిడంగా నారాజకాంతా రత్నములు దానిం గయికొని యుల్లంబు లెంతయుం బల్లవింప తమ పిన్న పెద్దయంతరువులకుం దగినట్లు దానిం బంచి యిచ్చుటం జేసి రాజుతమ్ము బహూకరించెనని తలంచిరి. పిమ్మట నమ్మత్తకాశినులు

మహీశుఁ డిచ్చినమేలి పాయసమును వేఱువేఱ భుజించి యగ్నిని సూర్యునిం బోలు తేజంబున రాజిల్లుచుఁ గొండొక కాలము కడచనఁగా నపుడు గర్భంబులు దాల్చిరి. అంత భూకాంతుఁడు దనకాంతలకు చూలు దలసూపుటఁ గనుంగొని స్వస్థచిత్తుఁడై స్వర్గంబున సురవర సిద్ధర్షి గణపూజితుండై రాజిల్లు నింద్రునివలె, సంతసంబునొంది యుండె ఇది పదియాఱవ సర్గము.

---

## దేవతలు తమతమయంశముల వానరాదులఁ బుట్టించుట.

విష్ణుఁడు మహాత్ముఁడగు నమ్మహీనాథునకుఁ బుత్రుఁడై యవతరింపఁ బూనఁగా భావికార్యజ్ఞుఁ డగు బ్రహ్మయు దేవతల నెల్లఁ జూచి యిట్లనియె. 'విష్ణుదేవుఁడు దానాడినమాటదప్పక మనుజుఁడై యవతరించి మహావీరుఁడు గాన మనకిందఱికిని హితము సేయుటకుఁగా లోకకంటకుని రావణుని గీటణంచువాఁ డగు. కాన యమ్మహాత్మునికిఁ గింకరులై తోడుపడుటకుఁ దగినకడిందిబలము గలవారై కపటరాక్షసులతోఁ బోరుటకుఁ గావలయునట్టి కామరూపంబులు దాల్పం జాలినవారిని మీరు సృజింపుఁడు. మఱియు వారు విచిత్రశక్తులఁ దెలిసినవారును, శూరులును, వాయుసమాన వేగశీలురును, యుక్తిశాలులును, బుద్ధిసంపన్నులును, విష్ణుదేవునిం బోలుపరాక్రమము గలవారును బరులకుఁ జంపఁ దరముగానివారును, జతురుపాయకుశలులును, రూపముల సింగంబులవలెఁ బొలుచువారును, సకలాస్త్రశక్తియుతులును, అమృతం బాహరించినవారివలె మరణదూరులునై యుండఁదగు. *అప్సరఃకాంతలలో మేలుబంతులైనవారలందును, గంధర్వకామినుల దేహములందును, యక్షపన్నగులకన్నెలందును, ఋక్షవిద్యాధర కాంతలయందును, కిన్నరపన్నగవేణులగాత్రములందును, వానరవనితల తనువులయందును, బుత్రులను మిముం బోలుపరాక్రమవంతుల వానరరూపంబుల సృజింపుఁడు. పూర్వమే నేను నాయంతకు జాంబవంతుం డను నెలుఁగుబంటిమిన్నను సృజించియున్నవాఁడ. నేనావులింపఁగాఁ దోడనే నా నోరినుండి యతఁడు పుడమినాఁ' డనియె. బ్రహ్మదేవుఁ డట్లు చెప్పఁగా నతనియానతి నందఱు గయికొని వానరరూపములఁ బ్రసిద్ధు లయిన పుత్రులఁ బుట్టించిరి. మహాత్ములగు ఋషులును, సిద్ధవిద్యాధరులును, ఉరగులును, చారణులును మిక్కిలి వీరులగు వానరకుమారులను బుట్టించిరి. ఇంద్రుఁడు మహేంద్ర పర్వతమువలె ధృతిపెంపు సొంపారు వానరచక్రవర్తిని నవ్యాహతవిక్రమునిం

---

* దేవతలకుఁ బార్వతీశాపంబునంజేసి స్వక్షేత్రములందుఁ బుత్రోత్పాదనము కలుగదు. కావున యప్సరఃప్రభృతు లిట క్షేత్రములుగాఁ జెప్పఁబడిరి. రావణుఁడు దిగ్విజయకాలమున కైలాసమున నందిని జూచి కోఁతి యని యుపహసింపఁగా 'నావంటి బలవంతులైన కోఁతులచేతనే నీవు నశింతు'వని యతఁడు శాపము పెట్టియున్నవాఁడు గానతచ్ఛాపానుగుణముగా పుత్రులను వానరాకారంబుల సృజించునట్లు బ్రహ్మ నియోగించినాఁ డని తెలియునది.

గాంచెను. సూర్యుఁడు పగతుర నూటాడించు తనమేటిమగఁటిమికిం దగినవానిని సుగ్రీవునిం బుట్టించె. బృహస్పతియు నఖిలవానరముఖ్యులలోపల నెంతయు నెనలేని బుద్ధిమంతుం డగుమహావానరునిం దారుం డనువానిం గలిగించెను. కుబేరుండును దన్నుంబోలె శ్రీమంతుండగు గంధమాదను డనువానరునిం గాంచెను. విశ్వకర్మయు సర్వకార్యనిర్మాణచణుండుగాను గొప్పవాఁడగు నలునిం గలిగించెను. అగ్నికి నగ్నితుల్యం బగుతేజంబున విరాజిల్లు శ్రీమంతుఁడు నీలుం డనుసుతుండు పుట్టె. వాఁడు తేజంబునను, యశంబునను, వీర్యమునను దక్కుంగల వానరవీరులనెల్ల నతిశయించినవాఁ డయ్యె. రూపం బనుధనంబు సొంపునఁ బెంపారుచు మిక్కిలి పొగడ్త గాంచిమించు నశ్వులు తమంత మనస్సుచేత నే మైందద్వివిదులను గనిరి. వరుణుండు సుషేణుం డనువానరశిఖామణిని గాంచె. పర్జన్యునకు మహాబలుఁడైన శరభుఁడు ప్రభవించె. శ్రీమంతుం డగుహనుమంతుండు వాయుసుతుండు. అతని దేహము వజ్రకఠినము, వేగమున నతఁడు గరుడునిం బురుడించువాఁడు. వానరతల్లజులలో నెల్ల మిక్కిలి బుద్ధియు బలిమియుఁ గలవాఁడు. ముఖ్యులైన యీవానరులే కాక మఱి యపారబలాఢ్యులును వీరులును విక్రమసారులును గామరూపులు నగువానరులు రావణుం బొరిగొన నురవడించువారు పెక్కువేవురు సృజింపఁబడిరి. మఱియు దృఢశరీరులై మేరుమందరగిరులం బోలి మహాబలంబునఁ జెలంగునెలుంగులును గోఁతులును గొండముచ్చులును జెచ్చెర (మానససృష్టిం జేసి) జనించిరి. ఆయా దేవతలకుఁ గలరూపములును వేషములును బరాక్రమములును వారివారి పుత్రులకును వేఱువేఱ తప్పక కలిగినవి మొగముమాత్రము వానరాకారం బయ్యె శరీరసంస్థానాదులం దెల్ల, ఆయావనచరులు తమతమపితలం బోలి విలసిల్లిరి. పరాక్రమంబునఁ బొగడ్తగన్న కొందఱు వానరులు కొండముచ్చు చెలువలయందుఁ గలిగిరి. కొందఱెలుంగు వెలందులందు జనించిరి. మఱికొందఱు కిన్నరకాంతలందుఁ బుట్టిరి. కీర్తిమంతులగు దేవతలును, మహర్షులును, గంధర్వులును, గరుడులును, యక్షులును, నాగులును, గింపురుషులును, సిద్ధవిద్యాధరులును, ఉరగులును, మఱియుం బెక్కండ్రు నక్కజంపు ముదంబున నచ్చరమిన్నలందును, విద్యాధరకన్యలందును, నాగకన్యలందును, గంధర్వకాంతాశరీరంబులయందును విష్ణునవతారకాలమున వేలకొలఁదిని వనచారు లగువానరుల మహాకాయులం బుట్టించినవారైరి. అందఱును గామరూపబలసంపన్నులును, గామగమనులును, దర్పబలంబుల సింహశార్దూల సదృశులును నగుదురు. అందఱును శిలలుగొని కొట్టి పగర నుల్లంబెట్టుదురు; వ్రాఁకులం దాల్చి చీకాకు పఱుతురు. అందఱికిని గోళ్లును గోఱపండ్లు నే యాయుధములు. శిలలును వృక్షములును దప్ప నస్త్రములు ప్రయోగించువారు గాని దేవాంశ జనితులగుటం జేసి యస్త్రప్రయోగోపసంహారముల యుపాయంబులందఱు నెఱింగినవా రగుదురు. వారు పెనుఁగొండలనైనఁ గదల్పఁ గలరు;

కడింది ప్రాకులను జెల్లగింపఁగలరు; ఉరవడిచేఁ గడలినిగూడఁ గలంచి వైవఁగలరు; పుడమి నడుగులచే బ్రద్దలు వాపఁగలరు, మహాసముద్రంబును జెంగున లంఘింపఁగలరు; ఆకసంబునకుం బ్రాకఁ గలరు; మబ్బులనుం బట్టుకొనఁగలరు; మత్తిలి యడవులను బరుగువాఱు సేనంగులనుం బట్టఁగలరు; ఆర్పులచప్పుడుచేత నే పక్షులం గూల్పఁగలరు. ఇట్లు కామరూపులును, మహాధీరులు నై యేపారువానర సేనాధ్యక్షులు నూఱులక్షలు పుట్టిరి. వాలిమొదలైన యావానరచమూపతులు వానరసమూహములందు సేనాధిపతులలోనుం బ్రధానులై యుండిరి. ఇంతియ కాక వారు పరాక్రమశీలు రగువానరులనుం గనిరి. కొండఱువానరులు, ఋక్షవంత మను కొండనత్తములందు వేలకొలఁది నివసించియుండిరి. మఱికొందఱు నానావిధము లైనకొండల నడవుల నాశ్రయించిరి. ఈ వానరోత్తములందఱును నింద్రసుతుండై (రాజై) నవాలిని, సూర్యకుమారుండై (యువరాజై)న సుగ్రీవుని, (మంత్రులైన) నలుని నీలుని హనుమంతుని, మఱియుందక్కిన వానరసేనాపతులనుం గొలుచుచుండిరి. వారెల్ల గరుడునకుం గలబలంబున వ్రాలుచు, యుద్ధములందు నేర్పరులై, దర్పంబున సింగంబులను బెబ్బులులను బెనుఁబాములను బాములఁబెట్టుచు నిచ్చలు తిరుగుచుండిరి మహాభుజుండును బహువిక్రమ విరాజితుండు నగు వాలితన బాహుబలంబున నాయెలుంగుగొడ్డులను గొండముచ్చులను గోతులను బాలించుచుండె. మఱియు వారు వివిధములైన యాకృతులు గలిగి వేఱువేఱ తమ్ము గుఱుతుగొనం జేయులక్షణంబులతోఁ గూడినవారై యాపుడమిని గల గొండలు నడవులు సముద్రంబులందలి దీవులు సంతట నెఱసి వఱలు చుండిరి. ఘోరములగువారి కాయములను రూపులను జూడఁగాఁ గడిందిమబ్బులగుంపులో పెనుఁగొండకొమ్ములో యనం జూపట్టిరి. అట్టి మహాబలు లగునా వానరచమూపాలురు రామునకు సహాయము చేయు నిమిత్తము నిఖిలభూతల మంతయు వ్యాపించియుండిరి. ఇది పదునేడవ సర్గము.

---

# శ్రీరామావతారము.

రామాదులజననము—విద్యాభ్యాసము—విశ్వామిత్రుఁడు వచ్చుట.

మహాత్ముఁ డగుదశరథుని యశ్వమేధయాగము పుత్రకామేష్టితోఁ గూడ నెఱవేఱె. సురలును తమతమ హవిర్భాగములను బుచ్చుకొని వచ్చిన దారిని వెడలి పోయిరి. రాజును దీక్షకొఱకుఁ బూనిననియమమును దీర్చి పత్నులతోడం గూడి, భృత్యులు సైన్యములును వాహనములును బలసి కొలువఁ బురముఁ బ్రవేశించువాఁ డయ్యె. ఆయజ్ఞమునకు వచ్చినరాజు లందఱు దశరథునిచేఁ దమ తమకుఁ దగినపూజ లంది ముదము నొంద మునిశ్రేష్ఠుఁ డగువసిష్ఠునకు మ్రొక్కి

నిజదేశములకుం బోయిరి. ఆయయోధ్యాధ్యా పురమున నుండి తమతమపట్టణ ములకుం బోవుచున్న శ్రీమంతు లగుభూకాంతుల సైన్యము లారాజన్యునిచే నీయంబడిన యమూల్యవస్త్రములచే శుభ్రములై సంతోషమునం బ్రకాశించినవి. అట్లు రాజులందఱు వీడుకొని పోవఁగా నపుడు శ్రీమంతుఁ డగుదశరథుఁడును, బ్రాహ్మణోత్తమ పురస్సరముగాఁ బురముఁ బ్రవేశించె. అంత నారాజుచేఁ జక్కఁగాఁ బూజితుఁడై ఋశ్యశృంగుఁడు శాంతాదేవితోఁ గూడి, ధీమంతుఁడగురోమపాదుఁడు నిజభృత్యులతో వెంబడించిరాఁగాఁ, బయనమై పోయెను. ఇట్లురాజా బ్రాహ్మణోత్తములనందఱినివీడుకొలిపి కోరికలీడేఱఁగాఁగొడుకు లెప్పుడు పుట్టుదురోయని చింతించుచు సుఖంబుండె. అశ్వమేధయాగము ముగిసి యొకసంవత్సరము గడిచిన దయ్యె. అంతఁ గౌసల్యాదేవి పండ్రెండవది యగుచైత్రమాసమున, నవమీతిథిని బునర్వసూ నక్షత్రమునందు, సూర్యాంగారక శని బృహస్పతి శుక్రులైదుగురును దమతమయుచ్ఛస్థానంబులైన మేష మకర తులా కర్కాటక మీనంబులందుండఁగా, నందు,బృహస్పతి చంద్రునితోఁ జేరియుండఁ,గర్కాటక లగ్నంబు నందు, సకల జగన్నాయకుఁడును, సర్వలోక నమస్కృతుఁడును, సమస్త శుభలక్షణ లక్షితుఁడును, ఇక్ష్వాకువంశ వర్ధనుఁడును, మహాభాగ్యవంతుండును, విష్ణుదేవునర్ధాంశంబును నైనరాముఁ డనుపుత్రలలామునిం గాంచెను. కౌసల్యాదేవియు మిక్కిలి తేజంబు రంజిల్ల, వజ్రరేఖఁ గేలందాల్చి యున్న యాపుత్రునింగాంచి, వజ్రంబు దాల్చిన దేవేంద్రునిం గన్న యదితియుంబోలె, నెంతయుం బ్రకాశించిన దయ్యె. అంత సత్యపరాక్రముం డగునాదశరథుఁడు గైకేయియందు ప్రత్యక్షవిష్ణుదేవుని చతుర్థ భాగంబును దదీయసకల కల్యాణగుణయుతుండు నగుభరతుం డనుసుతునిం గాంచె. పిదప వీరులును సకలాస్త్రములం దారి తేఱినవారును విష్ణువు నాలవయెనిమిదవయంశములుగూడిన వారునైన లక్ష్మణశత్రుఘ్ను లనుకుమారుల సుమిత్రాదేవి గనియె. ప్రసన్నమతి యగుభరతుండు పుష్యమిని మీనలగ్నమందు నుదయించె. లక్ష్మణశత్రుఘ్ను లాశ్లేషానక్షత్రమునఁ గటకలగ్నమందు సూర్యుఁ డుదయించి యుండఁగాఁ (మధ్యాహ్నమునందు) బుట్టిరి. ఇట్లామహీపాలునకు ననురూపులై గుణవంతులునై కాంతి విల్లునఁ బూర్వభాద్రానక్షత్రంబులు నాలుగుంబోలె మిక్కిలియుఁ దులకించుమహాత్ములు నలువురు గొడుకులు జనియించినవారైరి. అయ్యవసరమున గంధర్వులు మధురముగాఁ బాడిరి; అప్సరోగణంబు లాడిరి. దేవదుందుభులు మొరసె అమరు లాకసంబున నుండి పువ్వులసోనలు గురిసిరి. అయోధ్యయందును జనులు గ్రిక్కిఱిగా నెఱసి సంతోషంబు నిండార నమ్మహోత్సవంబుఁ గొనియాడిరి. నలుగడ జనబృందంబు గ్రందుకొన, నటనర్తకులు రసభావంబు లొకపక్కంబున నభినయింప, నొకచాయ గాయకులు పాడ, నొకదెస వాద్యశిల్పులు పలువిధముల వాద్యముల వాయింప,మఱియొక చక్కి నితరు లగు

సూత వంధిమాగధుల స్తుతి వాక్యంబులు బలిసికొన, రాజమార్గము లెంతయు మ్రోఁగుచుండె. రాజును పౌరాణికు లైనసూతులకును, వంశావళిం గీర్తించు మాగధులకును, స్తుతిపాఠకు లగువందిజనులకు, దగుపారితోషికము లొసంగె. బ్రాహ్మణులకు గోవులను ధనమును వేలకొలఁది నిచ్చె. పిదప లక్ష్మణుఁడు పుట్టిననాఁటికిఁ బదునొకండవ దినము, * అనఁగా రాముఁడు పుట్టినది మొదలుగాఁ బండ్రెండవ దినము. గడవఁగాఁ బదుమూఁడవ దినమునందు రాజు, కొడుకులకు నామకరణము సేయువాఁడై యందులకుఁ బరమప్రీతుండగు వసిష్ఠునిచే మహాత్ముండైన జ్యేష్ఠునకు రాముండనియుఁ, గైకేయిసుతునకు భరతుండనియు, సుమిత్రాదేవి సూనులలో నొకనికి లక్ష్మణుండనియు మఱియొకనికి శత్రుఘ్నుండనియు నామములు గావించెను. ఇట్లు గావించి యతఁడు పట్టణములను బల్లెలను నుండుబ్రాహ్మణులకు భోజనములు పెట్టించి వారలకుఁ గొలఁదిలేని రత్నజాలము లనేకము లొసఁగెను. పిదపఁ గుమారులకు జాతకర్మాది సమస్త కర్మములను జేయించినవాఁడయ్యె. ఆకుమారులలో వయస్సునఁ బెద్దవాఁడగు రాముఁడు ధ్వజమువలె నిజకులముఁ బ్రకాశింపఁ జేయుచుఁ, దండ్రికి నెంతయు సంతసంబుఁ గూర్చుచు, బ్రహ్మదేవునివలె సకలప్రాణులకు బ్రియుండై యుండె. కుమారు లందఱును వేదంబుల నభ్యసించి ధనుర్వేదంబునను విశారదులై శూరులై లోకహితాచరణపరాయణులై వేదార్థముల నెఱుంగుటం జేసి జ్ఞానసంపన్నులై, ఆజ్ఞానమువలనఁ గలుగుసకలకల్యాణ గుణముల పెంపున సొంపారుచుండిరి. వారలలోపల రాముఁడు మిక్కిలి తేజమున రాజిల్లుచు నెందును డిందువడని పరాక్రమంబునుగలిగి కందు లేనినునుఁజందురుండునుంబోలె లోకులకుఁ గన్నుల విందులు గావించుచుండె. మఱియు నతండు గజముల మూఁపులెక్కుట యందును, తురంగముల నారోహించుటయందు, యుద్ధంబుల రథములను మెలపు మెలఁకువలయందును, అసమానుండని యందఱును బొగడ నెగడుచు విలువిద్యయందు నారితేఱి పితృశుశ్రూషాపరుండై యొప్పుచుండె; రామునికిఁ గైంకర్యంబు సేయుసొంపు నెప్పుడు సంపాదించుచు లక్ష్మణుఁ డుండు. అతఁడు తనకుఁ బెద్దన్నయు సకల జగదభిరాముండు నగురామునకుఁ బిన్ననాఁటనుండియు నెప్పుడును మిక్కిలి నెయ్యంబు తియ్యంబుఁ జూపుచుండు. మఱియు నాలక్ష్మీసంపన్నుఁ డారామునకు

---

* మూలంబున 'ఏకాదశాహమ్' అనుటచే పదునొకండవదినము గడవఁగా పండ్రెండవదినమున నామకరణము జరిగెనని యున్నది. క్షత్రియులకుఁ బండ్రెండుదినములు సూతకమని శ్రుతియుఁ బదుమూఁడవదినంబున నామకరణం బని స్మృతియుఁ జెప్పుటంజేసి పదునొకండవదినము గడవఁగా పండ్రెండవదినమున నామకరణము సేయుటవిరుద్ధమగును. కావున నిట 'ఏకాదశాహమ్' (పదునొకండవ దినము) అనఁగా లక్ష్మణుండు పుట్టినదిమొదలుకొని పదునొకండవదినముగా గణించుకొనవలయును. అపుడు రాముండు ముందునాడు పుట్టినవాఁడు గాన ఆతండు పుట్టినదిమొదలుకొని పండ్రెండవ దినమగును అది గడవఁగాఁ బదుమూఁడవదినమున నామకరణము జరిగెననుట యుపపన్నమగును.

నిజశరీరముకంటెను సర్వవిధంబుల నతి ప్రియకరుండై యాతనికి మేని వెలుపల నున్న మఱియొక ప్రాణమో యనఁ దగియుండె. పురుషులలామమైన శ్రీరామునకుఁ బ్రాణపదంబైన యాచిన్న తమ్ముఁడు లేనిచో నిదుర రాదు. తల్లి మృష్టాన్నముఁ దెచ్చి యుంచినను లక్ష్మణుండు లేక దానిని గుడువ నొల్లఁడు ఎప్పుడేని రాముఁడును గుఱ్ఱంబెక్కి వేఁటాడఁ బోయెనేని యపుడే లక్ష్మణుఁడు దానును విలుదాల్చి యాతని వెంటనె కంటికిఱెప్పవలెఁ గాచుచుఁ బోవుచుండు. ఇట్టి లక్ష్మణునకుఁ దమ్ముఁడుగాన శత్రుఘ్నుఁడుదాను నట్టి గుణంబులు గలవాఁడై భరతునిఁ గొలిచె. దానంజేసి భరతున కతఁడు ప్రాణములకంటె నత్యంత ప్రియుఁడై యుండె. ఆశత్రుఘ్ను నకు భరతుఁడు నట్లె యతిప్రియుఁడై యుండె. దశరథుఁడు మహా భాగ్యవంతులగు ప్రియపుత్త్రులు నలువురం బడసి నలువురు దిక్పాలకులచేత బ్రహ్మదేవుండునుం బోలె మిక్కిలి సంతసిల్లె. ఇట్లు దశరథునకు వారిని గన్నంతమాత్రచేఁ గలిగిన కేవల సంతోషమే కాదు; వారువయసునఁ మంచిశాస్త్రజ్ఞానము గడించి సకలసుగుణములరాణించుచుఁ బరాకుపడి చేసిన యకార్యంబులయెడ సిగ్గును మంచిజ్ఞానవంతులనియెడ ప్రీతియుఁ గలిగి సకలలౌకిక కార్యముల యెఱుకయు దప్పులాగను బుద్ధిగౌరవముఁ బడసి మహిమం గాంచి యపారతేజమున దీపించుచుండఁగాఁ జూచినయప్పు డతనికి బ్రహ్మలోకాధిపత్యము గలిగినంతియు విశేషసంతోషమును గలిగె. వారట్లు తమ తండ్రి మెచ్చుటచే గర్వము హెచ్చి సోమరులుగాక పురుషసింహులుగాన మఱియు నినుమడిగా వైదికములగు స్మృతిపురాణాదులం జదువుచు పితృశుశ్రూషయందు జాగరూకులై మీఁదుమిక్కిలి విలువిద్యం దగిలి కఱచుచుండిరి అంత దశరథుఁడును బుత్త్రుల కమ్యోకాలములఁ జేయం దగుధర్మములు నెఱింగినవాఁడుగాన వారికి వివాహమునకుఁ దగువయసు రాఁ జూచి వారి పెండ్లి నిగుఱించి పురోహితునిని బంధులనుం గూడి యాలోచించెను. అట్లమ్మహాత్ముఁడు మంత్రులతో నాలోచించుచుండఁగా మహాతపఃప్రభాసంపన్నుఁ డగువిశ్వామిత్రుఁ డారాజుం జూడఁ గోరి యచటికి వచ్చి ద్వారపాలకులను జూచి 'ఓరీ! కుశికవంశమున జనించిన గాధిసుతుఁడు విశ్వామిత్రుఁడు వచ్చెనని వేగ చెప్పుఁ' డనియె. వారవ్వాక్యము విని యందఱును మనమున భయమును సంభ్రమమును బెరిగొనఁ బురికొని రాజగృహమునకుఁ బరుగునం బోయి యిక్ష్వాకుకులతిలకునకు రాజునకు విశ్వామిత్రుని రాక యెఱింగించిరి. అది విని యమ్మహీకాంతుఁడును సంతసిల్లి యెచ్చరికమీఱఁ బురోహితునిం గూడి, బ్రహ్మదేవుని దేవేంద్రుఁడునుబోలె, అమ్ముని నెదుర్కొని చని, కాంతి వెల్లునఁ దేజరిల్లుచు నియమంబులవాఁడిమిఁ బోఁడిమిగన్న యాతపసి మిన్నంగాంచిమించుసొంపున మోము వికసింప నాతనికిఁ బురోహితునిచే నర్ఘ్యమి మిప్పించెను; అమ్మునియు శాస్త్రవిహితవిధానంబున జనవిభుఁ డొసఁగినయర్ఘ్యముఁ గయికొని యాతనిఁ జూచి 'రాజా! సేమమా? కోరినవన్నియు నొడఁగూడి కొఱవడక

పయింబయిఁ బెరుఁగుచున్నదా? నీధార్మికత్వంబునం జేసి నీపట్టణమును, బొక్కసమును, దక్కంగల దేశమును, ఏయుపద్రవము లేకున్నవిగదా? నీబంధువులకును మిత్రులకును గుశలమా? సామంతులైనరాజు లందఱు నీకు నడఁగి మడిఁగి యుందురా? పగతురెల్ల గెలువంబడిరే కదా? యజ్ఞదేవతార్చనాది దైవకర్మములును నతిథిసత్కారసామదానాది మానుషకర్మములును జక్కఁగా ననుష్ఠింపఁబడునే' యని యడిగె. పిదప నమ్ముని వసిష్ఠునిం జేరనరిగి యతనిని దక్కంగలవామదేవాదిఋషులను మహాభాగులను న్యాయముచొప్పున వారివారికుశలం బరసె. ఇట్లు విశ్వామిత్రుఁడు బహూకరింప వారెల్ల మనంబు లుల్లసిల్ల రాజసభను బ్రవేశించి వారివారికిం దగునెడలఁ గూర్చుండిరి. మహోదారుఁడైన యమ్మహీవరుఁడును మేనం బులకలొత్తనా తాపసోత్తముఁ బూజించి సొంపు పెంపారఁగా "మునీశ్వరా! పుత్త్రులవివాహంబుం గూర్చి చింతించుచున్న నాకు నీవు నీయంతఁ జనుదెంచుట యమృతము లభించినట్లును, నిర్జలదేశంబున వానగురిసినట్లును, బిడ్డలు లేని వానికి సజాతీయ యగుభార్యయందుఁ గొడుకు పుట్టినట్లును, బోయినపెన్నిధి మరల దొరకినట్లును, మంచియభ్యుదయకాలమున మించుసొంపుగలిగినట్లును, అగునని తలంచెద. నీకు స్వాగతము. బ్రాహ్మణోత్తమా! నీకుంగల పెనుఁగోరిక యేమి? దానినెట్లు జేయవలయు? నాదానమునకు నీవే మిక్కిలి యర్హుఁడవు. ఇట్టి నీవు నా యదృష్టవశమున నిచ్చోటికి విచ్చేసితివి. కాన యిప్పుడే నాజన్మము సఫలమయ్యె; నాజీవనము సుజీవనమయ్యె. నీవు మొదట రాజర్షివై వెలసి పిదపఁదపము పెంపునమిక్కిలియుఁ గాంతి దీపించుచు బ్రహ్మర్షివైతివి. కావున రాజర్షిగను బ్రహ్మర్షిగను మఱియుం బెక్కుచందముల నీవు నాకుఁ బూజింపఁ దగుదువు. ఇట్టి నీరాక యెంతయు నాశ్చర్యము. ఇంతకంటె నన్నుఁ బవిత్రునిఁ జేయునది మఱొద్దియు లేదు. నీవు వచ్చి దర్శనం బిచ్చుటవలన నాయీస్థలము పుణ్యక్షేత్రమయ్యె. నీవే ఫలము గోరి యిట వేయరుదెంచితివో చెప్పితివేని దానిని నీయనుగ్రహమున నెఱవేర్పం గోరుచున్నాఁడను. నీ కార్యము నేను జేయుదునో లేనో యని సందియపడఁదగదు. నీవు నాకు దైవము గావున నీకోరినకార్యమంతయు నావంత గొఱవడకుండఁ జేయంగలవాఁడ. నీయీరాకయే నాకు మహాభ్యుదయము సుమా; అభ్యుదయమే కాదు. నీరాకవలన ననుత్తమమగు ధర్మమంతయుం గూడ నాకు దొరకొన్నదయ్యె" ననియె. ఇట్లర్థంబు పెంపున మనంబునకు సొంపుగా, మెత్తనిపలుకులఁ జెవులకు నింపుగా, ఎంతయు వినయమున నా మతిమంతుఁడు చెప్పినవాక్యము విని, వినుతగుణవంతుఁడును గుణగణజనితకీర్తిమంతుఁడు నగు విశ్వామిత్రమహర్షి పరమ హర్షంబుఁ జెందినవాఁ డయ్యె. ఇది పదునెనిమిదవ సర్గము.



విశ్వామిత్రుఁడు దనతోడ రామునిఁ బంపుమని దశరథు నడుగుట.

మిక్కిలియు నాశ్చర్యము గొలుపు చున్నయారాజ సింహునిపలుకులు విని పులకితగాత్రుఁడై మహాతేజుఁ డగు విశ్వామిత్రుం డిట్లనియె. 'భూపాలతిలకా! ఈ లోకమున గొప్పకులంబునఁ బుట్టి, వసిష్ఠులవంటివారియుపదేశమును జేపట్టి, యతిం డును బొగడ నెగడునినుబోఁటివానికే యిది తగునుగాని మఱొక్కనికిఁ దగదు. ఇది కల్లగాదు సుమీ. దానిని నీవు సేయ నీయకొనవలయును. నీవు సత్యసంధుం డవు. కాన యాడి తప్పవు, నే నొకానొక ఫలమును గోరి యుందులకై యాగము సేయంబూని యొక వ్రతమును జరుపుచున్నాఁడను కామరూపు లగునిద్దరు రాక్షసులు దాని కెపుడును విఘ్నములు సేయుచుందురు. నావ్రతమును జాలఁ జలిపితిని, ఇఁక ముగింపవలయునని యుండఁగా మహావీర్యవంతులై మిక్కిలి గడి దేఱియున్న యామారీచసుబాహులు మాంసముతోఁ గూడిన నెత్తురువఱ్ఱు నాయజ్ఞ వేదిపైఁ గురియుదురు. చాల జలిపి యున్న నావ్రతసంకల్ప మీ విఘ్నము వచ్చునం గలియఁగా నేను మిక్కిలియుశ్రమపడి యుత్సాహముడిగి యక్కడనుండి తొలఁగివచ్చితిని రాజా! వారినేల శపింపరాదందువేని నాకు వారియెడఁ గోపముఁ జూపుటకు బుద్ధి గలుగదు. ఏలనఁగా నాయజ్ఞ మొనరించునపుడు గోపము నొంద రాదు. కావున వారిని శపింప నయితిగాదయ్యె. ఇఁక నీవలననే యీపని కావలసి యున్నది. మఱేమియు వలదు. బీఱువోనిపరాక్రమంబున మీఱు రాజశార్దూలుం డగు నీపెద్దకుమారుని రామునిఁ గాకపటివాఁడని పాటింపక నాకొసంగఁ దగు. 'వీఁడు బాలుఁడే వారల నెట్లు చంపునో', యనవలదు. నేను గాపై యుండఁగా నీతఁడు దివ్యంబగుతన తేజమున, వారిరువురినే కాదు, విఘ్నకారు లగురక్క సులనెల్లఁ జక్కాడ సమర్థుఁడు. మఱి యితనికి సందియము లేక పలుచందంబుల నేను మేలొడఁగూర్తు దానిచే నితఁడు ముల్లోకంబులను బ్రఖ్యాతుం డగు. ఆమారీచసుబాహులు రాముని మార్కొని యొక్కింతయు నిలువలేరు. రాముఁడు తప్ప మఱి యెట్టివాఁడు మగండును వారిని జంపునంత తెగుదారిగాఁడు. 'రాముఁ డెంతశూరుఁ డయ్యును వారును మిక్కిలియు వీర్యవంతులే కాన గెలువఁగడగునా' యందువేని, వారెంత వీర్యగర్వితులై యున్నను బాపాత్ములు గావున నప్పాప మూలమునం జేసి కాలపాశమునకు లోనై యున్నవారు. కాన మహాత్ముఁ డగురాజ శార్దూలునికి రామునికి వారొకసరకుగాదు సుమీ. రాజా! కొడుకనిగారాబము చూపవలదు. నాయీమాట నమ్ముము. నే నిదె ప్రతిజ్ఞ సేసి చెప్పెద. ఈ రాక్షసు లిరువురును జంపఁబడిరనియే యెఱుంగుము. ఇదె యెట్లు చెప్పఁగలిగితినన, * ఈ రాముండు మహాత్ముండనియు నెయ్యెడను గడిందిపరాక్రమంబు గలవాఁడనియు

* ఇందులకు 'అహంవేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్। వసిష్ఠోఽపి మహాతేజా యేచేమే తపసిస్థితాః' అని మూలము, ఇందులకు విశేషార్థము. (అహమ్) నేను--అనఁగా బహుగురువుల

నేనెఱుంగుదు. నేనే కాదు. మహానుభావుండైన యీ వసిష్ఠుఁడు నెఱుంగు. మా యిరువురే కాదు. మఱియు ననవరతతపోనిరతులై యున్న యీ వామదేవాది మహర్షులందఱును నెఱుఁగుదురు. వేయేల? పుడమియందు నీకు మిక్కిలి ధర్మాభివృద్ధియు యశస్సమృద్ధియు స్థిరముగా నుండవలయునని కోరితివేని రాముని నాకీయం దగు. నాయొక్కనిమాట వినియే యీయవలదు. వసిష్ఠుఁడు మొదలైన నీమంత్రులందఱు ననుమతించిరేని పిదప రామునిఁ బంపుము. తామర ఱేకులను బోలుకన్నులు గలిగి చెన్నారుగా రాముని రామునిఁ బెక్కుదినంబు లెడఁ

---

నుపాసించి, గౌణగబలంబున పరావరతత్త్వంబుల కలరూపు నెఱిఁగి, జటావల్కలంబులు దాల్చి, తపంబు సేయు సాత్త్వికుండనై, మోక్షకామేష్టి సేసి, ధర్మమోక్షంబులుమాత్రము గయికొన్న బ్రహ్మర్షియగు నేను అనుట, ప్రసిద్ధమైన దానిని పరామర్శించునట్టి 'అహమ్' అను సర్వనామశబ్దముచేత ఈయర్థము ఫలించినది. ఇట్టి నేను రాముని ఎఱుంగుదును గాని నను వ్యత్యస్తముగా కర్మిష్ఠుండనై, రాగద్వేషంబులు దాల్చి, సంసారమగ్నుండగు రాజసుండనై, పుత్రకామేష్టిం జేసి, ధర్మకామంబులు మాత్రము గయికొన్న కేవలక్షత్రియుండ వగునీవు ఎఱుఁగఁజాలవనుట. రాముని ఎట్టి వానినిగా నెఱుంగుదు ననఁగాఁ జెప్పుచున్నాఁడు. (మహాత్మానమ్) 'వేదాహమేతం పురుషం మహాన్తమ్' అను శ్రుతి చెప్పిన అపరిచ్ఛిన్న మహిమగలవానినిగా! లేక 'తేజసాం హి న వయస్సమీక్ష్యతే' అన్నట్లు బాల్యమందును నిరతిశయ వైభవము గలవానినిగా! లేక ఆత్మయనఁగా దేహమనియు నర్థము గావున 'మహాత్మానమ్' అనఁగా 'నతస్య ప్రాకృతా మూర్తిః' అనుస్మృతి చెప్పిన అప్రాకృతదివ్యమంగళ విగ్రహునిగా - లేక, 'అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ' అన్నట్టి మహాస్వభావముకలవానినిగా ననుట. ఇంకను ఎట్టి వానినిగా ననఁగాఁ జెప్పుచున్నాఁడు (సత్యపరాక్రమమ్) ఎప్పుడు నొక్కరూపమైయుండు పరాక్రమము గలవానినిగా. లేక, సత్యమువలన పరుల నాక్రమించు వానిని, అనఁగా, ప్రకృతి సంబంధము వలనఁ దనకుఁ బ్రతికూలురై యుండుటను బలుమాఱునివర్తింపఁ బాటుపడియుఁ బ్రతికూలురుగానే యుండిరేని యట్టివారలను చంపువానినిగా - లేక, 'సుఖసుప్తః పరంతపః' అన్నట్లు పరాక్రమంబు చూపక యుండు నిద్రాదిసమయములందును ఆ కాలముయొక్క యౌజ్జ్వల్యమువలన శత్రుభయంకరుఁడై యుండువానినిగా ఎఱుంగుదును. కార్యవశమున నే నొక్కఁడే యిట్లు చెప్పుచున్నానని తలఁపకుము. వసిష్ఠుఁడును జెప్పెడి ననుచున్నాఁడు. (వసిష్ఠోఽపి) నీకు ఆప్తముఁడును, కులాచార్యుఁడును, అపిశబ్దముచే నాకువిరోధియును అగువసిష్ఠుఁడు ననుట, ఆవసిష్ఠుఁ డెట్టివాఁడన-(మహాతేజాః) 'బ్రహ్మకుమారుఁడును యోగసిద్ధజ్ఞానుఁడు ననుట' లేక, ఎవ్వఁడు చెప్పఁగా నేను బ్రహ్మర్షినైతినో యట్టి ప్రభావసంపన్నుఁ డనుట, వసిష్ఠుఁడు నీ వాఁడు గనుక మనయిరువురవివాదంబు నతఁడు నీకుఁ బక్షపాతి గావచ్చును. కాన నతఁడట్లుండనీ. రాజద్వారసంబంధము లేమిచే పక్షపాతము చూపనియితరులునట్లే యెఱుంగుదు రనుచున్నాఁడు. (యేచేమే) 'తస్య ధీరాః పరిజానన్తి యోనిమ్' అన్నట్లు అవతారరహస్యవిదులగు వామదేవాదులనుట. వీరును నీకుఁ బ్రియపరులు గావచ్చును గాన వీరట్లుండనీ. కేవలపరమైకాంతులునట్లె యెఱుంగుదురనుచున్నాఁడు (తపసిస్థితాః) కామ్యకవ్యాపారములను వదలి సదాతపంబునందే నెలకొని యుండువారనుట, వీరందఱిని వేఱువేఱ యడిగి యంద ఱనుమతించినచో రాముని ఇమ్మనిభావము.

బాసియె ట్లుండునోయని వందురవలదు. బహుదినంబులు కాదు; పదిరాత్రులే నీగారవంపుఁగొమరుఁడు నాకుఁ గావలయు. కాన యంతవఱకు నేచింతయు లేక నాకు నతని వేగ యీఁదగు, రఘుకులతిలకా ! నాయజ్ఞకాలము మీఱిపోకుండున ట్లు మునుముట్ట రాముని౯ బంపుము. నీకు శుభమే యగు. కావునఁ గొంచెమైనను మనమున శోకింపకు.' ఇట్లు మహాతేజుఁ డగునమ్మునిరాజు ధర్మాత్ముఁడు గాన ధర్మార్థసహితంబగు వచనంబు సెప్పి యూరకుండె. విశ్వామిత్రుఁ డిట్లు శుభముగఁ జెప్పినవాక్యము విని రాజేంద్రుఁడు తీవ్రం బగుశోకంబుపాలై వెఱచి మొగము విన్ననై యుండె. మనంబుప ట్టఁగుహృదయంబును దద్దయుం బ్రద్దలు వాపునమ్ముని మాట విని రా జపుడుకరంబు నొచ్చినవాఁడై సింహాసనమునసనుండివడవడ వడంకె.
ఇది పందొమ్మిదవ సర్గము.

---

—దశరథుఁడు రాముని౯ బంపుటకు విషాదపడుట.—

రాజసింహుండు విశ్వామిత్రుం డట్లాడిన వచనంబు విని ముహూర్తకాలము ప్రాణము లేనివాఁడుంబోలె నుండి యంతఁ దెలివినొంది యి ట్లనియె. "మునీంద్రా! తామరలను బురుడించుకన్నులు గలనాచిన్నిరామునకు నింకను*బదియాఱేండ్లును గా వయ్యె. ఇపుడు పంద్రెండేఁడులు నడచుచున్నది. ఇంతటికనుగాయ యెట్లు పోరనేర్చు ? నాయొడిని విడువ కుంకుకూన నన్నెట్లు విడనాడి యుండఁగలఁడు. ఇంతకునాటలాడికొనుటకే కాని యుద్ధమునకు యోగ్యుఁడుగాఁ గనుపట్టఁడు. మనుష్యులతోడను బోరాడి యెఱుఁగఁ డన్న నిఁక నొక్కనితోఁ గాదు, పెక్కండ్రురాక్షసులతోఁ బోరాడఁ జాలుననుట నాకుఁ దోఁపకున్నది. అయినను నాయాడినమాట కల్లసేయను. ఇదె పూర్ణముగ నొకయక్షౌహిణియంత సేన నాపాలనకును ఆజ్ఞకును లోనై యున్నది. దీనితోడం బోయి నేనారాక్షసులతో మార్కొనియెద. ఈ నాభటులు శూరులును బటుపరాక్రములును నై సకలాస్త్రములం దారితేరి యుండుటంజేసి,యిరువురు రాక్షసు లన నేల, బహురాక్షసగణములతోడనుఁ బోరాడఁ జాలుదురు; కాని రాముని౯ దోడ్కొని పోవఁదగదు. నేనే విలుదాలిచి యీసేనలకు నెల్లఁ గాపై యనిమొననిలిచియుసురు నామేనియందుండువఱకు నాయసురలతో వెఱచకుండ మాఱుకొనియెద. నేనందులకు రాఁగా, దానంజేసి నీవ్రత

---

* పదాఱేండ్లక్షత్రియకుమారుఁడే యుద్ధమునకు అర్హుఁడని శాస్త్రము. రాముఁడు 'ఊనషోడశవర్షః' పదాఱేండ్లకుఁ దక్కువైన వయస్సుగలవాఁడనుటచే యుద్ధమునకు అర్హుఁడు కాఁడని భావము. మారీచుఁడు రావణునితో 'బాలోద్వాదశవర్షోఽయ మకృతాస్త్రశ్చ రాఘవః' అని రామునకు, 'విశ్వామిత్రునితోఁ గూడవచ్చినపుడు, వయస్సు పంద్రెండేండ్లనిచెప్పినాఁడు. కనుక 'ఊనషోడశవర్షః' అనగా నాలుగేండ్లు తక్కువయైన పదాఱేండ్లు - అనఁగా పంద్రెండేండ్లు, గలవాఁడని యర్థము.

కార్యము సురక్షితంబై నిర్విఘ్నముగా జరుగఁగలదు; కాన రాముని దోడ్కొని పోవం దగదు. వీఁడు బాలుఁడు. కాన విలువిద్యయందుఁ దేరుగడ యైనవాఁడు గాఁడు. మఱియు శత్రువుల బలాబలంబులు నెఱుఁగఁడు. అస్త్రబలంబును గల వాఁడుగాఁడు. ఇఁక యుద్ధమం దారితేఱినవాఁడును గాఁ డననేల. రాక్షసులో కపటయుద్ధకుశలులు. అట్టివారితోఁ బోరాడుటకు నీ బుడుతఁడు మొదలంటఁ దగఁ డనుట నిజమే కదా. రామునివిషయ మిటుండ, మునీంద్రా ! నావిషయ మింకఁ జిత్తగింపుము. రామునిఁ బాసి యొకముహూర్తము సేపైన నేను జీవించియుండనోప. దీనింబట్టియేని రామునిఁ దోడ్కొనిపోవ నీకుఁ దగదు. రఘుకులదీపకుండైన రాము నే కొనిపోవం దలఁచితివేని, చతురంగబలంబుతోఁ గూడిన నన్నును, వానితోఁ గూడఁ గొనిపొమ్ము. అఱువదినేలయేండ్లు గడచినపిదప ఉపవాసాది వ్రతముల నెంతో కష్టపడి యీబుడుతవానిం గానక కంటి. ఇది తలఁచియేని నీకు రాముని దోడ్కొని పోవం దగదు. మఱియు నలువురు కొడుకులలోపల నాకు రామునియందు మక్కువ మిక్కిలి యెక్కువ యగు. వాఁడే నాకు జ్యేష్ఠసుతుఁడు : కడుధార్మికుఁడు అట్టి రామునిఁ దోడ్కొనిపోవం దగదు. మునిపుంగవా! ఆరాక్షసుల వీర్య మెట్టిది? వారెవరికొడుకులు? వారలపే రేమి? వారల యాకారము లెంతటివి? వారికి నధిపతు లెవరు? కపటయుద్ధకుశలులగు నారాక్షసులకు రాముఁడుగాని, నా సైన్యములు గాని, నేనుగాని ప్రతీకారము సేయవలసిన దెట్లు? రాక్షసులు వీర్యగర్వితులు గావున నట్టిదుష్టాత్ముల రణంబున నేయొద్దు నన్ని మార్కొనం దగు. మహాత్మా ! ఇవి యన్నియు నాకుం జెప్పవే'' యనిన విశ్వామిత్త్రుండు 'రాజా! పులస్త్యమహర్షి వంశంబునఁ బుట్టిన రావణుం డనురాక్షసుఁ డొకఁడు గలఁడు. వాఁడు బ్రహ్మవలన వరముగాంచి యగ్గలంపుబలంబునను నవార్యం బగువీర్యంబునను మించి పెక్కండ్రు రాక్షసులు బలసి కొలువ ముల్లోకంబులను మిక్కిలి పీడించుచున్నాఁడు. వాఁడు సాక్షాత్కుబేరునకుఁ దమ్ముఁడు; విశ్రవసుం డనుమునికిఁ గొడుకు; రక్కసులకెల్ల నొడయండు ! మహాపరాక్రమవంతుఁడు. కాఁబట్టి వాఁడు ప్రసిద్ధుఁడే యగును గాన నీవును వానిని వినియుందువే కదా. అమ్మహాబలవంతుఁడు దానై వచ్చి యజ్ఞములను జెఱుపనయితిగాని యిప్పుడు, వానిచేఁ బురికొలుపఁబడి మారీచసుబాహులను నిద్దఱు రాక్షసులు మహాబలులు యజ్ఞంబులకు విఘ్నంబులు గావింతు'రనియె. ఇది విని యపుడు రాజు, 'మునివరా ! అట్టి దురాత్మునితో రణంబున మార్కొని నిలువ నేను శక్తుండను గాను. నీవు ధర్మజ్ఞుండవు నాకు గురుండును దైవంబును నీవ. కావున నాకుమారునెడను, నీనియోగంబు సేయ నోఁచనియల్పభాగ్యుం డగు నాయెడను, బ్రసన్నుండవు గమ్ము. దేవ దానవ గంధర్వ యక్ష పతగ పన్నగులును ఆరావణుని మార్కొని నిలువనోపరన నిఁక మానవు లెంతమాత్రము. వాఁడక్కజంపుఁబరాక్రమవంతులనేని యుక్కడంచునట్టివాఁడు. కాన నే నొక్కండను

గాని, బలంబులతోఁ గూడికాని, కొడుకులం దోడుసేసికొనికాని, వానితోడం బోరాడనోప; వాని బలంబులతో నేని తెలపడంజాల. అమరులవలెఁ బొడసూపుచు, యుద్ధంబుల నారితేఱకున్న నాచిన్నారికొమరునిఁ బున్నామనరకనిస్తారకుని నే నెట్లు నియ్యంజాల. మఱి, నీ యజ్ఞమును జెఱుపు సుందోపసుందకుమారులైన మారీచసుబాహువులు యమునింబోలువారై యున్నవారు. కావున నీకు నాకుమారు నీయంజాల. మారీచసుబాహులిరువురును మిక్కిలి వీర్యంబు మీఱి యుద్ధముల గడితేఱి యున్నవారు. నేను నా మిత్రులందఱును నొక్కమొత్తంబుగాఁ గూడియు వారిలో నొకనితో నేని పోరాడఁగలనా!' యని చెప్పుటయు నా కౌశికుండు నింతం తనరాని కోపావేశంబు పయికొన యజ్ఞంబునఁ దొలుత సమిధలచే నేల్వంబడి పిదప నేయి వ్రేయఁగాఁ దడిసి దిగ్గురనసెగ లెసకొలుపుచు మండునగ్నిహోత్రంబుం బోలెఁ బ్రజ్వలించినవాఁ డయ్యె. ఇది యిరువదవ సర్గము.

---

## వసిష్ఠుఁడు విశ్వామిత్రునిమహిమఁ దెలిపి దశరథునిఁ దేర్చుట.

పుత్రస్నేహమున మహారాజు తొట్రుపడుచుఁ జెప్పిన వాక్యంబులు విని విశ్వామిత్రుండు కోపాక్రాంతుఁడై 'నేను వేఁడినయర్థమును జేయునట్లు నీవు మొదటఁ బ్రతిజ్ఞసేసి, యిప్పు డాప్రతిజ్ఞను విడువఁగోరితివి. పరమధార్మికులైన రాఘవులయిక్కులంబునకు నిటులాడి తప్పుట తగునా? చెప్పి తప్పుట నీకు నొప్పిద మగునేని చెప్పుము. నావచ్చినదారిని బోయెదను. సత్యసంధ మగు కాకుత్స్థవంశంబునఁ బుట్టినవాఁడవు. చెప్పినమాట పొల్లుచేసి బంధువులఁ గూడి సుఖంబుండుము' అనియె. ఇట్లాధీమంతుఁడు రోషసమాక్రాంతుఁ డగుటయుఁ బుడమియెల్ల గడగడ వడంకె. అతం డేమిసేయునో యని దేవతలమనంబుల దిగులు దగిలె. అంత సువ్రతనిరతుండును మతిమంతుఁడు నగువసిష్ఠుండు జగంబంతయు బెదరుగదరుటం జూచి రాజుతో 'భూపగా! నీ వాడి తప్పని యిక్ష్వాకుకులంబున జనించినవాఁడవు; మఱి యొకరూపుందాల్చిన సాక్షాద్ధర్మమో యనం దగువాఁడవు; ధృతిమంతుండవు; వ్రతపరాయణుండవు; శ్రీమంతుండవు. ఇట్టి నీకు ధర్మంబు తప్పందగదు. ధర్మాత్ముం డని ముల్లోకంబులను బ్రఖ్యాతి గన్నవాఁడవు. ఆడినమాట తప్పకుండుట నిజధర్మంబు. దాని ననుష్ఠింపుము. అధర్మమును గయికొనరాదు. ఇట్లు చేసెదనని యొప్పుకొని యట్లుసేయనివాఁడు దాను మున్ను చేసిన యశ్వమేధాది యాగంబులను, నిర్మించినవాపీకూపతటాకాదులను, నిష్ఫలములుగాఁ జేసికొనును. కాఁబట్టి రాముని ఋషి కిమ్ము. రాముఁ డస్త్రము కఱచిన నేమి? గఱవకున్న నేమి? కౌశికుం డతనికిఁ గాపై యుండఁగా నగ్నిచక్రంబుచే నావరింపఁబడిన యమృతముంబోలె రాక్షసు లతనిని జెనకఁజాలరు సుమీ. రూపొందిన ధర్మమే యితఁడు. ఇతండు వీర్యవంతులలోన మేలుబంతి. బుద్ధిం జేసి లోకంబునం దతిశయించినవాఁ డితండు.

ఇతఁడు తపంబునకు మేలిమొంకి. కాన యింతటి తపసి మఱియొకఁడు లేఁడు. సచరాచరంబు లగు మూఁడులోకములను గల నానావిధంబు లగు నస్త్రంబుల నన్నియు నీతఁ డెఱుంగు. ఇతం డెఱింగినన్ని యస్త్రంబుల నింతవఱ కెవ్వఁడును దెలిసికొన్న వాఁడుగాఁడు; ఇఁక నెవ్వరును దెలిసికొనను జాలరు. యక్షవీరులును కిన్నరులును నురగులును మఱెవ్వరును నేరరు. పరమధార్మికులైన భృశాశ్వునిపుత్త్రు లస్త్రము లగుదురు. తొల్లి కౌశికుఁడు రాజ్యము సేయుచున్నప్పు డాతనికి భృశాశ్వుం డాయస్త్రము లన్నియు నొసంగినాఁడు. భృశాశ్వునికి దక్ష ప్రజాపతి పుత్త్రిక లిద్దరియం దాపుత్త్రులు పుట్టిరి. వారు నానారూపులను మహా వీర్యవంతు లున్నై మిక్కిలి కాంతిం దేజరిల్లుచు జయంబు లొసంగుదురు. దక్షునికి జయ, సుప్రభ, యని సన్నని కౌఁదీగెలం జెన్నారు కన్నియ లిరువురు గలరు. వారిరువురు మిక్కిలియు వెలుంగునట్టి యస్త్ర శస్త్రంబుల నూటిం గ[illegible]చిరి. వారిలో మొదటజయ, కొలంది యిడరాని మహిమగల వారును గామ రూపులును అదృశ్యాకారులునైన యేటి కుమారుల నేఁబండ్ర నసురసైన్యంబులం జెండాడుట కొఱకుఁ బడసినదయ్యె. పిదప సుప్రభ యెదిరింపను గ్రిందుపఱుపను నలవికాని బలవంతుల నేఁబండ్రుకొడుకులఁ దానును గాంచె. ఆ యస్త్రంబుల నెల్లఁ బూర్ణంబుగ నీకౌశికుం డెఱుఁగు. వాని నేకాదు! ఈ సకలాస్త్రవిదుం డింతకుఁ గని విని యెఱుంగని యస్త్రముల వింతగాఁ బుట్టింపను నెంతయు సమర్థుండు. మహాతేజుండును నపారయశోవిరాజితుండు నగు విశ్వామిత్త్రుని వీర్యం బిట్టిది. కావున రాజేంద్రా! రాముని బంపుటకు సంశయింపవలదు. ఆరాక్షసుల నేకుశికాత్మజుండు దా నొక్కఁడే నిగ్రహింప సమర్థుఁడు సుమా. నీపుత్త్రునికి హితము సేయు కొఱకై నిన్నుఁ జేరి యిట్లు యాచించుచున్నాఁడు గాని' యనియె. వసిష్ఠమహర్షి యిట్లు చెప్పఁగా నారఘువృషభుం డుల్లంబు కలంకి దేఱి పల్లవింప, మోమునఁ దెలివిదొలఁకాఁడ, రామునిపోకకు నియ్యకొని యతనిని విశ్వామిత్త్రునకు నొసంగ మదిం దలచినవాఁ డయ్యె. ఇది యిరువదియొకఁడవ సర్గము.

---

విశ్వాత్రుఁడు రామలక్ష్మణులను దోడ్కొని పోవుట;
బల యుబల యనెడువిద్యల నుపదేశించుట.

వసిష్ఠుఁడు చెప్పినమాటకు దశరథుఁడు సంతసము మొగంబున దొంతరగొన రాముని లక్ష్మణునితోడం బిలువఁ బంచెను. తల్లియుఁ, దండ్రి యగుదశరథుండును, రామునికి మంగళాచారము నిర్వర్తించిరి. పురోహితుఁ డగువసిష్ఠుఁడును మంగళసూక్తముల నతని నభిమంత్రించె. అంత దశరథుండు రామునిగారాబము మీఱ నొదల మూర్కొని మది ముదంబు పొదల నతనిని విశ్వామిత్త్రునకొసఁగె. పద్మపత్త్రాక్షుం డగురాముండు విశ్వామిత్త్రుని జేరె. అపుడు వాయువు

దుమ్ముగొనక యిమ్మయి యింపారుచోఁకుల జల్లగా వీచె. మహాత్ముం డారాముఁ డమ్మునిలలామముతోడఁ బయనంబుగాఁ దొడంగుటయుఁ బువ్వులవానలు మిక్కిలియు నివ్వటిలె, దేవదుందుభులు మ్రోఁగె. దశరథుని శంఖంబులును దుందుభులును ఘోరనఁ జెలంగె. విశ్వామిత్రుండు ముందటఁ బోయె. అతని వెనుక విలుఁ బూని రాముండు చనియె. రాముని వెనుకొని, కాఁకటులు నుదుటఁ దుంపెనలాడ విల్లుదాలిచి లక్ష్మణుండు నడచె. వారిరువురు వేఱువేఱ రెండేసి పొదులం దాల్చి యుంటఁ జేసి మూఁడుదలల సర్పంబులు రెంటింబోలి, వింటినిగేలఁ బూని దశదిశలు వెలిఁగించుచు నభంగరూప వీర్యాదికంబులు సెలంగ మహాత్ముం డగు విశ్వామిత్రుని, నశ్విదేవతలు బ్రహ్మదేవునిం బోలె, వెంబడించి చనిరి. అట్లు వింట్లఁ బూని చక్కఁగా నలంకరించుకొని, యుడుపతోలు హస్తకవచంబును నంగుళీకవచంబును దొడిగి, కత్తులు దాల్చి, మిక్కిలిజిగి దళుకొత్త, నేకందు నొందని యాయన్నదమ్ములు చిన్ని రామలక్ష్మణులు మహాత్ముండగు విశ్వామిత్రుని వెంటఁ బోవుచు, నచింత్య మహిముండగు నీశ్వరుని వెంబడించిన యగ్ని కుమారులగు * స్కందవిశాఖులంబోలె విశేషకాంతిని విలసిల్లినవారైరి. అంత వారొకటియు నర యామడనడచి సరయు దక్షిణతీరముఁ జేరిరి. విశ్వామిత్రుఁడు రఘుకుల తిలకుని 'రామా' యనితీయఁగ పలుకునం బిలచి 'బిడ్డా; జలము తీసికొనుము. కాలాతిక్రమమువలదు. సకలమంత్ర స్వరూపం బైనబలయు నబలయు ననెడివిద్యలం గయికొనుము. వానిని దెలియుటవలన నీకలసటగాని దప్పిగాని కలుగదు. రూపంబును మాఱుపడదు. నిదురించునప్పుడు గాని యేమఱుపాటున గాని నిన్ను రాక్షసులెదిరింపరు. ఆరెంటిని నీవు జపించుచున్న యెడల బాహుబలంబు నందు భూతలంబున నీకెవ్వండు సాటిగలుగఁడు. బాహుబలంబు నందే కాదు. మూఁడులోకంబుల నేగుణంబునను నీకు సమానుండు గలుగఁడు మఱి సౌందర్యంబునను, సామర్థ్యంబునను, సూక్ష్మార్థములఁ గనుఁగొను తెలివిని, గార్యాకార్యముల నిశ్చయించుబుద్ధి యందును, నుత్తర ప్రత్యుత్తరములయందును నీకు సముండు లోకంబున నుండఁడు. పలుమాటలేలని? ఈ రెండు విద్యలను బడసినయెడ నీకుఁ బురుడైన వాఁడెప్పటికిని గలుగఁడు; ఇఁక నెప్పటికిని గలుగఁడు, ఏలన, బలాబల లనెడి యీ రెండు జ్ఞానంబుల కెల్ల మొదలియిక్క. ఈ రెంటిని మార్గమునందుఁ బఠించుచు నడచి నట్టయిన నీకు నాఁకలియు దప్పియుఁ గలుగవు. వీనిని గఱచిన యెడనీకు ససమానంబైన యశంబును జేకుఱు. నివి బ్రహ్మదేవునిచే నిర్మింపఁబడినవి; కావున మహాప్రభావ సంపన్నములైనవి. నీవు మహాకకుత్స్థవంశంబునం బుట్టిన వాఁడవు.

---

* 'తతోఽభవచ్చతుర్మూర్తిః క్షణేన భగవాన్ ప్రభుః । స్కందో విశాఖశ్చాకశ్చ నైగమేశశ్చ పృష్ఠతః' అని భారతమందుఁ గుమారుఁడు నాలుగురూపములుదాల్చినట్లు చెప్పఁబడియుండుట తెలియనది.

ధార్మికుండవు. కావున నిట్టి విద్యల నొసంగుటకు నీవే తగినపాత్రము. నీ యంతటి వాఁడు మఱొకఁడు గలుగఁడు. మున్ను చెప్పఁబడిన సౌభాగ్యాది నానావిధ గుణములన్నియు నీయందు సమందముగా నున్నవి. ఇందులకు సందియము లేదు. అయినను దపంబు పెంపున నివి సంపాదింపఁ బడినవిగావున వీనిని సైత ముప దేశము గొందువేని యివి నీకు బహుఫలంబులు కలిగించును; తామును బెక్కు విధముల లోకమునవిస్తరిల్లు' ననియె. అంత రాముండు జలంబులుగొని యాచ మించి. శుచియై సంతసమునఁ బరమాత్మ ధ్యానసంపన్నుం డగునమ్ముని వరుని వలన నావిద్యల రెంటిని బ్రతిగ్రహించిన వాఁడయ్యె. ఇట్లు రాముండా రెండు విద్యలఁ బడసినవాఁడై, శరత్కాలంబున రేవెలుంగులం దుఱంగలించు భగవం తుండగు సూర్యుండుంబోలె, మహాపరాక్రమ శాలియై తులకించె. పిదప గురువు నకుఁ గావింపఁ దగుపాదసంవాహ నాది పరిచర్యా కార్యంబుల్ విశ్వామిత్రుని కాచరించి తామును ఆ ఋషియు ముగ్వురును నాఁటిరేయి యాసరయూతీరమున మిగుల సుఖంబుగా వసించిరి. అట్లు దశరథ రాజతనూజులు సంగడిగా గడ్డిపఱుపులు పఱచుకొని యొండొరుల ప్రక్కంబరుండి కౌశికుని బుజ్జగింపు పలుకులకు నలరారు చుండ సుఖముగా నా రాత్రి తెల్లవాఱె. ఇది యిరువదిరెండవ సర్గము.

---

## విశ్వామిత్రుఁ డంగ దేశవృత్తాంతము సెప్పుట.

రాత్రి తెల్లవాఱఁగా విశ్వామిత్ర మునీంద్రుండు*పర్ణ శయనంబునఁ బవ్వళించియున్న రామలక్ష్మణులనుజూచి †'కౌసల్యాసుపుత్ర! రామా! తొలుసంజయైనది పురుషశార్దూలా! లెమ్ము; పగటఁ జేయఁదగిన దేవతారాధనకృత్యంబు సేయవలయు'

---

*పూర్వసర్గమున 'గడ్డిపఱుపు' అని చెప్పి, యిచట 'ఆకుపఱ' యనుటవిరోధముగానపూరియు నాకులను రెంటిని గలిపి కావించినపఱుపుగా గ్రహింపఁదగును.

† ఈవాక్యమునకు 'కౌసల్యా సుప్రజా రామ పూర్వా సన్ధ్యాప్రవర్తతే। ఉత్తిష్ఠనరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్' అని మూలము. ఇందుఁ గలయర్థవిశేషములేవి యనఁగా:— విశ్వామిత్రుఁడు రామలక్ష్మణుల నిరువుర వేకువను మేలుకొలుపవచ్చి 'సమయాబోధితః శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః' అన్నట్లు రాముఁడు నిద్రపోవునప్పటియొప్పిదమును జూచి యందు మనంబు దగిలి వచ్చినకార్యంబు మఱచి యితనిఁగన్నకౌసల్య యేమితపంబు సేసెనోయని యబ్బురపడుచున్నాఁడు.—(రామ) సర్వోత్తర సౌందర్యముచే రమింపఁజేయువాఁడా యనుట. (కౌసల్యా) నిన్నుఁగన్న కౌసల్యాదేవి. (సుప్రజాః) నీయట్టిచెలువంపుకొడుకును గన్నందున మంచికొడుకు గలది; లేక, విశ్వామిత్రుఁడు విస్మయపడితనకుఁ దానే చెప్పికొనుచున్నాఁడు:-(కౌసల్యా సుప్రజాః) ఈతనిం గన్నకౌసల్య సుపుత్రునిఁ గన్నట్టిది; లేక, ముని దీనిచే రాముని సంబోధించుచున్నాఁడు;- (కౌసల్యాసుప్రజాః) కౌసల్యాదేవి సుపుత్రుఁడైన, (రామ) రాముఁడా! యని రామశబ్దమునకు విశేషణము. పరశురాముఁడుగాదని తెలుపుటకై కౌసల్యా రాముఁ డనఁబడినది. రాముఁడు కౌస

నని యె. అమ్మునివరుఁడు చెప్పిన పరమగంభీరవాక్యము విని వీరు లారాజకుమారులు జలకమాడి. యర్ఘ్యంబు విడిచి పరమం బగు గాయత్రీ మంత్రంబు జపించి, సంధ్యోపాసనాది ప్రాతఃకాలకరణీయంబులు నిర్వర్తించి తపోధనుం డగు విశ్వామిత్రునకు నమస్కరించి మించుసంతసంబున బయనంబునకుఁ బురికొనిరి. అట్లు చటి నుండి తరలి యామహావీరులు మంగళకరం బగు సరయూసంగమంబు నందు దివ్యంబగు గంగానదిని గాంచి యందుఁ బెక్కువేల సంవత్సరములుగాఁ బెను తపంబు సలుపుచున్న మహాప్రభావభూషితు లగు ఋషులపుణ్యాశ్రమం బొకటిఁ జూచి యేచిన సంతసంబున విశ్వామిత్రునిఁ జూచి 'మహాత్మా! ఈ పుణ్యాశ్రమ మెవరిది? ఇం దెవఁడు వసించు? ఇది మాకు మిక్కిలి కౌతూహలము గలిగించుచున్నది గాన వినఁ గోరెదము చెప్పవే' యని యడిగిరి. మునివరుఁడును వారడి

---

ల్యాదశరథుల కిరువురకును, తపఃఫలముగా నవతరించియుండుటం జేసి దశరథుండును సుపుత్రుని గన్నవాఁడైయుండఁగా 'కౌసల్యాసుప్రజాః' అని కౌసల్యమాత్రము సుపుత్రుఁడు గలదిగాఁ జెప్ప నేలయన 'మాతృదేవో భవ పితృదేవో భవ' అనుచోట ముందట తల్లినే ప్రధానముగాఁ జెప్పుటచేతను 'పితుశ్శతగుణం మాతా' అను స్మృతిం బట్టియు కౌసల్యయే యిట చెప్పఁబడినది. లేక:— విశ్వామిత్రుఁడు 'అహం వేద్మి మహాత్మానం' అని రాముని పరత్వమును దెలిపియు దశరథుఁడు కేవలము పుత్రునిగాఁ దలఁచి పంపనొల్లక వసిష్ఠుఁడు తెలిపిన పిదపఁ బంపినవాఁ డయ్యె. కౌసల్య రాముని యందు మిక్కిలి వాత్సల్యము గలదయ్యు ఆతనిని దోడనే సాదరముగాఁ బంపినదయ్యె, దశరథుని కన్నఁ గౌసల్య కిట్టి యతిశయ ముండుటం బట్టి విశ్వామిత్రుండు మోదమంది కౌసల్యం బేర్కొన్నవాఁడు. మాతృవాక్యపితృవాక్యములు పాలింపఁ దగును అను ధర్మమును లోకంబునఁ బ్రవర్తిల్లఁ జేయుటకై తానే దాని ననుష్ఠించుటం బట్టి రాముఁడు (సుప్రజాః) యనఁబడెను. ఇట్లు ముని రాముని యుత్తర కల్యాణగుణము లందును క్రమముగా మగ్నుఁడగుట మాని మేలుకొలుపుచున్నాఁడు. (రామ) ఈశబ్దముచే నిద్రించునప్పటి యొప్పిదము సూచితము. (పూర్వాసంధ్యా ప్రవర్తతే) పూర్వసంధ్య దివాకరుఁ గన్నట్లు రామ దివాకరుని నిన్నుఁ గౌసల్య గన్నదనుట లేక, ఇట్టికింబోలె పూర్వసంధ్యను నుపచారము సేయుమనుట. లేక, పూర్వసంధ్య జరుగుచున్నది; ఇప్పుడు సూర్యున కిల్లు మందేహాదులైన విరోధుల నిరసించు సమయమో యట్లే నీకును విరోధనిరసనసమయ మయ్యెననుట. లేక, అంధకారము పోయి పూర్వసంధ్య వచ్చినట్లు నాయజ్ఞానాంధకారము పోయి భగవంతుఁడవగు నీ సాక్షాత్కారము గలిగినది; నేఁడు నాకు సుప్రభాతమనుట. (ఉత్తిష్ఠ) లెమ్ము. నీవు నిదురించునప్పటి యొప్పిదమును జూచితిని. ఇఁక మేలుకొన్నప్పటి చెలువమును జూడఁగోరెదననుట. (నరశార్దూల) నీవు పురుషశ్రేష్ఠుఁడవుగావున 'యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః' శ్రేష్ఠుఁ డేదియేది యాచరించునో యితరజనులు నది యదియే యాచరింతు' రన్నట్లు, ఇతరులకు విహితమని తెలియుటకై సంధ్యోపాసనమును నీవు చేయవలయుననుట. ఆశ్రితులయొక్క విరోధులను నిరసించుటయే స్వభావముగాఁ గల పురుషశ్రేష్ఠునకి నీకు నిదురించుటకును దీక్ష గలదా యనుట. లేక, నా యజ్ఞము నిర్వహింపఁ జాలువాఁడవాయనుట. లేచుటకు ప్రయోజనమేమనఁగాఁ జెప్పుచున్నాఁడు:— (కర్తవ్యం దైవమాహ్నికమ్) దేవునిచే విహితమైన నిత్యకర్మమును జేయవలయును. లేక, దేవర యాజ్ఞారూపమైన కర్మమును నేను జేయవలయును. దానిని నీవు స్వీకరింపు మనియు నర్థము.

గిన మాటసొంపునకు నవ్వి యిట్లనియె. 'రామా! ఇది మున్నెవరి యాశ్రమమో చెప్పెద వినుము. కాముఁ డని పండితులాడు *(కందర్పుఁడు) మన్మథుఁడు ముం దాకారము గలవాఁడై యుండె. ఆదుష్టుఁడు, మహాత్ముం డగుశివుఁడు పార్వతిం బెండ్లియాడం గలవాఁడై మొడతెగని నియమంబున సమాధి నొంది తపంబు సలుపుచు నియ్యాశ్రమంబునకు దేవతలతోడఁ గూడి రాఁగా, నవు డాతని మార్కొనియె. ఆదేవుండును వానిని హుంకారమున నిరాకరించె. ఆముక్కంటి కంటిమంటను మాఁడినయాపలుగాకి మొదలినుండి వీడి యావయవము లన్నియు విశీర్ణములైనవి. అట్లమహాత్ముండు వానిని నీఱు గావింపఁగా వాని దేహంబును రూపఱె. పరమేశ్వరుని పెనుకోపంబువలనఁ గానుం డీతని శరీరము లేనివాఁడై యది మొదలుగా ననంగుఁ డని నలుగడల పేరు వడిసిన వాఁడయ్యె. వాఁ డిచ్చట నంగములు విడిచెనో యీదేశ మంగదేశమని పేరు గాంచి సిరుల వహించె. ఆస్థాణుని యాశ్రమం బిది. ఇం దున్నయీమునులు తొల్లింటినుండి క్రమముగా నాతనిశిష్యులై యున్నవారు. కావున వీ రెప్పుడును ధర్మపరాయణులై పాపం బేమియు నొందకయుందురు. శుభదర్శనా! ఈరాత్రి యంగదేశంబున నీపుణ్యనదులనడుమ వసించి రేపు గంగానదిని దాఁటుదము. ఇఁక స్నానంబు చేసి జపంబులు సలిపి హవ్యంబులను వేల్చి పరిశుద్ధులమై పోల్చుచు నాయాశ్రమంబున కంటకమును బోవుదము' ఇట్లు వారు మాటాడుకొనుచుండఁగా నందలిమునులు తపోమహిమచే దవ్వులం గనుఁగొని తమజ్ఞానదృష్టిం జేసి, వారిని వారిరాకకుఁ గారణము నెఱింగి యెంతయుసంతసిల్లి మేనం బులక లొత్తఁగాధిసత్తమునకు నర్ఘ్యపాద్యంబులు నాచమనీయంబు నొసంగి కందమూలాదు లారగింపనిచ్చి పిదప రామలక్ష్మణులకు నతిథిపూజలు గావించిరి. విశ్వామిత్రుండును వారికుశలంబు లడిగె. వారును దమయతిథుల నమ్మువ్వుర నానావిధకథల రంజిల్లఁ జేయుచుండిరి. అంతమలుసంజ కెంజాయ చూపట్టఁగా విశ్వామిత్రుఁ డాదిగాఁ గలఋషులును రామలక్ష్మణులు నేకాగ్రచిత్తులై తమతమకొలఁదిని సందె వార్చి గాయత్రి జపించిరి. అంత నందు వసించు సువ్రతులగు తాపసులు తమ్ముఁ దోడుకొనిపోవఁగా వారు కాముండు దహింపఁబడుటం జేసి కామాశ్రమమని పేరుగలయాస్థలమునకుఁ జని యపు డందు సుఖంబుగా వసించిరి. ధర్మాత్ముఁడును మునితిలకుఁడు నగువిశ్వామిత్రుఁడు ఆయాశ్రమమహిమను గుఱించి రమణీయములగు కథలను జెప్పుచు నా చెలువపురాజకుమారుల నలరించినవాఁడయ్యె. ఇది యిరువదియూఁడవ సర్గము.

---

* 'కందర్పః' అనఁగా కుత్సిత మైనదర్పము. ఇది మున్ను ఆకారముగలిగియుండె దానినే పండితులు కాముఁడని చెప్పెదరు, అని వ్యాఖ్యానాంతరము.

మలదకరూశదేశములవృత్తాంతము. తాటకావనమునకుఁ బోవుట.

అంతఁ దెలతెలవాఱఁగా నాయరిందములు తత్కాలకరణీయములు నిర్వర్తించి విశ్వామిత్రపురస్సరముగా గంగాతీరమున కరిగిరి; అం దున్న మునులు వాఁడి నియమంబులఁ బోఁడిమిగన్న మహనీయులు. వార లందఱును శుభంబగు నొకయోడను దెప్పించి విశ్వామిత్రునిఁజూచి 'రాజపుత్రులను దోడ్కొని నీవీయోడ నెక్కి శుభముగా వారిని పయనముగమ్ము. కాలవిలంబము వల' దనిరి. 'వల్లె' యని విశ్వామిత్రుఁడును వారిని బూజించి రాజసుతులతోడ సముద్రగామిని యగు నానదిని దాఁటుచుఁ దజ్జలంబులనడిమికిఁ బోవఁగా నయ్యెడ, అలలొండొంటిని బిట్టుగా మోఁదెడియురవడిచేఁ బెచ్చుపెరుఁగుచున్న పెనుచప్పుడును రాముఁడు నతనితమ్ముఁడును వినిరి. రాముఁడు మునివరుని జూచి 'మహాత్మా! ఇయ్యేటినడుమ జలము లొండొంటితో బిట్టుగా మోఁదుటచేఁ బుట్టినదా యేమి యీపెనుచప్పు' డని యడుగఁగా నందులకు విశ్వామిత్రుఁడును కుతూహల మంది యాశబ్దమునకుఁ గారణం బిది యని నిశ్చయించి చెప్పఁబూని 'రఘుకులతిలకా! కైలాసపర్వతమున బ్రహ్మదేవుఁడు తనమనస్సుచే నొకసరస్సు నిర్మించెను. కావున నది మానససరస్సు నాఁబడు. ఆసరస్సునుండి స్రవించి యాసరయూనది అయోధ్యాపురంబు * నావరించి ప్రవహించుచున్నది. ఆబ్రహ్మసరస్సునుండి యది వచ్చినదగుటం జేసి సరయువు నాఁబడియె. గంగానది నెదిరి పఱతెంచునా సరయూజలంబులకలగుండుచేఁ గలిగిన దీపెనుచప్పుడు. కాన నియతచిత్తుండవై వీనికి నమస్కరింపు' మనియె. ఆధార్మికు లిరువురు నారెండునదులకుఁ బ్రణమిల్లి గంగానది దక్షిణతీరంబు సేరి యవ్వలఁ జులుకసినడల నడచిపోయి యచ్చట ఘోరముగాఁ బొడతెంచుచున్న వనంబును నిర్జనం బైనదానిని జూచి మునితోడ 'ఓరా! చొరరాని యీవనం బేమి! నలుగడల నీలపురుగులు గీపెట్టుచున్నవి. బెట్టిదము లైన క్రూరమృగంబు లంతటఁ దిరుగాడుచున్నవి. శకుంతంబులును మఱియు నానావిధపక్షిసంతతులును బిట్టుగాఁ గూయుచున్నవి. సింహశార్దూలవరాహంబులభయంకరశబ్దంబులు వినఁబడుచున్నవి. గజంబులు నందందఁ గ్రాలుచున్నవి. ఇనుమద్దిచెట్లును చంద్రచెట్లును పఱుమద్దులును బిల్వచెట్లును దుమ్మికులును కలిగొట్టుచెట్లును గంగరేఁగులును క్రిక్కిఱిసియున్నవి. ఈదారుణవన మెవరిది? యనియడుగఁగా మహాతేజం డగు నమ్ముని పుంగవుండు 'వత్సా! కాకుత్స్థకులతిలకా! ఈదారుణవన మేప్రాణిదో

* సరయువు బ్రహ్మనిర్మితం బైనమానససరస్సునఁ బుట్టి అయోధ్యపడమటిభాగంబునఁ బాఱి, దాని యుత్తరపుదిక్కును జుట్టుకొని తూర్పుప్రక్కకు వచ్చి యచ్చట అంగదేశమునందు గంగతో సంగమించుచున్నది. ఆరెండునదులు గలియుచోట స్థాణ్వాశ్రమమున్నది. కాఁబట్టి సరయువుతోఁ గూడిన గంగానదిని దాఁటునపుడు సరయూజలము లెత్తుగుటచే గంగయందుఁ బాఱుతెంచి పడఁగా ఆశబ్దము పుట్టినదని తెలియనది.

చెప్పెదవినుము- తొల్లి యిది దేవనిర్మితంబులై దేవలోకసదృశములును ధనధాన్యసమృద్ధములు నగుమలదకరూశము లను రెండు దేశములుగా నుండినవి. మున్నింద్రుఁడు వృత్రాసురుని వధింపఁగా దోడనే యానేయుగన్నులప్రోడను బ్రహ్మహత్య యావేశించె; కనుక నాతని కశుచిత్వంబును నాఁకలియు మిక్కిలి పయికొనియె. దేవతలును దపోధను లగుఋషులును, ఆయింద్రుని గంగాదిపుణ్యతీర్థంబుల నభిషేకించి పిదప మంత్రపూతంబు లగుకలశజలంబుల స్నాతునిఁ గావించి యశుచిత్వమును ఆఁకలిని విడిపించి యింద్రశరీరజనితంబు లైనయామలంబును గారూశంబును నీదేశంబుననుంచి యంతిసంతసించినవారైరి. ఇంద్రుఁడును మలదకరూశములు విడిచి తాను బరిశుద్ధుండు కాఁగా మిగులసంతసించి యాదేశంబులను ద్దేశించి 'నా దేహముమలంబును గరూశమును దాల్చుటం జేసి యీజనపదములు ధనధాన్యసమృద్ధి నభివృద్ధి నొంది మద్దేహ మలమును ఖండించుటం జేసి మలదంబనియు, నాకరూశమును గ్రహించుటంబట్టి కరూశమనియు జగంబునఁ బ్రసిద్ధినిగాంచఁ గల' వని యనుత్తమం బగువరం బొసంగె. ఆధీమంతుం డాదేశంబుల నట్లు పూజించుటఁ గని దేవతలు 'బాగు బా'గని యాతనిఁ గొనియాడిరి. ఈ కారణమునుబట్టి యీ మలదకరూశ దేశంబులు పెద్దయుంగాలము ధనధాన్యసమృద్ధిని బెంపు సొంపారి యుండె. అంతఁ గొంతకాలమునకుఁ దాటకయను పేరుగల యొక యక్షకాంత కలిగినది. అది పుట్టుకతోడనే వేయియేనుంగుల కడిందిబలము గలదై కామరూపిణిగా నుండెను. దానివలన నీకు భయంబేమియుఁ గలుగకుండుఁ గాక. దానిని ధీమంతుం డగుసుందుండు పెండ్లియాడెను దానికిఁ బరాక్రమంబున శక్రునిఁ బోలుమారీచుం డనురక్కసుఁడు పుట్టె. వాఁడు వట్రువలగు బుజములు నజయ్యమగువీర్యమును గలిగి వెడంద మొగముతోడను పెనుశరీరంబుతోడను భయంకరాకారుండై పొడసూపుచు నెప్పుడుఁ బ్రజలను దిగులుపాలు సేయుచున్నాఁడు. దుష్టచారిణి యగుతాటకయు నీమలదకరూశదేశంబుల నెప్పుడునాశము సేయుచున్నది. అది యిట యొకటియునఅయామడదూరంబున మార్గము నడ్డగించి కాపున్నది. అది యున్నవనంబునకుఁ బోవుమార్గముననే మనము పోవలయు. నీవు నిజబాహుబలమును బూని యీదుష్టతాటకను జంపుము. అట్లు చంపి నాపంపున నీదేశంబును మరల నెప్పటివలె నిష్కంటకము గావింపుము. ఈదేశ మిట్టిపుణ్యక్షేత్రమయినను ఎవ్వరికిని జిక్కనియాయక్షిణి దీనిని ఆవరించినిర్జనము గావించుటచే నెవ్వరు నిచటికి రానోపరైరి. ఈవనం బెట్లు భయంకరమయ్యెనో, ఏవిధమున నిర్జనము గావింపఁబడినదో. ఏల యిప్పటికిని నా చొప్పుననే యున్నదో, యావృత్తాంతమంతయు నీకు సాంతముగాఁ జెప్పితి' ననియె. ఇది యిరువదినాల్గవ సర్గము.

---

## తాటకావృత్తాంతము.

అప్రమేయప్రభావుఁ డైన యమ్మునిసత్తముని యుత్తమవాక్యంబు విని పురుషలలాముండగు రాముండు 'మునీంద్రా! యక్షు లల్పవీర్యులని వినంబడు. అట్టి వారిలో నొకయబలయైనది వేయిగజములబలము గలిగియుండుట యెట్లు? వినిపింపవే' యనఁగా విశ్వామిత్రుఁ డిట్లనియె 'ఒకయబల యగుతాటకకు నింత మేటి బలము గలుగుటకుఁ గారణంబు వినుము. దానికి వరదానమున బలము గలిగినది. కాఁబట్టి యబలయైనను బలవంతురాలై యున్నది. తొల్లి పరాక్రమశాలి యగు సుకేతుండను గొప్ప యక్షుం డొకఁ డుండెను. అతఁడు సదాచారసంపన్నుఁడయ్యు సంతానహీనుఁ డగుటంజేసి సంతతిని బడయుటకై పెనుతపము గావించె. అప్పుడు పితామహుఁడు కడుం బ్రీతుండై యాయక్షపతికిఁ దాటక యను మేటికూఁతు నొసంగి, యాకన్నియకు, వేయింటియేనుంగులబలంబును నిచ్చెను; కాని యమ్మహాయశుని కొకకొడుకును గృపసేసినవాఁడు గాఁడయ్యె. అట్లు పుట్టి పెరుఁగుచు నానాఁట రూపును నెలపరువంబును మీఱుచున్న యాకన్నియను నాయక్షులమిన్న ఝర్ఝనందనుం డగు సుందునికిఁ బొగడొందు నిల్లాలుగా నిచ్చి పెండ్లి గావించె. అంతఁ గొంతకాలంబున కాయక్షకాంత యప్రతిముం డగుమారీచుం డనుపుత్త్రుం గాంచె వాఁడు శాపమువలన రాక్షసుఁడయ్యె. శాపహేతువు వినుము. సుందుఁ డగస్త్యునిచేఁ జావఁగా నాతాటక కొడుకుంగూడి యాఋషిని మాఱుకొని చంపం దలఁచి యురవడిఁగొని గర్జిల్లుచు నమ్మునిపుంగవుని మ్రింగఁ బాఱుతెంచె. అట్లు పఱతెంచుచున్న దానిని భగవంతుఁ డగస్త్యుఁడు సూచి దానికుమారుని మారీచుని 'రాక్షసుండవుగ' మ్మని శపించి మఱియుఁ గోపంబు దీపింపఁ దాటకతో 'ఓసీ! ఈరూపము విడిచి మనుష్యులను భక్షించుదానవై వికార మగురూపమును మొగమును గలిగియుండుము. ఇఁక నీకుఁ గ్రూరంబగుశరీరము గలుగుఁగాక' యని శపియించె. తాటకయు నాశాపమునకు సైఁపక క్రోధంబు పెల్లున మూర్ఛిల్లుచు నప్పు డగస్త్యుఁడు చరించుచుండిన యీరమణీయదేశమును నిర్జనముగాఁ బాడుసేయుచున్నది. దుర్మార్గపునడవడిని మెలంగుచు నీయక్షిణి మిక్కిలియుం గ్రూరయై పరాక్రమంబున లోకంబునకుఁ జెట్టసేయుచున్న కట్టిఁడిగావున గోబ్రాహ్మణహితంబుకొఱకు దీని నుఱుమాడుము. శాపంబు సోఁకియున్న యీపలుగాకిని ముల్లోకములందు నీవు దప్ప మఱియెవఁడును జంపం దెంపుసేయఁడు. రఘుకుల ప్రసూతుఁడ వగునీవ యిందులకుఁ దగుదువు. ఆఁడుదానిని జంపుట యెట్లని యసహ్యపడఁదగదు సుమీ. నీవు పురుషరత్నంబవు. అందును రాచపట్టివి. చతుర్వర్ణములహితము కొఱకు వలయుకార్యము రాజసూనునకుఁ గర్తవ్యము. ప్రజారక్షణముకొఱకైన కర్మం, బది క్రూరముగానీ యక్రూరముగానీ, పాతకముగానీ దానివలన నపవాదము గలుగనీ, ప్రజలం గాచు రాచ

పట్టి దానినిజేసియే తీఱవలయు. రాజ్యభారముఁ బూనినవారి కిది సనాతన ధర్మము. అధర్మపరాయణ యగునీయక్షిణిని జంపుము. కకుత్స్థకులజు లధార్మికులఁ జంపుదురు. దీనియందు ధర్మమే కానిపింపదు. కాన నీకుఁ జంపఁదగు. దుష్టాత్మ లగుస్త్రీలనైనను జంపుట శిష్టాచారసిద్ధమే కాని మత్కల్పితముగాదు. తొల్లి పుడమినెల్లఁ బాధసేయం బూనినమంథర యనుదానిని విరోచనుకూఁతును నింద్రుండు చంపుట వినఁబడుచున్నదే కదా. మఱి భృగుపత్ని యైనశుక్రునితల్లి తొల్లి జగంబున నింద్రుని లేకుండఁ జేయుదునని కడిందిపూనికిం బూనఁగా దానిని విష్ణుండుచంపె ననుటయుఁ బ్రసిద్ధము. రాజకుమారా! వీరేకాదు. మఱియు మహాత్ములు పెక్కండ్రచేత, అధర్మపరాయణలైనరమణులు చంపఁబడిరి. ఇది యిరువదియైదవసర్గము.

---

## రాముఁడు తాటకను జంపుట.

విశ్వామిత్రుఁ డఘనంతముగాఁ జెప్పిన యాదిట్టంపుమాట విని దృఢవ్రతుండును రఘుకులాలంకార భూతుఁడు నగురాముఁడు చేతులు మోడ్చి తనలో 'కౌశికుండు' చెప్పినట్లు చేయవలయునని తండ్రి నాకుఁ జేసినయాజ్ఞవలనను, ఆయాజ్ఞయందలి గౌరవమువలనను, భగవంతుఁడగు విశ్వామిత్రుఁడు చెప్పుటవలనను, ఏశంకయు లేక యిది నాకుఁ జేయఁదగినది' యని యెంచి విశ్వామిత్రుని జూచి 'మునీంద్రా! అయోధ్యాపురంబున మహాత్ముఁ డగునాతండ్రి దశరథుఁడు విశ్వామిత్రుండు చెప్పినట్లు చేయువలయునని నాకానతిచ్చెను. నా కాతనిమాట జవదాఁట రాదుగదా. తండ్రి చెప్పినమాట వినియున్నాఁడ. మఱి పితృవాక్యపరిపాలనవ్రతుండ. అందును బ్రహ్మవాది యగు విశ్వామిత్రులయాజ్ఞ. దీనింబట్టి తాటకావధము నాకుత్తమంబైనది గావునఁ గావించెద. ఇందులకు సందేహము లేదు. మఱి గోబ్రాహ్మణహితముకొఱకును, ఈదేశము సుఖముకొఱకును, మహానుభావుం డగు నీయాజ్ఞను జేయఁబూనితిని' అనియె. ఇట్లు చెప్పి పగతుఱ వడఁకించు నావాఁడి మగఁడు వింటినడుమును బిడికిలించి దిక్కులు మాఱు మ్రోఁగు నట్లు నారిమొరయించి టంకారము గావించె. ఆశబ్దము విని తాటకావనమున నున్నవారందఱు వెఱపు నొందిరి. తాటక సహజముగా నత్యంతకోపాత్మురాలు; మఱి యా మ్రోఁత విని, యది యేమియుఁ జేయుటకుఁ దోఁపక తత్తఱపడి యాలోచించి కోపంబు వెల్లున మూర్ఛిల్లుచు నాశబ్ద మేదిక్కుననుండి వచ్చెనని విని యాదిక్కునకు వేగపాఱుతెంచె. వికార మగునాకారమును మొగమును గలిగి మిక్కిలియుం బొడువుగాఁ బెరిఁగియున్న యా తాటక మిక్కిలికోపముతోఁ బాఱుతెంచుటఁ జూచి రాముఁడు తమ్మునితో 'లక్ష్మణా! మిగుల వికృతమై చూచువారికి దిగులుగొలుపునట్టి యీయక్షిణిశరీరంబును జూడుము. దీనిని పిఱికివారు

చూచిరేని వారిహృదయంబులు పఱియలగును. దీనిని మాఱ్కొనుట మిక్కిలి కడిఁది. ఇది మాయాబలమును గలది. దీనిని ముక్కును జెవులును గోసి మరలి పాఱి పోవం జేసెద. ఇంతియ చాలును. దీన నే గురువచనముఁ దీర్చుటయుఁ గలుగును. కాని యాఁడుది యనుటం జేసి కావఁదగినదియు నగుం గావునఁ దెంపు సేసి చంపుటకు నామనం బొల్లకున్నది. కనుకఁ జేతులును గాళ్లును గోసి దీనిపరాక్రమమును గతియు రూపుమాపుద మని నాకుఁ దోఁచిన' దనియె. రాముఁ డిట్లు పలుకుచుండఁగాఁ దాటకయుఁ గ్రోధమూర్ఛితయై చేతు లెత్తుకొని గర్జిలుచు లక్ష్మణునిమాని రామునిపైకి నుఱికెను. బ్రహ్మర్షి యగు విశ్వామిత్రుఁడు రాముఁ డతిమానుషశక్తియుక్తుం డని యెఱింగియు, ఆజఅభిక్రార్యాతిశయమును జూచి యొక్కింత కొంకి దానిని హుంకారమునన దల్చి 'రామలక్ష్మణులకు శుభంబగుత; జయము గలుగుఁగాక' యని దీవించె. తాటకయుఁ బెంధూళిని ఘోరముగా నగఁజల్లుచు, దానిచేఁ బెనుఁజీఁకటి గావించి కొంతతడవు రామలక్ష్మణులనిరువుర సొమ్మసిల్లఁ జేసి పిదప మాయవన్ని మఱుంగుపడి ఱాలను బెనుజడిగా వారిపయిం గురియించె. రాఘవుఁడును గ్రుద్ధుఁడై శరవర్షమునఁ దదీయభూరిశిలావర్షమును బ్రతిహతముఁగావించి మీఁదు మిక్కిలి ఱాలు గురియకుండునట్లు, పాఱుతెంచు నాదుష్టాత్మురాలికరములను నఱికినవాఁ డయ్యె. అంత నది చేతులు లేక మిగుల శ్రమ మొంది సమీపంబున నిలుచుండఁగా దానిచెవులును ముక్కును లక్ష్మణుఁడు గోపంబు దీపింపఁ గోసివైచె. అది కామరూపిణి గావున తోడనె 'నానావిధరూపములు గొని మాయఁబన్ని యంతర్హితయై ఘోరముగా శిలావర్షము గురియుచు మోహంబు గొలుపునటుల చరించుచుండె. అంత సలుగడల రాలవానం దొప్పఁదోఁగుచున్న యాఁకొమరులఁ జూచి గాధికుమారుఁడు, తాటకను జాపించుసొంపు గళుకొత్తవారతో రామా! దయ చాలుఁ జాలు, ఆఁడుదియనియా? ఆఁడుదియయ్యు నిది కడిందిపాపాత్మురాలు సుమీ. ఇఁక సైఁచిన దుడుకునడతలు సూపును. ఱాలు గురియించి మనల ముంచును. ఇది యాగంబులను జెఱుపునది. ఇఁక ముందు ప్రొద్దుగ్రుంకు నేని దీని మాయ పెచ్చు పెరుఁగునుజుమీ. ఇదె ముందు సందె రానున్నది. ఇంతలో దీనినంతమునొందింపుము. రక్కసులను సందెవేళల నెదురించుటకష్టముగదా యనియె. ఇట్లు చెప్పఁగా రాముఁడును, అంతర్హితయై శిలావర్షము గురియించుచున్న యాయక్షిణిశబ్దంబు వలన నది యున్నదిక్కునెఱింగి దానిని వేధింపఁ జాలుబలిమిని బ్రకటించుచు బాణంబుల దాని నరికట్టఁగా, అది మాయాబలమున నంతర్ధానమునొందె. అయినను శరజాలంబు నలుగడలం గ్రిక్కిఱియుటం జేసి యది తనయంతర్ధానము వ్యర్థము కాఁగా దానిని విడిచి బయలుపడి బిట్టుగా నార్చుచు రామలక్ష్మణులపయిని బాఱుతెంచెను. ఇట్లు విక్రమించి పిడుగుంబోలెఁ గడువడి వచ్చుచున్న దానిరాముఁ డొకవాఁడియమ్మును ఱొమ్మునందు నాటఁగా నది నేలంగూలి యుసురు విడిచె. భీకర

మూర్తి యగునాతాటక గీటడంగుటకు వేలుపులమేటి యింద్రుండును దక్కినవేలుపులును జూచి 'బాగు బా' గని కాకుత్థ్సకులుని గొనియాడిరి. వేయిగన్నులఱవరయగు నాతెఱగంటిదొరయు దేవతలును మిక్కిలి సంతసిల్లి విశ్వామిత్రుని జూచి 'మునీంద్రా! కుశికకులతిలకా! నీకు శుభం బగుఁగాత. ఇంద్రుఁడు తోడఁగాఁ గల దేవతల మందఱమును నీకర్మమునకు సంతుష్టుల మైతిమి. రామునియెడ నెయ్యమును ననుగ్రహమును నెఱపుము. ప్రజాపతి యగుభృశాశ్వునకుఁ బుట్టి యత్యూర్జితపరాక్రమంబులగు నస్త్రంబులను దపోబలంబున నీవార్జించితివి. వాని నీతనికిఁక జెప్పుము. ఏలననితండు నియతంబుగా నిను వెంటనంటి నీకు శుశ్రూషఁ జేయుటయందు స్థిరముగా బుద్ధిగలిగియున్నవాఁడు గాన నీకెంతయుఁ బాత్రుండు. మఱియు నీరాజకుమారుఁడు సురలకుఁగాను గొప్పకార్య మొకటి గావింపవలసియు నున్నది' యనిరి. ఇట్లుచెప్పి దేవతలందఱును విశ్వామిత్రుని బూజించి యతిముదంబునఁ దమ వచ్చినదారిం బోయిరి. అంత సంధ్యాసమయ మయ్యె. పిదప మునివరుఁడును దాటక గీటడంగుటకు నెంతయు సంతసిల్లి ప్రీతి గడలుకొన రామునియాదల మూర్కొని 'రామా! నాకన్నులపండువా! నేఁటిరాత్రిమన మీయెడ నుండి రేపువేకువను మదీయాశ్రమంబునకుఁ బోద' మనఁగా రాముఁడు నమ్మాటకు ముదంబంది యా రాత్రి తాటకావనముననే సుఖముగా నుండిరి. ఆదినమునం దప్పుడే యావనమును ఉపద్రవము తెల్లవీడి కుబేరునియుద్యానవనం బగుచైత్రరథంబునుంబోలెఁ బొలుపారుచుండె. రాముఁ డిటు లాతాటకిను జంపి సురసిద్ధసమూహంబులు పొగడ మునితోడ నావనంబున నుండె. తెలతెలవాఱుటయు మునియు నాతని మేలుకొలిపినవాఁ డయ్యె. ఇది యిఱువదియాఱవసర్గము.

---

## విశ్వామిత్రుఁడు రామునకు నస్త్రముల నిచ్చుట.

మహాయశుం డగువిశ్వామిత్రుం డారాత్రియంతయు నచటఁ గడపి యంత రామునిఁ జూచి చిఱునగవు చిగురొత్త నింపారుమెత్తనిపలుకులతో 'రాజకుమారా! నాకెంతయు సంతసం బైనది. నీకు శుభంబయ్యెడు. కీర్తినిధి వగునీకుఁ బరమప్రీతుండనై నకిలాస్త్రంబుల నొసంగెద. దేవాసురనికరములనుగానిగంధర్వులనుగాని యురగులను గాని మఱి యేపగవారినేని బలిమితోడ బవరంబున లోఁ బఱచి గెలుపు నొడఁగూర్పఁ జాలుదివ్యాస్త్రంబులనన్నింటి నిచ్చెద. నీకు మంగళం బగు. దివ్యం బగునొక పెద్దదండచక్రము నిచ్చెద. నీవీరత్వమునకును పెనుబుజంబులకును దగుధర్మచక్రంబును, గాలచక్రంబును, నత్యుగ్రం బగువిష్ణుచక్రంబును, ఇంద్రాస్త్రంబును, వజ్రాస్త్రంబును, శైవం బగుమేలిశూలంబును, బ్రహ్మశిరోస్త్రంబును, ఐషికంబును, నిరుపమం బగుబ్రహ్మాస్త్రంబు నొసంగెద. నృపకుమారా!

ఇంతియకాదు, మోదకి శిఖరి యనెడిగదలు మిక్కిలి ప్రకాశించుచు నాకడ నున్నవి. ఆరెంటిని నిచ్చెద. మఱియు ధర్మపాశమును, కాలపాశమును, వరుణపాశమును, నిరుపమాన మగువారుణాస్త్రమును నిచ్చెద. శుష్కాశనిని, ఆర్ద్రాశనిని, పైనాకాస్త్రమును, నారాయణాస్త్రమును, అగ్నిదేవునకుఁ బ్రియం బైన శిఖరం బనునాగ్నేయాస్త్రమును, ప్రథనం బనియెడు వాయవ్యాస్త్రమును, హయశిరోస్త్రమును, క్రౌంచాస్త్రమును, విష్ణుశక్తి రుద్రశక్తులనెడిశక్తిద్వయమును మఱియు నసురులు దాల్చుకంకాళము కాపాలము కింకిణము మొదలగు వెడిదంపుముసలములును, విద్యాధర దేవతాకం బైన నందనం బనుమహాస్త్రమును, గంధర్వప్రియములైన మానవ ప్రస్వాపన ప్రశమనంబు లనియెడిగాంధర్వాస్త్రములును, సౌరాస్త్రమును నిచ్చెద. దర్పణము, శోషణము, సంతాపనము, విలాపనము లను నస్త్రములును, మన్మథునకుం బ్రియంబై సహింపరాని మదనాస్త్రమును, పిశాచప్రియంబై పిశాచదేవతాకం బైన మోహనాస్త్రమును మహాయశుండగు పురుషశార్దూలునకు నీకు నిచ్చెదఁ గయికొనుము. ఇంతేకాక తామసము, సౌమనసము, సంవర్తము, దుర్ధర్ష మగుమౌసలము, సత్యము, మహామూరము, శత్రుతేజోనిరాసకమును ఘోరము నగు తేజఃప్రభమును, శిశిరం బనుసౌమ్యాస్త్రంబును, త్వష్ట్రదేవతాకం బైన సుదామనాస్త్రమును, శితేషునామకమును దారుణము నగుభగాస్త్రమును, మానవమును మొదలుగాఁ గామరూపములును మహాబలయుతములును నత్యుదారములు నైనయీయస్త్రముల శీఘ్రంబ పరిగ్రహింపుము. మహాభాగసంపన్నుం డగురాజకుమారునకు నీ కివిదగు' ననియె. ఇట్లు చెప్పి యమ్మునివరుండు శుచియై తూర్పుదిక్కు మొగంబై నిలిచి, యప్పుడు మిక్కిలియుఁ బ్రీతి యొప్ప నుత్తమంబు లగు* నాయస్త్రమంత్రముల నన్నిటిని రామున కుపదేశించె. ఆయస్త్రముల నన్నింటిని దెలియుట దేవతలకు నేని దరము కాదు. అట్టి వాని నావిప్రవరుఁ డపుడు రామునకుఁ జెప్పినవాఁ డయ్యె. ఇట్లస్త్రమంత్రముల నొసంగి మంత్రదేవతలను రామునికి వశము గావింపఁ గోరి ధీరుఁ డావిశ్వామిత్రుఁడు వానిని దలఁచి జపింపఁగాఁ, దదాజ్ఞం జేసి మహార్హంబు లైన యాయస్త్రము లన్నియు నపుడు ప్రభామయ శరీరంబులు గ్రాల నిలిచి రాముని గొలిచి ముదంబునఁ గేలు మొగిచి యావీరుం జూచి 'రఘుకులతిలకా! పరమోదారుల మగుమేము నీకుఁ గింకరుల మైతి' మనిరి. రాముఁడును వానిసేవం బ్రతిగ్రహించి హస్తంబున స్పృశించి 'నామనంబు ననువర్తించి యుండుఁ' డని యాజ్ఞాపించె. అంత నారాముండు మిక్కిలి తేజంబు దీపించుచు నతిప్రీతిని విశ్వామిత్ర మహర్షికి నమస్కరించి పయనంబు కాఁదొడంగె. ఇది యిరువదియేడవ సర్గము.

---

* అస్త్రము లిచ్చుటయనఁగా అస్త్రమంత్రము లిచ్చుటయని భావము. అస్త్రంబులయధిదేవతలు భృశాశ్వనిపుత్రులు గాన వారినిబట్టి యస్త్రంబులును భృశాశ్వని పుత్రులుగాఁ జెప్పఁబడియె.

## విశ్వామిత్రుఁడు రామున కుపసంహారమంత్రము లుపదేశించుట

అంత రాముఁ డస్త్రములను బ్రతిగ్రహించి శుచియై మొగంబున సొంపు పెంపారఁ బయనంబు గాఁబూని విశ్వామిత్రుని జూచి 'మునీంద్రా! నే నస్త్రంబులఁ గయికొన్నవాఁడ నగుటంజేసి దేవతలకును మార్కొనరాని వాఁడనైతి. అస్త్రముల ప్రయోగముమాత్ర ముపదేశించితిరి. ఇప్పుడు వాని యుపసంహారమును నాకుపదేశింపఁ గోరెద' ననఁగా సువ్రతుం డగునమ్మునివరుండును బ్రీతిం బొంది శుచియై రామున కుపసంహార మంత్రములఁ జెప్పఁబూని 'రామా; సత్యవంతము, సత్యకీర్తి, ధృష్టము, రభసము, ప్రతిహారతరము, పరాఙ్ముఖ, మవాఙ్ముఖము, లక్ష్యాక్షము, విషమము, దృఢనాభము, సునాభము, దశాక్షము, శతవక్త్రము, దశశీర్షము, శతోదరము, పద్మనాభము, మహానాభము, దుందునాభము, సునాభకము, జ్యోతిషము, కృశనము, నైరాశ్యము, విమలము, యోగంధరము, హరిద్రము, దైత్యము, ప్రశమనము,(శుచి, బాహువు, మహాబాహువు, నిష్కలి, విరుచి.) సార్చిమాలి, ధృతి, మాలి, వృత్తిమంతము, రుచిరయు, పితృసౌమనసము, విధూతము, మకరము. కరవీరకరము, ధనము, ధాన్యము, కామరూపము, కామరుచి, మోహ, మావరణము, జృంభకము, సర్వనాభము, సంతానము, వరణము ననెడియుప సంహారములఁ గామరూపులును భాస్వరులు నగుభృశాశ్వ కుమారులను నావలనఁ బ్రతిగ్రహింపుము, నీకు మంగళ మగుఁగాత, నాకెంతయు నీవు పాత్రుండ' వనియె. 'వల్లె' యని రాముండును నుల్లంబు పల్లవింప నామంత్ర సమూహంబులఁ బ్రతిగ్రహించె. అవియు నారాఘవుని గొలిచినిలిచె. అవి మెఱుంగులు దుఱుంగలించుచు దివ్య దేహంబులు దాల్చి మూర్తిమంతములై సుఖప్రదములుగా నుండినవి. అందుఁ గొంద ఱగ్గిం బోలియుఁ గొందఱు పొగం బురుడించియుఁ, గొందఱు సూర్యచంద్రుల నెనయుచును, గొందఱు నమ్రులై కేలు మోడ్చియుఁ జూపట్టిరి. అందఱును బ్రాంజలులై రాముని జూచి తియ్యని పలుకుల 'బురుషశార్దూలా! ఇదె యున్న వారము ఆనతిమ్ము. నీకేమి సేయవలయు' ననిరి. రఘునందనుండు నాబృందమును జూచి 'మీరలు కార్యము కలుగునపుడు నేను మనంబునఁ దలంచి నంతనే వచ్చి నాకు సాహాయ్యము సేయుఁడు, ఇప్పుడు నిచ్చలు పోయిరం' డని పలికెను. అంత నమ్మంత్రదేవతలు .అట్లయగుఁగాక' యని రామునివలన వీడుకోలు వడసి వచ్చినట్లు వెళ్లిపోయిరి. (అంత, రాముఁడు బ్రహ్మవాదియగు నవ్విశ్వామిత్రునిపంపున లక్ష్మణునికినాయస్త్రములనెల్లఁ బ్రయోగోపసంహారసహితముగా నెంతియుఁ బ్రీతిని దెలిపినవాఁ డయ్యె.) ఇట్లు రాఘవుం డాయుపసంహార మంత్రముల నెఱింగి యవ్వలఁ బయనంబై పోవుచు నమ్మునిని జూచిలీపారు తేటమాటల నిట్లనియె 'మునీంద్రా! ఇయ్యెడఁ గొండకుఁ గొంతదూరమునఁ గ్రిక్కిఱియ దట్టమై తాఱుకొనుచు పెనుమబ్బువలెఁ జెట్లగుంపు పెంపారుచున్నది.

చూచుట కెంతయు సొంపై, యింపైనయెలుఁగులు గలపలువగలపులుఁగుల చేతను నలుగడలఁ దిరుగాడు పెక్కుమృగముల చేతను విలసిల్లుచు నుల్లమున కెంతయు నుల్లాసము గొలుపుచున్నది. కాన యిది యేదియో తెలియుటకుఁ గుతుకముగానున్నది. దిగులు గొలిపి గగుర్పట్టించునా ఘోరతాటకావనమును గడచి వచ్చితిమిగదా. ఈ దేశమట్లు దిగులుగొలుపక సుఖముగానుండుటచే నిది యొక యాశ్రమపద మనిమాత్రము దెలియుచున్నది; కాని యెవరిదో తెలియకున్నది. కాన యంతయు నెఱిఁగింపుము. బ్రాహ్మణఘాతకులును దుష్టప్రవర్తనులు నైన మారీచాదిదురాత్ములు నీయజ్ఞమును జెఱుపుటకై తిరిగెడియాశ్రమ మెద్ది? నేను వారిని జంపి నీవు గావించుయజ్ఞకార్యమును గాపాడవలయుచోటదియే కదా. ఆ యాశ్రమ మెక్కడ నున్నది? దీనినంతయు వినఁగోరెద. నీవును దీనిని జెప్పనేర్తువు" అనియె. ఇది ఇరువదియెనిమిదవసర్గము.

---

## వామనమూర్తివృత్తాంతము: విశ్వామిత్రుఁడు దీక్షఁ బూనుట.

ఆరాముఁ డచింత్యమహిముఁ డయ్యును మనుష్యత్వమువలనఁ దనమును పటివృత్తాంతము దెలియనట్లు అవ్వనమునుగూర్చి యడుగఁగా మహాతేజుఁ డమ్మునితల్లజుఁడు దానిని వివరించి చెప్పఁదొడఁగె. 'రామా! మహాబాహూ! దేవతావృషభుండును సర్వలోక ప్రభుండు నగువిష్ణుండు లోకమునఁ దపమును ప్రవర్తింపఁ జేయుటకై తాను దపం బాచరించుటకును, యోగం బనుష్ఠించుటకును, బూని పెక్కునూఱులయుగము లవ్వనమందు వాసముచేసె. *ఇది మఱియుఁ దొల్లి మహాత్ముం డగువామన దేవుని యాశ్రమము. ఇందు మహాతపోనిధి యగుకాశ్యపుఁడు సిద్ధిని బొందినవాఁడు. కావున నిది సిద్ధాశ్రమ మని యన్వర్థనామమునఁ బ్రసిద్ధమైనది. ఆ దేవుండు తపం బాచరించునికాలమున విరోచనునికొడుకు బలి యను రాక్షసరాజు వాయుగణంబులతోఁ గూడిన దేవతలనందఱిని ఇంద్రసహితముగా జయించి ముల్లోకములను బొగత్తగాంచి యాదేవరాజ్యమును దాను పాలించుచుండె. ఆబలి భగవదారాధనరూప మగునొక యజ్ఞమును బూని కావించుచుండె. అప్పుడు దేవతలందఱును దానికి దిగులొంది యగ్నిదేవుని మున్నిడుకొని తామే గుమిగూడివచ్చి యీయాశ్రమమున విష్ణునిఁజూచి 'విష్ణూ! విరోచనునికొడుకు బలి యుక్తం బగునొక యజ్ఞము చేయుచున్నాఁడు. అది సమాప్తినొందకమునుపే మనకార్యమును దీర్చుకొనవలయును. ఇందు నందు నుండి యెవ్వరేని యతనికడకు వచ్చి యేదియెంత యడుగుదురో యదియంతయును గారవమున వారి కందఱికిని నిచ్చును. విషయ మట్లున్నది. నీవును దేవతలమేలు

---

* మొదట విష్ణురూపమునను బిదప వామనావతారరూపమునను ఇచటఁ దపముచేసినాఁడని తెలియునది.

దలంచి, మాయాయోగమునుగైకొని, నీపరత్వమును మఱుఁగుపఱిచి వామన రూపమును బొంది మాకు నుత్తమ మగు మంగళ మాచరింపు' మని వేఁడికొనిరి. *అయ్యవసరమున కాశ్యపుఁడదితినిగూడి, కాంతితోడం గూడియగ్నివలె దీపించుచు సహస్రదివ్యవర్షములు విష్ణునిగూర్చిసలుపుచున్న వ్రతమును సమాప్తము గావించి, యపుడు తనకువర మొసఁగ సాక్షాత్కరించిన యద్దేవునిని, భార్యయును దానును 'దేవా †నీవు తపోమయుఁడవు; తపోరాశివి; జ్ఞానస్వరూపుఁడవు. తపమే నీస్వభావము నీవు పురుషోత్తముఁడవు. అట్టినిన్ను ననస్యప్రయోజనమై సాంగముగా ననుష్ఠింపఁ బడిన తపంబు పెంపునఁ గనుఁగొనుచున్నవాఁడ ప్రభూ! చరాచరాత్మక మగునీ యఖిలజగంబు నీశరీరమునందుఁ గాంచుచున్నాఁడ. ఆద్యంతములు లేక యిట్టట్టని నిర్దేశింపరాక వెలుంగువాఁడవు. అట్టి నిన్ను నేను శరణుఁజొచ్చితి' నని స్తుతించె. విష్ణుసాక్షాత్కారమున దూరీకృతకల్మషుఁడగు నమ్మహర్షి రాజును జూచి హర్షించి 'వర మెద్దియేని కోరుము. నీకు శుభమగు. వర మొసఁగుటకు నీవే తగుదువని నేను దలఁచుచున్నాఁడ' ననఁగా నవ్వచనము విని మరీచికుమారుం డా కాశ్యపుండును 'వరదా! ఆశ్రితుల రక్షించుటయే నీ సువ్రతము. కాన సుప్రీతుఁడవై నిన్ను యాచించుచున్న యదితిని, దేవతలకును, నాకును వరం బొసంగఁదగును. అది యెద్దియన, రాక్షసుల నడఁచుటకు నీవు అదితికిని నాకును బుత్త్రుఁడవై యింద్రునకుఁ దమ్ముఁడవుగా వెలసి దుఃఖపీడితు లగు దేవతలకు సాయము సేయవలయు. నీయనుగ్రహమున నా వ్రతకార్యము సఫలమై సిద్ధించుటవలన నీయీ ప్రదేశమును సిద్ధాశ్రమమని పొగడొందఁగలదు. ఇచ్చటనుండి యవతరించుటకై లెమ్ము' అనియె. అంత మహాతేజుండగు నద్దేవుఁడును వామనరూపము గయికొని యదితియం దవతరించినవాఁడై బలికడకుఁబోయి యభిమానంబుదక్కి మూఁడడుగుల బిచ్చమడిగి తీసికొని లోకాత్ముఁడుగాన ముల్లోకములను సకలభూతహితము గోరి రెండడుగుల చేత నాక్రమించి మూఁడవయడుగుకొఱకు తన తేజంబున బలినడఁచి యాజగంబులను మరలనింద్రునివశము గావించె. ఆవామనదేవుఁడు తొల్లి సంసారశ్రమనివారక మగు నీయాశ్రమమున వసించియుండె. నేనును అద్దేవునియందలి యనన్యభక్తిం

* ఇచటఁ గ్రమమెట్లనఁగా 'సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి - స తపోఽతప్యత' అను శ్రుతి చొప్పున విష్ణువు జగద్రక్షణచింతాపరుండై యీదేశంబునఁ జిరకాల మదృశ్యుఁడుగా వసించియుండె. కాశ్యపుఁడు ఇది యెఱింగి యాదేవుని నే పుత్రునిఁగాఁ బడయఁ గోరి సభార్యుండై దివ్యసహస్రవర్షపరిమితంబును తదారాధనరూపంబు నగు నొక వ్రతం బనుష్ఠించి దానిని ముగించునపుడు తనకు వరమిచ్చుటకుఁ బ్రత్యక్షంబైన విష్ణుదేవుని స్తుతించె. అయ్యవసరముననే దేవతలు నచటికేతెంచి యద్దేవునిఁ బ్రార్థించిరని తెలియునది.

† తపోమయుండనఁగా తపఃప్రచురుఁడు లేక జ్ఞానప్రచురుఁడు. తపోరాశి యనఁగా తపోరాశిస్వరూపుఁడని లేక తేజోరాశి! యని యర్థము.

జేసి యాతని దైన యియ్యాశ్రమమునఁ గా పున్నాఁడు. యజ్ఞవిఘ్నకారు లగు రాక్షసు లీయాశ్రమమున కే వత్తురు. పురుషసింహుఁడవగు నీ వా దురాత్ములను బొరిగొనవలసి నది యిందే చుమీ. కాన యిప్పుడే కదలి నిరుపమమైన యీసిద్ధాశ్రమమునకుఁ బోవుదము. వత్సా! ఆయాశ్రమపదము నాకెట్లో యట్లే నీకును *సొంతము' అనుచు నా యిరువురితోఁడ నాశ్రమముఁ బ్రవేశించుచు, మంచుమాసి పునర్వసుచుక్కల తోడంగూడిన చందురుండునుం బోలెఁ బ్రకాశించె. సిద్ధాశ్రమవాసు లగు తాపసు లెల్ల నమ్మునితల్లజు రాకఁ జూచి వేవేగ వచ్చి సన్నిధికిఁ దగుపూజలు గావించి యట్లే రాజకుమారులకును నతిథిసత్కారములనొనరించిరి. అంత నారాజపుత్త్రు లందు నొకముహూర్తము విశ్రమించి పగఱ సంహరించువాఁడు గలుగావున నూర కుండక యమ్మునిశార్దూలుని జూచి కేలు మొగిచి 'మునివరా! నేఁడే దీక్షవహింపుము. నీయజ్ఞము సిద్ధి నొందుటవలన, ఈసిద్ధాశ్రమము పేరు సార్థక మగుసిద్ధి నొందుఁ గాత. ఇచ్చటనే దుష్టచారులను బొరిగొనవలయు నన్నీపలుకును సత్యమగుఁ గాత' మనిరి. వారట్లు చెప్పుటయు మహాతేజుఁ డా మునిరాజును నిగ్రహీతాంతఃకరణుఁడును జితేంద్రియుఁడునై యప్పుడే దీక్షను గయికొనియె. అక్కుమారులు నా రేయి యెంతయు నెచ్చరిక మీఱఁ గడపి తెలతెలవాఱుటయు లేచి తొలుసంధ్య నుపాసించి యర్ఘ్యములు విడిచి శుచులై నియమమున గాయత్త్రీజపమును దీర్చినవారై కృతాగ్నికార్యుండై కూర్చుండి యున్న విశ్వామిత్త్రునికి వందనము గావించిరి.

ఇది ఇరువదితొమ్మిదవసర్గము.

---

## రాముఁడు మారీచుని దూరముగాఁ జిమ్మి సుబాహునిఁ జంపుట

రామలక్ష్మణులు దేశకాలము లెఱింగి మాటలాడు నేరుపును పగవారినిరూపు మాపుబలిమియుఁ గలవారు; కనుక నమ్మునివరునిపగ వారి నడంపుతలంపున నక్కాలమునకును దేశమునకును దగుపలుకులఁ గౌశికుని జూచి 'మహాత్మా! యజ్ఞము గాచుటకై యారాక్షసుల నెప్పుడు వారింపవలయునో వినఁగోరెదము. ఆసమయమున నొకక్షణమును దప్పిపోరాదు గదా' యనుచుఁ బోరాడుకోరికల వేగిరపడుచున్న కాకుత్థ్సకులతిలకుల నాకుమారులఁ జూచి యందలిమును లందఱుం గొనియాడి 'వీరులారా! నేఁడు మొదలాఱు రాత్రులు మీరిరువురు గాపుండుఁడు. ఈమునియు దీక్షను గయికొని యంతకు మౌనవ్రతముఁ బొందును గాన పలుకఁడు. కాన యితనికిమాఱుగ మేము చెప్పితి'మనిరి. అమ్మహాయశస్కులు నమ్మాట విని యెచ్చరిక మెయి నిదురమాని యా యహోరాత్రములు తపోవనమునకు గాపై కేల బలువిలుపూని

---

* ఈ యాశ్రమమును తపంబుకొఱకు నేను గైకొనుటంబట్టి సొంతమైనది. నీవు విష్ణుఁడును వామనుఁడు నైయున్నప్పుడు దీనిని గైకొనియుంటివి గాన యిది నీకును సొంతమైనదని గూఢాభిసంధి యట గ్రాహ్యము.

పగలు నడంచునాయితపాటు దీటుకొన సమ్మునివరుం గాచుచు వసించియుండిరి. ఇట్లయిదుదినమ్ములు కడచి యాఱవదినము రాఁగా రాముఁడు లక్ష్మణునికి నెచ్చరికతో నాయితముగానుండునట్లు చెప్పుచుఁ బోరాడువేడుక చెంగలించుచు నుండఁగా నుపాధ్యాయుం డగువిశ్వామిత్రునితోడను దక్కుంగల ఋత్విజులతోడను గూడియున్న యజ్ఞ వేది దర్భ చమసస్రుక్కా సమిత్కు సుమసముదయ సహితముగా* మండుకొన్నదయ్యె, ఆయజ్ఞము మంత్ర వంతమై యథావిధిగాఁ బ్రవర్తించిన దయ్యె. ఆకసమున భయంకరముగా పెనుశబ్దము వీతెంచె. మారీచసుబాహులను రాక్షసులిరువురును మాయఁ గావించుచు నాకాశంబుగ్రమ్మి వర్షాకాలంబునఁ బఱతెంచుమేఘమువలెఁ బాఱఁ తెంచిరి. వారిరువురును వారియను చరులును భయంకరముగా వచ్చి నెత్తురువఱ్ఱు గురియించిరి. కుసుమాదివిరాజిత మైనయావేదియు, ఆరక్తంపు వెల్లిని బెల్లుగామండఁగా (నది యట్లగుటఁ జూచి రాముఁడు కడుం గోపావేశంబున) నెదుర్కొని వేగ పఱతెంచి మించుకడిమితోఁ దనపయిని గవియు దెంచుచున్న యారాక్షసులను జూచి యాజలజాక్షుఁడు తమ్మునితో 'లక్ష్మణా! పెనుగాలి మబ్బులను దూలఁగొట్టు నట్లు నాయీమానవాస్త్రంబిదె మాంసభక్షకు లగునీదుష్ట రాక్షసులను దూలఁగొట్టుటఁ జూడు' మని పలికి కోపమినుమడింప మిక్కిలి యుత్కృష్టం బై మెఱుంగులు దుఱంగలించుమానవాస్త్రమును మారీచునురము గాఁడ నేసె. అమ్మహనీయాస్త్రము దాఁకుటయు వాఁడు సముద్రజలపూరమున సరిగా నూఱు యోజనముల దూరమునఁ జిమ్మఁబడినవాఁడయ్యె. అట్లుపడి తెలివిదప్పి గుడుసుపడుచు నాశీతేషువువలనఁ గొట్టువడి బిట్టు దూలిన యమ్మారీచుని జూచి రాముఁడు తమ్మునితో 'లక్ష్మణా! ధర్మ సహితమైన శీతేషు వనియెడియీమానవాస్త్రము మహిమను జూచితివా ! ఇది వానిని మోహము గొలిపి కొనిపోయినదే కాని ప్రాణములఁ బెడఁ బాపదయ్యె. కరుణాదూరులును దుర్మార్గులునై పాపకర్మములఁ బట్టుకొని యజ్ఞములఁ జెఱుపుచును నెత్తురులు ద్రావుచును దిరుగునీరాక్షసులను గూడఁ జక్కాడెద' నని పలికి యంత దివ్యమును నద్భుతావహము నైనయాగ్నేయాస్త్రముఁ గయికొని సుబాహుఱొమ్మున నేసెను, వాఁ డది నాటఁగా నేలఁ గూలె. తక్కుంగలరక్కసులను వాయవ్యాస్త్రము దొడిగి యనుపులకుం బాపి మహాయశస్కుఁ డగునామహాదారుఁ డందలిమునులకు నెల్ల ముదంబు వ్రెదలం జేసె. ఋషులెల్లఁ దొల్లియసురుల జయించినప్పు డింద్రునిఁ బూజించినట్లు యజ్ఞ విఘ్న కారులగు నారాక్షసుల నెల్లఁ దునుమాడిన రాముని బూజించిరి. పిదప యజ్ఞము సమాప్తము కాఁగా విశ్వామిత్రుఁడు నలుగడలు నిరుపద్రవమై నెమ్మదిగానుండుటను జూచి రాముంగనుంగొని

* వేది మండుకొనుట యుత్పాతము గాన రాక్షసులరాకను సూచించుచున్నది. చమస మనగా పానపాత్రము. స్రుక్కనఁగా హోమపాత్రము.

'రామా ! నీచేతను బుజంబుల బలిమిం జేసి నేను కృతార్థుండ నైతి. పితృవచనమును నీవు గావించితివి. నాజన్నంబు సిద్ధింపం జేసి యీసిద్ధాశ్రమంబును సార్థక నామంబుం గావించి కీర్తి మించితి' వనియె. ఇది ముప్పదియవ సర్గము.

---

## విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులతో మిథిలకుఁ బయనమగుట.

అంత నమ్మునికార్యమును దీర్చి తీర్చినసంతసమున నుల్లంబు పల్లవింప నవ్వీరులిరువు రా రేయి ముడంబున నందు వసించి తెల తెలవాఱుటయుఁ బ్రాతః కాలకరణీయంబుల నిర్వర్తించి యిరువురును గూడి విశ్వామిత్రుఁడు మొదలగు ఋషులకడకుం బోయి యగ్గింబోలె నగ్గలంపుందేజంబున రాజిల్లు నమ్ముని రాజునకు మ్రొక్కి 'మునిశార్దూలా! మీరానతిచ్చిన రీతియుఁ గావించి యిదె మీ కింకరులము వచ్చి యున్నవారము. ఇంకను మీ కోరినటు లానతిండు. మీపం పేమి సేయవలయు,' నని మధురభాషులు గాన తీపరు మేలిపలుకులనడిగిరి. వారట్లడుగఁగానే ఋషులందఱును విశ్వామిత్రునిముందిడుకొని రాముని జూచి 'నరవరేణ్యా! మిథిలాధిపతి యగు జనకుఁడు మిక్కిలియు ధర్మిష్ఠుం బగు నొక యాగము సేయంబోవుచున్నాఁడు. అందులకు మేమందఱమును బోయెదము. నీవును మా తోడనే వచ్చి యచట మిక్కిలియాశ్చర్యకరంబై ప్రసిద్ధిగాంచియున్న యొక మేటి విల్లును (సీతనుం) జూడవలయు. కొలంది యిడరాని సారంబుగలిగి భయంకర మయి మిక్కిలియుం బ్రకాశించుచున్న యీ విల్లు * తొల్లి యాగకాలమున సదస్సునందు దేవత లొసంగిరి. దేవగంధర్వులుగాని యసుర రాక్షసులుగాని దాని నెక్కువెట్ట దిట్టలు గారు. ఇంక మనుష్యులకది యెట్టును శక్యము కానేరదు గదా! మహాబలాఢ్యు లగురాజపుత్రు లావింటి సారము నెఱుంగఁ గోరి వచ్చి తుదకు దానిని మోపెట్టనుం జాలక పోయిరి. నీవు వత్తువేని యచ్చట మహాత్ముఁ డగుమిథిలాధి నాథుని, మిక్కిలి యద్భుతంబుగాం బొడసూపు నావింటిని, ఆయాగమును జూడఁ గలవు. †ఆజనకుఁడు తనయజ్ఞమునఁ బ్రీతులైన దేవత నెల్ల నాయజ్ఞమునకు ఫలముగా మంచినడిపట్టు గలయామేటి వింటి నొసంగునట్లు వేఁడికొనఁగా వారు దాని నొసంగినవారైరి. అదియు నా రాజునింట వింటిపండుగల యందు ప్రధానముగా నర్చింపఁబడు విల్లుగా (ఆయాగముగా) నుండునదై యగురు వాసనలు బుగులుకొను గంధములను

---

* తొల్లి శివుండీవింటిని గొని దక్షయజ్ఞ ధ్వంసముఁ గావించె. దేవతలు శివునిఁ బ్రసన్నునిగా జేసి దానిని బడసిరి. దేవరాతుఁ డను తొల్లింటిజనకుఁ డొకఁడు యజ్ఞమున దేవతలను బ్రసన్నులనుజేసి వారివలన దానిని బడసె.

† 'ప్రీతశ్చ భగవానీశ స్త్రిశూలీ నీలలోహితః। ప్రదదౌ శత్రునాశార్థం జనకాయాద్భుతం ధనుః' అని కూర్మపురాణము.

ధూపముల నర్చింపఁబడియుండు' ననిరి. ఇట్లు చెప్పి యమ్మునివరుఁ డపుడు ఋషి సమూహములును రామలక్ష్మణులును దోడరాఁ గదలి పయనమై యచటివన దేవతలను జూచి 'మీకెల్ల భద్రం బగుఁగాత. నేను గార్యసిద్ధిఁ బొందితిఁ గాన యీసిద్ధాశ్రమమునుండి తరలి గంగానది యుత్తరతీరంబు నందుల హిమవంతము నకుఁ బోయెద' నని చెప్పి వీడ్కొని పిదప యప్రతిమ మగునా సిద్ధాశ్రమం బునకుఁ బ్రదక్షిణంబుఁ గావించి యుత్తరము మించి పయనంబు సాఁ దొడఁగె. అట్లు పోవుచున్న యమ్ముని వెన్నాడి బ్రహ్మవాదు లగుమునులు తమతమ యగ్ని హోత్రసంభారాదికములను బ్రాయికముగా నూఱుబండ్ల నెక్కించుకొని పోయిరి. ఆసిద్ధాశ్రమంబున నున్న మృగపక్షి సమూహములు సైత మతిభక్తి మీఱ మహాత్ముఁడగు నమ్ముని వెంటనంటి పోవఁగా నతఁడు నాపక్షి మృగసమూహముల మరల్చినవాఁ డయ్యె. ఆమునిగణములు గడుదూరము నడచి ప్రొద్దు గ్రుంకఁ బోవు నపు డందఱును గూడి శోణనదము తీరంబున వసించి సూర్యుఁ డస్తంగతుఁ డగుటయు స్నానము సేసి యగ్నిహోత్రములు వేల్చి కాంతివెల్లు వెల్లిగొన విశ్వామిత్రుని బురస్కరించి కూర్చుండిరి. రాముఁడును లక్ష్మణుఁడును నమ్మును లకు నమస్కరించి ధీమంతుఁ డగు విశ్వామిత్రుని మ్రోలఁ గూర్చుండి యమ్మహా తేజుని మునిరాజుని జూచి కుతుకము దిలగొన 'మహాత్మా! ఈ శోణకూలమున, మెండు కొనువనముల విలసిల్లుచున్న యీ దేశ మెవరిది? దీనిని వినఁ గోరెదఁ గాన కలరూపునఁ జెప్పవలయు. మీకు శుభం బగుఁగాతమనియడిగె' రాముని వచనములఁబురికొని మహాతపస్సంపన్నుఁడును సువ్రతుఁడు నగు విశ్వామిత్రుఁడు ఋషుల నడుమ నాదేశంబు సకలవృత్తాంతంబు నిట్లని చెప్పె. ఇది ముప్పది యొకండవ సర్గము.

---

## కుశకుశనాభుల వృత్తాంతము.

బ్రహ్మపుత్రులలో మేలుబంతి యగు *కుశుం డను మహాతపస్వియొకఁ డుండెను. అతఁ డెడ తెగక వ్రతము లాచరించుచు ధర్మముల నెల్ల దెలిసి సుజనులను బూజించుచునుండెను. అమ్మహాత్ముఁడు తన కనురూప యైనకులకాంత యగువైదర్భియందుఁ దనకుఁదగినవా రగు కుశాంబుఁడు, కుశనాభుఁడు, ఆధూర్తరజసుఁడు, వసువునను నలువురు కుమారుల గుణాధికులను గాంచెను. కుశుండును క్షత్రధర్మ మగు ప్రజాపాలనము సేయఁగోరి యత్యంత కాంతిమంతులును నుత్సాహవంతులును ధర్మిష్ఠులును సత్యవాదులు నగు నాకుమారులను జూచి 'పుత్రులారా!

---

* 'కాశతే ఇతికుశః' భూమియందుండు వాఁడనివ్యుత్పత్తి, బ్రహ్మలోకమును విడిచిప్రజాపాలన మందలిరక్తిచే చే నారదునివలె భూలోకమందుండు వాఁడు కావుననే కుశుఁ డనబడెను.

ప్రజాపాలనము సేసి పుష్కలముగ ధర్మముఁ బడయుఁడు' అని చెప్పఁగా నమ్మని
వచనము విని లోకము మదికెక్కినయా యుక్కుఁదునియలు నలువురును బుర
ములు నాలుగింటికి సన్నివేశములు గావించిరి. అందు మహాతేజుఁడై రాజర్షి
కుశాంబుండు కౌశాంబి యనుపురంబును గావించె. ధార్మికుఁ డగుకుశనాభుఁడు
మహోదయం బనునగరంబు నిర్మించె. అధూర్తరజసుఁడు ధర్మారణ్యమను పట్ట
ణము గల్పించె. వసుఁ డనువసుమతీశుఁడు గిరివ్రజ మనుపురము రచించె.
శోణనదీ కూలమున నున్న యీభూమి మహాత్ముఁ డగు నావసురాజుది. ఈ పెనుఁ
గొండ లైదును జుట్టుఁ బ్రకాశించుచున్నవి. మాగధి యని పొగడ్తగన్న యీ
చెన్నారునదియును మగధదేశమునకు వచ్చి యీయైదు పెనుగొండల నడుమఁ
బూదండవలెఁ దులకించుచున్నది. రామా! ఆ యీశోణనదియు మహాత్ముఁ డగు
నావసురాజును జేరినది. ఇది తూర్పునుండి పడమటిదిక్కుగాఁ బ్రవహించు
నది. దీనియిరుగడల మంచిమడుగులుగలిగి పయిరుల పచ్చలు చక్కఁగా
తెక్కొనుచున్నవి. రాజర్షియు ధార్మికవృషభుఁడు నగుకుశనాభుఁడు ఘృతాచి
యనునచ్చరయందు, ఎనలేని చెన్నారుకన్నియల నూర్వురం గాంచె. రఘు
నందనా! మంచి జవ్వనమునను మించుచక్కఁదనమునను దులకించు నక్క
న్నియలు పువ్వులు దుఱిమి చందనము లలఁది తిలకములుదిద్ది నీటుమిటారింప
మేలిసొమ్ములు మెయినెమ్మెలు గులుకఁ దొలుకరిమెఱుఁగుఁదీఁగలవలె వెలుఁ
గుచు నుద్యానంబునకు వచ్చి యచ్చటఁ బలుచందముల నాడుచును బాడుచును
వీణియలు మున్నగు వానిని వాయించుచును నెంతయు సంతసమునఁ దేలుచుండిరి.
ఇట్లు సకలాంగములను రంగుమీఱఁ బుడమిని నెనలేనిరూపంబు దీపింపఁ దళు
కొత్తుచున్న యాతలిరుఁబోఁడు లాయెలదోఁటయందు గుబురై కాఱుకొన్న చెట్ల
గుంపులలోన, మబ్బులలోని చుక్కలుంబోలెఁ, దళుకుతళుక్కని ప్రకాశించు
చుండిరి. ఎల్లగుణముల రాణించుచుఁ జొక్కంపుఁ బ్రాయంబునను జక్కఁదనమునను
నిక్కుచున్నయక్కన్నియల, నెల్లయెడలఁ జరించుచుండు వాయుదేవుఁడు గాంచి
కామించి 'కామినులారా! మీయందు నాకిగ్గలంపువలపు గలిగినది. కాన మీరెల్ల
నాకు భార్యలుకండు. మనుజులకు దేవతలతో సంబంధమెట్లని శంకింపవలదు. మీరు
మనుష్యభావము వీడి దీర్ఘాయువుఁ బడయుదురు. ప్రాయమెయెప్పుడును జంచలమై
నది. మనుష్యులయందో యదిమీఁదు మిక్కిలి చపలమైనది. కావున నన్నుఁ బెండ్లియై
యెన్నఁడు నుడివోనియీ యావనమున నివ్వటిల్లుచు వేలుపుఁబువ్వుఁబోండ్లు గండు'
అనియె. తలఁచినకార్యమునడ్డి లేక చేయఁ జాలిన యాదేవునివచనముల విని యా
కన్నియలు నూర్వురును బరిహసించి 'దేవోత్తమా! భూతము లన్నింటిలోనను
నీవు ప్రాణరూపమునఁ జరించుచుండువాఁడవు. ఈనీప్రభావము మేమెఱిఁగియున్న
వారమే కాని వేఱుగాము. ఇట్టిమమ్ము నీవేల యవమానించెదవు. మేమందఱ

మును గుశనాభునికూఁతులము సుమా. కావున నిన్నును నీప్రభువైన యింద్రునిని మీమీయధికారములనుండి తొలఁగింపఁజాలుదుము. అయినను శపించినఁ దపంబు చెడునుగాన దానిఁ బ్రోచుటకై యూరకున్నారము. మాతండ్రి నీయీదుష్టబుద్ధి నెఱిఁగెనేని నీకు మృత్యు వగుఁ జుమీ. అతఁ డట్లు గాకుండుఁ గాత. కాన సత్యవాది యగునతనిని నవమానింపకు. తండ్రికోరి మ మ్మెవరికేని నొసఁగుటయె ధర్మము. ఆధర్మముచొప్పున నతఁడు తానై మ మ్మెవనికి నొసఁగునో యట్టివరునే యెదురుచూచుచున్నవారము. (సత్యవాది యగుతండ్రి నవమానించి మాకోరిన చొప్పున మే మైపతిని గయుకొనునట్టికాలము కలుగకుండుఁగాక) ఏలన మాకుఁ దండ్రియె ప్రభువు. అతఁడే మాకుఁ బరదైవము. కాఁబట్టి యతఁడెవరికి మమ్మునొసంగునో వాఁడే మాకు భర్తయగుననిరి. వాయు వమ్మాటలు విని మిక్కిలియుఁగోపంబు దీపింప సమర్థుఁడుగాన వారియవయవములనెల్లఁ జొచ్చి వారిని బొట్టిగుజ్జులను గావించె. (వారును మూరెఁడుపొడువు గలయాకృతుల నొంది యుబ్బు కుంది వెఱ గందినవారైరి.) ఇట్లు వాయువుచే గుజ్జులు గావింపఁబడియా పడఁతులు పుడమిఱేని గృహమునకుఁబోయి సిగ్గు లగ్గలింప కనుఁగవల నీరు వెల్లిగొనఁ బెల్లగుతత్తఱపాటున నేలఁబడిరి. అప్పుడు కుశనాభుఁడును మున్ను మిక్కిలియుంగాంతి దళుకొత్తుచుండినతనగారాబుకూఁతు లా రీతిని భంగము నొంది క్రుంగుటనుజూచి మనంబు త్తలపడ 'పుత్రికలారా! ఇదేమి చెప్పుఁడు. ధర్మంబు నిరాకరించి యిట్లు బలిమి చూపినవాఁ డెవఁడు. మి మ్మెవఁడు మఱుగుజ్జులఁ గావించె, ఏలచుట్టుకొని పలుకకున్నారు' అని యి ట్లడిగి మది తుందుడుకునొంద నిట్టూర్పు పుచ్చి పిదప వారాడు మాట విను నెచ్చరికతోనుండె. ఇది ముప్పదిరెండవ సర్గము.

---

—: బ్రహ్మదత్తునివృత్తాంతము : అతఁడు కుశనాభుకూఁతులను బెండ్లాడుట. :—

ధీమంతుఁ డగుకుశనాభుఁ డాడినవచనంబు విని యాకన్నియలు నూర్వురును నాతనిపాదములకు నొసల సోఁక మ్రొక్కి యిట్లనిరి. "రాజా! సర్వాత్మకుఁ డగు వాయుదేవుఁడు మమ్మవమానింపఁ దలంచినాఁడు. బలాత్కారము సేయుటయమంగళమగుమార్గమని తలంపక బలిమికిఁ బూనిధర్మము నెంతమాత్రమువిచారింపఁడయ్యె. మే మాతనితో 'మాకుఁ దండ్రియున్నవాఁడు. కావున పతినివరించు స్వాతంత్ర్యమున మేమున్నవారముగాము. నీవు మాతండ్రినిబోయి వేఁడుము. అతండును మమ్మునీకొసంగునేని మేము నీసొమ్మగుదుము. నీకు శుభంబగుఁగాక' యని యందఱమును జెప్పుచుండియు నతఁడు పాపము వెంటఁబడి మానుడువులు వడచెవులఁ బెట్టి కట్టిఁడియై మమ్మి ట్లింతయుఁదూలఁబుచ్చినాఁడు" అనిరి. అవ్వాక్యమువిని రాజు మహాతేజుఁడయ్యుఁబరమధార్మికుఁడుగాన, వాయువుఁగినియక తనవలెఁ గినుక మాలి యోరిమిచూపుటఁ జేసియెనలేని పేరిమిఁగన్నయానూర్వురు

కన్నియలఁజూచి 'కూఁతులారా! ఓర్పుగలవారలు దమకెవ్వరైన నపరాధముచేసి నపుడు, చేయవలసినకార్యము క్షమించుటయె. మీరిపు డాతయు గొప్పకార్యము చేసితిరి. దేవుఁడు ప్రార్థించియు మనను కలఁగకుండుటయు సహిఁచుఁ భజించియుఁ గోపము నొందకుండుటయు ననునిది పెనుకార్యముగదా. ఇంతే కాక మీరందఱు నొద్దిక మీఱఁ గూడి కులమునకుఁ దగినకృత్యము నాచరించితిరి. స్త్రీలకును, పురుషులకుఁగాని క్షమయె భూషణము. ఓరు పనునడచూపుటయె కిష్టము. అందును రూపైశ్వర్యాదులుగల దేవత లపరాధము సేసినపుడు దానిని జూపుట మఱియుఁ గష్టము. దానికంటెను మీరందఱికిని నేకరీతిని నోరుపుగలుగుటతిద్దయుం గష్టము. దానమునను యజ్ఞమునను సత్యమునను యశమునను ధర్మమునను గలుగు ఫలములే క్షమవలనఁగూడఁగలుగు. కాన క్షమయే దానమును యజ్ఞమును సత్యమును యశమును ధర్మమును నగు భూమికిఁ గలక్షమచేతనే చరాచరాత్మకమైన జగమును అందు నెలకొనియున్న, దనియె. పరాక్రమమున దేవప్రతిముఁ డగునావిభుఁ డిట్లు పలికి కన్నియలను వీడుకొలిపి పిదపఁ గార్యాలోచనకుశలుండు గావునఁద త్కన్యాప్రదానముం గూర్చి వారల నెయ్యెడ నెన్నఁ డేతగుకులీనునకు నిచ్చునది యని మంత్రులఁ గూడి యాలోచించెను. అక్కాలమునందే యస్ఖలిత రేతనుండును మంగళాచారుండు నైనచూళి యనునొకమహాముని వేదచోదితం బగుతపంబు సేయుచుండె. అప్పుడచ్చటికి నూర్మిళకూఁతు రైనసోమద యను గంధర్వస్త్రీయొకతె యామునికడకుఁ బోయి శుశ్రూష గావించుచుండె. రామా! నీకు శుభం బగుఁగాక. ఆ ధార్మికురా లాతనికి మ్రొక్కి శుశ్రూషనెడతెగక కావించుచు నందకాపుండె. అంతఁ గొంతకాలమునకు నగ్గురుండు దానియెడ సంతుష్టుఁ డయ్యె. రఘునందనా! దానిశుశ్రూష పరిపక్వ మగు కాలము రాఁగా నతఁడు దానిని జూచి 'నేను నీ శుశ్రూషకు సంతోషించితిని. నీకు భద్రం బగుఁ గాక. నీకు నేనెయ్యది ప్రియంబు చేయుదుఁ జెప్పు' మనఁగా నాగంధర్వి యమ్ముని పరితుష్టుఁ డగుటకుఁ దా నెంతయుఁ బ్రీతినొంది యావాక్యవిశారదు నితో మాటనేర్పు మిటారింప మధురస్వరమున 'ధార్మిక శిరోమణీ! నీవు బ్రహ్మవర్చసమున నందఱ నతిశయించినవాఁడవు; బ్రహ్మసమానుఁడవు; మహాతపస్సంపన్నుఁడవు. ఇట్టివాఁడవు గావున నిన్ను బ్రాహ్మశ్రీయుక్తుం డగుపుత్రునినా కిమ్మని కోరెద. నేను పెనిమిటి లేనిదానను. నీకు శుభం బగుఁగాక. నన్ను వితంతు వని యెన్నకు. ఏలన నింతకును బురుషుండు నాకు లేఁడు. ఇప్పుడును నేనొక్కనికిని పెండ్లము గాను. కాన నేను నైష్ఠిక బ్రహ్మచారిణి నగుదు. ఇట్టి దాన నై నిను శరణుఁజొచ్చితి. కాన తపంబుపెంపున నాకుఁ బుత్రుని నొసంగ దగు' ననియె. ఆబ్రహ్మర్షియు దానికిఁ బ్రసన్నుఁడై తనమానసమునఁ బుట్టినబ్రహ్మదత్తుఁ డనునుత్తమపుత్రుని దాని కొసంగినవాఁ డయ్యె. ఆగంధర్వియు క్షత్రియ

జాతి గావున దానిసుతుఁ డా బ్రహ్మదత్తుఁడును రాజయ్యె. కుశనాభుఁడు కన్యాప్రదానమునుగూర్చి మంతన ముండునపుడు సోమదత్తతనూజుఁ డైనయా రాజు, దేవేంద్రుఁడు స్వర్గంబునందుఁబోలెఁ దాను గాంపిల్యానగరమున నివసించియుండె. అప్పుడు ధార్మికుఁ డైనకుశనాభుఁడు బ్రహ్మదత్తునికిఁ దనకూఁతుల నూర్వుర నియ్య నిశ్చయించి తేజంబు దీపింప నాతని రావించి మది నెంతయుఁ బ్రీతి గడలుకొనఁ గన్యాశతంబు నొసంగె. దేవేంద్రునివలె వెలుగునమ్మునియు నాపొలఁతుల నందఱిని గ్రమమునఁ బాణిగ్రహణము సేసె. అమ్మహనీయుఁడు వారిని జెట్టఁబట్టినంతనె కుబ్జాత్వము వీడి కొందలములు మాలి యాకన్యలు నూర్వురును అప్పుడు కాంతివెల్లున మిక్కిలియు విలసిల్లిరి. కుశనాభుఁడును వాయువువలన విముక్తలయిన యాపడఁతులను జూచి యనుకూలవరలాభంబున నెంతయుఁ బ్రీతి మించి వారు వికుబ్జ లగుటకుఁ బయింబయి సంతసంబునఁ దేలుచుండెను. ఇట్లు వివాహ మైన బ్రహ్మదత్తునిఁ గుశనాభ మహీవిభుఁ డపుడు అతని భార్యలతోడను ఋత్విగ్గణముతోడను గాంపిల్యానగరమునకుఁ బంపెను. సోమదయు సంతోషంబు వెల్లిగొన నా కాంతల నల్లల్లఁ బుడికి పుడికి కుశనాభునిఁ గొనియాడి కొడుకునకు ననురూప మైనయావివాహమునుఁ దనకోడండ్రను దగుకొలంది నభినందించిన దయ్యె". ఇది ముప్పదిమూఁడవ సర్గము.

## విశ్వామిత్ర కౌశికీనదుల జన్మవృత్తాంతము

"రాఘవా! బ్రహ్మదత్తుఁడు పరిణయ మై తనపురమునకుఁ బోవఁగాఁ గుశనాభుఁడు కొడుకులు లేమిం జేసి కొడుకును గనుటకొఱకుఁ దదర్థం బైనయిష్టిని గావించె. కుశనాభుఁ డట్లాయజ్ఞమును జరుపుచుండఁగా బ్రహ్మకుమారుఁడును మిక్కిలియు నుదారుఁడు నగునాతనితండ్రి కుశుఁ డపు డాతనిఁ జూచి 'పుత్రా! మిగుల ధార్మికుఁ డై గుణములచే నిన్నుఁబోలునట్టిసుతుఁడు నీకుఁ బుట్టు, వాడే గాధి యనఁబడు. వానిని గని నీవు జగమున శాశ్వతమగుయశము నొందుదు' అని చెప్పి యతఁడు కుశనాభుని వీడుకొని యాకాశమార్గమున నిత్యమగుబ్రహ్మలోకమునకుఁ జనియె. అంతఁ గొంతకాలము కడచనఁగా ధీమంతుఁ డగునాకుశనాభునకు నతనితండ్రి చెప్పినట్లె గాధి యను పేరు గలకుమారుఁడు పరమధార్మికుఁడు ఘృతాచియందు జనియించెను. కాకుత్స్థకులతిలకా! పరమధార్మికుఁ డాగాధియె నాకుఁ దండ్రి. కుశవంశమునఁ బుట్టితిని గాన కౌశికుఁడ నైతి. రామా! సువ్రతము లాచరించునాయక్క సత్యవతి యనునది ఋచీకునిఁ బెండ్లియాడినది. ఆపడ నిజభర్తృ ననువర్తించు ప్రభావమువలన శరీరముతోడనే స్వర్గమునకుఁ బోయిన దయ్యె. ఇంతే కాదు. అసర్వాతిశాయిని పుడమియందుఁ గౌశికి యనుమహానది యయ్యుఁ బ్రవర్తిల్లెను. ఏలన నాయక్క లోకమున

కైహికాముష్మికములు గలుగుటకుం బూని పావనజలమును రమణీయము నగు దివ్యనదియై స్వర్గమునుండి హిమవంతము నాశ్రయించిన దయ్యె. ఆకౌశికి హిమవంతము నాశ్రయింపంగా నేనును దోఁబుట్టువు నందలి నెయ్యమువలన ఆపర్వతపుంబార్శ్వముననే యెప్పుడును సుఖముగా వసించుచుందును. ఆసత్యవతి పవిత్రయైనది; తన పేరికిం దగునట్లు సత్యమును ధర్మమును నెలకొని యుండినది. మఱియు నది పతివ్రతయు మహాభాగయు నై కౌశికియనం బరంగు నదుల మిన్నయై చెన్నారుచుండు. నేను యాగనియమముం బూనుటవలన నామెను విడిచి సిద్ధాశ్రమమునకు వచ్చి యందు నీ తేజంబునం జేసి కార్యసిద్ధిని బొందిన వాఁడ నైతి. మహాబాహూ! ప్రసంగవశమున నాయీయుత్పత్తిని నావంశము నుత్పత్తిని దెలిపితిని. నీవు నన్నడిగిన యీదేశము విధమును జెప్పితిని. కాకుత్స్థా! నేను నిట్లు కథలు సెప్పుచుండంగా రాత్రిలోఁ గొంతసే పైనది. నిదురించువేళ యయ్యెం గాన యింక నిదురింపుము. నీకు మంగళం బగుం గాక. మేలుకొన్నయెడ మన కిచ్చో మార్గమునం బయనమగుటకుం జెఱుపు గలుగును. వృక్షము లన్నియుం బక్షులసంచారము లేమివలనం గదల మెదల కున్నవి. మృగంబులును బక్షులును వానియందు దడంగి నిదురించుచున్నవి. దిక్కు లన్నియు రాత్రి చీకట్లు గ్రమ్మినవి. సందెప్రొద్దు నల్లల్ల దాఁటినది. ఆకాశ మశ్విన్యాదినక్షత్రములచేతను దక్కుంగల చుక్కలచేతను నిఱిసి, వెలుంగులు గిఱిగొన్నకన్నులచేత నావృతం బైనదానివలెం బ్రకాశించుచున్నది. చలివెలుంగులు దుఱంగలించు చందురుఁడును జగంబునం జీఁకట్లు వికావికలు గావించుచు తనవెన్నెలలచే లోకమునం గలప్రాణుల యుల్లముల కుల్లాసము గొలుపుచు నుదయించుచున్నాఁడు. రాత్రులం దిరుగుగూబలు మొదలగు ప్రాణులు నిటునటు చెరలాడుచున్నవి. మాంసభక్షులై దిగులు గొలుపు యక్షరాక్షసులు నందంద సంచరించుచున్నారు."

ఇట్లు మహాతేజుం డగు నమ్మునిరాజు చెప్పి విరమింపంగా మునులందఱును 'మేలు మే'లని కొనియాడిరి. మఱియు వారు 'ఈకుశికులవంశము మిగుల గొప్పది. అదియెప్పుడును ధర్మపరాయణమునై యొప్పుచుండు. కుశవంశీయు లగుపురుషవరు లందఱును మహాత్ములు; బ్రహ్మదేవునికి సాటియగువారు. వారియందు మహాయశుండవై విశ్వామిత్రుం డనం బరంగు నీవే విశేషించి మహాత్ముండ వగుదువు. నదీలలామ యగు నీకౌశికియు నీకులమును బ్రకాశింపం జేయునది' యని ప్రశంసింపంగా నా కౌశికుండు సంతోషాతిశయమునం బ్రకాశించుచు నస్తంగతుం డైన సూర్యుండునుంబోలె నిద్రం బొందినవాం డయ్యె. రాముండును లక్ష్మణుండును మిక్కిలియు నాశ్చర్యకర మగు నావృత్తాంతము వినియు నిద్రావశమున నాశ్చర్యము కొంచెమే పొంది యమ్మునిశార్దూలుని గొనియాడి దారి నడచిన బడలికం జేసి చక్కఁగా నిదుర వోయిరి. ఇది ముప్పదినాలవ సర్గము.

---

## గంగాపార్వతుల జన్మవృత్తాంతము.

విశ్వామిత్రుఁడు కడమరాత్రియంతయు శోణనదీతీరమున మహర్షుల తోడఁగూడఁ బరుండియుండి తెలతెలవాఱుటయు రాముని జూచి 'రామా! రాత్రి చక్కఁగాఁ దెల్లవాఱినది. తొలిసంజ జరుగుచున్నది. లే లెమ్ము. నీకు శుభం బగుఁగాత. పయనమునకుఁ బూను'మనియె ఆమాట విని రాముఁడును లేచి పూర్వాహ్ణకరణీయముల నిర్వర్తించి పయనమునకు సమ్మతించి యమ్మునితో, 'బ్రాహ్మణోత్తమా! పావనజలమైనయీశోణనది యిపుడు కొంతజలమే కలిగి లోఁతులేక యిసుకదిన్నియలచే నందందఁ జెన్నుఁజూపుచున్నది. అయినను ఓడలేక దీనిని దాఁట వచ్చునుగాన యేమార్గమున మనము దీనిని దాఁటుదు'మనఁగా విశ్వామిత్రుఁడు, 'ఈ దారిని దాఁటవలయునని నేనుద్దేశించియున్నవాఁడ. ఈదారినే మహర్షులును బోవుదురు' అని చెప్పఁగా విని మహర్షులు పయనమై దారియందు నానావిధములగు వనములను గనుఁగొనుచుఁ బోయిరి. ఆమునులు చాలదూరము పోయి దినమునగము గడచనఁగా నపుడు మునిసేవితమైననదీలలామను గంగను జూచిరి. అట్లు పావనజలవిలసితమై హంససారసాది జలపక్షికలితంబైనయానదిని గాంచి మును లందఱును రామలక్ష్మణులును ముదం బంది యంత దాని తీరమున విడిపట్టు గావించుకొని పిదప స్నానములాడి నాయ్యముచొప్పున నఘమర్షణ సూక్తాదికము జపించుచుఁ బితృదేవతలకును ఋషులకును దర్పణము సేసి యగ్నిహోత్రములు వేల్చి హోమవిశేషమగుటం బట్టి యమృతప్రాయమగుహవిస్సును భుజించి మనమున ముదంబు పొదల విమలం బగుగంగా కూలమున మహాత్ముఁడగు విశ్వామిత్రుని చుట్టును బరివేష్టించి కూర్చుండిరి. అంత నయ్యెడ రాముఁ డపుడు విశ్వామిత్రుఁ జూచి 'మహాత్మా! గంగానది మూఁడుమార్గములఁ బ్రవహించినవృత్తాంతము విన గోరెద. అది ముల్లోకముల నాక్రమించి నదనదీపతి యగుసముద్రు నెట్లు చెందెనో' చెప్పు' మని యడుగఁగా రామవాక్యమునఁ బురికొని విశ్వామిత్ర మునివరుఁడు గంగ పుట్టినవిధమును, అది ముల్లోకముల నావరించుటకుఁ బెరిఁగిన చందమును, ఇట్లని చెప్పఁదొడంగె. 'బంగరు మొదలగుగైరికధాతువులకు గనియై హిమవంతు డనఁబడు పర్వతరాజు గలఁడు. వానికి జగంబునం దెనలేని చక్కఁదనము గల కన్నియ లిద్దఱు గలరు. మేరుగిరిపుత్త్రియు హిమవంతమునకుఁ బ్రియపత్నియు సుమధ్యమయు నగుమనోరమ యనునది నాయిరువురకుఁ దల్లి. ఆమనోరమయందు హిమవంతునికి గంగ పెద్దకూఁతురుగాఁ బుట్టినది. అతనికే రెండవకూఁతురు ఉమ యనునది గలిగినది. అంత దేవతలందఱును దమకార్యము తీర్పఁగోరి హిమవంతు కడకుఁ బోయి త్రిపథగ యగు గంగానది నిమ్మని వేఁడిరి. హిమవంతుండును యాచకు లడిగినదానిని నిరసింపరాదను ధర్మంబూని ముల్లోకములకు హితము సేయఁ గోరి తనకూఁతు రగు గంగను దేవతలకు నొసంగె. అది లోకములను బవిత్రము

గావించునది; తనయిచ్ఛచొప్పున నేమార్గముననేని ప్రవహింపఁజాలినది; దేవతలును ద్రిలోకహితాచరణపరులై దానిని బ్రతిగ్రహించి కృతార్థమనస్కులై తమతోఁ గొనిచన్నవారైరి. యీపర్వతరాజు కూఁతులలోఁ బెండ్లికాని మఱియొకకన్నియ యుగ్రమగు వ్రతము గయికొని తపమేధనముగా నెంచి శివునిఁ గోరి తపము గావించె. అటు లుగ్రతపోయుక్తయై, కావుననే లోకనమస్కృత యగు తనకూఁతును, ఉమాదేవిని ఆశైలవరుఁడు సమానరూపుఁడును బ్రసన్నుఁడు నగురుద్రునకు నిల్లాలుగా నొసంగ రాఘవా? నదీమతల్లి యగు గంగయు ఉమాదేవియు ననునీయిరువురు లోకపూజితలు; పర్వతరాజైన హిమవంతుని కూఁతులు. వత్సా! సుందరగమనా! మూఁడుమార్గములఁ బ్రవహించు గంగ మొదట ఆకాశమం దెట్లు ప్రవహించినదో యావృత్తాంత మంతయు నీకుఁ జెప్పితిని. అప్పుడు పాపదూరితయు, సంతతజలవిలసితయు నగు నాపర్వతరాజసుత గంగానదియే దేవతానదియై సురలోకమునకుఁ బ్రాఁకినదయ్యెననియె, ఇది ముప్పదియైదవ సర్గము.

---

## పార్వతీవృత్తాంతము.

అమ్ముని యట్లు సెప్పఁగా వీరు లారామలక్ష్మణు లిరువురు నాకథను గొని యాడి యామునివరుతో 'బ్రాహ్మణోత్తమా! పర్వతరాజు పెద్దకూఁతురైన గంగాదేవివృత్తాంతము ధర్మిష్ఠమును శ్రేష్ఠము నైనది. దానిని, ఇంత మాత్రము చెప్పితివి. నీవు సమస్తకథలను విస్తరించి యెఱిఁగినవాఁడవు. కావున నాగంగకు స్వర్గములోను భూమియందును గలిగినవృత్తాంతమంతయు సవిస్తరముగాఁ జెప్పవలయును. ఆలోకపావని మూఁడు మార్గములఁ బ్రవహించుటకుఁ గారణమేమి? ధర్మజ్ఞా! త్రిపథగ యనునది యెట్లు? ఏకార్యములు సేసి ముల్లోకము లందును నదీలలామమని ప్రఖ్యాతిఁ బొందిన' దని యడిగిరి. అందుల కాతపోధనుఁడు దేవమానుష లోకములందు జరిగిన యాగంగావృత్తాంతము నంతయు సవిస్తరముగా ఋషిమధ్యమున నిట్లని చెప్పె. "కాకుత్థ్సా! తొల్లి మహాతపస్సంపన్నుఁ డగు శివుఁడు పార్వతిని బెండ్లియాడి యాదేవిని జూచి తపోనిష్ఠుఁ డయ్యుఁ గామబాణవిద్ధుఁడై మరులుగొని యామెతో రతికేళికిఁ దొడంగినవాఁడయ్యె. ఇట్లు మన్మథక్రీడల నూఱుదివ్యవర్షములు గడచియు ఆదేవునకామెయందుఁ గుమారుఁడు గలుగఁ డయ్యె. అంత బ్రహ్మ మొదలగు దేవతలు 'ఈపార్వతియందుఁ బుట్టుభూతమును ఎవఁడు సహింపఁగలఁ' డని భయమునొంది యందఱును శివునికడకు వచ్చినిచ్చలు చాఁగి మ్రొక్కి 'దేవదేవా! మహాదేవా! నీవు లోకహితాచరణశీలుఁడవు; కావున నీచరణారవిందములఁబడి వేఁడుసురలకు మాకు నీవు ప్రసన్నుఁడవు కావలయు. దేవాధీశ్వరా! నీతేజంబునఁ బుట్టినపుత్త్రుని లోకములు ధరింపఁజాలవు.

కావున నీవు వేదచోదితం బగుయోగంబుఁ బూని పార్వతీ దేవితోడఁ దపము సేయుము. ముల్లోకములకు మే లొనర్చు పురుషార్థము కొఱకు నీ రేతమును దేజోమయ మగు నీ దేహమునందే దాల్పుము; కాని విడువకుమా. (ఈలోకముల నెల్ల గావుము. లోకములను రూపుమాపుట నీకుఁ దగదు గదా)' యనిరి. దేవత లాడిన యవ్వాక్యము విని యాసర్వలోక మహేశ్వరుఁడు 'నల్లె' యని, యాదేవతలను జూచి 'నేను మత్తేజమును నాదేహమందే నిలుపుకొనియెద. పార్వతియు నిజశోణితము తనయందే నిలుపుకొనెడు. దేవతలును ఎల్ల లోకములును సుఖము నొందుఁ గాక. నా రేతస్సు నేను లోపలనే యడంతును. కాని యందుఁ గొంత యింతకు స్థానముననుండి చలించియున్నది గాన చలించియున్న యాభాగమును మాత్రము విడువవలసి యున్నది. ఉత్కృష్టమైన యాయంశము విడుచునపుడు దానిని ధరింపఁ జాలువాఁడెవఁడు? చెప్పుఁ డనఁగా దేవతలందఱును ఆయాలపోతు పడగ వానిని జూచి 'దేవా! చలించి యున్న రేతమును ఈభూమి ధరింపఁగల' దని బదులు చెప్పిరి. అంత రుద్రుఁడును దనవీర్యమును విడువగా, నది భూమి యందలి పర్వతముల నరణ్యముల నెల్ల వ్యాపించె. పిదప దేవత లాతేజము భూతలమంతయు వ్యాపించుటకు భయపడి యగ్ని దేవునిఁ జూచి, యతఁడు మొదట వెఱచినను నియ్యకొలిపి 'నీవు వాయువును గూడి యీశివరేతమునఁ బ్రవేశింపు' మని చెప్పఁగా నగ్నియు నా రేతమును జొచ్చి వ్యాపింపఁగా నది తెల్లనికొండ యైనది. పిదప నది కాలపరిపాక వశమున సూర్యాగ్ని సమప్రభమును దివ్యము నగుశరవణము (తెల్లుతంపర) అయ్యె. అందుఁ గృత్తికాసుతుఁడును అగ్ని సంభవుఁడు నగు కుమారుఁడు పుట్టె. అప్పుడు దేవతలును ఋషిగణమును మిగుల సంతసిల్లి పార్వతీ పరమేశ్వరులకు మిథునకర్మను చెఱుచుటవలని కోపము ఉపశమించుటకై యాయిద్దఱ నెంతయుఁ బూజించిరి. పిదపఁ బార్వతి యాసురలఁ జూచి 'నాకుఁ బతిసంగమముఁ బాపినయీ యప్రియమునకుఁ బ్రతిఫల మనుభవింపుఁ' డనుచుఁ గోపంబు పెల్లున సూర్యునివలె మండి వెలుంగుచు జలములు గయికొన్ని కినుక పెంపునఁ గన్నుఁగవ కెంపుమీఱ, వారిని 'పుత్రుసంగనుటకు నువ్విళులూరుచుండిన నాకుఁ బతితోడ సంగతిని నివారించితిరి గాన మీకును మీమీ భార్యల యందు సంతానము గలుగదు. నేడు మొదలుగా మీయిల్లాండ్రు గొడ్డురాండ్ర' గుదురునుఁడీ, యని శపించె. ఇట్లు సురలనెల్ల శపించి భూమిని జూచి 'పంటనలంతీ! నీవు వృక్షరూపున నుండక చవుడు మొదలగు నానా విధరూపములు గలదానవై పెక్కురాజులకు భార్య వగుదువు. నీవు గడుదుష్టబుద్ధివి గాన నాకుఁ బుత్రుఁడు గలుగుట కొల్లవైతివి. కనుక నాశాపమువలన నీవు ప్రకృతి కలంగి కొడుకువలనఁ గలుగు సంతోషము నొందకుందు,' వని శపియించె. తిట్టువడి దేవతలందఱు సిగ్గున విన్ననై యుండుట శివుఁడును జూచి తనలో 'ప్రియురాలిడిన శాపమును మరల్పను

రాదు. ఈ నాయనుచరులు పడుదుగఖనూఁ జూడను రా, దని యప్పుడు వరుణ పాలిత మగుపడమటిదెసకుఁ బోయి యచట హిమవంతమున కుత్తర పార్శ్వము నందుఁ గలదాని శిఖరమునం దొకట దేవితోడఁ గూడి యెప్పుడును దపమాచ రింప సంకల్పించుకొన్న వాఁడయ్యె. రామా ! పర్వతపుత్త్రియైన పార్వతీ వృత్తాంతము నిదె సవిస్తరముగా నీకుఁ దెలిపితి. ఇఁక గంగానది ప్రభావమును గంగ వలనఁ గుమారస్వామి పుట్టుటయుఁ జెప్పెద. నీవును లక్ష్మణుఁడును వినుఁడు.' ఇది ముప్పదియాఱవ సర్గము.

---

## కుమారునిజన్మ వృత్తాంతము.

"తొల్లి శివుఁ డట్లు తపము సేయుచుండఁగా దేవతలును మునులును దమకు సేనాపతిని ఒకనిని గోరి బ్రహ్మకడకుఁ బోయి యింద్రుఁ డగ్ని మొదలుగాఁ దారందఱును మహాత్ముం డగునాపితామహునకుఁ బ్రణమిల్లి 'దేవా ! తొల్లి, దేవరమాకు దళవాయిగాఁ జేసిన యాభగవంతుఁడు శత్రునిహంత యగుశివుఁడిపుడు మాకు సేనాపతిగా నిలువఁ డయ్యె. మాతండ్రి యాభగవంతుం డిపుడు హిమాలయశిఖరమున నెనుతపంబు నూఁది పార్వతిని గూడి దానిని జలుపుచున్నాఁడు లోకహితార్థం బికఁ జేయవలసిన కార్యం బెద్దియో దానిని ఘటింపుము. నీవు సమస్తమును ఘటింప నెఱింగిన వాఁడవు. నీవే మాకుఁ దెనుదిక్కు' అనిరి. దేవత లాడినవచనము విని సర్వలోకపితామహుఁ డగునద్దేవుఁడు 'శివుఁ డుగ్రతపముఁ బూనినవాఁడు. కాన యతనిని మరల్పఁ దరము గాదు. కనుక నందులకై పూనను దగ' దని తీయని పలుకుల వారికి మాటట చెప్పి యి ట్లనియె. 'పార్వతీదేవి దేవతలకు నిజపత్నులయందు సంతానము కలుగ దని శపించుటవలన మీరు మీపడంతులందు సంతానముఁ బడయు లేరు. ఆదేవిశాపం బమోఘంబు. ఇది నిజముగాన మీరు సందియపడవలదు. అయిన నికఁ గతి యె ట్లందు రేని యిదె యీయాకాశ గంగయం దగ్నిదేవుఁడు నొకపుత్త్రునిఁ గాంచు. వాఁడు పగవారినెల్ల నణంపఁ జాలుపరాక్రమమున దేవతలకెల్ల సేనాపతి యగు. 'గంగ యిందుల కెట్లు సమ్మతించు? పార్వతియుఁ గోపింపకుండునా?' యనవలదు. 'గంగ హిమవంతుని పెద్దకూఁతు రేకదా. ఆమె యాపుత్త్రుని గారవమాతో(?)నఁగా, తనయప్పవలని ప్రీతిం జేసి పార్వతియు వాని నెంతయుం గయికొనును. ఇందులకు సందియము లే' దనియె. రఘునందనా ! దేవతలావాక్యము విని కృతార్థులకాఁ దమ్ముఁ దలఁచి యందఱును బ్రహ్మకు మ్రొక్కి మిక్కిలియుఁ బూజించి యంత వివిధధాతుచిత్రితమై, రుద్రతేజమును దహించినయగ్ని దేవుసిస్థాన మగుకైలాసపర్వతమునకుఁ బోయి పుత్త్రోత్పాదనమునకొఱకు న త్తేజమునందు మూర్త్యంతరముతో నెల కొనియున్న యద్దేవునిఁజూచి 'హుతాశనా ! దేవకార్యంబది సంఘటింపుము.

అది యెద్ది యన, నీవు మహాతేజఁడవు గాన పర్వతపుత్త్రియైన గంగయందు నీ వలమియున్న శివరేతమును విడువు' మని నియోగించిరి. అతండును 'వల్లె' యని దేవతలకు నియ్యకోలు చెప్పి గంగాదేవికడకుఁ జని 'దేవీ! నీవు చూలుదాల్పుము. ఏలన నిది దేవతలకెల్ల బ్రియమైనది' యని చెప్పఁగా విని యద్దేవి దివ్యస్త్రీరూపము దాల్చినదయ్యె. అగ్నియుఁ దదీయసౌందర్యాతిశయముఁ గాంచి మించుమరులునఁ దనయవయవములన్నింటి వలననుండియు నా రేతమును విశిచి, యా దేవి యంగంబు లన్నిటు వ్యాపించునట్లు దాని చేఁ దడిపినవాఁ డయ్యె. అంత గంగానది యవయవము లన్నిటను ఆ రేతము నిండారినదయ్యె. అట్లు దాల్చినయగ్ని తేజము తన్ను దహింపఁగాఁ జిత్తం బుత్తలపడ గంగ యాసకలదేవపురోహితుని హుతాశనుని జూచి 'దేవా! నీ తేజము నేను దాల్పనోప. కాన యిది వర్ధిలుట మఱి యెట్లు' అనఁగా, దేవతలు వేల్పుహవిస్సులనెల్ల లోఁగొనునా దేవుఁడును గంగను జూచి 'ఇదె యీహిమవత్పర్వతపాదమునందే యీగర్భము నునుపు' మనఁగా నమ్మాటవిని తేజంబు వెల్లున విలసిల్లుచున్న యాగర్భమును తనయింద్రియముల వలన నుండి తీసి విసర్జించె. ఆ గంగవలన నుండి వెడలి పుడమిని బడినశోణిత రేతములు కడానిబంగరువలె రంగారుబంగారును నచ్చలంపుమేలి వెండియు నయ్యె. అందలి కారమువలననే రాగియు నల్లనియినుమును బుట్టినవి. అందలిమలము తగరమును సీసమునయ్యెను. ఇత్తెఱంగున గంగానిర్గతమగు రేతము భూతలమునఁబడి నానావిధధాతువులుగాఁ బరఁగె. గంగ యాగర్భము నుంపఁగానే యా శ్వేతపర్వతమున మొలచి యున్న ఱెల్లువనమంతయు దాని వెలుంగు వెల్లికల మునింగి బంగరుమయమయ్యె. పురుషసింహమా! బంగారమపుడు పుట్టినది గాన యది మొదలుగా నిగ్గనిఖోలు నిగ్గున నిగనిగలాడు నామేలిబంగారును జాతరూపము (పుట్టినరూపముగలది) అని పేరుకొనంబడినదయ్యె. ఆవనమందలి తృణ వృక్ష లతాగుల్మము లన్నియు బంగారమయినవి. గంగ రేతంబు వీడినంతఁ గుమారుండు పుట్టె. తోడనే యింద్రుఁడు మున్నగు దేవతలు కృత్తికలను జూచి 'మీరు పాలిచ్చి యీబుడుతనిఁ బెనుపుం' డని నియోగింపఁగా వారలును దేవతలమ్రోల 'నీసి నువు మాకందఱకును బుత్త్రుండయ్యెడు' మని మేలగుసమయంబు గావించుకొని యాపుట్టినపట్టికిఁ బాలు గుడుపం దొడఁగిరి. అంత దేవతలందఱు 'నీకుమారుఁడు కార్త్తికేయుఁడని ముల్లోకములఁ బరఁగు, ఇందులకు సందియములే' దనఁగా నప్పలుకువిని కృత్తికలును నియ్యకొని యగ్నింబోలె నధికకాంతిం దేజరిల్లుచు గర్భస్రవమునఁ బడియున్న యక్కుమారునిఁ గొని గర్భస్రవమెల్లను బోవునట్లు జలకమార్చి, యగ్గింబోలు నమ్మహాభాగుఁడు కార్త్తికేయుఁడు గర్భస్రవముననుండి స్కన్నుం (పడినవా) డగుటం జేసి నతనికి స్కందుఁడని పేరిడిరి. జలకమార్చిన పిదపఁ గృత్తికలకు మేలైనపాలు చేఁపఁగా నతఁ డాయాఱ్వురచన్నుఁబాలును,

ఆఱుమొగములు దాల్చి త్రావినవాఁడయ్యె. ఆవిభుఁడు నొక్కదినమునఁ జన్నుఁ బాలుద్రావి యంత సుకుమారశరీరుఁ డయ్యెను శివవీర్యజనితుఁడు గాన తనయ వార్యవీర్యమున రాక్షససేనాసమూహముల గెలిచినవాఁ డయ్యె. అంత నగ్ని ప్రముఖు లగుసురలందఱును సరిలేనికాంతిని వెలుఁగు నక్కుమారుని తమసేనల కెల్ల నధిపతిగా నభిషేకించిరి. రామా ! నీవు నన్ను గంగాదేవిని గుఱించిన దేవలోకవృత్తాంతమును సవిస్తరముగాఁ జెప్పు మని యడిగితివి. ఈ కుమార సంభవమే ఆ కథావిస్తరము. ఇది నీకుఁ జెప్పితిని. ఇది మిక్కిలిధన్యమును బవిత్రమునై నది. కాకుత్థ్సా ! కృత్తికాసుతునికిఁ బుడమియం దేమనుజుఁడు భక్తుఁడగునో వాఁడాయుష్మంతుఁడై పుత్రపౌత్రసహితుఁడై యుండియంతమం దాస్కందుని తోడిలోకంబుఁ బ్రాపించు" ననియె. ఇది ముప్పదియేడవ సర్గము.

---

## సగర వృత్తాంతము.

కౌశికుఁడు కాకుత్థ్సునకు నాకథను జెప్పి మరల మఱియొకమాట నిట్లని చెప్పె. 'రామా! తొల్లి అయోధ్య కధిపతి యైనసగరుం డనురాజొకఁడు గలఁడు. అతఁడు మిక్కిలిశూరుఁడు; ధర్మాత్ముఁడు నగు. అతనికి సంతానము లేమిచేత దానిని బడయుకోరికి పొడమె. విదర్భాధిపతికూఁతురు కేశిని యనునది యాసగరుని జ్యేష్ఠపత్ని. ఆమె యెంతయుధార్మికురాలును సత్యవాదినియు నై యుండెను. కాశ్యపుని కూఁతురు సుమతి యనుపేరు గలది యాతని ద్వితీయపత్ని. చెలువమునం దాచెలువకుఁదుల యగుచిగురాకుఁ బోఁడి పుడమిని గానఁబడుట యరిది. ఆ రాజాయిద్దఱు రాజాననలంగూడి హిమవంతమున కరిగ భృగుప్రస్రవణ మనుదాని ప్రత్యంతపర్వతమునఁ దపము సల్పె. అంత నూఱుసంవత్సరములు నిండఁగా సత్యవంతులలో మేలుబంతి యగు భృగుమహర్షియు వారలతపమునకుఁ బ్రసన్నుఁడై సగరుని జూచి 'అనఘా! పురుషవరేణ్యా! నీకు మిక్కిలి యెక్కుడగు సంతానము గలుగును. దానిచేత నీకీర్తియు సాటిలేక భూతలమునఁ బరఁగు. నీపడఁతులయం దొకతె వంశకరుఁడగు కుమారు నొకరునిఁ గాంచు,మఱియొకతె కేవలులైన యఱువదివేవురు కుమారులఁ గాంచు'నని వర మొసఁగె. ఇట్లు పలుకు చున్న యమ్మహాత్మునిని, అపు డారాజపుత్రిక లారాధించి మిక్కిలి ప్రీతి గడలుకొనఁ గేలు మొగిచి యమ్మునితో 'బ్రాహ్మణోత్తమా! ఎవతె యెక్కనిని గనును? ఎక్కండ్రు వ్వతెకిఁ బుట్టుదురు.దీనిని వినఁగోరెదము. నీ వెవతె కెట్లు చెప్పుదువో యది చెప్పకుండుఁగాత' మనఁగా నాపలుకు విని యాపరమధార్మికుఁడు వారితో 'ఇందు మీయిచ్చ దెలుపుఁడు. వంశకరుఁ డగునొకకనిని గోరిన నొకండేని కలుగును. లేక మిక్కిలిబలమును మంచి కీర్తియుఁ గలిగి మహోత్సాహవంతు లగుబహుసుతు లేని కలుగుదురు. ఈ రెండువరములలో నెవతె యెదిగోరెడి' నని యడుగఁగాఁ గేశిని యనుమత్తకాశిని మహీ

శునిసన్నిధిని వంశకరుఁడగుపుత్త్రుఁ డొక్కఁడు గావలయు నని కోరె. అప్పుడు గరుడునితోఁడఁబుట్టు వైనసుమతి మహోత్సాహులును గీర్తిమంతులు నగు నఱువది వేవురు పుత్త్రులనుఁ గోరె. రఘునందనా! ఆరాజును భార్యాసహితుఁడై యాఋషిని వలగొని యాఁదల నేలందాఁక నమస్కరించి తనపురమునకు నరిగె. అంతఁ గొంత కాలము చనఁగాఁ బెద్దదియగు కేశిని సగరునకు నసమంజుఁ డనుకుమారుని గాంచె. సుమతియో సొఱకాయవలె గుండ్రనై యుండు గర్భపిండము నొకటి గాంచిన దయ్యె. ఆపిండమును భేదింపఁగా నందుండి పుత్త్రు లఱువదివేవురు పుట్టిరి. దాదులు వారిని నేయి నిండిన కుండలయం దునిచి పెనుపఁగాఁ బెద్దకాలమునకు వారందఱును యౌవనము నొందిరి. అట్లు దీర్ఘకాలము కడచనఁగా నప్పుడు సగరునకు రూపయౌవనములఁ జెన్నారుకుమారు లఱువదివేవురు కలిగిరి. పురుషవరేణ్యా! ఆసగరుని కుమారులలోఁ బెద్దవాఁడు నిత్యమును ఊరిబాలురను గొనిపోయి సరయూనది జలంబుల వైచి వారందు మునుఁగుటను జూచి నవ్వుచుండెను. ఇట్లు పాపచరితుఁడై సజ్జనులకుఁ బీడ సేయుచు బాలురకు అహితము గావించుచు నుంటం జేసి యాపుత్త్రుని సగరుఁడు పురమునుండి వెడలఁ గొట్టె. ఆయసమంజునికొడు కంశుమంతుఁ డనువాఁడు సకలలోకసమ్మతుఁడును సర్వజనప్రియంవదుఁడునై యుండె. అంతఁ బెద్దయుఁగాలమునకు సగరునకు యజ్ఞము సేయవలయు నను బుద్ధి గట్టిగాఁ గలుగఁగా నపుడు యజ్ఞకర్మంబునందుఁ గృతనిశ్చయుఁడై యావిభుఁడు వేదవిదుఁడు గాన ఋత్విజసమూహమునుగూడి యాగము సేయ నుపక్రమించె. ఇది ముప్పదియెనిమిదవ సర్గము.



## సగరునియజ్ఞము: ఇంద్రుఁడు యజ్ఞాశ్వము నపహరించుట.

రాముఁడు విశ్వామిత్రుఁడు చెప్పుచున్నకథను విని దానికడపట 'సగరుఁడు యజ్ఞమున కుపక్రమించె' నన్నపలు కాలకించినంతనే యెంతయు సంతసిల్లినవాఁడై యగ్నివలె వెలుఁగుచున్నయమ్మునితో 'విప్రోత్తమా! మీకు శుభం బగుఁగాక. ఈ యజ్ఞకథను సవిస్తరముగా వినఁగోరెద. మావంశమునకుఁ గూటస్థపురుషుఁడగు నాసగరుఁడు యాగము నెట్లు గావించెనో చెప్పుమా' యనియె. విశ్వామిత్రుఁడు తనమనంబున 'నేను జెప్పఁ దలంచినదానినే యడిగినాఁడు. అది సర్వజ్ఞుఁడగు తా నెఱింగియు ఎఱుంగనివానివలె నడిగెడిని. లోకులకుఁబోలె రామునకును తనవంశీయులందు నెయ్య మారా!' యని నవ్వువానింబోలె నెమ్మొగము వికసిల్ల నతనితో "రామా! మహాత్ముఁ డగుసగరునివృత్తాంతము విస్తరించి చెప్పెద వినుము. శివుని మామ యగుహిమవంతుఁ డనుపర్వతరాజు వింధ్యపర్వతమునకు దాపై, తమ రెంటికి నడుమఁ బెనుకొండ లడ్డముగా లేకుండఁ జేసియుఁ, దానును మిక్కిలియుం బొడవు లగుటం బట్టియు, నొండొరులఁ జూచుచు నుండునట్లు నెలకొనియుండును. ఆ రెండు

పర్వతములకునడుమనున్న *దేశము యాగకర్మములు గావించుటకు మిక్కిలి ప్రశస్తమైనది. కాన ఆమధ్యదేశమునందే సగరునియజ్ఞము జరిగినది. వత్సా! ఆసగరునిపని పూని మహారథుఁ డగునంశుమంతుఁడు దృఢకార్ముకము దాల్చి యాతనియజ్ఞాశ్వము వెంటఁ గాపై పోయెను. సగరుఁ డాయజ్ఞము సేయుచుండఁగా నింద్రుఁడు మాయామయుఁడై యాయజ్ఞమును జెఱుపఁ జాలినరాక్షస దేహమును దాల్చి యుక్థ్యము సేయుదినమున నాతని యజ్ఞీయాశ్వము నపహరించినవాఁ డయ్యె. అమ్మహాత్ముని యశ్వము ట్లపహరింపఁబడఁగా, ఋత్విజులందఱు నా యజమానుని జూచి 'ఈయుక్థ్యదినమందు నీయాగమును జెఱుప యజ్ఞాశ్వము నెవఁడో వేగ మపహరించినాఁడు. వానిని జంపి హయమును దీసికొనిరాఁ బనుపుము. యజ్ఞమునకైన యీవిఘ్నమున మన కెల్లవారికి నమంగళము గలుగు కాన రాజా! ఈ యాగమునం దేయపరాధమును లేకుండునట్లు చేయుము' అనిరి. ఆరాజును ఆ సదస్సున ఋత్విజులాడిన వాక్యమును విని తనకుమారుల నఱువదివేవురను జూచి 'పుత్రులారా! ఈ మహాయజ్ఞము మంత్రపవిత్రులై మిక్కిలి పూజ్యులగు ఋత్విజులచే ననుష్ఠింపఁబడుచున్నది. గాన రాక్షసులరాకను అయితి యేదియు నాకుఁ గానిపింపకున్నది. మీరు పురుషశ్రేష్ఠులరు గుఱ్ఱ మెట్లు పోయెనో తెలియకున్నది. కాన మీరుపోయి వెదకుఁడు. శుభము మీకయ్యెడు. జలధివలయితమైన భూతల మంతయు వెదకుఁడు. పుత్రులారా! భూమియో మిక్కిలి విశాలమైనది. కాన మీరు వరుస నొక్కొక్క యామడగా వెదకుఁడు. నా పంపున గుఱ్ఱమును దొంగిలిన వానిని వెదకుచు, భూమి యందును వాఁడు దొరకఁడేని వెసదీయక యాతిక్కరి పోడ సూపువఱకుఁ బుడమిని గ్రొచ్చి చూడుఁడు. నేను యజ్ఞదీక్షను బూనియున్నాఁడను గానయిచటనుండి రానొప్పదు. కాన నేనును మనుమనితోను ఋత్విక్సమూహములతోను గూడి మరల గుఱ్ఱమును బొడగాంచువఱకు దీక్షతోడ నీయెడనే యుండువాఁడ' ననియె. ఇట్లు చెప్పఁగా మహాబలు లగునారాజ పుత్రులుల్లముల నెంతయు నుల్లసిల్లి తండ్రిపంపునకు లోనై పుడమియెల్ల వెదకంబోయి యొక్కొక్కఁడును ఒక్కొకయోజనము నిడుపును వెడలుపును గలయంత వంతున, భూమినంతయు దాఁకినయెడల వజ్రముల వలెనున్న తమ వాఁడి గోళ్లతో, గ్రొచ్చి వజ్రతుల్యలము లగు శూలములచేతను చాలబెడిదము లగు నాఁగేళ్ళచేతను, బగుల్లువాపఁగా పుడమియెల్ల నొక్క పెట్టున మ్రోసినది. అప్పుడు సర్పములును పాతాళవాసు లైన యసురులును రాక్షసులును దక్కుంగలజంతువులను వారలచేఁ జంపఁబడఁజొచ్చి యార్వఁగా నాచప్పుడు వినరాని దయ్యె. రాఘవా! ఆవీరు లఱువదవేల యోజనముగా భూమిని పాతాళ మగునట్లుగాఁ ద్రవ్విరి. ఇత్తెఱంగునఁ గ్రిక్కిఱిసి యున్న జంబూ ద్వీపమును

---

* 'ఆర్యావర్తః పుణ్యభూమిర్మధ్యం విన్ధ్యహిమాగయోః' అను ఆర్యావర్తదేశము.

ద్రవ్వుచు నలుగడలఁ దిరిగిరి. అంత దేవ గంధర్వులును అసురులును బన్నగులు నందఱును జి త్తము త త్తరము నొందఁగా బ్రహ్మకడకుఁ బోయి పలువిధముల స్తుతించి వదనముల విషాద మచ్చుపడ, దిగులు గడలుకొన, 'మహాత్మా! సగరకుమారులు పుడమినెల్ల ద్రొచ్చి కోరాడుచున్నారు. రసాతల వాసులగుమహాత్ములఁ బెక్కండ్రను చంపుచున్నవారు. వీఁడే మాయజ్ఞమును జెఱిపినవాఁడు; ఇదియె మాగుఱ్ఱము గొనిపోయినదని చెప్పుచుఁ బ్రాణికోటులనెల్లఁ దూటాడుచున్నారు' అనిరి. ఇది ముప్పదితొమ్మిదవ సర్గము.

---

## సగరకుమారులు కపిలుని చే నీ ఱగుట.

బ్రహ్మయును దేవతల వదనమువిని, వారు జనులనెల్ల నంతము నొందించుచున్న యాసగరసుతుల బలిమికి మోహితులై మిక్కిలి దిగులొంది యుండుటఁ జూచి, వారితో, ఈ భూమియంతయు మహాత్ముఁడగు విష్ణుదేవునిసొమ్ము. అతఁడు కపిలరూపము దాల్చి యెప్పుడు నీభూచక్రమును దాల్చియుండును. కనుక సగర రాజకుమారులు భూమిని గొనిరేని తదీయస్వామియు భర్తయు నైన యాదేవుని కోపానలంబున నీఱగుదురు. పుడమి ప్రతికల్పమును అవశ్యముగా నిట్లు త్రవ్వఁబడు చుండును. ఇది పూర్వమే నిర్ణయింపఁబడిన యది, ఇంతే కాదు. సగరపుత్రులును జిరకాలము జీవింపక నశింతురని పూర్వమే నిశ్చయింపఁబడిన' దనియె. బ్రహ్మదేవునివాక్యము విని ముప్పదిమువ్వురు దేవతలును దక్కుంగల గంధర్వాదులును మిక్కిలి యుహర్షంబు నొంది తమవచ్చిన దారిని బోయిరి. మహాత్ములగు సగరాత్మజులు భూమినిద్రవ్వుచుండఁగా వారికిఁ జేటు వాటిల్లుట సూచించుచుఁ బిడుగుం బోనియొక పెనుశబ్దము పుట్టినది. అంత నాసగరసుతులు భూమిని ద్రవ్వి దాని చుట్టును దిరిగి తురగము గానక యందఱును గూడికొని తండ్రికడకుఁ బోయి 'మేము భూమియంతయుఁ జుట్టి తిరిగితిమి. బలవంతు లగుదేవతలను దానవులను రాక్షస పిశాచోరగు లను గిన్నరులను జంపితిమి. గుఱ్ఱముగాని దానిని దొంగిలిన వాఁడు గాని మాకుఁ గానరాఁడయ్యె. ఇంకేమి సేయుదము. మీకు శుభమయ్యెడి. ఈవిషయమునం దుపాయ మరసి చెప్పుఁ' డనిరి. రఘునందనా! సగరుఁడు కొమరు లాడిన యప్పలుకులువిని తురగము దొరకమికి మిక్కిలికోపము దీపింప 'మీకు మంగళమగుఁగాత. మరలఁ బోయి భూతలమును భేదించి త్రవ్వుఁడు. గుఱ్ఱమును దొంగనుబట్టికొని కృతార్థులై మఱలుఁడు' అని యానతిచ్చె. మహాత్ముఁడగు తండ్రి పంపున అఱువది వేవురును రసాతలమునకు వేగపాఱి దానిని ద్రవ్వ చుండఁగా నయ్యెడఁ బెనుఁగొండ వడువునఁ బొడతెంచుచు భూమిని దాల్చు చున్న విరూపాక్షు మనుదిగ్గజమును గాంచిరి. రఘుకులతిలకా! ఆ గిజరాజము సకలపర్వత వన రాజిసహిత మగుభూవలయము నంతయు శిరమునఁ దల్చి యున్నది. అమ్మహా

గజము మహాభూభరమును మోచుటవలని యలజడిచేఁ గొంత యలఁతదీర్చు కొనఁబూని యేతఃణమున శిరముఁ గదల్చునో యప్పుడు భూకంపము కలుగును. వారు ఆదెసను బాలించునాదంతా వళమును వలగొని దానిని బూజించుచు రసాతలమును ప్రక్కలించిచనిరి అట్లు దూర్పు దిక్కును ప్రక్కలించి పిదప దక్కినంపు దిక్కును ఛేదింపఁ జొచ్చిరి ఆదిశయందును మహాపర్వతతో పమానమై మిక్కిలి మహిమచే రహించు మహాపద్మమను దిగ్గజరాజమును జూచి యది భూచక్రముఁ దలను దాల్చుటకు నెంతయు నచ్చెరు పడినవారైరి అంత నాయఱువది వేవురు సగర కుమారులును దానికిఁ బ్రదక్షిణముసేసి పడమటిదెసను భేదించిరి అందు నమ్మహాబలులు పెనుఁగొండవలె గిండు మీఱుచున్న సౌమనమను పెనుదిగ్గజమును గాంచిరి. దానిని వారు వలగొని కుశల మడిగి వీడుకొని హిమవంతపుఁ జక్కటి దిక్కును ద్రొవ్వం దొడఁగినవారైరి. రఘువరేణ్యా! ఉత్తరపుదిక్కున నొప్పిద మగుమేనిచే నీ భూమిని దాల్చుచు మంచునుబోలి తెల్లనై మించు భద్రమను దిగ్గజమును వారు చూచి యందఱును దానిని స్పృశించి దక్షిణమును జేరి యఱువదివేవురును వసుధాతలమును ఛేదించిరి. అంత నాసాగరులు తురగము పోకడకుఁ దగునీశానుదిశకుఁ బోయి రోసముమీఱ భూమిని భయంకరవేగమునఁ ద్రవ్వుచు బోయి మహాకాయు లగునమ్మహాబలు లచట సనాతనుఁ డగువాసుదేవుని గపిలావతారునిని అద్దేవునికిఁ గొంతదూరమునఁ బులుమేయుచు మెలంగుచున్నయశ్వమును జూచిరి అట్లు చూచియందఱును మిక్కిలియు హర్షమునొంది యాతనిని దురగము దొంగిలికొని పోయినవానినిగాఁ దలంచి కినుకచేఁ గన్నులు గిఱ్ఱుకొన గుద్దంద్రను నాఁగేళ్లను నానావృతములను శిలలనుఁదాల్చిపాఱుతెంచి 'నిలునిలు' మనియదల్చి 'ఓరీ! మాయజ్ఞాశ్వము నీవపహరించినాఁడవు. దుర్బుద్ధీ! ఇదె సగరకుమారులము మేమువచ్చితి మని తెలియుము' అనఁగా వారలపలుకులువిని కపిలుఁడును మిక్కిలియు రోషావిష్టుఁడై యపుడు హుంకారముసేయఁగా నప్రమేయవిభవుఁ డగు నమ్మహాత్మునిచేత ఆకుమారు లందఱును బూడిదరాసులై కూలిరి. ఇది నలువదియవ సర్గము.

---

అంశుమంతుఁడు సగరునియజ్ఞాశ్వమును దెచ్చుట.

రఘునందనా! సగరుఁడు తనపుత్రులు పోయి బహుకాలమగుటఁ దెలిసి నిజతేజమునఁ బ్రకాశించుచున్న మనుమనిఁజూచి 'వత్సా! నీవుశూరుండవు. శస్త్రాస్త్ర విద్యలం దారి తేఱినవాఁడవు. కావునఁ బ్రతాపమునఁ బూర్వరాజులతోఁ బురుడించువాఁడవు. నీపినతండ్రులు పోయినతెఱఁగును, గుఱ్ఱమును గొని పోయినవానిని, వెదకుము. పుడమికి లోపలఁ బొడమినజంతువులు ఎంతయు గొప్పలై మంచిబలిమిచే నొప్పుచుండును. అట్టివానిని బొదవదంచుటకై వాలును

విల్లునుదాల్చి యరిగి యెరఁగం దగినవారి కెరఁగి, యడ్డుచూపినవారిని అశ్వమును దొంగిలినవానిని రూపుమాపి పోయినకార్యం బొడఁగూర్చుకొన్నవాఁడవై మఱలి, మదీయయజ్ఞము సమాప్తినొందింపుము' అనియె మహాత్ముఁ డగుసగరుఁడు అటు లొత్తిచెప్పఁగా అంశుమంతుఁడును బురికొని ధనుఃఖడ్గములు దాల్చి శీఘ్రగమన మున గండం ద్రగుతనతండ్రులు భూమికిలోనఁ ద్రవ్వినమార్గమునఁ బోయి అయ్యెడ దైత్యదానవరక్షః పిశాచపత గోరగపూజ్యమానమును, మహాతేజము నగుదిశాగజంబును గాంచినవాఁడయ్యె అట్లు గాంచి దానికిఁ బ్రదక్షిణము సేసి యారోగ్య మడిగి తనతండ్రులచందమును గుఱ్ఱముఁ గొనిపోయినవాఁ డెవ్వఁ డగుటయు విచారించె. దిగ్గజంబును, ఆయంశు మంతుఁడడిగిన వచనము విని 'అసమంజతనూజా ! నీవు గుఱ్ఱము గొనివచ్చినకార్యము ఒనఁగూడి వేగమే పోవఁగలవు' అని మాఱువలుకఁగా అది విని యతఁడు దిగ్గజంబుల నన్నింటిని వరుసగా న్యాయముచొప్పున సవినయముగా నడుగఁగా ఆదిగ్గజములును ఇతరు లాడువాక్యముల యభిప్రాయములు దెలియుటయే కాక తామును బొంకముగా మాటలాడఁజాలినవిగాన యాయంశుమంతునిఁ బూజించి 'గుఱ్ఱముతోడఁగూడియే నీవు పోవుదు' వని యాతనిపూన్కిని బురికొలుపఁగా నమ్మాట విని యాతఁ డును జులుకఁగా వడి నడతెంచి తనపినతండ్రులు సగరకుమారులు నివుఱుంబ్రోవు లై పడియున్న యెడకుఁబోయెను.ముందే వారగపడమికి మిగుల వగచుచుండిన యా యసమంజసుతుఁ డపుడు వారు రూపు మాయుటయుఁ దెలిసి దుఃఖము వెల్లడర మిక్కిలియు నార్తితో నేడ్చుచు నందుఁ గొంతదవ్వునఁ దిరుగుచున్న యజ్ఞాశ్వ మును జూచి యేచినవగ విలపించినవాఁ డయ్యె అంత నమ్మహాతేజుఁ డా రాజ పుత్రులకు జలక్రియలు చేయఁగోరి జలములు కావలసి వెదకఁగా నొక సరస్సును గానఁ బడదయ్యె కడు దవ్వుగా నతండు చూడ్కినిగిడించియు నీటిపట్టు నేదియుఁ గానక పిదప వాయుసమాన వేగుఁడును ఖగాధినాథుఁడును అగు గరుడునిఁగాంచె అతఁడు తనతండ్రులకు మేనమామ. అమ్మహాబలుఁడు వైన తేయుఁడంశు మంతుని జూచి 'పురుష సింహామా! నీపినతండ్రులకైన యీవిధము లోకమునకు హితమే యైనది, కాన వగవం బనిలేదు కొలఁది లేని మహిమ గల కపిలునిచే నిమ్మహాబలులు దహింపఁబడిరి అక్కపిలుఁడు * బ్రాహ్మణుండుగాన యాతనిచే నీల్గిన వీరికి నీలోక

* 'చణ్డాలా దుదకాత్సర్పాద్వైద్యుతాద్బ్రాహ్మణాదపి। దంష్ట్రిభ్యశ్చపశుభ్యశ్చమరణంపాపకర్మణాం॥ఉదకం పిణ్డదానంచ ఏతేభ్యోయద్విధీయతే।నోపతిష్ఠతితత్సర్వమన్తరిక్షేవినశ్యతి॥ చండాలునివలనను,జలమువలనను, సర్పమువలనను, మెఱుపువలనను, బ్రాహ్మణునివలనన, కోఱలుగల క్రూరజంతువువలనను, పశువులవలనను మరణము పాపకర్ములకుఁ గలుగును 'అట్లు మరణించినవారికి ఈయంబడు జలతర్పణముగాని పిండప్రదానముగాని వారింజేరదు అది యంతరిక్షమందేనశించు' నను ధర్మశాస్త్రముం బట్టి బ్రాహ్మణుఁడగు కపిలునిచేఁ జచ్చినవారికి జలతర్పణము వలదనఁబడియె.

మందలి జలముచేఁ దర్పణమువిడువ రాదుగాదా. ప్రాజ్ఞుఁడవగు నీకిది తెలియనిది గాదు. హిమవంతుని పెద్దకూఁతురు గంగయనునది గలదు. మహాబాహూ! నీవు దానియందే తండ్రులకు జలతర్పణమును జేయుము. దాని జలముల వట్టితర్పణమే కాదు. అది లోకపావని గాన యీబూడిద కుప్పలను దడుపవలయు. అట్లుసేయు నేని యాలోకకాంత, తనజలములం దడిసిన యీ బూడిదరాసుల అఱువదివేవురు కుమారుల స్వర్గలోకము నొందించు. పురుషలలామా! నీవుమహా భాగ్యవంతుం డవు గాన గుఱ్ఱముదొరకె. దానిని గొని సగరుకడకుఁ బొమ్ము, వీరుఁడవు కాన నీవే నీపితామహుని యజ్ఞము నిర్వహింపఁ దగు' ననియె. ఆపరాక్రమ వంతుఁడును గరుత్మంతుని మాటవిని గుఱ్ఱమును గొని నిజయశము నలుగండలం బ్రకాశింప మరలివచ్చి యజ్ఞదీక్షితుఁడై యున్న సగరధరాధ్యక్షుంజేరి గరుడుఁడు చెప్పినఁ దనతండ్రుల వృత్తాంతము నెఱింగించె. సగరుండు నంశుమంతుండు సెప్పిన యాబెడిదంపువార్త విని విదపక్రమముచొప్పున శాస్త్రవిధిప్రకారముగా యాగమును నిర్వర్తించి దానంజేసి యెంతయుఁ గాంతిం దళుకొత్తుచు నిజపురముఁ జొత్తెంచె. ఆరాజునకు గంగానదిని దెచ్చుట కేయుపాయమును దోఁపకపోయె. ఇట్లారాజుల పెన్నద్ది పెద్దయుఁ గాలమున కేని యేయుపాయమును జేయక ముప్పదివేల యేండ్లు రాజ్యముసేసి దేవలోకముఁ బ్రాపించినవాఁ డయ్యె. ఇది నలువదియొకండవ సర్గము.

---

## భగీరథుఁడు గంగను దెచ్చుటకై తపముసేయుట.

సగరుఁడు కాలధర్మమునొందఁగా మంత్రిజనులు పరమధార్మికుఁడైన యంశుమంతుని రాజుగాఁ గోరిరి. రామా! ఆయంశుమంతుఁడు మిక్కిలియు గొప్పరాజై యొప్పె అతనికి దిలీపుఁడనుకుమారుఁడుండె. ఇతఁడును మిక్కిలివన్నె కెక్కినవాఁడు. మహాకీర్తిమంతుఁడగు నంశుమంతుఁడు దిలీపునియందు రాజ్యమునుంచి గంగను దెచ్చుటకై తపోవనమునకు నరిగి తాపసిద్ధై పవిత్రమగు హిమగిరిశిఖరమున ముప్పదిరెండు వేలేండ్లు మిక్కిలిఘోరమగుతపము సలిపి గంగనుబొందక స్వర్గము చెందినవాఁడయ్యె. మహాతేజుఁడగు దిలీపుఁడును దనతాతలపమృత్యువువాతఁ బడుట విని తన తండ్రి యట్టి దుష్కరతపము గావించియు వారలకు గతి గలుగమికి దుఃఖము మిగిలి బుద్ధికలఁగంబాఱి, ఏయుపాయమును నిశ్చయింప నేరక 'గంగను దెచ్చుట యెట్లు? వారికి జలక్రియ లాచరించు టెట్లు? వీరల నీదుర్గతిని దరింపఁ జేయుట యెట్లు?' అని నిరంతర చింతాపరుఁడై యుండె. ఆత్మవిదుఁడగు నామేదినీవరుఁ డట్లు ధర్మమునంజేసి తాతల నుద్ధరించుట నెప్పుడును జింతించుచుండఁగా నాతనికిఁ బరమ ధార్మికుండగు భగీరథుఁ డను కుమారుఁడుపుట్టె దిలీపుఁనుడు దన తేజము నలుగడల రాజిల్ల యజ్ఞములు పెక్కులుగావించి ముప్పదివేలవత్సర

ములు ప్రజారంజకముగా రాజ్యము గావించె. అంత కాలమునకును ఆమహీపాలుఁడు సగరాత్మజుల నుద్ధరించుట కేవెరవునుగానక యాదుఃఖమున వ్యాధిగ్రస్తుఁడై పుత్త్రుఁడగు భగీరథుని రాజ్యమున కభిషిక్తు జేసి వ్యాధివలనఁ గాలధర్మమునొంది పురార్జితపుణ్య కర్మవశమున దేవలోకము నొందినవాఁ డయ్యె. ఆభగీరథుఁడు రాజర్షి యుఁ బరమధార్మికుఁడును మహాతేజుఁడునై విలసిల్లుచు స్సంతానము లేక దానిఁ బడయఁ గోరినవాఁడయ్యె. అతఁడట్లు సంతాన హీనుఁడు గాన నిజరాజ్యమును బుత్త్రుఁడు లేమిం జేసి మంత్త్రులయం దుంచి గంగను బుడమికిఁ దెచ్చుటయం దాసక్తినొంది హిమవత్పాదముల నొండొకటియగు గోకర్ణమున కరిగి యూర్ధ్వబాహుఁడును జితేంద్రియుఁడునై మాసమున కొక్కమాటు భుజించుచుఁ బంచాగ్నులనడుమ నిలిచి దీర్ఘతపము గావించె. అతం డట్లు భయంకరమగుతపము సలుపుచుండఁగాఁ బెక్కువేలేండ్లు గడచినవి. అంత సకలనియంతయుఁ బ్రజాపతియునగుభగవంతుండు బ్రహ్మదేవుండమ్మహాత్మునితపమున కెంతయుఁ బ్రీతుడై సురగణములఁగూడి తపము సేయుచున్నయమ్మహీయునికడకు వచ్చి 'భగీరథా! నీవు మహాభాగుఁడవు. దృఢవ్రతమున నీవెంతయుఁ జక్కనితపము సలిపితివి. కాన నీయెడఁ గడుఁ బ్రీతుఁడ నయితి. వరము వేఁడు' మనఁగా తపమువెల్లునఁ దేజము వెల్లిగొనుచున్నయాభాగ్యనిధి యాదేవుని కెదుటనిలిచి కేలు మొగిచి యాసర్వలోకపితామహునితో 'మహాత్మా! నీవు నాతపమునకుఁ బ్రీతుండ వయితేని' నాచేసిన తపమునకు ఫలము గలదేని, సగరకుమారు లందఱును నావలన జలతర్పణము నొందఁగలవారు. జలతర్పణమే కాదు. నాముత్తాత లగునీమహాత్ముల భస్మము గంగాజలములఁ దడియునేని వారందఱు నక్షయమగుస్వర్గముఁ బ్రాపింతురు. ఇంతే కాదు. ఇక్ష్వాకు కులమునఁ బుట్టిననాకు సంతతియుఁ బ్రసాదింపవలయు. మా వంశము గృశింపరాదు గదా. ఇదియ నారెండవవరము' అనియె. రాజిట్లుసెప్పఁగా సర్వ లోకపితామహుఁ డతనికి మధుర పదగుంభితమై మనోహరార్థ విజృంభితమైన శుభవాక్యమున 'మహారథా! ఓభగీరథ! నీకోరినయట్లే యగు. శుభము గలుగు. ఇక్ష్వాకుకులము వర్ధిల నీకు సంతానమును గలుగు. హిమవంతునికి దాపుననున్న యీగంగ హిమవంతుని పెద్దకూతురు. దానిని దాల్చుటకు శివుఁడే శక్తుఁడగుఁ గాన దాల్చుటకై యద్దేవునిం బ్రార్థింపుము. గంగ దేవలోకమున నుండి క్రిందికి నురవడించునపుడు దానిపాటును భూమి సైఁపఁజాలదు. నీవు వీరుఁడవు. అయినను దానిని దాల్పఁజాలువాఁడు శివునికన్న వేఱొక్కఁడు నాకుఁ గానిపింపడనియె. ఇట్లు లోకకర్తయగు నావాణీభర్త రాజునకుఁ జెప్పి గంగను జూచి ఇతండు కోరినతఱి ననుగ్రహింపుమీ' యని పలికి దేవమరుద్గణ పరివృతుఁడై త్రిదివమునకు వేంచేసె. ఇది నలుఁవదిరెండవ సర్గము.



### భగీరథుఁడు గంగను దెచ్చుట.

దేవదేవుఁ డగునా బ్రహ్మదేవుఁ డరుగఁగా, భగీరథుఁడు భూమియందు బొటనవ్రే లూని నిలిచి (యూర్ధ్వబాహుఁడును వాయుభక్షుండు నై యేపట్టును ఆధారమును లేక రేయుంబవలు స్థాణువువలె కదలక నెలకొని) యొక సంవత్సర కాలము శివు నుపాసించె. అంత సంవత్సరము నిండఁగా సర్వలోక నమస్కృతుం డగుపశుపతి పార్వతితోడఁ బ్రత్యక్ష మయి రాజునుజూచి 'నరవరా; నీయెడఁ బ్రీతుఁడనైతి. పర్వత రాజనందన యగుగంగానదిని శిరమున దాల్చి నీయిష్టము దీర్చెద' ననియె. అంత జగము లెల్ల మ్రొక్కునట్టియామంచు కొండతొలుపట్టి యపుడు పెనురూపము దాల్చి బెట్టిద మగువేగమున, ఆకాశమునుండి శుద్ధ మగు శివునిశిరమునఁబడి తనలోని ట్లని చింతించె. ఎవ్వారికిని ధరింపఁ దరము గాని నన్ను శివుఁడు దా దాల్తునని పూనె. 'కాని; నాప్రవాహమున నీతనిని దీసికొని పాతాళముఁ జొచ్చెద' నని చింతించి తగినట్టి రూపమును వేగమును దాల్చి పడినయాగంగగర్వము నెఱింగి భగవంతుఁ డగుశివుఁడు క్రుద్ధుఁడై దానిని వెలికి నిగుడక తనయందే మఱుఁగుపడి యుండునట్టు లడంపవలయునని మనస్సున దలఁచెను. రామా ! ఆపుణ్యనది పెనుజడల గుంపులు బెడిదముగాఁ బెనచుకొని యొకగుహవలెఁ గాఱుకొనుచు హిమగిరిని బురుడించుచుఁ బవిత్ర మగునాశివశిరమునఁ బడినదై యెన్ని ప్రయత్నములు సేసియు నందుండి భూమిని ఎట్లును జేరఁ జాలదయ్యె. వేయేల ! ఆజడల జొంపమునఁ జిక్కువడి తబ్బిబ్బునొంది దాని నుండి వెలికి దాఱునంత మాత్రకు నేరదయ్యె. ఇఁకఁ బుడమికి దిగుట చెప్పనేల? ఇట్లాజటాపటలముననే యద్దేవి బహు సంవత్సరములు సుడివడుచుండె. అంత భగీరథుఁ డందు గంగానదిని గానక మఱలఁ బెనుతపము గావింపఁగా దానికి శివుఁ డెంతయు సంతసిల్లి బ్రహ్మనిర్మితమగుబిందు సరస్సుఅను సరస్సునం దాగంగను విడిచినవాఁడయ్యె. అట్లుదానిని విడుచునపుడు ఏడుప్రవాహములు గలిగె. మంగళ జలకలితములును మంగళకరములునగుహ్లాదిని, పావని, నళినియనుమూఁడు గంగలు తూర్పుదిక్కునఁ బ్రవహించి నవి. శుభజలశోభితములగు సుచక్షువు, సీత, మహానదియగు సింధువు ననెడి యీమూఁడు గంగలు పడమటిదెసం బ్రవహించినవి. వానిలో నేడవదియగు గంగ భగీరథభూనాథు వెంటం జనియెను. ఆరాజర్షియు దివ్య మగురథమెక్కి తేజము వెల్లిగొన మున్నుగాఁ జనుటయు గంగ యాతనివెను దవిలిపోయె. *అట్లు ఆకాశముననుండి శివశిరంబునఁబడి యచటనుండి భూమికిదిగు పాఱఁగా ఆయురవడిచేత బెడిదంపుఁ జప్పుళ్లుమునుకొన దానిజలములు భూతలమున

* ఇచట గంగ స్వర్గాకాశభూములు మూఁటను బ్రవహించుటచేత త్రిపథగ యనంబడనని కొందఱిమతము. మూఁడుదిక్కులకుఁ బ్రవహించుటచే న ట్లయ్యె నని మఱికొందఱిమతము.

వెల్లి, విరిసిన వధ్యో. అప్పుడు గుంపుగుంపులుగా భూమినిపడుచున్న చేపలచేతను మొసళ్లుల చేతను, అట్లు పడిన తక్కిన జంతువులచేతను, భూమి యెంతయుఁ బ్రకాశించె. అంత దేవర్షి యక్షగంధర్వ సిద్ధగణము లప్పు డాకాశముననుండి యట్లు పుడమి కిడిగినగంగను జూచినడచునట్టి నగరములవలె విపులములైన విమానములను, హయములను, గజంబులను నెక్కి, సంభ్రమంబు మీఱ నాగంగాపతన దేశమున కెంతయు వచ్చిరి. భూమియందు గంగపాటు మిక్కిలి యాశ్చర్యమై సాటి లేనిది. కాన దానిని జూడఁగోరి తమయపార తేజములు నలుదెసల వెలుంగ వేలుపులెల్ల మూఁకలుగట్టి వచ్చి యయ్యెడఁ గూడిరి. అట్లు దివినుండి పిండుగట్టి వచ్చునపుడు వారల పెను తేజంబులును ఆభరణ కాంతులును ఆకాశమున వ్యాపింపఁగా నది మబ్బుమాటు లేక నూఱుగురు సూర్యులు గలిగియున్న కరణిం బురణించె; మఱియు మొసళ్లును సర్పములును చేఁపలును బెక్కులు తనయందిటునటు చంచలించుచుండఁగా మెఱపు నెఱసి యున్నదానివలె నది మెఱయుచుండె. ప్రవాహవేగమున వేయుచందములఁ జెల్లచెదరై, తెల్లని నురుఁగులును హంసల గుంపులును నాకాశంబున వెలయఁగా, అది శరత్కాలము నందలి తెలిమబ్బులతోఁ గూడియున్న విధము నూపె. ఆగంగానది యొక్కొక్కెడ నురవడిగా నడరుచును. మిట్టుపల్లంబుల మలకలై వట్రాడుచును, చదరములో జాఁపుగా నిగుడుచును, బల్లంబుల దిగుపాఱుచును, ఱాలు మున్నగువానిని దాఁకిపయి కెగయుచును, మిట్టుల మెల్లగాఁ బ్రాఁకుచును బ్రవహించె. మఱియొకచోట సారెకునీరెగసి పయి నడరుకరుడులనీటితో మాఱుకొని మాటికి మీఁదికెగయుచు గ్రిందఁపడుచునుండె. ఇట్లు ఆకసముననుండి శివునిశిరమునఁ బడియు, నచటనుండి భూమింపడియు. గంగాజలములు నిర్మలమై సకలకల్మషాపహరమై రహించె. ఆకాశచరులగు దేవ గంధర్వులును, భూతలవాసు లగుజనులును, శివునిశిరమున నుండి పడినజలము పావన మగునని తలంచి దానిని స్పృశించిరి. శాపమువలన గగనముననుండి భూమిపైఁ బడి వారందు జలకమాడి శాపము వీడి భాసురమగుతదీయ జలములచేఁ బాపంబులు దూలి మరల నాకాశమార్గమున నిజలోకములను బొందిరి. ప్రకాశమానమగు నాగంగా జలమును జూచి జనము మిక్కిలి సంతసిల్లి యందు జలక మాడి బడలిక వీడి సుఖం బుండెను. రాజర్షి యగు భగీరథుఁడును దివ్యం బగురథంబధిరోహించి తేజంబు రాజిల్ల ముందరపోవఁగా, గంగయు వెనుక నరిగె. దేవర్షిగణములును దైత్యదానవ రాక్షసులును యక్షగంధర్వకిన్నరమహోరగ ప్రవరు లందఱును అప్సరఃకాంతలెల్లను జలచరములును సంతసిలును ప్రీతులై భగీరథరథానుగమన యగుగంగ వెంబడిం జనిరి. సర్వపాపనిర్మాలినియు మహాయశస్వినియు నగు నా నదీలలామ భగీరథుం డెందెందుఁ బోయెనో యందందుఁ దానును బోయె. అట్లు పోవుచో నాత్రో

వను మహాత్ముడును నద్భుత కార్యకరణచణుఁడు నగు జహ్నుఁ డనుముని యజ్ఞము సేయుచున్న యజ్ఞక్షేత్రముండఁగా, గంగ దానిని దన ప్రవాహములో ముంచెను. దానిగర్వం బెఱిఁగి యాయజ్వయు అత్యాశ్చర్యముగా గంగాజలము నంతయుఁ ద్రావివైచె. అంత దేవర్షి గంధర్వుల తివిస్మితులై మహాత్ముఁడగు నప్పురుష సత్త మునిఁ బూజించి గంగ నమ్మహనీయునకుఁ గూఁతుంగావింపఁగా, అందుల కమ్మహా తేజుఁడు సంతుష్టుఁడై యవ యవంబులందుఁ బావనంబు లగు చెవులవలన నుండి దానిని మరలఁ బుట్టించె. దానంజేసి గంగ జహ్నునికూఁతు రనియు జాహ్నవి యనియును జెప్పఁబడు. ఆ నదీమతల్లి మరల భగీరథురథము వెంటనంటి యాతని కార్య సిద్ధికొఱకుఁ బోవుచు సాగరమును దఱిసిరసాతలమునకు వచ్చె. ఆరాజర్షియు మహాయత్నంబున గంగను గొని చని బూడిద యైన తాతలను జూచి మనం బున విన్నఁదనము గదురనుండఁగా, ఉత్తమం బగు నాగంగ యానీఱుం దడు పుటయు, ఆసగరకుమారులు పాపము లెల్లఁ దూలి స్వర్గమును బ్రాపించిరి. ఇది నలువది మూఁడవసర్గము.

## బ్రహ్మ భగీరథునితో సంభాషించుట.

అప్పుడా భగీరథుఁడు గంగ తనవెంట రాఁగా సాగరమునకు బోయి యచటనుండి సగరకుమారులు నీఱైయున్న పాతాళమును బ్రవేశించె. అంత గంగాజల మాబూడిదపయిఁ బ్రవహింపఁగానే సర్వలోక నాయకుఁ డగు బ్రహ్మ దేవుఁడు భగీరథుని జూచి "పురుషశార్దూలా! మహాత్ముఁ డగుసగరుని కుమారు లఱువది వేవురును ప్రేతభావమును నీచే నుత్తరించి దేవతలవలె స్వర్గము నొంది, సాగరజలం బెంత కాలము లోకమున నుండునో యంతకాలము తామును దేవ తలవలె దేవలోకంబున నుండువారు. ఈగంగయు నీకుఁ బెద్దకూఁతురు కాఁగలదు ఇది నీవు తండ్రిగా నుండుటచేఁ గలిగిన పేరితో, ఇఁక నీలోకంబునఁ బ్రసిద్ధిఁ గాంచు. రాజా! స్వర్గమున జనించిన యీ గంగాతరంగిణి త్రిపథగ యనియు, నీపేర భాగీరథి యనియు నామద్వయమున వెలయు. స్వర్గభూపాతాళములను బ్రవ హించునది గావునఁ ద్రిపథగ యని దీనికభిధానము చెప్పంబడియె. మనుజవరా! నీ తాత లగుసగరసూతుల కంజలికిని నీ నీగంగాజలమునందు జలతర్పణము గావించి 'గంగాజలంబులచే సాగరుల నుత్తరింపఁ జేయుదు' నన్న నీప్రతిజ్ఞ నొడఁగూర్చు కొనుము. నీకుఁ బూర్వుఁ డగుసగరుఁడు మిక్కిలియుం గీర్తిమంతుఁడు, ధార్మిక జనాగ్రగణ్యుఁడు. తొల్లి యట్టి మహనీయుఁడును నీవు గావించిన యీ కార్యము సేయఁబూనెను గాని యతనికోర్కి యపుడు నెఱవేఱినది గాదయ్యె. వత్సా! అప్రతి మప్రతాపముచేఁ లోకమున దీపించుచుండిన యంశుమంతుఁడును ఆ తెఱఁగుననే గంగను దేర బ్రార్థించుచుండెను గాని యాతఁడును బ్రతిన చెల్లించుకొన్న

వాఁడు గాఁడయ్యె; నీతండ్రి దిలీపుఁడును కేవలుఁడు గాఁడు గదా. అతఁడు రాజర్షి యనఁ బరగెఁ సుగుణములకు గని యై మహర్షులను బోలు ప్రభావమున భాసిల్లు నట్టివాఁడు! మహాప్రతాప విరాజితుఁడు; క్షత్రధర్మ పరిపాలనైక వ్రతుఁడు; వేయేల? తపంబున నాకు సమానుఁడు. అట్టి మహాభాగుఁడును గంగా నదిని దెచ్చుట కిచ్ఛగించు చుండెను గాని తుదకు దానిని గొని తెచ్చు విచారము కూడ లేనివాఁడయ్యె. ఇట్టి మహనీయుల కెల్లఁ జేయ నశక్యమైనది సుమీ యీ గంగను దెచ్చు ప్రతిజ్ఞ! అట్టి ప్రతిజ్ఞను నీవు పురుషర్షభుండవు గావునఁ జెల్లించితివి. దానివలన అత్యంత పూజనీయ మగునపార యశమును లోకంబునఁ బొందితివి అరిందమా! నీవు గావించిన యీగంగావతరణమువలన నీవు ధర్మంబునకుఁ బట్టయి మిక్కిలి పూజ్యమగు ధర్మ ప్రతిష్ఠయును బడసినవాఁడ వైతివి. ఇతర నదులవలెఁగాక యెప్పుడు స్నానయోగ్యంబై యెప్పు చున్న యిన్నదీజలముల స్నాన మొనరింపుము. దానం జేసి నీకుఁ బరిశుద్ధియుఁ బుణ్యఫలమును గలుగు. నీతాతలకెల్ల నిందు నుదకక్రియలాచరింపుము. నీకు శుభం బగుఁగాత. ఇఁక నాలోకమున కేఁగెద. నీవు నుదకక్రియ లాచరించి నీ పురమునకుఁ బొమ్ము' అనియె. ఇట్లు సకలదేవతా సార్వభౌముఁడగు నా యఖిలలోక పితామహుఁడు, ఆమహీవరునకుఁ జెప్పి యశంబు నలుగడలఁ బ్రకాశింపఁ దాను వచ్చి నప్పటివలె నొంటి బ్రహ్మలోకమునకు వేంచేసె. రాజర్షి యగు భగీరథుఁడును జ్యేష్ఠక్రమమునను స్మృతివిహిత ప్రకారమునను సగరకుమారులకు నుత్తమలోక ప్రాపకంబులగు నుదకక్రియ లాచరించి తక్కిన వారికి నర్ఘ్యకావించి, పవిత్రుండై యశంబు మీఱ నిజపురము ప్రవేశించి, యన్ని సంపదలును బొంపిరివోవ, నిజ రాజ్యంబునుఁ బరిపాలించె. రఘునందనా! లోకు లామహీపాలకునిఁ బడసి శోకంబు లెల్ల వీడి సకలార్థంబులు సమృద్ధముగా వేఱల, నిరామయులై యెంతయుఁ బ్రమోదమునఁ దేలుచుండిరి. రామా! నీవు సవిస్తరముగా నడిగిన గంగా వృత్తాంతమును నిదె చెప్పితిని. శుభంబులొందుము! నీకు శుభం బగు. సంధ్యాకాలము మించి పోవుచున్నది. ఇంక నన్నేమియు నిపు డడుగకుము. బ్రాహ్మణులందును, క్షత్రియులందును, మఱి యితరజాతీయు లందును ఎవ్వఁడేని ధనప్రదమును' యశస్కరమును, అయుఃపుత్రపౌత్రాభి వృద్ధి ప్రదమును, స్వర్గలోక ప్రాపకము నైన యీ గంగావతరణకథను వినిపించునో వాని పితృదేవతలు నందఱు సంతోషింతురు. గంగావతరణమను నీ శుభాఖ్యానమును బరాయత్తంబు కాని చిత్తంబున నెవఁ డాకర్ణించునో వానికి సర్వాభీష్టములు నొడఁగూడును. వాని పాపములన్నియు నశించి యాయువును యశమును బయింబయి వర్ధిలును' అని విశ్వామిత్రుఁడు చెప్పె. ఇది నలువదినాలుగవ సర్గము.

---

## విశాలాపురవృత్తాంతము. పాలసముద్రమును జిలుకుట.

విశ్వామిత్రుఁడు చెప్పిన గంగా వృత్తాంతమును విని రామలక్ష్మణులు మిక్కిలియు విస్మయము నొంది యాతనితో 'మహాత్మా! నీవు చెప్పిన యీ గంగావతరణమును, సాగరమును ద్రవ్వించుటయు, దానిని గంగా జలములచే బూరించుటయుఁ బరమంబును బావనంబునై మిక్కిలియద్భుతకరముగా నున్నవి;' యని విశ్వామిత్రుఁడు సెప్పిన యారొప్పిదపు వృత్తాంతంబును జింతించుచు వారిరువురు నారాత్రి యంతయుఁ గడపిరి. అంత బలబల తెల్లవాఱఁగా, అరిందముండగు రఘునందనుఁడు, అమ్మునివరుఁ డాహ్నిక కృత్యములఁ నిర్వర్తించువఱకు గూరకుండి పిదప నమ్మునివరునితో 'తపోనిధీ; మిక్కిలియు వినఁదగిన దానిని వింటిమి. దానంజేసి యీరాత్రి యతిపూజ నీయంబై నది. నీవు చెప్పిన యీకథయంతయు మిక్కిలియు నింపారు చుండుటచే దానినే చింతించుచుండఁగా మాకీరాత్రి యంతయు క్షణప్రాయముగాఁ గడిచిపోయినది. మిక్కిలియు నింపు సొంపు గూర్చు పక్షులచేఁ బెంపారినదై, పుణ్యకర్మ పరాయణులగు ఋషుల కెక్కుటకుఁ దగిన యీయోడ, దేవరయిట విచ్చేయుటఁ దెలిసి త్వరితముగా వచ్చినది. దీనం జేసి పుణ్యనదీలలామం బగు గంగను దాఁటుద' మనఁగా అమ్మహాత్ముని మాట విని విశ్వామిత్రుఁడును ఋషులను, రామలక్ష్మణులను గూడి గంగానదిను త్తరించి, దాని యుత్తర తీరంబు సేరి, యపు డాయోడ దాఁటించుటకుఁ గూడ వచ్చిన మునులను బూజించి మరల్చి, యానదిగట్టున క్షణకాలము గూర్చుండి, విశాల యను పురమును జూచిరి. అంత విశ్వామిత్రుఁ డపుడు రామలక్ష్మణులతోడ వెడలి దివ్యమై దేవలోకంబునుం బోలె అతి మనోహరమైన విశాలా నగరమునకు వేగపోయె. అంత మహాప్రాజ్ఞుఁ డా రాముఁడు విశ్వామిత్రునిఁ కేలు మొగిచి 'మహాత్మా! ఉత్తమమైన యీ విశాలాపురము మహిమ యేమి? దీని నిపుడేలు చున్న రాజవంశమెయ్యది? ఇవి తెలియుటకు నాకు మిక్కిలియుఁ గుతూహలముగా నున్నది గాన వినఁగోరెద. నీకు శుభంబగు. వినిపింపవే.' యనఁగా నామాట విని యాముని విశాలాపురి పురాతనచరితంబు నంతయుఁ జెప్ప నారంభించిన వాఁడయ్యె. 'రామా! ఈదేశమునం దేమి జరిగెనో చెప్పెద వినుము. ఇంద్రుని వృత్తాంతమును దీనిని సంబంధించి యున్నది. అతిశుభమైన యావృత్తాంతమును నేను జెప్పఁగా వినుము. తొల్లి కృతయుగమున దితికొడుకులు మిక్కిలి బలవంతులు మాత్రమై యుండిరి. అదితికొడుకులు మంచి పరాక్రమవంతులును మిక్కిలియు ధార్మికులునై యుండిరి. అంత నమ్మహాత్ములకు రెండుదెఱఁగుల వారికిని 'మనకు చావును ముదిమియుఁ దెవులును ఎట్లు లేకుండు' నని యొక యాలోచనము కలిగె. అట్లు చింతించునప్పు డమ్మహాత్ములకు 'పాల సముద్రము చిలికి యం దమృతముం బడయుద' మని బుద్ధిపుట్టె. అట్లు నిశ్చయించి వారమిత తేజులుగాన సర్పరాజగు వాసుకిని

ఆఁకత్రాడుసేసి మందర గిరిని గవ్వముగావించి పాలవెల్లి నిజిలుకం దొడఁగిరి. అట్లు చిలుకఁగా వేయేండ్లకు, ఆఁకత్రాడగు వాసుకితలలు బెడిదము గా విషము వెడలఁ గ్రక్కుచు నాకొండయందలి ఱాలను పండ్లచేఁ గఱవఁగా నవి నిప్పువలె మండుహాలాహల మనుమహావిష మయి పయికినెగసె. దానంజేసి సదేవా సురమనుష్యంబైన జగమంతయు దహింపఁబడియె. అంత దేవతలు మహాదేవుఁడును బశుపతియు నగుశంకరుని శరణుసొచ్చి 'కావుకావు' మని ప్రస్తుతింపఁగా నపుడా దేవదేవుని యున్నకడకు శంఖచక్రధరుఁ డగుహరియు వచ్చి చిఱునవ్వు దళుకొత్త నాశూలిని జూచి 'సురశ్రేష్ఠా! నీవు దేవతల కెల్ల మొదలింటి వాఁడువు. కాఁబట్టి పాలవెల్లిని దఱువఁగా ఏది మొదటఁ బుట్టినదో యది నీది గదా. ఈవిషమును అగ్రపూజగా నెంచి గ్రహింపు' మని చెప్పి యయ్యెడ నద్దేవుఁ డంతర్హితుండయ్యె. అంత భగవంతుఁడగు శివుఁడును దేవతలకుఁ గలిగిన భయముఁ జూచి, విష్ణుఁడు సెప్పిన వాక్యమును విని భయంకర మగుహాలాహల విషమును, అమృతమువలె లోఁగొని దేవతలను వీడుకొని చనియె. పిదప దేవత లందఱును ద్రచ్చుటకుం జొరఁగా నాతఱిగొండ పాతాళమునకుఁ గ్రుంగె. దానిని జూచి యాదేవతలును గంధర్వులును మధుసూదనుని గాంచి 'మహాబాహూ! నీవే సర్వభూతములకును, విశేషించి దేవతలకును, దిక్కగుదువు. మమ్ముఁ గావుము పర్వతమును బయికినెత్తుము. అందులకు నీవే తగుదు' వనినుతింపఁగా వినివిష్ణుఁడు తాఁబేటిరూపును గయికొనియాపర్వతమును వీఁపునమోచి పాలకడలిని బవ్వళించె. మఱియు నాపురుషోత్తముఁడు లోకాత్ముండుగాన అక్కొండ కొనను చేతఁబట్టి దేవలనడుమ నిలిచి తరవంజొచ్చె. అంత వేయి సంవత్సరములు కాఁగాఁ దొలుత దండకమండలువులఁ దాల్చి ధన్వంతరి వొడమె. పిదప మంచి వర్చస్సుగల యప్సరసలుపుట్టిరి. పాలయందుఁ జిలుకుటచే నొకరసమును, ఆరసము నుండి యాస్త్రీలును నుప్పతిల్లిరి. కావున వార లప్సరస లని యన్వర్థనామమునఁ బరఁగిరి. సువర్చస లగునాయప్సరస లఱువదికోటులు గలిగిరి. వారల పరిచారికలను లెక్కింపఁ దరముగాదు. ఆయప్సరసలు తమకుఁ బతి యెవ్వండని విచారింపమిచే దేవదానవు లెవ్వరును వారిని బరిగ్రహింపరయిరి. అట్లు పరిగ్రహింపమిఁ జేసి వార లందఱును వేశ్య లనఁబడిరి. అంత సముద్రాధి దేవతయును వరుణుని కూఁతురును మహాభాగ్యవతియు సురకు నధిదేవతయు నగువారుణి, కడలినుండి పొడతెంచి తన్నుఁ బరిగ్రహించువా రెవ్వరని యరయఁగా దితిపుత్త్రులగు రాక్షసు లెవ్వరును, ఆవరుణకుమారిని గయికొనరైరి. అదితిసుతు లగు దేవతలుమాత్ర మా యనింద్యచరితను బరిగ్రహించిరి. వారుణిని బరిగ్రహింపమింజేసి దితిసుతుల సురులయిరి. దానిని బరిగ్రహించుటవలన అదితిసుతులు సురలైరి. మఱియు నాసురలావారుణీ గ్రహణంబునఁ బులకితగాత్త్రులై యెంతయు సంతసంబునఁ బొదలిరి.

అంతగుణములమిన్నయగు నుచ్చైశ్శ్రవమును, మణిరత్నం బగుకౌస్తుభమును, అట్లే యుత్తమ మగు నమృతమును, సముద్రమునుండి పొడమినవి. రామా ! ఆ యమృతముకొఱకుఁబోరాడి దేవదానవకులము లెంతయు నమసె. దేవతలును దైత్యులఁ బెక్కండ్రఁ జంపిరి. అసురులందఱును దమబలము వృద్ధిఁజెందుటకు రాక్షసులతో నొక్కటిగాఁ గూడికొనిరి. అంత ముల్లోకముల నుడివడఁజేయుబెడిదంపుయుద్ధము ప్రవర్తించె. అంతయు నాశమునొందున ట్లగుటయు, మహాబలుఁ డగువిష్ణుఁ డపుడు జగమును మోహింపఁ జేయుమాయను గయికొని మోహినీరూపము దాల్చి యసురులను వంచించి వారలవలననుండి వేగమ యమృతము హరించినవాఁడయ్యె. అక్షయుండగు నప్పురుషోత్తమున కెదిరినవారలనెల్ల ప్రభవిష్ణుం డగు నావిష్ణుఁడు గయ్యంబున నుగ్గునూచగావించె. మఱి శరణుసొచ్చిన దేవతలనెల్ల నావేశించి వారికి బలాతిశయము కలిగించె. భయంకర మగునాదేవాసురయుద్ధమున విష్ణునావేశమువలన బలం బతిశయిల్లి యదితిసుతులు దితితనూజులం జక్కాడిరి. ఇట్లింద్రుఁడు దైత్యులఁ జంపి త్రిలోకరాజ్యమును బ్రాపించి ముదమున మహర్షి చారణసంఘముల నమృతముతోడఁగూడ సమస్తలోకములను బాలించె.
ఇది నలువదియైదవసర్గము.

---

## దితి తపము సేయుట.

దితి తనకొడుకు లందఱును జావఁగా మిక్కిలియు దుఃఖించి తనపతి యగు కాశ్యపుని మరీచికుమారునిఁ జూచి 'మహాత్మా ! మహాబలవంతు లగునీపుత్త్రుల చేత నాకొడుకు లందఱు హతులైరి. దీర్ఘకాలపుతపము పెంపునఁజేసి దార్ఢ్యము గలిగి యింద్రునిఁ జంపెడునట్టికొడుకును బడయఁగోరెద. బిడ్డలు లేని నేను తపము సల్పెద. నాకు (బలవంతుఁడును మేటివిలుకాఁడును నాస్థితినెఱిఁగినవాఁడును సమదర్శియు) లోకనాయకుఁడును ఇంద్రసంహారకుఁడు నగుపుత్త్రు నీయం దగు. అందునకై తపముసేయ నా *కనుజ్ఞయి' మ్మనియె. ఆచెలువపలుకులు విని యపుడు మహాతేజుఁడగు కాశ్యపుఁడు దా నతిదుఃఖిత యగునాదితితో 'నీవు కోరినట్లే యగుఁగాత. నిన్ను శుభం బొదవెడు. తపం బధికంబుగాఁగలదానవై పుత్త్రుఁ డుదయించువఱకు శుచిగానుండుము అట్లుండువేని యుద్ధమున నింద్రునిఁ జంపఁ జాలు పుత్త్రునిఁ బడయుదువు. వేయేండ్లు నిండువఱకు శుచివై యుందువేని ముల్లోకములకు భర్తయగు కుమారుని నాయనుగ్రహమునఁ గాంతు' వనిచెప్పి యాతన్విని జేత నల్లన పుడుకుచు నూఱడించి యుదరము తాఁకి 'శుభంబగుఁ'గాత మని తపము

---

* స్త్రీలకు భర్తయనుజ్ఞ లేక తపము సేయుస్వాతంత్ర్యము లేదు. కావుననే యిట భర్తయనుమతి ప్రార్థింపఁబడియె.

నకుఁ జనియె. అతఁడు పోఁగా దితియు మిక్కిలియు హర్షమునొంది విశాలాపురి పూర్వస్థాన మగుకుశప్లవనముఁ జేరి దారుణ మగుతపము సలిపె. ఆపడఁతి యట్లు తపము గావించుచుండఁగా వేయుగన్నులప్రోడ యగువేల్పులఱేఁడు వినయాది గుణంబు లెంతయు నెఱపుచు నాతెఱవకుఁ బరిచర్య సేయఁ జొచ్చె. అగ్నికుశకాష్ఠములను ఫలమూలములను మఱియెయ్యది గోరినను దానినంతయుఁ దెచ్చియిచ్చుచు. ఒడలు పిసుకుచు, వీవనలువిసరుట మొదలగుపనుల నలఁత దీర్చుచు, అన్నికాలంబులందునుదితికిఁ బరిచరించుచుండెను. అంత పదియేండ్లు కొఱఁతగా వేయి సంవత్సరములు కాఁగా దితి, యింద్రునిపరిచర్యకు మిక్కిలియుఁ బ్రీతయై, యాతనితో 'సురవరా ! మహాత్ముఁ డగుమీతండ్రిని యాచించి వేయిసంవత్సరము లయినంతఁ గొడుకును గాంచునట్లు వరము వడసితి. దానికై తపముఁ జలుపుచున్నదాన. వీరాగ్రణీ! ఇఁకఁబదియేఁడులు కొఱఁతగానున్నది. నీకుశుభంబగు. ఆపదియు ముగిసెనేని నీతోఁబుట్టువును జూచెదవు. వాఁడు నిన్ను జయింప నుత్సుకుఁడై యుండు. అయినను నీకొఱకై నేను సమాధానపఱిచి నీయెడ భ్రాతృస్నేహముఁ గలిగించెద. నీవు వానిని గూడి వంత వీడి ముల్లోకములను గెలిచి యావిజయంబు ననుభవింతు' వని శుశ్రూషవలనిహర్షంబున మఱచి చెప్పె. ఆదితి సూర్యుఁ డాకాశమధ్యంబున వెలుంగుపట్టపగట నిదురకు లోనయి * తలప్రక్క పాదము లుంచుకొనియె. ఇంద్రుఁడు నిట్లాయమ యశుచియై పాదములప్రక్కఁ దల వెండ్రుకలునుఁ దలప్రక్క పాదములు నుంచుకొని నిదురించుచుండుటఁజూచి 'ఈయమ యూరక గర్వించిన'దని వెడనవ్వు నవ్వుచుఁ జెఱుప సందు దొరకుటకునుబ్బి యాయమ యోనిద్వారముఁ జొచ్చి ధైర్యము పెచ్చున గర్భము నేడుదునియలుగా భేదించె. అట్లు నూఱంచులవా లగువజ్రముచే గర్భమును భేదించుచుండఁగా, ఆ సిసువును నిం పయినయెలుంగున నేడ్చె, అంత దితియు మేలుకొనెను. సురరాజును శిశువును జూచి 'ఏడువకు ఏడువకు' మని చెప్పి అది యేడ్చుచున్నను చలంబు దీపింపదానిని దునియలుసేసె. దితియుఁద్రుంచినను 'జంపకు చంపకు' మనిచెప్పఁగా దేవతావల్లభుండు తల్లిమాట గౌరవించి గర్భమునుండి వెడలివచ్చివజ్రంబు కేలంగ్రాలఁగను పట్టి కేలుమొగిచి దితిని జూచి 'తల్లీ ! నీ వశుచివయి పాదములవలనఁ దల వెండ్రుకలునిచికొని నిదురించితివి. కావున నేను దెఱపి గాంచి శత్రునియుద్ధంబున జంపనున్న యాశిశువును ఏడుతుండములుగా ఖండించితిని. తల్లీ! దీనిని క్షమింపఁ దగు'దనియె. ఇది నలువదియాఱవ సర్గము.

---

* మధ్యాహ్నమున పడుక గూడదుగాన యాసనమందేకూర్చుండి నిద్రావశమున ముందఱికి వ్రాలఁగా తల పాదములను దగిలెననియు దానిచే అశుచితకలిగెనని కొందఱిమతము. పడుకయందు తలతట్టు పాదములుంచుకొని నిదురించెననియు పగలునిదురించుటయు తలతట్టుపాదము లుంచుకొను

## సప్తమారుతులవృత్తాంతము.

గర్భం బేడుదునియలు గావింపఁబడఁగా, దితి యతిదుఃఖితయై యింద్రుఁడు నెఱిదప్పక తనయక్కఱ దీర్చుకొనుటం జేసి వానినేమియుం జేయరాదనియెంచి యూఱట నొంది యింద్రునితో "బలారీ ! నాయపరాధమునలన ఈగర్భం బేడు దునియలుగా వ్యర్థమయ్యె. ఇందు నీ తప్పేమియులేదు. ఈ చెడినగర్భమునకు నొకమేలుగావింపఁగోరెద. ఈతునియలేడును * ఏడుమారుతములఁ బాలించువా రగుదురుగాక. నాకుమారు లీయేడ్వురును వాతస్కంధాభిమానిదేవతలయి దివ్య రూపముల దివిఁ జరింతురుగాక. ఈ యేడ్వురు వర్తించుచోటులును వారిస్థాన పాలనము తెఱంగులును జెప్పెద. ఒకఁడు బ్రహ్మలోకంబునఁ జరించుఁగాత' మఱి యొకఁడింద్రలోకంబునఁ దిరుగుచుండుఁగాక, మూఁడవవాఁడు మహాయశుండై వాయువను పేర నంతరిక్షమునందిరుగాడెడు. నాకొడుకులు తక్కిన నలువురును నీయాజ్ఞంజేసి దేవత్వమునొందినీవు 'మారుదః మారుదః' అని పలుకుటం జేసి మారుతు లనియెడు పేరంబరఁగుచు దిక్కులందుసంచరింతు" రనియె. ఆయమ యాడినమాటలు విని బలనిషూదనుం డగుపురందరుఁ డంజలి గీలించి 'తల్లీ ! అంతయు నీవు చెప్పినట్లే జరుగు. ఇందులకు సందియము లేదు, నీకొడుకు లంగఱు దేవత్వమునొంది సంచరింతురు. నీకు శుభం బగు, ననియె. రామా ! తల్లియుఁ గొడుకును నిట్లు తపోవనంబున నిశ్చయించుకొని కృతార్థులై స్వర్గమునకుఁ బోయి రని మాకు వినికి. తొల్లి యింద్రుం డెచట వసించియుండి తపస్సిద్ధిని బూనినదితికిఁ బరిచర్యగావించెనో యాదేశం బిదియే. అది యిప్పుడు విశాల యనుపేరొందినది. ఇఁక నేరాజవంశంబు దీని నేలెడినో తెలిపెద. ఇక్ష్వాకువునకు నలంబుస యను దానియందుఁ బరమధార్మికుఁ డగు విశాలుఁ డనుపుత్త్రుఁడు పుట్టె. ఆ విశాలుఁడే యిచట విశాల యనునీపురము నిర్మించె. విశాలునకు మహాబలుఁ డగుహేమచం ద్రుఁడు పుట్టె. హేమచంద్రునకు సుచంద్రుఁ డనువాఁడు కలిగె. సుచంద్రునకు ధూమ్రాశ్వుఁ డనుతనయుఁ డయ్యె. ధూమ్రాశ్వునకు సృంజయుఁ డనువాఁ డుద యించె. సృంజయునకు శ్రీమంతుఁడును బ్రతాపవంతుఁడు నగుసహదేవుఁడు కుమా

---

టయు అను రెంటిచే అశుచిత్వముకలిగెనని మఱికొందఱి మతము. భూశయనమునం దేయుండెననియు స్మృతులు దక్షిణపూర్వదిశలందే శిరస్సునుంచుకొనవలయునని నియమించియుండఁగా దానికి విప రీతముగాఁ దలయుంచిపరుండుటవలన అశుచిత్వమని వేఱుకొందఱిమతము. పదుశ లేకుఁడియుకృష్ణా జినాదులయందుఁ దలచోటఁబాదములును బాదములచోట తలయు నుంచుటచే అశుచిత్వమనియు కొందఱి మతము.

* "గగనఃస్పర్శనోవాయురనిలశ్చతథాపరః । ప్రాణః ప్రాణేశ్వరోజీవ ఇత్యేతేసప్తమా రుతాః" అని మారుతు లేడు. అవహా, ప్రవహా, సంవహా, ఉద్వహా, వివహా, పరివహా, పరావహా ము లని సప్తమారుతములు విష్ణుపురాణప్రతిపాదితములు.

రుఁడయ్యె. సహదేవునకుఁ బరమధార్మికుఁ డగువిశాశ్వుఁడు పుత్త్రుఁ డయ్యె. కుశాశ్వునకు మహాతేజుఁడును బరాక్రమవంతుఁడు నగుసోమదత్తుఁడు కలిగె. సోమదత్తునకుఁ గాకుత్థ్సుఁ డనుకుమారుఁడు పుట్టె, ఆకాకుత్థ్సునికొడుకు మహాపరాక్రమశాలియు, దేవతాప్రతిముఁడును అరాతిదుర్జయుఁడు నగుసుమతి యనువాఁడిపుడీ విశాలాపురమునందు వసించుచున్నవాఁడు. ఇక్ష్వాకువంశమునం దంతయు నీకొండఱు పురుషులా? యనవలదు. ఇక్ష్వాకుపియనుగ్రహంబున విశాలాపురాధిపతులగు రాజులందఱు దీర్ఘాయుష్యమును, అతిధైర్యమును, వీర్యమును గలిగి పరమధార్మికులై యుందురు. రామా! మన మీరాత్రి యిచట సుఖముగా వసింతము. రేపు ప్రాతఃకాలమున జనకునిఁజూడఁబోవచ్చును' అనియె. మహాతేజుఁడును మహాకీర్తిమంతుఁడు నగుసుమతియు విశ్వామిత్రునిరాక విని ఋత్విజులను బంధుజనులనుగూడి యెదుర్కొనవచ్చి యమ్మునిరాజును మిక్కిలియుఁ బూజించి చేమోడ్చి కుశలంబడిగి 'విశ్వామిత్రమునీంద్రుఁడు నాదేశమునకు విచ్చేసి దర్శనమిచ్చుటంజేసి నేను మిక్కిలి ధన్యుఁడ నయితిని. నే నిమ్మహనీయునియనుగ్రహము వడసితిని నాకీడై నధన్యుఁ డెవ్వఁడును లే' డనియె. ఇది నలువదియేడవసర్గము.

---

## అహల్యావృత్తాంతము.

సుమతియు విశ్వామిత్త్రుఁడును ఒండొరుల కుశలము లడిగి యుత్తరములు చెప్పి ముగిసినంత సుమతి యమ్మహామునిని జూచి 'మునీంద్రా! మీకుమంగళమగుఁగాక. ఈకుమారు లిరువురు నెవరు? ఆకారముతీరు చూడ విష్ణుంబోని పరాక్రమము గలవా రని తోఁచెడి. గజమువలె గంభీరముగాను, సింగమువలె బీరముగాను, బెబ్బులివలె బెడిదముగాను, ఆఁబోతువలె గరువముగాను, ఈవాఁడిమ గలనడ చూపట్టెడి. కన్నులు తామరఱేకులం బోలి విశాలములై వీరి లావణ్యంపుసొంపును భాగ్యంపుఁ బెంపును దెలుపుచున్నయవి. వాలును బొదులును విల్లును దాలిచి పొలుచుచున్న వారు. అశ్విదేవతలం బోలురూపమునను, దానికనురూపముగా మొలకొత్తుచున్న యెలజవ్వనమునను, నివ్వటిలిచు దేవలోకమునునుండి యిచ్చమెయి భూమికి వచ్చిన యమరులో యనఁ గొమరారుచున్నవారు. కడుమృదువులైనయడుగులు గంద నీగడుసుఁ ద్రోవల నేవడువున నడచి రాఁ గలిగిరి. వీరి రూపునేపుం జూడఁ గోరికలన్నియు నొడఁగూడి యున్నవా రని తెలిసెడి. అట్లయ్యును నేమికోరి యెవ్వనికొఱకు నిట వచ్చిరి. నీవు సర్వజ్ఞుఁడవుగాన దీనిని దెలియనేర్తువు చెప్పుము. చంద్రసూర్యు లాకాశమును వెలిఁగించునట్లు వీర లీదేశము నలంకరించుచున్నవారు. దేహప్రమాణమునను, ఇంగితాకారములను ఈయిరువు రొండొరులకుఁ బురుడై యున్నవారు. మేటికైదువులం దాల్చి మగఁటిమిం బొల్చునీపురుషసింహులీ దుర్గమంపుదారిని రానేల? దీనిని

గలరూపున వినఁగోరెద' ననియె. ఆ భూపాలుఁ డడిగినపలుకులు విని మునివరుఁడును దాము సిద్ధాశ్రమమున నుండుటయు, అందు యజ్ఞముఁ జెఱుప వచ్చిన రక్కసులను జక్కాడుటయు, జనకునియాగముఁ జూడ మిథిలకుఁ బోవుటయు, మొదలుగాఁ గలవృత్తాంతమును జరిగినరీతిని జెప్పఁగా విని యప్పార్థివోత్తముఁడు పరమహర్షితుఁడై తనకుఁ బ్రాప్తించినయతిథి సత్తముల మహాబలుల నా దశరథకుమారుల, సత్కారార్హులు గాన యథావిధిగాఁ బూజించె. అంత రామలక్ష్మణులు సుమతివలన నెంతయు సత్కృతులు వడసి యయ్యెడ నొక రాత్రి యుండి వేకువను లేచి మిథిలకుఁ బోయిరి. మును లందఱును శుభప్రదమగు నాజనకపురిని మిథిలను జూచి 'బాగుబా' గని కొనియాడిరి. రాముఁడు మిథిలకు దాపున నుండునొక వనమునందుఁ బురాతనంబై జనములును బర్ణశాలలును లేకున్నయొక మనోహరమైన యాశ్రమమును జూచి యమ్మునివరునితో 'మహాత్మా! సిరి దులకించు చున్నయిది యొక యాశ్రమమువలెఁ జూపట్టుచున్నది కాని యిందు మును లెవ్వరును గానము. కాన నిది యేమి? తొల్లి యెవరియాశ్రమమో వినఁగోరెద' నని యడుగఁగా నవ్వాక్యము విని వాక్యజ్ఞుఁ డగువిశ్వామిత్రుఁడు తేజము దళుకొత్త, అహల్యాశాపవిముక్తి సమీపించిన యుబ్బున 'బాపురే' యని పిదప "రామా! ఈయాశ్రమ మెవ్వనిదో, ఎవరికోపమున నిది శాపము నొందెనో, అమ్మహాత్ముని నున్నరూపునఁ జెప్పెద వినుము. మును పిది మహాత్ముఁ డగుగౌతముని యాశ్రమము. ఇది దివ్యమై వెలుఁగుచుండుటం జేసి దేవతలుగూడ దీనిని మిక్కిలి పూజించుచుండిరి. మహాయశుఁ డగునా గౌతముఁ డహల్యను గూడి మున్ను పెక్కుసంవత్సరంబు లిందు తపము గావించుచుండె. ఒకప్పు డింద్రుఁడు మునివరుఁడు లేని తెఱపిని గాంచి గౌతముని వేషము దాల్చి వచ్చి యహల్యను జూచి 'సుందరీ! కామముచేత భోగార్థు లిచ్చచొప్పునఁ గ్రీడింతురుగాని ఋతుకాలము నెదురుచూడరు. బ్రహ్మ మిక్కిలియుం జక్కఁగా నిర్మించి యున్ననిన్నుఁ జూడఁగా నెవ్వాఁడు సైఁచు; నీనెన్నడుము చెన్నుం జూడ నీతో రతి సలుపునంతియ కోరినాడను. నీయందు నాకుఁ బుత్రుఁడు వలదు. కాన యందులకై ఋతుకాలము నిరీక్షింపవలదు. అనఁగా నహల్యయుఁ 'దనలో ముని యెప్పుడును ఇట్లడుగఁడు. మఱొకఁ డిందుఁ జొరఁజాలఁడు. ఇంద్రుఁడే చిరకాలము నన్నుఁ గోరియున్నాఁడని విందు. కాన వీఁడు వేయిగన్నుల ప్రోడయే యగు' నని యెఱింగియు, నాతెఱగంటి దొరవలని యగ్గలంపు వలపునం జేసి బుద్ధి మాసి యందులకు సమ్మతించి యాతనితోఁ గ్రీడించి కోర్కి యీడేఱి యుల్లంబు పల్లవింప నాదేవునిఁ జూచి 'ప్రభూ! సురవరా! నేను కృతార్థనయితి. నీ విచ్చట నుండి వేగపొమ్ము. నీవు దేవేశ్వరుఁడవు. మానమునొసంగువాఁడవు. కాన యెవ్వారికినిఁ దెలియకుండునట్లు నీ విట దాఁటి నిన్నునునన్నును ఎల్లప్పుడును గాచికొనఁదగు'

ననియె. ఇంద్రుఁడు నందులకు నవ్వుచు నహల్యనుజూచి 'నింతబినీ! నేను మిక్కిలియు సంతుష్టుఁడ నయితిని, కాన యిఁక నిలువను. వచ్చిన దారిని బోయెద'నని చెప్పి యప్పుడతితో నిట్లు క్రీడించియంత గౌతముఁడు వచ్చునో యనుశంకవలన భయముగొని తొట్రుపడుచు వేగమ యాపర్ణశాలనుండి బయలువెడలె. అట్లు వెడలఁగా నప్పుడు తీర్థోదకముల జలకంబాడి యగ్నియుం బోలె వెలుఁగుచుఁ గుశలును సమిధులునుగొని మునిపుంగవు డగుగౌతముఁడును బ్రవేశించె. అతఁడు తపోబలము పెంపున దేవదానవులకేని ఎదిరింపరాని వాఁడు. అట్టి తపోనిధి యాశ్రమముఁ జొచ్చుచుండఁగాఁ జూచి సురపతి వడవడ వడంకుచు మొగము వెలువెలఁబాఱ నిలిచె. మునివేషము దాల్చి దుర్ణయమునకుఁ జొచ్చిన యాసహస్రాక్షునిఁ జూచి సువృత్తిసంపన్నుఁ డగునమ్ముని రోషము దీపింప 'ఓరీ దుర్బుద్ధీ! నీవు నారూపము గయికొని చేయ రానియీపని చేసితివి. కావున నీ వృషణములు దూలిపడుఁగాక' యని శపింపఁ నమ్మహాత్ముని సరోషవాక్యమువలన నింద్రునివృషణము లాక్షణముననే భూమిపైఁ బడియె. అట్లు దేవేంద్రుని శపించి యంత నహల్యను శపించువాఁడై 'ఓసీ! నీ వీయాశ్రమమునందుఁ బెక్కువేల సంవత్సములు వాయుభక్షణము సేయుచు, అన్నపానాదులు లేక తపించుచు భస్మంబునం బరుండి సమస్తప్రాణులకును గాన్పింపని దానవై వసించియుండు దానవు. ఎప్పుడు దురాధర్షుం డగు దశరథకుమారుఁడు రాముఁడు, పాడువడి భయంకరమైయుండు నీయాశ్రమమునకు వచ్చునో, యప్పుడు తదీయపదారవిందపరాగ స్పర్శమున నీవు పరిశుద్ధురాలవై లోభమోహములు వీడి యాతని నతిథిసత్కారములఁ బూజించి నాయెదుట ముదముతో *నీ దేహము మరలఁదాల్తు' వనియె. గౌతముఁ డట్లా దుష్టచారిణికిం జెప్పి యీ యాశ్రమము విడిచి సిద్ధచారణసంతత సేవితమును బవిత్రము నగుహిమాలయ శిఖరమున శాపకృతపాప ప్రాయశ్చిత్తార్థమై మహాతపముఁ గావించె'' ఇది నలువది యెనిమిదవ సర్గము.

---

*అహల్య బుద్ధిపూర్వకముగా వ్యభిచరించినందులకు వలయు ప్రాయశ్చిత్తమును మునిశాపరూపముగ విధించినాఁడు. కానయిట యహల్య శిలయగుట గానరాదు కావుననే 'నీదేహము' అనఁగా మునుపటివలెఁ గనంబడునట్టి దేహంబు, అనియర్థమూహ్యము. అయినను పద్మపురాణమున 'సాతత్ర స్తస్య రామస్య పాదస్పర్శాన్మహాత్మనః। అభూత్సురూపా వనితా సమాక్రాన్తా మహాశిలా' అని యహల్యకు పాషాణావస్థ చెప్పంబడినది. అదికల్పాంతరవృత్తమును అనుసరించి చెప్పంబడెననికొందఱి మతము, కొందఱు దీనిననుసరించి యహల్యపాషాణముగాశపింపఁబడినదనియెంచితదనుగుణముగా 'నీ దేహము' ననఁగా 'పాషాణావస్థనుండి నీ పూర్వదేహమును' అని వాఖ్యానము చేసియున్నారు.

### రామునిచే నహల్యకు శాపమోక్షణము గలుగుట.

'అంత దేవేంద్రుఁడు విగతవృషణుఁడై మోమున విన్నఁదనము మీఱ మహర్షులను జారణులను అగ్నిప్రముఖు లగుదేవతలనుం జూచి 'మహాత్ముఁ డగు గౌతముఁడు సర్వదేవతాపదములను దూలించుకొఱకుఁ దపము గావింపఁగా నతనికిఁ గోపముఁ బుట్టించి తపముఁ జెఱుపుటకై యిట్టికృత్యము సేసితిని. ఈకార్యము దేవతలకొఱకై నదిగాని వేఱుకాదు. ఆమునియుఁ బెనుకోపమున నావృషణములను దూలించె. అహల్యను శాపం బిడి విడిచె నాకును నహల్యకును బెనుశాపం బొసంగుటం జేసి యాతనితపము తఱుఁగుటవలన నే నాతనితపస్సును హరించితిని. కావున దేవతలారా! మీరందఱును ఋషులును జారణులనుగూడి మీకు సాయము సేసిన నాకు వృషణములు గలుగునట్లు గావింపవలయు' ననియె. ఇంద్రుఁడాడిన మాటలు విని యగ్నిప్రభృతులగు దేవతలుసమస్తమరుద్గణములతోడం గూడి పితృదేవతలకడకుఁ జని "ఇప్పుడు యాగమున మీకు భాగార్థము నియుక్తమై యున్న యీమేషమునకు వృషణము లున్నవి. ఇంద్రునివృషణములు పోయినవి కాన యీ మేషవృషణములు గొని యాతనికి వేగ నిండు. 'వృషణములు లేనిచో మాకుఁదుష్టి చెడు'ననవలదు. ఇది వృషణములు లేనిదిగాఁ జేయఁబడినను మీ కెంతయు సంతోషము నొసంగును. ఇదియ కాదు. మాకు హర్షము గలుగుటకొఱకు ఏ మానవులు వృషణరహితమైన మేఁకమాంసము నొసంగుదురో వారును మీ కెంతయు సంతుష్టి గావింపఁగలరు' అనిరి. అగ్నిమొదలైన దేవతలవచనము విని పితృదేవతలు గూడి యపుడు యూపమున నియుక్తంబైన మేషమువృషణంబుల నూడఁదీసి యింద్రునందు జొప్పించిరి. అదిమొదలుగాఁ బితృదేవతలు సమాగతులై తమ కర్పింపఁబడు నితర మేషము లా తొలిమేషమునకు సజాతీయములుగాన వృషణముల మాని వానిని భుజించువా రయిరి; మేషములను వృషణములు లేక తమ కర్పించువారికిని వృషణముతోడ వాని నర్పించునంతియఫలమును గూర్చిరి. ఇంద్రుఁడును మహాత్ముఁడగు గౌతమునితపఃప్రభావమునం జేసి యదిమొదలుగా మేషవృషణుఁ డయ్యె. రామా! నీవు మహాప్రభావసంపన్నుఁడవు. ఆ యహల్యశాపమును నీవు వచ్చునంతకాలమే నిలుచును గావునఁ బుణ్యకరుఁ డగునమ్మునివరేణ్యునాశ్రమమునకు వచ్చి దేవతా యువతియుంబోలె నతుల్యరూపమునం జెలువారుమహాభాగ్యవతిని ఆ యహల్యను శాపంబుఁ దరింపఁ జేయుమా" యనఁగా విశ్వామిత్రువచనముచొప్పున రాముఁడును లక్ష్మణసహితుఁడై మునివరుఁడు మునుసన నయ్యాశ్రమముఁ జొచ్చి యహల్యను గాంచినవాఁడయ్యె. ఆ మహాభాగయు వాయుభక్షణాదిరూపంబైన తపంబు పెంపున నెంతయుఁ గాంతి యతిశయిల్లి వెల్లిగొన, లోకులను సురాసురుల కేనియు డాసి తేఱి చూడరానిదై, 'బ్రహ్మ మిక్కిలియు జతనమున నిర్మించుటంజేసి యతిమానుషరూప లావణ్యవిలాసినియై, మాయచేఁ గావింపఁబడినదియుంబోలెఁ జూడ్కికి కక్కఁజముగా

వింత నెక్కొనం జేయుచుఁ, బూవుందీవియల మఱుంగువడుటం జేసి మంచు వెలివిరిసి మబ్బుగ్రమ్మిన నిండు చందురుని వెలుంగు తెఱంగునను, (పొగ పొదివినతుఱంగలి యగ్గిసెగవలెను), జలంబులనడుమ వేండ్రంబొకింత తఱిఁగియుఁ దేఱిచూడనీక వెలుంగు సూర్యుని ప్రతిబింబంబుడంబునను, బొడ తెంచినదయ్యె ఆమెయు గౌతముని వాక్యంబునం జేసి రామునిదర్శనము దొరకొనువఱకు ముల్లోకముల వారికిని గాన రానిదై యుండి, యపుడు శాపము తుదముట్టఁగా నావిశ్వామిత్రాదులచూడ్కికిఁ గానఁబడినదయ్యె. రామలక్ష్మణు లప్డాపుణ్యవతియడుగులంటి పూజించిరి. ఆమెయు గౌతమునివచనము తలంపునకుఁ దెచ్చుకొనుచు వారలఁ బూజింపఁ గయికొని యెచ్చరికమెయి శాస్త్రదృష్టప్రకారమున సర్ఘ్యపాద్యము లొసంగి యతిథిసత్కారము గావింపఁ గాకుత్థ్సుఁడు వానిని గయికొనియె. అప్పుడు సురలు పువ్వులు జడిగొనఁ గురిసిరి. దేవదుందుభులు మొరసె. గంధర్వాప్సరసలు వచ్చి, నృత్తగీతాదికము లెంతయుఁ గావించిరి. అహల్యయుఁ దపోబలమున శరీరదోషము వాసి, పరిశుద్ధయై, యపుడు రామాగమ మెఱిఁగి యోగబలమున వచ్చినగౌతమునిపాలఁ జేరఁగా, దేవతలందఱును 'బాగుగా' గని యారమణిని గొనియాడిరి. మహాతేజుఁడగుగౌతముఁడును జిరకాలం బెడఁబాసి యున్నయహల్యను బొంది, సుఖమునొంది, రాముని విధ్యుక్తముగా మిక్కిలి పూజించి యయ్యాశ్రమమునఁ దపము సల్పువాఁడయ్యె. రాముఁడు నమ్మునిరాజువలన విధ్యుక్తముగా నెంతయుఁ బూజలొంది యచటనుండి కదలి మిథిలనుగూర్చి పోవువాఁడయ్యె. ఇది నలువదితొమ్మిదవసర్గము.

---

## రామాదులు మిథిలకుఁ బోవుట.
## జనకుఁడు విశ్వామిత్రునితో సంభాషించుట

రాముఁ డంత లక్ష్మణునిఁ గూడి యీశానదిశగాఁ బోయి విశ్వామిత్రుని మున్నిడుకొని జనకుని యాగశాలను బ్రవేశించె. రామలక్ష్మణులంత నామునిసింహునిఁ జూచి 'మహాత్మా! మహాత్ముఁ డగుజనకునియజ్ఞసంభారసామగ్రి యెంతయుఁ జక్కనై యున్నది ఇదె చూడుఁడు. వేదాధ్యయనశీలురును నానాదేశవాసులు నగు బ్రాహ్మణోత్తములు వెక్కువేవు రిందు యజ్ఞవాటమున వచ్చియున్నవారు. అగ్నిహోత్రసంభారములు వహించియున్న వందలకొలఁదిబండ్లచేఁ గ్రిక్కిఱిసిఋషి నివాసము లివిగో కానంబడుచున్నవి. ఈ యిఱుకటమున మనకుఁ జోటు గనుపట్టదు. కాన మనము వసించుటకుఁ దగినచోటు నేర్పరింపుఁ'డనిరి. రామునివచనము విని యమ్మహామునియు, జనసమ్మర్దరహితమైనది కాన పరిశుద్ధమై జలములతోఁ గూడి యున్న యొక్కెడ విడిపట్టు గావించుకొనియె. అపుడు విశ్వామిత్రుఁడు వచ్చుట జనకుఁడు విని తనపురోహితు ననిందితుని శతానందునిఁ బురస్కరించుకొని వినయము మీఱ వేగముతో నెదుర్కొనెను, మహాత్ములగు ఋత్విజులును సత్వరమున నర్ఘ్య

మధుపర్కాదిపూజాద్రవ్యములు గొని ధర్మవిధానమున మంత్రపూర్వకముగా నమ్మునిని గొనఁగి యతిథిసత్కారము నెఱపిరి. మహాత్ముఁడగుజనకభూజానియొసంగినపూజలను గయికొని విశ్వామిత్రుఁ డాతనికుశలమును, యాగము నిరుపద్రవముగా జరుగుటయు, విచారించి పిదప వచ్చిన ఋత్విజులును బురోహితుఁడగు శతానందునిఁ గ్రమమునఁ గుశలం బరసి యంత వందఱిని గూడి సంతసంబున నుండె. పిదప నాభూపతియుఁ గృతాంజలియై యమ్మునివరునిఁ జూచి 'మహాత్మా! నీ విమ్మునివరులతోఁగూడ నాసనమునఁ గూర్చుండు' మనఁగా నామాట విని యమ్మహామునియు నాసనమునఁ గూర్చుండె. పిదపఁ బురోహితుఁడును ఋత్విజులును గూర్చుండిరి. అంత రాజును మంత్రులును గూర్చుండిరి. ఇట్లు చుట్టును ఆసనములందుఁ గ్రమముచొప్పున నందఱుఁ గూర్చుండుటనుజూచి యంత నా భూకాంతుఁడు విశ్వామిత్రుం గాంచి 'మునీంద్రా! నేఁడుగా నాయజ్ఞము సమృద్ధంబయ్యె. ఆసమృద్ధివలని ఫలమును దేవతలచే నాకొడఁగూడిన దయ్యెఁ జుఁడీ. యజ్ఞం బటుండనిండు. దేవర దర్శనముననే నాకు యజ్ఞము గావించినంతియఫలముగలిగె. నీవు మునులను గూడి నాయజ్ఞశాలకు వచ్చుటంజేసి నేనుఁ గడుధన్యుఁడ నైతి. మీయనుగ్రహమును జూఱగొంటి; మంటి. బుద్ధిమంతు లగుఋత్విజు లీ యాగమున కింకఁ బండ్రెండుదినములు కొఱఁతయని చెప్పుచున్నారు. అది కడచనఁగా నంత దేవతలు తమతమ హవిర్భాగములు గొనవత్తురు. అంతకు నీవిందే యుండి వారిని దర్శింపం దగు' నని చెప్పి నెమ్మొగమున సంతసము వెల్లివిరియ మరల నమ్మునిని జూచి యంజలి గావించి 'మునీంద్రా! మీకు శుభం బగుఁగాక. ఈ కుమారు లిరువురు నెవరు? వీరి యాకారంబులీరుఁ జూడ విష్ణుంబోనిపరాక్రమంబు గలవా రని కనుపట్టెడి. గజంబునోజ గంభీరంబుగాను, బెబ్బులిసలువున బెడిదంబుగాను, ఆఁబోతురీతి గరువంబుగాను వీరినడ చూపట్టెడి. ఈ వీరులకన్నుంగవ తామరరేకులను బురుడించుచు వీరల చెలువంపుసొంపును బెంపును వేనోళ్లఁ జాటుచున్నది. వీరు ధర్మోచితముగా కృపాణతూణ బాణాసనపాణు లై రాణించుచున్నవారు. రూపంబున నశ్విదేవతలం బోలి యీయౌవనమునకుఁ దగ మొలకొత్తుచున్న యెలజవ్వనమున నివ్వటిలుచుఁదను యిచ్చమెయి దేవలోకంబునుండి భూమి కవతరించిన దేవతలో యనం గొమరారుచున్నవారు. దుర్గమంపువనమార్గంబుల సుకుమారము లగునడుగులు గందనేకరణి నడచి యిచటికి వచ్చిరి? ఎవ్వనికొఱకేమిపనికై యిట రాక? నీ వంతయు నెఱుఁగుదువు. ఆయుధంబులు దాల్చి యున్నయీ వీరు లెవరికుమారులు? చంద్రసూర్యు లాకాశంబునుంబోలె వీరలీదేశంబును వెలిగించుచున్నవారు. మేనియొడ్డుబొడ్డుపులను ఇంగితాకారములను నొండొరులకు నెంతయు నీడు జోడై పొడసూపెదరు. కాకపక్షధరు లగునీవీరులవృత్తాంతమును గలరూపున వినఁగోరెద' నని యడిగె. మహాత్ముఁ డగునమ్మహీనాథునివచనము విని విశ్వామిత్రుఁ డమ్మహాత్ము

లిద్దఱును దశరథకుమారులని యెఱింగించి మఱియు సిద్ధాశ్రమమున నుండుటయు నందు యజ్ఞవిఘ్నకరు లగురాక్షసుల నాయిరువురు చంపుటయు, రాక్షసులు వేవురకొలఁదిని బలసి యున్న యరణ్యమార్గముల నిర్భయముగ వారరుగుదెంచుటయు, విశాలాపురిని గాంచుటయు, అహల్యను దర్శించుటయు, గౌతమునితోడి సమాగమంబును, జనకునింటనున్న పెనువింటిసారాసారంబు లెఱుంగఁ గోరి రాకయు, మున్నగు వృత్తాంతమెల్ల నమ్మహాతేజునకు జనకరాజునకుఁ జెప్పి యంతట విరమించినవాఁడయ్యె. ఇది యేఁబదవసర్గము.

---

## విశ్వామిత్రుని చరిత్రము.

మహామతి యగునమ్మునిపతి విశ్వామిత్రుని వచనము విని యమందతేజుఁడగుశతానందుఁడు పులకితాంగుఁ డయ్యె. మహాతపంబు పెంపున నెంతయు దేహకాంతి దీపించు చున్న యమ్మహాత్ముఁడు గౌతముని పెద్దకుమారుఁడు గాన 'నాతల్లి నుద్ధరించిన రాముని మహిమ యౌరా యేమనవచ్చు!' నని రాముని జూచినంతమాత్రమున మిక్కిలియాశ్చర్యము నొంది తనయెదుర సుఖాసీను లై యున్న యారాజకుమారులఁ జూచి విశ్వామిత్రమునీంద్రునితో 'మునిశార్దూలా! నీవు దీర్ఘతపము సలుపు చున్న యశస్విని యగునాతల్లిని ఈ రాజకుమారునకుఁ జూపితివా? ఆయమ మహాప్రభావయుతయు యశస్వినియుఁ గావున, సర్వప్రాణిపూజనీయుఁడైన రామునకు వన్యములగు కందమూలాదులఁ బూజఁ గావించెనా? తొల్లి దైవదుర్విలాసమువలన నాతల్లికిఁ గలిగినవృత్తాంతమును గలరూపున రామునికిం జెప్పితివే కదా? కుశికవంశతిలకా! నీకుఁ గుశలం బగుఁగాక. మాయమ్మ రామసందర్శనాదులయినపిదప, ఆమహిమంజేసి మాతండ్రిని గూడినదా? నాతండ్రియు రాముని బూజించెనా? మహాత్ముఁ డగురాముఁడును హిమవంతమున నుండి వచ్చిన మాతండ్రిని అహల్యాదానమునఁ బూజించెనా? నా గురుఁడును మనసునఁ గినుకమాని మరల నాయాశ్రమమునకు వచ్చినపుడు రాముఁ డతనికి మనస్స్ఫూర్తిమెయి మ్రొక్కెనా?' యని యడుగఁగా విశ్వామిత్రుఁడు విని యమ్మాటలపొం దూహించి వాక్యవిదుఁ డగుశతానందునితో 'మునీంద్రా! నే నేదియుఁ గడపి పుచ్చ లేదు. ఏ సమయమున నేది చేయం దగునో యది చేసియున్నాఁడ. రేణుక జమదగ్నిం గూడినట్లు అహల్యయు గౌతమునిఁ గూడినది' యనియె. విశ్వామిత్రుఁ డాడిన యవ్వాక్యము విని శతానందుఁడు మొగమున నగ్గలంపుఁ దెలివి తొలఁకాడ రామునితో నరోత్తమా! రాఘవా! నీకు స్వాగతము. దైవయోగమున బీఱువోని తపోగరిమము గలయిమ్మహర్షిని విశ్వామిత్రునిఁ బురస్కరించుకొని యిట వచ్చితివి. ఈవిశ్వామిత్రుఁడు అచింత్యము లగుమహాకార్యములఁ గావించినదిట్ట సుమీ! తపోబలమున బ్రహ్మర్షియైన యెనలేనికాంతిఁ దళుకొత్తుచున్న వాఁడు; మహాతేజుఁడు.

ఇతఁడు నీకు పరమహితసంధాయకుఁ డని యెటుంగుదే? మహాతపము సల్పినకుశిక పుత్త్రుఁ డీవిశ్వామిత్త్రుఁడు గాధి యుండుటఁజేసి యీపుడమిలో నీకన్న ధన్యుఁడు వేఱొకఁ డెవ్వాఁడును లేఁడు సుమీ! మహాత్ముఁ డగునీకౌశికునితపోబల మెట్టిదో, యాతనిచరిత మేచందం బయినదో, చెప్పెద నాలించి వినుము. ఈ ధర్మాత్ముఁడు బహుకాలము రాజై యుండి పగతుర నుక్కడంచుచు ధర్మము లెఱింగినడపుచు, సకలవిద్యలయం దాఱితేరి, ప్రజాహితరతుండై, యుండె ఇతని వంశావతారము వినుము బ్రహ్మదేవునికుమారుఁడు కుశుం డను రాజు గలఁడు. కుశునకు మహాబల వంతుఁడును బరమధార్మికుఁడు నై నకుశనాభుఁడు కొడుకయ్యె. ఆకుశనాభునకు గాధి యనువాఁడు పుట్టె. మహాముని యగునీవిశ్వామిత్త్రుఁడు మహాతేజుఁ డగు నాగాధితనూజుఁడు. విశ్వామిత్త్రుఁడును మిక్కిలియుఁ దేజంబురాజిల్లఁ బెక్కువేల సంవత్సరములు రాజై పుడమిని రాజ్యపరిపాలనము గావించె ఒకనా డమ్మహాతేజుఁడు చతురంగబలములఁ గూర్చుకొని యక్షౌహిణీసైన్యము చుట్టుబలిసి చను దేర భూతలమంతయుఁ దిరుగువాఁడై నానాదేశములను అందలి వివిధనగరము లను నదీనదములను బర్వతములను బుణ్యాశ్రమములను గ్రమమునం జరించుచు వసిష్ఠాశ్రమమునకుఁ బోయె. అందు పలువిధము లగువృక్షములు గ్రిక్కిఱిసి పెఱలుచుండు. పులులు సింగములు మొదలగు పెక్కు దెఱంగులమృగములు నెఱసి తిరుగాడుచుండు. మనుజులలో మరిగినజింక లందంద పొంకము చూపుచుండు, పెక్కువగలపులుఁగులమొలుఁగులు మించుచుండు. మఱియు నయ్యాశ్రమము సిద్ధచారణసేవితమును, దేవదానవకిన్నర గంధర్వవిరాజమానమును, బ్రహ్మర్షి దేవర్షి గణభాసమానము నై యొప్పుచుండు ఇంతే కాక తపము సల్పి సిద్ధిని బొందిన వారును, అగ్నితుల్యులును, మహాతేజులును, జలాహారులును, వాయుభక్షులును ఫలమూలశీర్ణపర్ణాశనులును, విజితాంతఃకరణులును, రోషరహితులును, జితేంద్రి యులు నగుఋషులును, నిరంతరజపహోమపరాయణు లగువాలఖిల్యులును, మఱి యులు దక్కంగల * వైఖానసాదులును, నలుగడల మెలంగ నెంతయు జెలు వారుచుండు. ఇట్లు మఱియొక బ్రహ్మలోకమువలెఁ బ్రకాశించుచున్న యవ్వసిష్ఠా శ్రమ పదమును, అమ్మహాబలుఁడు విశ్వామిత్త్రుఁడు గాంచినవాఁ డయ్యె ఇది యేఁబ దియొకండవసర్గము.



* బ్రహ్మవాలమునఁ బుట్టినఋషులు వాలఖిల్యులనియు, నఖములఁ బుట్టినవారు వైఖానసు లనియుఁ జెప్పఁబడుదురు, 'యే నఖాః తే వైఖానసాః యే వాలాః తే వాలఖిల్యాః' అని శ్రుతి

లిద్దఱును దశరథకుమారులని యెఱింగించి మఱియు సిద్ధాశ్రమమున నుండుటయు నందు యజ్ఞవిఘ్నకరు లగురాక్షసుల నాయిరువురు చంపుటయు, రాక్షసులు వేవుర కొలఁదిని బలసి యున్నయరణ్యమార్గముల నిర్భయముగ వా రరుగుదెంచుటయు, విశాలాపురిని గాంచుటయు, అహల్యను దర్శించుటయు, గౌతమునితోడిసమాగమంబును, జనకునింటనున్న పెనువింటిసారాసారంబు లెఱుంగఁ గోరి రాకయు, మున్నగు వృత్తాంతమెల్ల నమ్మహాతేజునకు జనకరాజునకుఁ జెప్పి యంతట విరమించినవాఁడయ్యె. ఇది యేఁబదవసర్గము.

---

## విశ్వామిత్రుని చరిత్రము.

మహామతి యగునమ్మునిపతి విశ్వామిత్రుని వచనము విని యమందతేజుఁడగుశతానందుఁడు పులకితాంగుఁ డయ్యె. మహాతపంబు పెంపున నెంతయు దేహకాంతి దీపించు చున్నయమ్మహాత్ముఁడు గౌతముని పెద్దకుమారుఁడు గాన 'నాతల్లి నుద్ధరించిన రామునిమహిమ యౌరా యేమనవచ్చు!' నని రాముని జూచినంత మాత్రమున మిక్కిలియాశ్చర్యము నొంది తనయెదుర సుఖాసీను లై యున్న యా రాజకుమారులఁ జూచి విశ్వామిత్రమునీంద్రునితో 'మునిశార్దూలా ! నీవు దీర్ఘ తపము సలుపు చున్నయశస్విని యగునాతల్లిని ఈ రాజకుమారునకుఁ జూపితివా ? ఆయమ మహాప్రభావయుతయు యశస్వినియుఁ గావున, సర్వప్రాణిపూజనీయుఁ డైన రామునకు వన్యములగు కందమూలాదులఁ బూజఁ గావించెనా ? తొల్లి దైవదుర్విలాసమువలన నాతల్లికిఁ గలిగినవృత్తాంతమును గలరూపున రామునికిం జెప్పితివే కదా ? కుశికవంశతిలకా! నీకుఁ గుశలం బగుఁగాక. మాయమ్మ రామసందర్శనాదులయినపిదప, ఆమహిమం జేసి మాతండ్రిని గూడినదా? నాతండ్రియు రాముని బూజించెనా ? మహాత్ముఁ డగురాముఁడును హిమవంతమున నుండి వచ్చిన మా తండ్రిని అహల్యాదానమునఁ బూజించెనా? నా గురుఁడును మనసునఁగినుకమాని మరల నాయాశ్రమమునకు వచ్చినపుడు రాముఁ డతనికి మనస్సంతృప్తిమెయి మ్రొక్కెనా? ' యని యడుగఁగా విశ్వామిత్రుఁడు విని యమ్మాటలపొం దూహించి వాక్యవిదుఁ డగుశతానందునితో 'మునీంద్రా ! నే నేదియుఁ గడపి పుచ్చలేదు. ఏ సమయమున నేది చేయం దగునో యది చేసియున్నాఁడ. రేణుక జమదగ్నిం గూడినట్లు అహల్యయు గౌతమునిఁ గూడినది' యనియె. విశ్వామిత్రుఁ డాడిన యవ్వాక్యము విని శతానందుఁడు మొగమున నగ్గలంపుఁదెలివి తొలఁకాడ రామునితో నరోత్తమా ! రాఘవా ! నీకు స్వాగతము. దైవయోగమున బీఱువోని తపోగరిమము గలయిమ్మహర్షిని విశ్వామిత్రునిఁ బురస్కరించుకొని యిట వచ్చితివి. ఈవిశ్వామిత్రుఁడు అచింత్యము లగుమహాకార్యములఁ గావించినదిట్ట సుమీ ! తపోబలమున బ్రహ్మర్షి యైన యెనలేనికాంతిఁదళుకొత్తుచున్నవాఁడు; మహాతేజుఁడు,

ఇతఁడు నీకు పరమహితసంధాయకుఁ డని యెఱుంగు దేని మహాతపము సల్పినకుశిక పుత్త్రుఁ డీవిశ్వామిత్త్రుఁడు గావై యుండుటఁజేసి యీపుడమిలో నీకన్న ధన్యుఁడు వేఱొకఁ డెవ్వఁడును లేఁడు సుమీ ! మహాత్ముఁ డగునీకౌశికునితపోబల మెట్టిదో, యీతనిచరిత మేచందం బయినదో, చెప్పెద నాలించి వినుము. ఈ ధర్మాత్ముఁడు బహుకాలము రాజై యుండి పగతుర నుక్కడంచుచు ధర్మము లెఱిఁగినడపుచు, సకలవిద్యలయందు దాఁటి తేరి, ప్రజాహితరతుండై, యుండె. ఇతని వంశావతారము వినుము. బ్రహ్మదేవునికుమారుఁడు కుశుం డనురాజు గలఁడు. కుశునకు మహాబల వంతుఁడును బరమధార్మికుఁడు నైనకుశనాభుఁడు కొడుకయ్యె. ఆకుశనాభునకు గాధి యనువాఁడు పుట్టె. మహాముని యగునీవిశ్వామిత్త్రుఁడు మహాతేజుఁ డగు నాగాధితనూజుఁడు. విశ్వామిత్త్రుఁడును మిక్కిలియుఁ దేజంబురాజిల్లఁ బెక్కువేల సంవత్సరములు రాజై పుడమిని రాజ్యపరిపాలనము గావించె. ఒకనా డమ్మహాతేజుఁడు చతురంగబలములఁ గూర్చుకొని యక్షౌహిణీసైన్యము చుట్టుబలిసి చను దేర భూతలమంతయుఁ దిరుగువాఁడై నానాదేశములను అందలి వివిధనగరము లను నదీనదములను బర్వతములను బుణ్యాశ్రమములను గ్రమమునం జరించుచు వసిష్ఠాశ్రమమునకుఁ బోయె. అందు పలువిధము లగువృక్షములు గ్రిక్కిఱిసి పెఱులుచుండు. పులులు సింగములు మొదలగు పెక్కు దెబ్బంగులమృగములు నెఱసి తిరుగాడుచుండు. మనుజులలో మరిగినజింక లందంద పొంకము చూపుచుండు. పెక్కువగలపులుఁగులయెలుఁగులు మించుచుండు. మఱియు నయ్యాశ్రమము సిద్ధచారణసేవితమును, దేవదానవకిన్నరగంధర్వవిరాజమానమును, బ్రహ్మర్షిదేవర్షి గణశోభసమానము నై యొప్పుచుండు. ఇంతే కాక తపము సల్పి సిద్ధిని బొందిన వారును, అగ్నితుల్యులును, మహాతేజులును, జలాహారులును, వాయుభక్షులును ఫలమూలశీర్ణపర్ణాశనులును, విజితాంతఃకరణులును, రోషరహితులును, జితేంద్రియులు నగుబుషులును; నిరంతరజపహోమపరాయణు లగువాలఖిల్యులును; మఱియు లు దక్కుంగల * వైఖానసాదులును, నలుగడల మోలంగ నెంతయు జెలువారుచుండు. ఇట్లు మఱియొక బ్రహ్మలోకమువలెఁ బ్రకాశించుచున్న యవ్వసిష్ఠాశ్రమ పదమును, అమ్మహాబలుఁడు విశ్వామిత్త్రుఁడు గాంచినవాఁ డయ్యె. ఇది యేఁబదియొకండవసర్గము.



* బ్రహ్మవాలమునఁ బుట్టినబుషులు వాలఖిల్యులనియు, నఖములఁ బుట్టినవారు వైఖానసులనియుఁ జెప్పఁబడుదురు, 'యే నఖాః తే వైఖానసాః యే వాలాః తే వాలఖిల్యాః' అని శ్రుతి.

### వసిష్ఠుఁడు తనహోమధేనువును విశ్వామిత్రునకు విందు సేయ నియమించుట.

"మహాబలుఁడును బరాక్రమశీలుఁడు నగువిశ్వామిత్రుఁడు మునివరిష్ఠుఁడగువసిష్ఠునిఁ జూచి సంతసము గడలుకొన నతివినయమున నమస్కరింపఁగా నమ్మహాత్ముఁడును 'నీకును నీపరివారమునకును స్వాగతం' బనుచు నాతని కాసనము నిప్పించె. అంత ధీమంతుఁ డగునావిశ్వామిత్రుఁ డయ్యాసనమునఁ గూర్చుండఁగా, అమ్మునివరుఁడు యథావిధి నతనికి ఫలమూలము లర్పించిన నారాజసత్తముఁడు మునిసత్తముఁ డొనర్చినయాపూజను బరిగ్రహించి యాతనిఁజూచి 'తపము జరుగుచున్నదా? అగ్నిహోత్రకార్యము లెడతెగక ప్రవర్తిల్లునా? శిష్యు లందఱు సేమమా? ఇందలి వృక్షసమూహమెల్లఁ జక్కఁగా వర్ధిల్లుచున్నదా?' యని కాంతి దళుకొత్తఁ గుశల మడిగె. వసిష్ఠుఁడును 'రాజసత్తమా! నీయడిగిన వెల్లఁ గుశలమే యని యుత్తరము సెప్పె. బ్రహ్మపుత్రుఁ డైనయాపరమతపస్వి విశ్వామిత్రునిట్లు కుశలం బరసి యాతఁడు సుఖముగాఁ గూర్చున్నపిదప నతనితో 'రాజా! నీకుఁ గుశలమా? నీవు పరాక్రమవంతుఁడును ధార్మికుఁడు నగుదువు. కానప్రజల ధర్మపద్ధతిం జేసి రంజిల్లఁజేయుచు * రాజవృత్తముచొప్పున వారిని బాలించెదవే కదా. భృత్యులను జక్కఁగాఁ బోషింతువా? వారు నీ యాజ్ఞనుదప్పక నిలుతురా? పగవారిఁ దూటాడుమేటివి. కాన శత్రులందఱు గెలువంబడిరే కదా? శత్రులను దమింపఁజేయుట నీ కవశ్యకృత్యము గాన యందులకు సాధనము లైన చతురంగబలములును, బొక్కసమును, మిత్రులును పుత్రపౌత్రులును గుశలమా?' అనియడుగ, విశ్వామిత్రుఁడు నమ్మహాతపోధనునకు అతివినయంబున 'మీరడిగిన దెల్ల గుశలమే' యని బదులుచెప్పె. ఇట్లాపరమధార్మికు లిద్దఱును బెద్దయుం బ్రొద్దు మిక్కిలి ముదము పొదలఁ బరస్పరకుశల ప్రశ్నములం గూర్చి సల్లాపము లాడుచు నొండొరుల నుల్లసిల్లంజేయుచు నుండిరి. అంత నాసల్లాపములు తీరఁగా వసిష్ఠుఁడు నెమ్మొగము వికసిల్ల నాజనవల్లభునిఁ జూచి 'నీ వతివిస్తారబలములతోడ నిచ్చటికి వచ్చితివి. కాన యీచతురంగబలములకును, దీనినిబట్టి కొలంది యిడరానిమహిమ గలనీకును, దగినరీతి నతిథిపూజను గావింపఁగోరెద. నీవును నా ప్రార్థన కియ్యకొని నేను జేయఁ బూనినయతిథి సత్కారము నంగీకరింపుము. నీవు రాజవు ; అతిథిశ్రేష్ఠుఁడవు గావున నిన్నుఁ బ్రయత్నమునఁ బూజింపవలయు' నని ప్రార్థించెను. విశ్వామిత్రుఁడును వసిష్ఠుఁ డాడినమాట విని బుద్ధిమంతుఁడు

* 'న్యాయేనార్జన మర్థస్య వర్ధనం పాలనం తథా । సత్పాత్రే ప్రతిపత్తిశ్చ రాజవృత్తం చతుర్విధమ్' అను న్యాయంబున ధనము సంపాదించుట, దానిని బెంచుట, రక్షించుట, సత్పాత్రంబున నొసఁగుట యని రాజవృత్తము నాలుగువిధము లగును.

గాన యాతనికి శ్రమము గలిగింప నిచ్ఛగింపక యాతనిఁజూచి 'మహాత్మా! అతిథిసత్కారము చేసెద నని మీరు పలుకుటచేతనే మాకు మీసపర్యలు వచ్చె. ఇఁక వేఱ చేయవలయునా? మీ యాశ్రమమునం గలఫలమూలములను, పాద్యమును, ఆచమనీయమును, భగవంతుఁ డగుమీదర్శనమును, నాకొసఁగి యన్ని దెఱఁగుల నన్నుఁ జక్కఁగాఁ బూజించితిరి. నాకుఁ బూజనీయుల లగు మీరింతమాత్రము మముబోంట్ల సత్కరించుటయే మాకెంతయుఁ బూజయయ్యె. మఱియుం బూజ యేల? ఇది మహాప్రాజ్ఞు లగుమీకుఁ దెలియనిదిగాదు. కాన పని వినియెద. ఇదె నమస్కరించితి. నన్ను నెయ్యంపుఁజూడ్కిఁ గటాక్షింపుఁ' డనియె. ఇట్లు విశ్వామిత్రుఁ డెన్నిమాఱులు వల దని వేఁడికొన్నను నావసిష్ఠుఁ డుదారచిత్తుఁడు గాన మరలమరల భోజనమునకై ప్రార్థింపఁగా 'వల్లె' యని యాగాధిసుతుఁ డియ్యకొని వసిష్ఠునిఁ జూచి 'మునీంద్రా! మీచిత్త మెట్లో యట్లే యగుంగాక' యనియె. అందులకు వసిష్ఠుఁడు నెమ్మనము కలంకదేఱి చాల మోదమునొంది మొగంబునఁ గాంతి దళుకొత్త నత్తఱి చిత్రవర్ణం బగుకామధేనువును బిలిచి 'శబళా! వేగ రారమ్ము. నే నొకమాట చెప్పెద. దాని నీవు విన వలయు. నే నీరాజర్షికిని ఇతని బలములకును మిక్కిలి యొప్పిద మగువిందు వెట్టి సత్కారము సేయఁగోరితి. నీవు దానికి వలయుద్రవ్యములను సమకట్టుమా. నీవు కోరినవాని నెల్లం బిదుకుదానవుగదా. కావున నాఱురసములయం దెవ్వని కేది యిష్టమో దానినంతయు నన్నుఁబట్టి వానికిఁగురియుము. రసాయనములును, భక్ష్యములును, పానీయములును, తేనియలు మొదలగు లేహ్యములును, పెరుఁగు మున్నగు చోష్యములును (పీల్పందగునవియుఁ), గూడి చవులు గులికెడిశాల్యన్నము వలయుదాని నంతయుఁ బ్రోవుగానిర్మింపుమా. జాగు వలదు; వేగ కావలయు' ననియె. ఇది యేఁబదిరెండవసర్గము.

---

**విశ్వామిత్రుఁడు శబళను దన కిమ్మని వసిష్ఠు నడుగుట**

"రామా! వసిష్ఠుఁ డట్లుచెప్పఁగా నాశబలయుఁ గోరినకోర్కులను బిదుకు నదిగాన యెవ్వఁ డెట్లుగోరెనో వారి కట్లే కోరినవన్నింటిని గురిసినదయ్యె. చెఱకులును, దీయనితేనియలును, పేలాలును, మేలిపాత్రములనిండ నిప్పపూఁగల్లులును, మిక్కిలి యొప్పిదము లైనపానీయములును, పలువగల పిండివంటలును నుప్పతిల్లె. మఱియు నయ్యాశ్రమమునఁ గొండలంబోని వేఁడియన్న పురాసులును, పాయసము మొదలగుమృష్టాన్నములును, సూపములును, పెరుఁగువెల్లువలును, పలుదెఱంగుల చవులు గులుకునటు లాఱురసంబులం గూర్చి కావింపఁబడినపాడబములనుతినుబండములు నిండియున్న పాత్రలును, మఱియు బెల్లంపుఁబణియారములును వేలకొలఁదిని గాన్పించినవి. రామా! సంతుష్టియుఁబుష్టియును గలిగి

యొప్పవిశ్వామిత్రు బలంగములోనిజను లందఱును, ఆవసిష్ఠునివిందు గుడిచి తృప్తిం బొందీ మఱింత తుష్టియుఁ బుష్టియు నొందినవారైరి. విశ్వామిత్రుఁడును అతని యంతఃపుర కాంతాజనములును బ్రాహ్మణులును పురోహితులును ఆవిందునకు మిక్కిలియు సంతసము నొందిరి. విశ్వామిత్రుఁడు తన్నును దనకుఁ గార్యమున సహాయు లగుభృత్యులను వసిష్ఠుఁడు పూజించుట కవు డత్యంతసంతుష్టుఁడై యమ్మునిం జూచి 'బ్రాహ్మణోత్తమా ! నీవు మాకుఁ బూజనీయుఁడవు. అట్టినీవు మాకోఁటులను బహూకరించి యతిథిసత్కారంబులు తోరంబులుగాఁ జేసితివి.ఇంత కన్నఁ బెంపు మాకేదికలదు? అది యటుండనీ. నీవు మాటపొందుఁజక్కఁగా నెఱుంగుదువు. కాన నీతో నొకమాట సెప్పెద వినుము. నీకు లక్షగోవులిచ్చెద. వానిని బుచ్చుకొని నాకీకామధేనువునిమ్ము. ఇది తనజాతియందెల్ల శ్రేష్ఠమైనది. కావున రత్నంబగు. రత్నములన్నియు రాజునకుఁ జేరవలయునుగదా! కాఁబట్టి దీనిని నాకిమ్ము. ధర్మమునుబట్టి చూడఁగా నిది రాజయిననాదియే కాని బ్రాహ్మణుఁడ వగు నీదిగా' దనియె. ఇట్లావిశ్వామిత్రుఁడు సెప్పఁగా మహాత్ముఁ డగు నమ్మునిసత్తముఁడు వినియు ధర్మాత్ముఁడు గాన నిజధర్మానుష్ఠానములకు సాధనమైన యాధేనువు నీయం జాలక యాభూపాలకునితో 'రాజా ! ఒకనూఱువేలుకాదు. పెక్కునూఱుకోట్లకోలఁదియావులు నా కిచ్చినను, ఇంతేల వెండిరాసులు తండోపతండములుగాఁ గుమ్మరించినను, నేను శబళ నీయంజాలను జుమీ. నీవు పగవారినెల్లనడంచు దిట్టవే. ఇట్టివాఁడవుగాన యేమిచెట్ట సేయుదువో యని వెఱచి దీనిని దిగవిడుతు నాకెవ్వడవను. ఏలన నిది నాచెంతనే యుండఁదగునుగాని చెంతఁబాసి యుండరాదు. మనస్వి యగువానికిఁగీర్తియుంబోలేఁ, దపస్వియగు నాకు నిది యెప్పుడును బాయక స్థిరముగానుండునది. ఇందులకుఁ గారణము వినుము. దేవతలకు నిచ్చుహవ్యములును పితరులకుఁ బెట్టుకవ్యములును, రేపును మాపును వేల్చునగ్నిహోత్రములును, భూతలబలియు, దర్శపూర్ణమాసాదిహోమములును, ఇవియవియననేల? నాదేహయాత్రయు, ఈకామధేనువువలననే జరుగుచున్నవి. ఇంతేకాదు స్వాహాకార వషట్కారమంత్రములును వేదము మొదలగు నానావిధ[illegible]లును జరుగుట కిదియె మూలము. ఇందులకు సందియము లేదు. సత్యముగాఁ జెప్పెద. ఇదియే నాసర్వస్వము. నాకెపుడును సంతోషముసేయున దిదియే. ఈచెప్పినకారణములే కాక యింకను పెక్కుకారణములుకలవు. వానింబట్టి నేనీయావును నీకీయ నేర'ననియె. వసిష్ఠుఁడిట్లు చెప్పఁగా విశ్వామిత్రుఁడు మిక్కిలి యక్కఱచే దొట్రువడచు మాట నెఱనీటు మీఱ మఱిమఱి యమ్మునితో 'బంగారునడికట్టుత్రాళ్లను బసిండి మెడ గొలుసులును అంకుసములును గలిగి రంగారు నేనుంగులు పదునాలుగువేలనునీకొసంగెద. మేలిబంగారుమయములై నాలుగేసి తెలిగుఱ్ఱములఁబూని చిఱుగంటలచే మొరయుచుఁ దుఱంగలించునరదంబులు నెనిమిదివంద లిచ్చెద. మఱియు మంచి

దేశంబులను మంచిజాతులనుం బుట్టి మిక్కుటంపుబలిమి గలిగి యున్నగుఱ్ఱములు పదునొకండువేలు నీకిచ్చెద. ఇంతేకాదు. పలువిధము లైనవర్ణములు వేఱువేఱ కలిగి యున్నతెలుపియావులను నొక కోటియిచ్చెద. కామధేనువును నాకిమ్ము. రత్నములను బంగారును వలచితివా, నీవెంతగోరిన నంతయు నిచ్చెద. కామధేనువును మాత్రము నా కిమ్ము' అనియె. ఇట్లు విశ్వామిత్రుఁడడుగఁగా మహాత్ముఁడగువసిష్ఠుఁడాతనింజూచి 'రాజా! ఏవిధమునఁగాని నేనీయావు నీయఁజాల. నీవిచ్చెద నన్నరత్నాదులవి నాకేల? ఇదియె నాకురత్నము; నాకు ధనము. ఇదియె నాకు సర్వస్వము నాజీవితమును ఇదియ. నాకుదర్శమును బూర్ణమాసయు మంచిదక్షిణలు గలయజ్ఞములును, మఱియు నానావిధక్రియలును ఇదియే. ఇంతేల? నేను జేయుకర్మములన్నింటికిని ఇదియె మూలము. పలుమాట లేల? కోరినవానినన్నిఁ బిదుకునట్టి యీకామధేనువు నియ్య' ననియె. ఇది యేఁబదిమూఁడవసర్గము.

---

—•◆ శబళ బలంబులను సృజించి విశ్వామిత్రుసేన నుఱుమాడుట. ◆•—

"వసిష్ఠుఁడు కామధేనువును విడువకుండుటను జూచి విశ్వామిత్రుఁడు దానిని బలాత్కారంబునంబట్టి తనపెంపు దీపింప నీడ్చుకొని పోవఁగా, ఆశబళ శోకమున స్రుక్కి యేడ్చుచు తనలో 'అక్కటా! ఈరాజభటులు నన్ను మిక్కుటముగా దీననై దుఃఖించునట్లు పట్టికట్టి యీడ్చుకొనిపోవుచున్నారు. ఇదేల! మహాత్ముఁడగు వసిష్ఠుఁడు నన్ను విడిచెనా యేమి? ఆమహర్షికి నే నపకార మేదియుఁ జేయలేదే! ఆత్మవేత్తయగునతని కేది తెలియదు? అట్టిధార్మికుఁడు, ఏయపరాధమును జేయక యనురక్తనై తనప్రీతికిని బాత్రం బై యుండునన్ను విడువనేల?' (యని చింతించి సారెకు నూర్పులు పుచ్చుచు)తన్నుఁ బట్టికొని పోవుచున్న రాజభృత్యులను విదిల్చి త్రోచి వేగ చని మహాత్ముఁ డగువసిష్ఠునియడుగులమూలము సేరి యాతనియెదుట నిలఁబడి యేడ్చుచును మేఘదుందుభిరవంబున నఱచుచు నతనితో 'మహాత్మా! నీవు నన్ను దిగవిడిచితివా? లేకున్న నన్నేలయీకింకరులు నీచెంతఁ బాపి తీసికొనిపోవుచున్నారు? బ్రహ్మకుఁ బుత్త్రుఁడ వగునీకు నను విడువఁ దగునా' యని యడుగఁగా నాబ్రహ్మయు మిక్కిలి శోకమున డెందము కొందలపడఁ, జెలియవలె నేడ్చుచున్న యాశబళను జూచి 'శబళా! నిన్ను నేనువిడువను. నీవు నాకేమియు నపకారమును జేయవు. నిన్ను విడుతునా! మహాబలుం డైన యీభూపాలుఁడు తనబలిమివెల్లున మ త్తిల్లి పాడిదప్పి నిన్నుఁగొనిపోవుచున్నాఁడు. అతని నడంచి నిన్ను విడిపింతునందునా, యాతనితో సాటియైనబలమునాకు లేదు. తపోబలముచేనిగ్రహింతునందునా, యతఁడు మనకు రాజై యున్నవాఁడు. రాజును దపోబలమున దండింపరాదుగదా! అందును విశేషించి యాతిథ్య మిచ్చిన యీసమయమునం దేమియుఁ జేయఁ దగదు. ఈరాజుబలవంతుఁ డగుక్షత్త్రియుఁడై భూమి నేలుచున్నవాఁడు భూమికి

పతి యైన వానిని జంపినచో పాతకము ఈ యక్షౌహిణియో కేవలమైనదిగాదు ; రథములును తురగములును గ్రిక్కిఱిసి, గజములందలిధ్వజములును నెఱయ, మెఱయుచున్నవి, ఇట్టిబలముంగమువలన నితఁడు మఱియుబలీయుఁడై యున్నవాఁడు. ఏమిసేయుదు'ననియె. మాటలపొందెఱింగిన యాశబళయు వసిష్ఠునిపలుకులు విని వినయముదళుకొత్తనపరిమితదీప్తియుతుఁడగు నాబ్రహ్మర్షినిఁ జూచి 'బ్రాహ్మణోత్తమా ! క్షత్రియునిబల మల్పమైనది. బ్రాహ్మణుఁడే యెక్కుడుబలవంతుఁడు. బ్రాహ్మణునిబలము క్షత్రియునిబలమునకన్న మేలై మిక్కిలి బలీయమగునని యార్యులు చెప్పుదురు. కాఁబట్టిబ్రాహ్మణుఁడ వగునీబలము కొలందిడ యిడరానిది విశ్వామిత్రుఁడు మిక్కిలి వీర్యవంతుఁడై నను నీకన్నను బలవంతుఁడుగాఁడు.నీతేజం బెవరికిని గలుగుట యరిది. ఇట్టిమహామహిముఁడవు గాన నీబ్రహ్మబలమున నాకుఁ బ్రభావము గలిగించి నియోగింపుము. ఇదే యీ రాజునకుఁగల కావరంపుబలిమి నంతయుఁ బులిమిపుచ్చెద' ననియె. అంత నమ్మహాకీర్తిమంతుఁడు దానిఁజూచి 'ఈ పరబలములములను రూపుమాపం గలబలంబును సృజింపు' మని యానతిచ్చె. అమ్మాటవిని యానురభి యప్పుడు బలంబు సృజింపఁబూని యంబా యని యఱచె. ఆయఱపువలననుండి పప్లవులనుమ్లేచ్ఛజాతులు వందలకొలఁదినిబుట్టి విశ్వామిత్రుని కన్నులయెదుటనే యాతనిబలము నంత నిర్మూలము గావించిరి. కౌశికుఁడు తన బలము హతమగుచుండుటఁ జూచి యరదంబెక్కి పగవారిపయిం గలపడి యుల్లంబున కోపంబు మల్లడిగొన, రోషంబువెల్లునఁ గన్నుఁగవ యెంతయు వికసిల్ల,నానా విధశస్త్రంబులు వైచి యాపప్లవులను నాశము సేసె. విశ్వామిత్రుఁడు పప్లవులను నూఱులకొలఁది నుఱుమాడుటంజూచి శబల మఱల కినుకదనుక, శకులను యవనులను సృజింపఁగా వారును మంచికాంతియు మిక్కుటంబగుపరాక్రమమునుం గలిగి, సంపెంగయకరువులవంటిరంగుమీఱ, మిటారించునిడుదకత్తులును బట్టసలునుబూని. బంగారువన్నెవలువలు గట్టి, పొడసూపి పుడమియంతయుఁ నెక్కడఁ జూచినను దావమై క్రమ్ముకొని మండుచున్న నిప్పులంబోలె నాతనిదండుదట్టము నంతయుఁ గాల్చివైచిరి. అంత విశ్వామిత్రుండును దేజము రాజిల్ల బాణము లామ్లేచ్ఛశ్రేణులపయిని బ్రయోగింపఁగా నాయవనులును గాంభోజులును బప్లవులును నాకులపడి తూలినవారైరి. ఇది యేఁబదినాల్గవ సర్గము.

---

విశ్వామిత్రుఁడు శివునివలన నస్త్రవిశేషములెల్లఁ బడయుట.

"వసిష్ఠుఁడు విశ్వామిత్రునిశరజాలముల సొమ్మసిల్లి చెల్లాచెద రగుచున్న యామ్లేచ్ఛబలములఁ గనుఁగొని కామధేనువునకు యోగబలంబున బలముల సృజింప నానతిచ్చె. అంత నది'హుంబా'యనుటయు నాయఱపువలననుండి సూర్యునింబోలు తేజముగల కాంభోజులుపుట్టిరి. దానిపొదుఁగునుండి పప్లవులు బాణములు

దాల్చి పోడమిరి. యోనివలననుండి యవనులును. శకృత్తునుండిశకులును, రోమకూపములనుండి తురకలును బోయలును హారీతులును బుట్టిరి. వారందఱు వేఱువేఱ రథగజతురగపదాతిసంయుతం బగువిశ్వామిత్రుని బలమునంతయు తోడనే తునిమి తూటాడివైచిరి. విశ్వామిత్రునిపుత్త్రులు నూర్వురు తమసైన్యమును వసిష్ఠుఁడు తన మహిమవలన నాశముసేయఁగాఁ జూచి నానావిధము లైన యాయుధములు ధరించినవారై యతిక్రుద్ధుఁ డైన యాతాపసోత్తమునిపయిని గలపడిరాఁగా, ఆతఁడు మహామహిముఁడుగాన హుంకారముచేతనే వారినందఱిని దహింపఁగా నపుడా విశ్వామిత్రకుమారులును వారిగుఱ్ఱములును రథములును బదాతులును అందఱు నొకగడియలోన నీఱయిరి. ఆవసిష్ఠునిమహిమ ! విశ్వామిత్త్రుఁడు నపుడు తనకుమారులును జతురంగబలములును హతములగుటం జూచి తనమహాయశమునకుఁగొఱంత కలిగెనే యని యగ్గలంపుసిగ్గున నెంతయుఁ జింత పయిఁకొనఁగా, నురవడి లేని సముద్రమువలె, యుద్ధప్రవృత్తిని మాలి తూలుచుఁ, గోఱలు వెఱుకఁబడినకాల సర్పమువలె, నేమియుజేయుటకు శక్తిలేక, రాహువు గ్రసించినసూర్యునివలెఁ దోడనే యమందతేజంబు గుందినవాఁడయ్యె. మఱియు నతండు, కొడుకులును దడంబులును మడియఁగా, ఱెక్కలు తునిఁగినపక్షివలె మిక్కిలియుదీనుఁడై, దర్పంబు సెడి, తెంపువెం పుడిగి, కొందలపడుచు ‘ఇసీ! యీచతురంగబలము లెల్ల నెందులకును గొఱగా’ దని రోసి వానియం దాసవిడిచి తనకుఁ దక్కియున్నకొడుకు నొక్కనికిఁ బట్టముగట్టి భూమినెల్ల రాజధర్మము దప్పక యొప్పుగాఁ బరిపాలింపు మని నియోగించి యరణ్యమున కరిగి కిన్నరోరగవిజిత మైనహిమవంతముపొంత మహాదేవుఁ డగునీశ్వరుఁడు ప్రసన్నుఁడు గాఁ గోరి వెనుతపము గావించుచుండె. అంతఁ గొంత కాలమునకు నాల పోతుపడగ గలవేలుపులయొడయఁడు శివుఁడు తానాశ్రితవరప్రదుఁడుగాన మహాబలుఁ డగువిశ్వామిత్రునికిఁ బ్రత్యక్ష మయి ‘రాజా! నీవు తపముసేయు నేల? చెప్పఁ దలంచినవానిని దాఁపక చెప్పుము. నే నాశ్రితు లడుగు వరముల నిచ్చువాఁడను. కాన నీవు గోరినవర మేదో దానిని జెప్పు’ మనియె. మహాతపస్సంపన్నుఁ డగువిశ్వామిత్రుఁడాపలుకు విని యమ్మహాదేవునకుఁ బ్రణామముఁ గావించి ‘మహాదేవా! పాపహూరా! నీకు నాయెడఁ జాలఁ బ్రీతి గలదేని ధనుర్వేదమును దానియంగములును ఉపాంగములును రహస్యమంత్రములును ఉపదేశగమ్యము లగువానిరహస్యార్థములును నాకుఁ బ్రసాదింపుము. అనఘా! దేవదానవమహర్షి యక్షరక్షోగంధర్వాదులం దేయేయస్త్రములు గలవో యవియెల్ల నాయందు విలసిల్లుఁగాక. నీవు సామాన్యుఁడవే? దేవదేవుఁడవు గాక. ఇట్టి నీప్రసాదమువలన నామనోరథము మఱొకటియు నెఱవేఱవలయు’ ననుచు వేఁడఁగా నాదేవవల్లభుఁడును ‘వల్లె’ యని పలికి యపుడు తనయెడకు నంతర్హితుఁడయ్యె. విశ్వామిత్త్రుఁ డింతకుఁ బూర్వమే మంచిబలవంతుఁ డై క్షత్రియత్వము

మొదలగువానికి మిక్కిలిగర్వము నొందియుండెను. ఇప్పుడో యీశ్వరకృపా విశేష మున విశేషాస్త్రములు లభింపఁగా నతనిగర్వమునిండి కడలుకొన కుండునా? అతఁడు పర్వమునందు సముద్రము పొంగునట్లు పరాక్రమంబునఁ బెరుఁగుచు ఆ యేపున వసిష్ఠునంతటితాపసోత్తముని ‘ఇఁక వీఁడెక్కడిది! నాచేఁ జచ్చినవాఁడే’ యని తలంచె. పిదప నతఁడు వసిష్ఠునియాశ్రమప్రదేశమునకుఁ బోయి యనేకాస్త్రము లేయఁగా, ఆయస్త్రములవలనను నిజతేజమువలనను నా తపోవన మంతయు దగ్ధ మయ్యె. ఆవిశ్వామిత్రుఁడు మతి మెఱసి పఱపుచున్న బాణపరంపరలఁ జూచి యం దున్నమునులు వందలకొలఁదిని నలుదెసలకుఁ బాఱిపోయిరి. వసిష్ఠుని శిష్యులును మఱియు నందుఁ గలమృగపక్షి సమూహములును దిగులు మిగుల వేలకొలఁదిని దమతమయిక్కలను బాసి పరుగిడినవి. అమ్మహాత్ముని పుణ్యాశ్రమము చెడి పాడుపడి జంతురహితమగుటచే నొకింతచప్పుడును లేక గడియలోపల చవుటినేలయుంబోలె చెట్లుచేమలు మాలి దూలినదయ్యె. అంతయు గన్నారఁ జూచి వసిష్ఠుఁడు మిన్న కుండునా? అతఁడు ‘ఇదె సూర్యుఁడు మంచునువిరియించునట్లు విశ్వామిత్రుఁ దూల పుచ్చెద. భయపడవలదు వలద’ని మాటిమాటికిఁ జెప్పుచునేయుండె. ఎంతచెప్పిన నేమి? వాఁడితూపులతాఁకోర్చినిలుచువారెవరు? ఇట్లా వసిష్ఠుఁడు పలాయితు లగు నాశ్రమజనులకుఁ జెప్పి యంతఁ దేజము వెలుంగఁ గోప మగ్గలింప విశ్వామిత్రు జూచి ‘ఓరీ! ఈయాశ్రమము చిరకాలముగాఁ బెరిఁగి సిరిగులుకుచుండుటయుఁ బాటింపక దీనిని పాడుచేసితివి. కావున నీవు దురాచారుఁడవు: మూఢుఁడవు. కనుక నీయుసు రిఁకదక్కునా? నీ విఁక లేనివాఁడవేసుమీ’ యని మిక్కిలి కోపము దీపింప వేగమునఁ బొగలేనికాలాగ్నివలెను మఱియొక యమదండమువలెను విల సిల్లుచున్న బ్రహ్మదండమును నెత్తికొని యెదుర్కొని నిలిచె. ఇది యేఁబదియైదవ సర్గము.



## వసిష్ఠుఁడు విశ్వామిత్రుని నిర్జించుట.

“వసిష్ఠుఁ డట్లు చెప్పఁగా విశ్వామిత్రుఁడును మహాబలుఁడు గాన వెను దీయక యాగ్నేయాస్త్రము నెత్తి నిలునిలు మని యదల్చె. వసిష్ఠుఁడును రెండవకాల దండమోయన గండుమీఱుతన బ్రహ్మదండమునుగొని కోపమున మండిపడుచు ‘ఓరీ క్షత్రియాధమా! ఇదె నీ చెప్పినట్లు నిలిచితిని. ఏదీ! నీబలము చూపుము. నీక్రొవ్వును నీబాణములయేపును రూపుమాపెద చూడు. క్షత్రియుండ వగు నీబల మెక్కడ? మహనీయం బైనమా బ్రహ్మబల మెక్కడ! క్షత్రియకులపాంసనా! ప్రశంసింపఁదగిన నాబ్రహ్మబలము నిదె చూడు’ మనుచు విశ్వామిత్రప్రయుక్తమై భయంకరముగా నున్నయాగ్నేయాస్త్రమును,నిప్పువేండ్రము నీటిచేత నడఁచునట్లు,తన బ్రహ్మదండము చేత నడంచెను. గాధిపట్టి యంతటవిడువక చలపట్టి, కినుకదనుక, వారుణాస్త్రము,

రౌద్రాస్త్రము, ఇంద్రాస్త్రము, పాశుపతము, ఐషీకము నొక్కపెట్టున వైచె. మఱియు మానవము, మోహనము, గాంధర్వము, స్వాపనము, జృంభణము, మాదనము, సంతాపనము, విలాపనము, శోషణము, దారణము, అతిదుర్జయ మగువజ్రము, బ్రహ్మపాశము, కాలపాశము, వారుణపాశము, పైనాకాస్త్రము, దయితము, శుష్కమైన యశనియు, ఆర్ద్ర మగునశనియు, దండాస్త్రము, పైశాచము, క్రౌంచాస్త్రము, ధర్మచక్రము, కాలచక్రము, విష్ణుచక్రము, వాయవ్యాస్త్రము, మథనాస్త్రము, హయగ్రీవాస్త్రము, శక్తులు రెంటిని నాఋషిపయి వైచెను. ఇంతే కాక కంకాళము, ముసలము, మహాస్త్రంబైన వైద్యాధరము, కాలాస్త్రము, దారుణాస్త్రము, త్రిశూలము, ఘోరాస్త్రము. కాపాలము, కంణము ననియెడునీయస్త్రముల నెల్లఁ బ్రయోగించె. ఎన్ని ప్రయోగించినను వసిష్ఠుఁడు మేటితపసి గాన యవి యన్నియు నాతనియెడఁ గొంచెమేనియుఁ గార్యము చూపకుండుటఁ జూడఁగా మిక్కిలి యాశ్చర్యకరముగాఁ జూపట్టె. వసిష్ఠుఁడు వానినెల్ల బ్రహ్మదండముచే గ్రహించె. బ్రహ్మపట్టి యైనయాదిట్ట కివి యెల్ల నొకసరకా? విశ్వామిత్రుఁడాయస్త్రము లన్నియుఁ బొడవడఁగఁగా బ్రహ్మాస్త్రమును బ్రయోగించుటయు దానిని యగ్నిప్రభృతులగు దేవతలును దేవర్షులును గంధర్వులును నురగులును మిక్కిలిత త్తరపడిరి. ఆ బ్రహ్మాస్త్రము ప్రయుక్తము కాఁగా ముల్లోకములును గడగడ వడంకె. ఘోరమగునా బ్రహ్మాస్త్రమును సయితము వసిష్ఠుఁడు బ్రహ్మవిద్యాభ్యాసజనితంబైన తేజంబున మించు బ్రహ్మదండము గొని గ్రహించె' అమ్మహాత్ముఁడు బ్రహ్మాస్త్రము నడంచుచుండఁగా నపు డాతనిరూపము ముల్లోకములను భయము వెల్లున మూర్ఛగొలుపుచు స్మరించుటకు నతిభయంకరమై తేఱి చూడరా కుండె. అమ్మహాత్మునిరోమకూపము లన్నింటివలననుండి, పొగయుచున్న సెగల రగులు చున్నయగ్గిమిడుంగురులవలె జ్వాలలు వెడలె. అతనిహస్తమునందలి బ్రహ్మదండము, పొగలేనికాలాగ్నివలెను రెండవది యగుకాలదండముం బోలెను, గ్రాలుచుండె. అంత మునిజనము లాతాపసశిఖామణిని బొగడుచు నాతనితో 'బ్రాహ్మణోత్తమా! నీబ్రహ్మబలము అమోఘము. నీమహిమం జేసి యాబ్రహ్మాస్త్రతేజము నుపశమింపఁ జేయుమా! విశ్వామిత్రుఁడు మహాతపస్సంపన్నుఁడైనను నీకు నోటువడియె. ఇఁకఁ గోప మేల? ప్రసన్నుఁడ వగుము, తాపసశ్రేష్ఠుఁ డవగునీప్రసాదమున లోకములు దుఃఖరహితములై యుండు' ననిరి. అది విని యమ్మహాతేజుఁడునుపశమిల్లె. మహాతపస్వికి శమమే స్వభావముగాని కోపమగునా? విశ్వామిత్రుఁడు నోటువడి నిట్టూర్పులు పుచ్చుచు ఇసీ! క్షత్రియబలమేటికి? బ్రహ్మతేజమువలనిబలమే బలము. ఇందులకు మఱొక నిదర్శనమేల? ఇదె యొక బ్రహ్మదండముచే నాబాణము లన్నియుఁ గొట్టుపడినవి. ఇంతే చాలదా? ఈతారతమ్యము చక్కఁగాఁ గని, మనసును నింద్రియములను గలంచునట్టి క్షత్ర

రోషమును దిగనాడి, వానిని బ్రసన్నములు గావించుకొని మహాతపము సలిపి బ్రహ్మత్వము (బ్రాహ్మణ్యము) నొందెద:' ఇది యేఁబదియాఱవసర్గము.

---

## విశ్వామిత్రుఁడు తపంబు సేసి రాజర్షి యగుట.

"విశ్వామిత్రుఁడు దనకుఁ గలిగినభంగపాటును దలఁచి, డెందము మిక్కిలి కొందలపడ సారెసారెకు నూర్పులు పుచ్చుచు, వసిష్ఠునితోడి వైరము మిక్కిలి యుఁ గొనియుండె. కాని వసిష్ఠునిఁ దా నేమి సేయఁగలఁడు? అంతటితపము పెంపు తనకు లేదు. మహాత్మునితోడ వైరము పూనుటం జేసి యున్నతపమును నశించె. కాన మరలఁ దపముచే నాతని నిర్జించుటకై పూని పట్టపుదేవితోడ దక్షిణదిశ కుంబోయి యందు (ఫలమూలాశనుఁడై దమముగలిగి) మిక్కిలి భయంకర మగు పెనుతపము గావించెను. పిదప నాతనికి సత్యవంతులును ధార్మికులు నగుహవిష్యందుఁడు మధుష్యందుఁడు దృఢనేత్రుఁ డనుపుత్రులు గలిగిరి. అంత వేయిసంవత్సరములు నిండఁగా లోకపితామహుఁ డగుబ్రహ్మ, తపోధనుఁ డగువిశ్వామిత్రునిఁ జూచి తీయనిమాటల 'కౌశికా! నీవు రాజర్షిలోకములను చూఱగొంటివి. ఈ తపమువలన నిన్ను రాజర్షిగా గ్రహించెదము' అని చెప్పి యాలోకపరమేశ్వరుఁడు బ్రహ్మలోకమునకుఁ దేజము వెలుఁగఁ జనియె. అద్దేవునితోడ వచ్చినదేవతలు స్వర్గమున కరిగిరి. కామక్రోధముల ననువర్తించువానిఫలం బింతే కాక బ్రహ్మత్వము గలుగునా? విశ్వామిత్రుఁడును బ్రహ్మ చెప్పినపలుకు విని సిగ్గునఁ దలవాంచి మిక్కిలియు దుఃఖము ముంచుకొన నతిదీనుఁడై తనలో 'మిక్కిలి గొప్పతపము సలిపితిని. దేవతలు ఋషులును అందఱు నన్ను రాజర్షిగాఁ గొనిరి. అయిన నాచేసిన మహాతపమునకు నింతమాత్రము ఫలము గాదు. బ్రహ్మత్వమే తగుఫలము' అని మనమునఁ జింతించి మిక్కిలియు జతనమున మునుపటికంటె నతిశయించినతపమును మరలఁగావించుచుండె. ఇట్లతఁడు తపము సలుపుచున్న కాలమున, ఇక్ష్వాకువంశవర్ధనుఁ డగుత్రిశంకుఁ డనురా జుండె. అతఁడు సత్యవచనుఁడు; జితేంద్రియుఁడు. అతనికి 'యజ్ఞము సేసి శరీరముతోనే దేవతలయుత్కృష్టస్థాన మగుస్వర్గమును బొందవలయు' నని బుద్ధి పుట్టఁగాఁ గులపురోహితుఁ డగువసిష్ఠుని రావించి తాను మనసునఁ జింతించుకొన్న కార్యమును విన్నవింపఁగా నమ్మహాత్ముఁడు 'బొందితో స్వర్గమునకుఁ బోవుట యశక్య' మని చెప్పి యాపూనికను నిరాకరించె. అంత నా భూకాంతుఁడు వసిష్ఠుఁ డాక్షేపించినపిదప నాతనిదెస నాస మాని యాకార్య మొడఁగూర్చుకొనుటకు దక్షిణదిశకుఁ బోయి మిక్కిలి తేజమున రాజిలుచున్నవా రగు వసిష్ఠునిపుత్రులు నూర్వురును మహాతపము సేయుచున్న చోటును జేరె. అట్లు సేరి యమ్మహాయశస్వులు తపము సలుపుచుండఁగాఁ గాంచి మహాత్ములైన యాగురుకుమారులందఱికి క్రమము దప్పక అభివందనముగావించె;

అయినను వసిష్ఠునినిరాకరించి వచ్చుటవలన సిగ్గుచేఁ దలకొంచెను వాంచియుండె. అతఁడమ్మహాభాగుల కెల్లఁ జేమోడ్చి 'నేను శరణుగోరి వచ్చితి. మీరు శరణన్నవారికి దిక్కగుదురు గాన మిమ్ము శరణుఁజొచ్చెద. కులగురుని వసిష్ఠుని ముందే శరణుఁ జొచ్చితినిగాని యామహాత్ముఁడు నాకోర్కి నిరాకరించె. నేను గోరినది మఱేమియు గాదు. నేనొక మహాయజ్ఞమును యజింపఁగోరితిని. మీరందుల కనుజ్ఞ సేయఁ దగును. గురుకుమారుల కందఱికి మ్రొక్కెద. నాకుఁ బ్రసన్నులుగండు. శిరస్సు నేలసోఁక నమస్కరించి తపోధురీణు లగుబ్రాహ్మణుల మిమ్ముఁ బ్రతిమాలుకొనుచున్నవాఁడ. అట్టిమీర లెచ్చరికతో నాకోరినసిద్ధి నొందఁగూర్చువారై నేను శరీరముతోనే దేవలోకమును బొందునట్లుగానాచే యజ్ఞంబు సేయింతురుగాక. వసిష్ఠుఁడు నన్నుఁ ద్రోచిపుచ్చె. మీరు తపోధనులు; మఱియు గురుపుత్రులు కాన మీరందఱినిదప్ప యజించుటకు మఱొక్కయుపాయ మేదియు నాకుఁ గానిపింపదు. ఇక్ష్వాకుకులజులకు ఎల్లవారికిని పురోహితుడు వసిష్ఠుఁడే వెనుదిక్కు. విద్వాంసు లగుపురోహితులే రాజుల కెప్పుడు నుత్తారకు లగుదురుగదా? అట్టి పురోహితుఁడు రక్షకుఁడుగాక దిగవిడిచెనేని యాతనికిఁ బిదప మీరందఱే నాకు దైవముంబోని రక్షకు లగుదురు' అనియె. ఇది యేఁబదియేడవసర్గము

---

## వసిష్ఠపుత్రులు నిరసింపఁగాఁ ద్రిశంకుఁడు విశ్వామిత్రు నాశ్రయించుట.

''అంత వసిష్ఠునిపుత్రులు నూర్వురును త్రిశంకునివచనము విని కోపించి 'నీవు బుద్ధిలేనికార్యమునకుఁ బూనితివిగాన సత్యవాదియైననీగురుఁడు దానికి సమ్మతింపక నిరాకరించె. అట్టిగురువు నుల్లంఘించి మఱొకరిని ప్రాపుగాఁ బట్టఁ జూచెద వెట్లు? ఇక్ష్వాకుకులజు లందఱికిని ఆతఁడే పురోహితుఁడును బరమాచార్యుఁడునగు. ఇంతే కాక యతఁ డెంతయు సత్యమే పలుకునుగాని వేఱుపలుకఁడు. అట్టివానిమాట జవదాఁటుటకు శక్యముగాదు. వసిష్ఠునంతటిమహాత్ముఁ డట్టిక్రతువు అశక్యమని చెప్పఁగా అట్టిదానిని నీకుఁగాను జేయుటకు మముబోఁటుల కెట్లు శక్యమగును? నీవు రాజుల కెల్లఁ దలమిన్న వయ్యు, ఇట్టిప్రయత్నమును జేయుటఁ జూడఁగా మూర్ఖుఁడ వగుదువు. నెమ్మది నీపురికిఁ బొమ్ము. రాజా! అమ్మహాత్ముఁడు నిన్నే కాదు! ముల్లోకములవారినేని యజింపఁ జేయుటకు సమర్థుఁడు. అట్టి మహనీయున కవమానము మేమెట్లుసేయనేర్తు' మనిరి. ఇట్లు వారు కోపముచే నక్షరములు తొట్రువడఁ జెప్పినయప్పలుకులు విని మరల వారలతో 'గురువు మొదట నన్నుఁ ద్రోచిపుచ్చె. అట్లే గురుపుత్రులును గావించిరి. ఇఁక మఱియొకదిక్కు చూచుకొనియెద. తపోధనులారా! మీకు శుభంబగుఁగాక 'యనఁగా నాఋషికుమారులవాక్యములువిని ఔరా! సాక్షాత్కులగురువును బ్రహ్మపుత్రుఁడు నగువసిష్ఠు నతిక్రమించి

మఱొకపురోహితు నాశ్రయింపఁ దలఁచె. ఇట్టిఘోరంపుఁదలఁపు గలుగునా!' యని మిక్కిలియుఁ గ్రుద్ధులై 'చండాలుఁడ వగుదు' వని శపించి యంత నమ్మహాత్ములు నిజాశ్రమమును బ్రవేశించిరి. అంత రాత్రి గడచి తెల్లవాఱఁగానే యారాజు చండాలత్వము నొందఁగా నతని మొలయందుఁ దులకించుచుండిన పీతాంబరము, చండాలురు గట్టునల్లని వలువ యయ్యె. మున్నతనియందు వెలుఁగు చుండినరాజ తేజస్సు దూలి నల్లనిచాయ యలముకొనియె. భోగసౌభాగ్యమును సూచించునవయవముల సౌకుమార్యము వీడి శరీరమంతయు బిరుసై పసగుందె. నిగనిగ మను పొగరు గలిగి తెగఁబాఱెడు కురులు కుఱుచ లయ్యె. గుమగుమ తావులు గుబులుకొనుమంచి పూవులసరులు వల్లెకాటిపూదండలయ్యె. పునుఁగుజవ్వాదులు మెదిచిన మంచిగంధము వ్రాయి, ఆయొలికిమిట్టయందలి బూడిదమెయి పూఁతలయ్యె. మంచిరతనంబులు దాపినపసిండియాభరణములు వీడి యినుపసొమ్ములిమ్ముకొనియె అతఁడట్లు చండాలరూపము నొందఁగాఁ జూచి యతనివెంట వచ్చిన మంత్రులును. పురజనులును, అందఱును దిగవిడిచి యొండొరులం గలసి పాఱిపోయిరి. రాజొక్కఁడే తక్కి నిలిచె. అయిన నతఁడు మిగుల దుఃఖమున రేయుంబవలు నుడుకుచుండియుఁ గడిందితెంపు పెంపుమాత్రము విడువక వసిష్ఠునివైరి యగువిశ్వామిత్రుని యొద్దకుఁ బోయె. ఇట్టిదుర్దశయం దట్టితపోధనుఁడుగాక మఱెవరు దిక్కు? గురువు చేతను గురుపుత్త్రులచేతను మనోరథము విఫలమై, చండాలునిరూపు నొంది. ఐహికాముష్మికసాధనములు దూలి, వందురుచున్న యతనిని జూడఁగా విశ్వామిత్రునకెంతయుజాలి పుట్టె. అమ్మౌని మహాధార్మికుఁడు మిక్కిలియుఁ బ్రభావసంపన్నుఁడునగును గాన ఘోరరూపుఁ డయినయారాజును జూచి కారుణ్యము మీఱ 'నీకు భద్రంబగుఁగాక' యని దీవించి 'ఓయీ! ఇటవచ్చినకార్యమేమి? నీవు రాజపుత్త్రుఁడవు. నీ మహాబలంబు నడఁప నెవరికిని సులభము కాదు, అందును అయోధ్యాకధినాథుఁడవు. ఇట్టివీరునికి నీకు శాపమువలనఁ జండాలత్వము గలుగుటకుఁ గారణమేమి? యని యడిగెను. వాక్యవిశారదుఁ డగునమ్మునివరుఁ డాడినమాట విని చండాలత్వమొంది యున్న యారాజు మాటలపొందెఱింగినవాఁడు కావున గేలు మోడ్చి 'నే నొకకోరిక నుద్దేశించి నాకులగురువును నాగురుకుమారులను దానిని ఈడేర్పుఁడని వేఁడఁగా వారు నన్ను నిరాకరించిరి. ఆకోరిక చేకూరకయే పోయె. అది కలుగకున్న మానెఁగాని యందులకు మాఱుగా, దైవమా! ఈవిపరీతగతి నాకుఁబట్టినది. ఆకోరిక మఱేదియుఁగాదు. శరీరముతోనే దేవలోకమునకుఁ బోవుటకు నాకు బుద్ధిగలిగెను. ఊరకయే యట్టికోరికను గోరినవాఁడను గాను. అందులకై నూఱుయజ్ఞములును జేసితిని. వానికి ఫలము సశరీరస్వర్గమే కదా. ఆఫలము మాత్రము నాకుఁ గలుగదయ్యె. *అనృతమాడుటచే, ఆయజ్ఞములఫలము నశించి

*'యజ్ఞోఽనృతేన క్షరతి' యజ్ఞము అనృతముచే క్షీణించు ననువచన మిట యూహ్యము.

యుండునందురా? అదియు లేదు. ఇంతకు మున్నెప్పుడును నేను అనృతమాడినది లేదు. ఇఁక ముందెట్టియాపదలు వచ్చినను అనృతమాడనని యిపుడు నీయెదుట నాక్షత్రధర్మము సాక్షిగాఁ బ్రమాణము సేసెదను. నానావిధములైనయాగములు సేసితిని. ధర్మమునం బ్రజలనెల్లఁ బాలించితిని. మహాత్ములగుగురుజనములను నా వినయాదిసుగుణములచేతను సదాచారములచేతను సంతోషపఱిచితిని. ఇంకను నేమి చేయవచ్చు? ఇట్లు ధర్మము సంపాదించుటకై ప్రయత్నపడుచు నందులకై యజ్ఞము సేయ నిచ్చగింపఁగా నాగురువు లందులకు సంతోషింపరైరి. మఱెందులకు సంతోషింతురో! ఇవన్నియుఁ జూడఁగా నొకరి ననవేల! దైవమే (ప్రారబ్ధఫలమైనయదృష్టమే) యధిక మని నాకుఁ దోఁచుచున్నది. అదియే పురుషునికి హితములు గలిగించునదిగాని వేఱేదియుఁ గాదు. పౌరుషము (పురుషప్రయత్నము)నఁ బ్రయోజనమేమియు లేదు. అది దైవమును నిరసింపఁజాలదు. కాఁబట్టి నాయిప్పటిధర్మానుష్ఠానములన్నియు నిరర్థకములయ్యె దైవం బన్నిటిని దిరస్కరించి తానే యొక్కఁడై నెక్కొనుచున్నది. అదియే. యన్నిటిని గలిగించుముఖ్యకారణము. కావున ననుబోఁటి కేమి సేసిన నేమి గలుగు? దైవము నాపురుషకారము నెల్లఁ దూలపుచ్చఁగా మిక్కిలియు దుఃఖితుఁడనై నీప్రసాదముఁ బడయఁగోరితిని. నీకు శుభంబగుఁగాత. నాయెడ ననుగ్రహింపఁదగు. నేను మఱొక్కని కడకును బోనను. నీవు దక్క మఱెవ్వఁడును నాకు దిక్కుఁగాఁడు. వసిష్ఠుఁడు తానై యిఁకఁ బిలిచెనేనియు శరణుఁ జొరను. కానభవదీయప్రసాదం బగు పురుషకారమునఁ బ్రతికూలమగుదైవమును ద్రిప్పి నా కనుకూలముగాఁ జేయుందగు' ననియె. ఇది యేఁబదియెనిమిదవసర్గము.

---

## విశ్వామిత్రుఁడు త్రిశంకునికై యజ్ఞప్రయత్నము సేయుట.

చండాలచిహ్నములు దాల్చి యున్నయన్నరనాథుఁ డిట్లు వేఁడగాఁ గాశికుఁడు కృపావేశముతో మధురవాక్యముల 'నాయనా! ఇక్ష్వాకుకులతిలకా! స్వాగతము. నిన్నుఁ బరమధార్మికుఁ డని యెఱుఁగుదు. నిన్ను నేను రక్షించెదను. ఇఁక భయపడకుము. రాజుల కెల్ల మేటి యగునీకు భయము దగునా? నీవు కావించుయజ్ఞమునకుఁ దోడుపడుటకుఁగాను, పుణ్యకర్మపరులైనమహర్షుల నందఱినిఁ బిలిపించెద. దానం జేసి నీ వూఱటతో యజ్ఞము సేయఁగలవు. నీకుఁ గల యీచండాలరూపము గురుశాపముచే నైనది గాన బ్రహ్మకును వారింప నలవి కాదు. కాన యిది నీయందే యుండును. అయిన నేమి? ఈరూపముతోడనే నీవు శరీరముతో స్వర్గమునకుం బోవుదువు. విశ్వామిత్రుఁ డెంతయు శరణుఁజొరం దగినవాఁడు సుమీ! అట్టివానిని శరణుఁజొచ్చితివి. కావున స్వర్గము నీయఱచేతిలోనిదని తలఁచెద'ననియె. అంతనమ్మహాతేజుఁ డగువిశ్వామిత్రుఁడు పరమధార్మికులను

మహాప్రాజ్ఞులు నై నతనపుత్త్రులను జూచి యజ్ఞసంభారముల సమకట్టునటు లాజ్ఞాపించి పిదప శిష్యులనెల్లం బిలిచి 'బిడ్డలారా! మీరు నాపంపునఁ బోయి ఋషులను వారిశిష్యులను సుహృదులను ఋత్విజులను విద్వాంసుల నందఱిని దోడ్కొని రండు. మీరు నామాటబలిమిచేఁ బోయి పిలువఁగా మఱియెవ్వఁడైన ననాదరముతో నేమేని చెప్పునేని యామాటలన్నియు నాకుఁ జెప్పవలయు' ననఁగా నమ్మాట విని యమ్మునిశిష్యులు గురువు నాజ్ఞం గొని నలుదిక్కులకుఁ బోయి సకలదేశముల నున్న బ్రహ్మవాదులను బిలిచివచ్చిరి. ఆదేశముల నన్నిటినుండియు బ్రహ్మవాదు లగుమునులు వచ్చిరి. శిష్యులందఱును దేజమువెల్లున వెలుంగు చున్నగురుని కడకు వచ్చి బ్రహ్మవాదు లందఱును జెప్పినమాట లిట్లనిరి. "మీవచనము విని బ్రాహ్మణు లందఱు వచ్చుచున్నవారు. మహోదయుఁడనుమునియు వసిష్ఠునికుమారులునూర్వురును దప్ప సకలదేశములనున్న తక్కినవారందఱును వచ్చిరి. వసిష్ఠుని కుమారులు నూర్వురును మహోదయుఁడును గోపమునఁ బలుకులు తొట్రువడ నుడివినమాటలనెల్లఁ జెప్పెదము వినుము. 'యాగము సేయించుట బ్రాహ్మణుఁడొక్కని కేతగును. ఇట్లుండగాయాగము సేయించువాఁడు క్షత్త్రియుఁడఁట! మఱి చేయువాఁడో చండాలుడట! ఇది మఱియు విశేషము. బాగుబాగు! ఆచండాలునిసదస్సునందు దేవతలు హవిస్సు నెట్లు గుడుతురు? ఋషులుగాని ఋత్విజులై యాగశిష్టమైనహవిస్సు నెట్లు భుజింతురు? మహాత్ములగు బ్రాహ్మణులు విశ్వామిత్త్రుండు తమ్ముఁ బాలించిన నేమి? చండాలుని యన్నమును దిని స్వర్గ మెట్లు పొందఁగలరు?' ఇట్లు మహోదయుఁడును వసిష్ఠకుమారులును గన్నెఱ్ఱఁ జేసికొని యీ పరుసనిమాట లాడి" రనిరి. విశ్వామిత్త్రుఁడును వారెల్లఁ జెప్పినమాటలు విని వెనుఁగోపంబునఁ గన్నెఱ్ఱఁ బాఱరోషంబు మీఱ 'మహాత్ముల తేజోవిశేషమువలన, ఏప్రత్యవాయమును గలుగదను న్యాయము లేదే? దానిని బట్టియే కదా చండాలునేని యజింపఁజేయుచున్నాఁడను. కాన నేను దుష్టుఁడనగుదునా? మఱియు నుగ్రతపమును జేయువాఁడను గాని కేవలుఁడను గాను. ఇవియన్నియు నెఱుఁగక, నా వెనుతపమును సరకుసేయక, నన్ను దూషించినట్టిదురాత్ములు నీఱయి పోవఁగలరు. ఇందులకు సందేహము లేదు. ఇప్పుడు వారు కాలపాశముచే నీడ్వంబడియమునిపురికిఁ బోవుదురు; ఇంతే కాదు. వారేడునూఱుల జన్మములవఱకు నలుగడలఁ బీనుఁగులఁ దినుచు ముష్టికు లనుహీనజాతిని బుట్టి కట్టిఁడులై కుక్కమాంసము నియతముగా మెసవుచు మాటలు మొదలగు చేష్ట లన్నియు వికృతంబులుగా వికారం బగురూపంబుతో నీలోకమునందుఁ జరింతురు. మహోదయుఁడు దుర్బుద్ధియై దూషింప రానినన్ను దూషించినాఁడుగదా. వాఁడే సర్వలోకములను దూషితుఁడై నిషాదత్వమునొంది బలవంతముగాఁ దనప్రాణములఁ దూలఁబుచ్చుచు, కనికరము మాలి, చిరకాలము నాదుకోపమునం జేసి దుర్గతిని బొందఁగలవాఁ

డనియె. ఇట్లా విశ్వామిత్రుఁడు తన పెనుతపంబు పేరిమిం జేసియు, తన ప్రభావంబు పెంపువలనను, ఋషులనడుమ వారల శపించి విరమించె. ఇది యేఁబదితొమ్మిదవ సర్గము.

---

## విశ్వామిత్రుఁడు త్రిశంకునకై మఱొకస్వర్గము సృజించుట.

"విశ్వామిత్రుఁడు తన తేజము పెంపునను దపోబలమునను మహోదయుని తోడ వసిష్ఠకుమారుల నందఱిని హతులం గావించి ఋషులనడుమ మరల 'ఇతం డిక్ష్వాకుకులజుండు. ఇతనిపేరు త్రిశంకుఁ డండ్రు. మఱియుఁ బరమధార్మికుఁడు; మిక్కిలియు దాత. పూర్వము క్షత్రియరూపముగా నుండి యిపుడు శాపమునఁ జండాలరూప మొందినయీబొందితోడనే స్వర్గమునకుఁ బోవఁగోరి నన్ను శరణు జొచ్చినాఁడు. ఈతఁడు నిజదేహముతో స్వర్గమునకుఁ బోవునట్లుగా మీరును నేనును గూడి యజ్ఞము జరపవలయుననియె. విశ్వామిత్రునిమాటలు విని మహర్షు లెల్ల నొక్కటిగాఁగూడి ధర్మవిదులుగాన ధర్మయుక్తముగాఁ దమలో 'ఈముని కుశికవంశమునఁ బుట్టినవాఁడు. మిక్కిలియుఁ గోపస్వరూపుఁడు. కాన నితఁడు చెప్పిదానిని ఊరక చేయుటకాదు; చక్కఁగాను జేసియేతీఱవలయు. ఇందులకు సంశయములేదు. ఏలననితఁ డగ్నికల్పుండు; అనల్పమహిముఁడు కోపము గలిగించితిమేని మనల శపించును. కావున యజ్ఞము మనము జరుపవలయు. ఊరక జరుపుటకాదు. ఈయిక్ష్వాకుకులజుఁడు, విశ్వామిత్రునిప్రభావమున శరీరముతో స్వర్గమునకుఁ బోవునట్లుగా దానిని జరుపవలయును. కావున నందఱును దొడంగి తమ తమయార్త్విజ్యమును నిర్వహింపుఁడు' అని పరస్పరము మాటలాడుకొని యపుడెల్ల వారును ఆయాకార్యములు గావింపఁ దొడఁగిరి. ఆయజ్ఞమునందు మహాతేజుఁ డగువిశ్వామిత్రుఁడు యాజకుఁ డయ్యె. మంత్రజ్ఞులగుఋత్విజులును క్రమముచొప్పున సమస్తకర్మములును మంత్రయుక్తముగా శాస్త్రరీతిని గల్పసూత్రానుసారముగాఁ గావించిరి. అంత విశ్వామిత్రుఁడు తనమహాతపంబు పెంపుచే హవిర్భాగము లిచ్చుటకు దేవతలందఱిని మంత్రములచేఁ బిలిచెను. మఱియుఁ మంత్రావృత్తులవలనఁ బెద్దకాలము పిలిచియుఁ దమతమ భాగములకొఱకు దేవత లెవ్వరును రారైరి. అంత నమ్మహాముని కోపావేశపరవశుఁడై స్రువంబెత్తి రోషమునఁద్రిశంకునిఁ జూచి 'నరవరా! నీయాగం బటుండనిమ్ము. నాయార్జించినతపంబు ప్రభావము చూడుము. ఇదె నాతపోవీర్యమున నిన్నితరులకుఁ బొందరానిస్వర్గమునకు నీదేహముతోనే పంపెద. నీమేనితోడనే స్వర్గమునకుఁ బొమ్ము. నే నింతకాలము తపము సేసి సంపాదించినఫలము ఏదో యొకకొంచెమేని యున్నదియే కదా. దాని యసాధారణప్రభావమున నీవు శరీరముతో స్వర్గమున కరుగుము' అనియె. అమ్ముని యట్లు చెప్పఁగానే యపుడు మునులందఱును దేఱకొనఁ జూచుచుండఁగా. ఆనర

నాథుఁడు స్వర్గమునకుఁ బోయెను. దేహముతో దేవలోకమునకు వచ్చిన యాత్రిశంకునిఁజూచి దేవేంద్రుఁడును దక్కం గలదేవత లందఱును 'త్రిశంకూ! మరలి పొమ్ము. నీవు స్వర్గమున వసించుట కర్హుఁడవు గావు. తెలివి మాలి గురు శాపముచేఁ గొట్టువడిననీ వెక్కడ! స్వర్గమెక్కడ! చాలుఁ జాలు. తలక్రిందుగా భూమిపయిని బడు' మనిరి అట్లు దేవేంద్రుఁడు సెప్పఁగాఁ ద్రిశంకుఁడు తపోధనుఁ డగువిశ్వామిత్రునిఁగూర్చి 'కావుకావు' మని యఱచుచు మఱల భూమిని బడియె. కౌశికుఁడును, అమ్మహీశుఁ డాక్రోశించు పలుకు విని పెనురోషం బుల్లంబున మల్లడిగొన 'నిలునిలు' మని పలికి తేజంబు మెఱయ ఋషులనడుమ నుండి మఱి యొక బ్రహ్మదేవుఁడో యనఁ ద్రిశంకుఁ డున్న దెస వేఱొకస్వర్గము సృజింపఁబూని దక్షిణదిశ దారియందు వేఱుగా సప్తర్షులను సృజించె. ఇంతే కాదు. కోపంబు ముంచుకొనఁగ నది యేమి చేయింపదు! ఆమునీశ్వరుఁడు ఋషులనడుమ నిలిచి, నిజయశము ప్రకాశింప, దక్షిణదిశయందుఁ గ్రొత్తగా వేఱునక్షత్రముల వరుసలుగా సృజించి యంతటితో నిలునక కోపము మనసును గలంచి చెఱుపఁగా 'మఱొకయింద్రునైనను సృజించెద. కాదేని, నిర్మించులోకమునకుఁ ద్రిశంకుఁ డుండఁగా నింద్రుఁడు మఱియొకఁడేల ? వల' దని పూని యింద్రుఁడై సత్రిశంకునకుఁ బరివారము గాఁ దగువేఱు దేవతలనుగూడ నిర్మింప నారంభించెను. దానిని జూచి సురాసురులును ఋషిసమూహములును 'మనకుమాఱుగా వేఱుదేవతల సృజించినచో సహింపనగునే' యని మిక్కిలియు తత్తఱపడి యమ్మహాత్ముని కడకు వచ్చి యూఱడించుచు 'మహాభాగా! నీకుఁ దెలియనిది లేదు. ఇతఁడు గురుశాపమునఁ గొట్టువడినవాఁడు. కానదేహముతో స్వర్గమునకుఁ బోవం దగనే తగఁడు' అనఁగా నమ్మునిపుంగవుఁడును వారివచనమువిని 'దేవతలారా! మీకు శుభమగుఁ గాక. ఈ త్రిశంకుమహీశునకు శరీరముతో స్వర్గమునకుఁ బోవునట్లు ప్రతిజ్ఞ సేసి యిపుడా ప్రతిజ్ఞను కల్లసేయ నేనొల్లను. ఈ త్రిశంకుఁడు తనశరీరముతో నెలకొని యున్న యీదేశమే శాశ్వతముగా స్వర్గం బగుఁగాత. మఱి యీలోకము లెంతకాల ముండునో యంతకాలము నాసృజించినయీనక్షత్రములన్నియు స్థిరములై యుండుఁ గాక. దీనిని మీరందఱు నొప్పుకొనవలయు' ననియె. అమ్ముని యట్లు సెప్పఁగా దేవతలందఱును 'మునీంద్రా! అట్లేయగు. నీకు శుభంబగుఁ గాఁత. నీవు నిర్మించిన యీ యనేకనక్షత్రము లన్నియు నాకాశమునం దనాదియైనజ్యోతిశ్చక్రమార్గమునకు వెలుపల శాశ్వతముగా నెలకొనియుండుఁగాక. నీవు సృజించిన యాజ్యోతులనడుమ ద్రిశంకుఁడు గురుకృతాపరాధమునఁ దలక్రిందుగానుండియుఁ దేజమున దేవతాసముఁడై వెలుఁగుచుండును. ఈ రాజసత్తముఁడు స్వర్గలోకమును బొందినట్టివానివలెఁ గృతార్థుఁడై ధ్రువునివలెఁ గీర్తి వెలుంగుచుండుఁగాన యీజ్యోతులన్నియు నీతని ననుసరించుచుండుననిరి. ధర్మాత్ము

డగునమ్మునివరుఁడును బ్రభావముదీపింప, సకలదేవతలును ఋషులను దన్నుఁ బొగడ నెగడుచు వారిని జూచి 'వల్లె' యనియె. అంత నాయాగము ముగి యఁగా మహాత్ము లగు దేవతలును, తపోధను లగుమునులును, దమతమ వచ్చిన దారిని బోయిరి. ఇది అఱువదియవ సర్గము.

---

## అంబరీషుఁడు శునశ్శేఫుని నరపశువుగాఁ గొనుట.

"మహాత్ముఁ డగు విశ్వామిత్రుఁడు తనపంపున యాగమునకు వచ్చిన ఋషు లందఱును బోవుటఁ గాంచి తన తపోవనమున నుండుమునులతో 'మహాత్ములారా! నేను బూనినతపమునకు నీదక్షిణదిక్కునందు గొప్పవిఘ్నము సంభవించె. కావున మఱియొకదిక్కునకుఁ బోయి యచటఁ దపము సలుపుదము. పడమటిదిక్కున విశా లంబు లగుతపోవనంబులు గలవు. అందుఁ బుష్కరతీర్థంబుల తీరంబులందు సుఖ ముగాఁ దపంబు సలుపుదము. అది మంచి తపోవనము సుఁడీ' యనియె. ఇట్లు మహాతేజుఁ డగుమ్మునిరాజు పలికి పడమటిదెసకుం జని యందు ఫలమూలము లాహారముగాఁ బుష్కరములతీరములందనివార్య మగుభయంకరతపము గావించు చుండెను. ఈకాలముననే యయోధ్యకుఁ బ్రభుఁ డయినయంబరీషుఁ డనురాజు, దానొకయాగము సేయ సమకట్టి, దానిని జరపుచుండఁగా, అతనియాగపశువు నింద్రుఁడపహరించికొనిపోయె. ఆపశు వదృశ్యము కాఁగాఁ బురోహితుఁడు రాజును జూచి 'రాజా! నీపరాకువలనఁ బశువు నిపు డెవరో యపహరించిరి. కాన యది కానరాదయ్యె. ఏమఱి దానిని వదిలముగాఁ గానకున్న యెడల రాజును, బశు నాశము మొదలగు దోషములు రూపుమాపును. ఈ పశునాశనమునకుఁ బ్రాయ శ్చిత్తమో మిక్కిలి దుష్కరమునుమా. ఈ యాగకార్యము ప్రవర్తించుటకు మును పేపోయిన పశువునైన వెదకి కొనితెమ్ము. లేనియెడ నెవఁడేని యొకమను ష్యునైనను యాగపశువుగా వేగకొనితెమ్ము. జాగు తగ' దనియె. ఉపాధ్యా యుఁడు చెప్పినపలుకు విని యామహీశుఁడు మహాబుద్ధియుతుం డగుపురుషలలా ముఁడుగాన వేనవేలు గోవులనిచ్చి నాపశువును వెదకి తెచ్చుటకుం బూని యన్యో దేశములను జనపదములను నగరములను వనములను బుణ్యాశ్రమములను నెమ కుచు నెందును మనుష్యపశువును బడయం జాలక భృగుతుంగంబను పర్వతమున కరిగి యందు ఋచికుఁ డనుముని తనకొడుకులతోను భార్యతోడను సుఖముగాఁ గూర్చుండి యుండఁగాఁ జూచె. అమ్మహాతేజుఁడు నాపము వెంపున దీపించుచున్న యాబ్రహ్మర్షిని జూడఁగానే మిక్కుటంపు సొంపుపలనికాంతి వెంపారనాతనికి మ్రొక్కి ప్రసన్నునిఁ గావించి యన్నిటను గుశలం బడిగి 'మహాత్మా! నేను నీకు నూఱువేలగోవుల వెలకు నిచ్చెద. దానిని బుచ్చుకొని నీపుత్రుని యాగపశువుగా నా కమ్మెదు వేని కృతార్థుఁడ నగుదును. నీవు భృగుకులజాతుఁడవు. నాకోర్కి

యీడేర్పం దగు; దేశములన్నియుఁ ద్రిమ్మరితినిగాని పశు వెక్కడను దొరకదయ్యె. నీ వీకొడుకులలో నొక్కని వెలదీసికొని నా కీయవలయు'ననియె. అది విని ఋచీకుఁడు 'రాజా; నీవేమి యిచ్చినను గాని నా పెద్దకొడుకును అమ్మను జుమీ'యనియె. మహాత్ములగు నా పుత్రులతల్లియు మహాతపస్వినియు నగు ఋచీకునియిల్లా లాపలుకు విని యంబరీషునిఁ జూచి 'రాజా! ఈ మహాత్ముఁడు భృగుకులసంజాతుఁడు గాన తన పెద్దకొడుకును అమ్మరాదనియెఁ గదా. నాకును గడకొట్టువాఁ డగు శునకుఁడు గారాబుకొడుకు కాన కడపటివాని నీకీయం జాల. నేను విపరీతమేమియుఁ జెప్పలేదు. తఱుచుగా తండ్రులకుఁ బెద్దకొడుకులందుఁ బ్రేమగదా! తల్లులకో పిన్నకొడుకులందే మక్కువ. పురుషశ్రేష్ఠుఁడ వగు నీకు తెలియనిదేమున్నది. కాఁబట్టి కడగొట్టువానిని గాచుకొనెద' ననియె. అమ్మునియు అమ్మునిపత్నియు నిట్లు చెప్పఁగా మధ్యముఁ డగు శునశ్శేఫుఁడు తానై రాజుతో 'రాజా! మా తండ్రి పెద్దవానిని విక్రయింపరా దనియె. తల్లి కడపటివానిని అమ్మఁగూడదనియె. కాన నడిమి కొడుక నగు నన్నే వారు నీకు విక్రయించి రని యెంచెద. కనుక నన్నుఁ * గొని పొమ్ము' అనియె. అంత నా మహీశ్వరుఁ డెంతయు సంతసిల్లి నూఱువేల గోవులిచ్చి శునశ్శేఫునిఁ గొని యాతనిని సత్వరముగా రథ మెక్కించి తేజంబు మిక్కిలి రాజిల్ల యశంబు దిశలఁ బ్రకాశింప నిజపురమునకుఁ బోయె. ఇది అఱువది యొకఁడవ సర్గము.

---

## శునశ్శేఫుని విశ్వామిత్రుఁడు నరపశువుఁ గానీక కాచుట.

రామా! మహాయశుఁ డైన యా మహీశుఁడు శునశ్శేఫునిఁ దోడ్కొనిపోవుచు మట్టమధ్యాహ్నము కాఁగాఁ బుష్కరతీర్థమందుఁ గొంత విశ్రమించెను. శునశ్శేఫుఁడు నిజగుణములవలన మిక్కిలి జాగ్రత్త గన్నవాఁడే. అయిన నేమి? తండ్రిపం బెంతయెక్కుడైనను ప్రాణము లంతకంటె తీపుగదా! కాన తన్ను యాగమునకుఁ బశువరించినందులకు మిక్కిలి కొందలపడి యారాజు విశ్రమించి యున్న తెఱపిచూచి పుష్కరక్షేత్రమునకువచ్చి యచ్చట ఋషులతోడఁ దపము సేయుచున్న తన మేనమామను విశ్వామిత్రునిం గని పయనమువలన దప్పియు బడలికయు బురికొన మొగము వెలువెల్లనై విన్నఁదనము గదురఁ బ్రాణములయెడఁ బేరాస యొసఁగొన ఆ మునియొడినివ్రాలి తొడిఁబడుచు 'మామా! నాకందఱునుండియు ఎవ్వరును రక్షింపరైరి. కాన తలిదండ్రులు ఉండియు నాకు లేరైరి. ఉట్లే జ్ఞాతులును లేరైరి. ఇంక బాంధవులు నా కున్నవా రనుట యెక్కడిది? నీవు సౌమ్యుఁ

---

* శాస్త్రము, అపత్యమును దానము సేయుటయు విక్రయించుటయు నిషిద్ధముగాఁ జెప్పినను ఒకవంశము మొదలంట నశింపనుండఁగా ధర్మార్థము అపత్యమును దానము సేయుట యెట్లో యట్లే యజ్ఞమునకై అపత్యమును విక్రయించుటయు దోషముగాదని తెలియునది.

డవు; మునిచంద్రుఁడవు కావున నావలన నీ రాజుయజ్ఞంబు చెడకుండునట్టిపాడి విచారించి నన్నుఁ గావవలయు. నీవు కేవలుండవు గాక మునులకెల్ల మేలుబంతివి; కాన యెల్లవారికిని రక్షకుఁడవు; అందఱికిని హితము లొడఁగూర్చువాఁడవు. కాన నన్నొక్కనిఁగాచుట యెంతపని! అయినను నన్నుఁగాచుచో ఈరాజుపూనిన యజ్ఞమును జెడరాదు. రాజును గృతకృత్యుఁ డగునట్లుగాను, నేనును మీదయ వలననే దీర్ఘాయుష్యుఁడనై యేనాశమునొందక యత్యుత్తమ మగుతపము సలిపి స్వర్గలోకము ప్రాపించునట్లుగాను, మీరు నన్ను రక్షింపవలయు. నీవు నెమ్మన ముతో దిక్కులేకున్న నాకు దిక్కుగమ్ము. తండ్రి కొడుకునుంబోలె, నీవునన్ను ఈ పాపమువలని విపత్తినుండి రక్షింపు' మనియె. విశ్వామిత్రుఁడును దానిని విని తన వెనుతపము పెంపున వానిని రక్షింపఁజాలుఁ గాన పలుదెఱంగుల నూఱట చెప్పి తనపుత్రులనుజూచి 'శుభము గోరుతండ్రులు ఏప్రయోజనముకొఱకు పుత్రులను బుట్టింతురో యట్టిప్రయోజనమున కిప్పుడు సమయమువచ్చినది. ఆ ప్రయోజనము పితృవాక్యకరణమే కదా. దానిని జేయుటచే మీకే కాదు, నాకును బరలోక హితముఁ గూర్చుధర్మము సిద్ధించును. ఒకమునికుమారుఁడైన యీబాలుఁడు నన్ను శరణుగోరుచున్నాఁడు. వీనికిఁ బ్రాణము దక్కునంతమాత్రము ప్రియమును మీరు గావింపుఁడు. మీ రందఱును బుణ్యకర్ములరు; అందఱును ధర్మపరాయణు లరు. కావున అంబరీషునియాగమునకు మీయం దెవరేని పశువై యగ్నికిం దృప్తి సేయుఁడు. మీరిట్లుచేయుటచే శునశ్శేఫుఁడు నాప్రాపుగలిగి బ్రతుకును. అంబ రీషునియజ్ఞమును నిర్విఘ్నముగా జరుగును. దేవతలును దృప్తులగుదురు. తండ్రి నగు నావాక్యముఁ జేసిన ట్లగు'ననియె. మధుష్యందుఁడు మొదలగుకుమారు లామునివచనము విని యహంకారమువలనఁ బరిహాసముగా 'తండ్రీ! నీవు మా కొడయుండవు. అయినను గడుపారఁ గన్నకొడుకులను రక్షించుట విడిచి మఱొ కరికొడుకును రక్షించుట యెట్లు? ఇది యెక్కడిపాడి? మంచియన్నము దొరకఁగా విడిచి కుక్కమాంసమును దినునట్లు ఇది అకార్య మని యెంచెద' మనిరి. ఆకొడు కుల పలుకులు విని మునితిలకుండు కినుక పెంపున, గన్నుంగవ యెఱ్ఱఁబాఱ 'ఓరా! తండ్రికి మాఱాడరా దనువెఱపు లేక తండ్రిచెప్పిన ట్లాచరింపవలయు ననుధర్మ మును దిగవిడిచి నామాట జవదాఁటి కఱుకై నాకు గరు పుట్టించునిట్టికట్టిఁడి మాట చెప్పితిరిగా! కాఁబట్టి మీరందఱును వసిష్ఠకుమారులవలె ముష్టికజాతులై కుక్కమాంసముదినుచు, వేయేండ్లు నిండువఱకు భూమియందు వసింపఁగలరు' అని శపించి దుఃఖార్తుఁడైన శునశ్శేఫునకు భయము లేకుండునట్లు విభూతి మొదలగు నవి మంత్రించి రక్ష గావించి యాతనితో 'మునిపుత్రా! నీవు పవిత్రము లగు దర్భత్రాళ్లచేఁ గట్టఁబడి రక్తవర్ణము లైనపుష్పమాలికలును గంధమును దాల్చి విష్ణుదేవతాకం బగుయూపస్తంభమును బొందునప్పుడు నేను జెప్పువాక్యములను

దేవునకభిముఖుఁడవై స్తుతిసేయుము. ఇదే యీరెండుగాథలు నీకుఁజెప్పితి. ఇందొకటి యింద్రునిని, మఱొకటి యుపేంద్రునిని గుఱించినది. దివ్యములైనయీ గాథలరెంటినిమాత్రము నీవంబరీషునియాగమున గానము సేయుము. దానిచే నీకు జీవితసిద్ధి గలుగు' ననియె. శునశ్శేఫుఁడును మిక్కిలి సమాహితుఁడై యీగాథల రెంటిని బరిగ్రహించి నెమ్మది నొంది వేగమునఁ బోయి రాజసింహుఁడగునంబరీషునిఁజూచి 'రాజేంద్రా! నీవు మహాబలుఁడవు గాన యజ్ఞము సెడకుండ నెందేని తిరిగి నన్నుఁబశువుగాఁ బడసితివి. ఇంక జాగేల ? రమ్ము; సదస్సునకు వేగ పోవుదము. దీక్షఁబూని యాగము నిర్వర్తింపు' మనఁగా నవ్వాక్యము విని రాజును మిక్కిలి సంతసము మీఱ సొంపుపెంపారఁ బ్రాలుమాలికవీడి వేగమ యజ్ఞవాటమునకుఁ బోయె. అంత నామహీకాంతుఁడు యాగమునందలి సదస్యులయనుమతివలన నా శునశ్శేఫుని పశువగుటకు గుఱుతుగా దర్భరజ్జువులఁ గట్టిరక్తవస్త్రములు దొడిగించి పశువును గావించి యూపస్తంభమున బంధింపఁగా, ఆమునిపుత్త్రుఁడును బద్ధుఁడై శ్రేష్ఠము లగుగాథలచేఁ బశుభోక్తయైనదేవత యగునింద్రునిని యూపదేవత యగు నుపేంద్రునిని,యథావిధిగాఁ బ్రస్తుతింపఁగా నంతసహస్రాక్షుఁడు తనస్వామి యగువిష్ణుని శునశ్శేఫుఁడురహస్యముగా స్తుతించినందులకు మిక్కిలి తృప్తినొంది, తన్ను స్తుతించినందులకును సంతోషము మీఱ, వానికి దీర్ఘాయువు నొసంగె. అంబరీషుఁడును ఇంద్రునిప్రసాదమున యజ్ఞఫలమును పెక్కుమడుంగు లధికముగా బడసె. ధార్మికుఁ డగువిశ్వామిత్త్రుఁడును మరలఁ బుష్కరములందు వేయిసంవత్సరములు మహాతపము గావించుచుండె. ఇది యఱువది రెండవసర్గము.

---

## విశ్వామిత్త్రునకు మహర్షిత్వము గలుగుట.

వేయేండ్లును నిండఁగా దేవతలందఱును ఆమహామునితపమునకు ఫలము నొసఁగఁగోరి వ్రతాంతమందు స్నాతుఁడై యున్నయాతనికడకు వచ్చిరి. అప్పుడు బ్రహ్మనిజప్రభావము దీపింప నమ్మునినిజూచి 'నీకు శుభం బగుఁగాక, ఇంతవఱకు నీవు రాజర్షివై యుంటివి. నీవు గడించినశుభకర్మములవలన నిఁక *ఋషి వగుదు'వని చెప్పి యంత నాదేవేశుఁడు నిజలోకమునకుం బోయె. విశ్వామిత్త్రుఁ డంతటితోఁ దృప్తినొందక యమందతేజము రాజిల్ల మరల మహాతపము గావించె. అంతఁ బెద్దయుఁ గాలంబునకు నచ్చరలతలమానికం బైనమేనక యీపుష్కరముల జలకములాడుటకు వచ్చెను. విశ్వామిత్త్రుఁడు మిక్కిలి ప్రభావసంపన్నుఁ డయ్యు, మబ్బునందలిమెఱుపుఁ దీఁగెవలె ఆ పుష్కరమునం దెసలేనిచక్కఁదనమున వెలుఁగుచున్నయాజక్కవ గుబ్బలాఁడిని గాంచి మరులుగొని దాసితో

* ఇంతవఱకు రాజర్షిగా నుంటివనియు, ఇపుడు కేవలము ఋషివైతివనియు భావము.

'ఓయచ్చరమిన్నా! నీకు స్వాగతంబగుఁగాక. నీవు నాయాశ్రమమున వసించి సుఖం బుండుము. నిన్నుఁ జూచి మన్మథుని బారిఁ జిక్కి యున్న నన్ననుగ్రహించి యేలుకొనుమా. నీకు శుభము లగు' నని ప్రార్థింపఁగా నాతని ప్రార్థన కియ్యకొని యామేనకయు ఆయాశ్రమమున వసించియుండె. అట్లాయప్సరసయు విశ్వామిత్రుఁడును బదిసంవత్సరము లయ్యాశ్రమమున సుఖముగాఁ గూడి వసించి యుండిరి. ఆపదియేండ్లును గడవఁగా అమ్మునివరుఁడు ఆ నిగ్గులాఁడితోడి సంగడి చేతపము సెడుటకు సిగ్గుపడి మిగులఁ జింతయు దుఃఖమునుబొంది యంతట 'దేవత లందఱును జేరి నాతపమును జెఱుపఁ జేసినకడిఁదికార్యమే కాని యిది మఱొకటి గాదు. కట్టా! పదిసంవత్సరములును, ఒక యహోరాత్రమువలెఁ గడచిపోయె. కామవశమున మతిదప్పి మిక్కిలి చెడితిని. కావుననే నాతపమునకీవిఘ్నము పుట్టె. ఏమిసేయుదు' నని నిట్టూర్పులు పుచ్చుచు పశ్చాత్తాపమున దుఃఖించె. అంత మేనక 'ఇతఁడు నన్నేమి శపించునో' యని భయపడి గడగడవడంకుచుఁ జేమోడ్చి యెదుట నిలువంబడియుండఁగా నమ్మునిగాంచి 'ఓసీ! ఇది నాయపరాధమే కాని నీవేమిసేయుదు' వని తియ్యనిమాటలు వలికి విడిచిపుచ్చి యంత నుత్తరమున వెలుఁగు హిమవంతమునకుఁ బోయె. అట్లు పోయి యింద్రియముల జయించువ్రతము నూని యది సమాప్త మగువఱకు దృఢవ్యవసాయము పూని నిజయశముఁ బ్రకాశించునట్లు కౌశికీతీరము సేరి యచట ఘోరమగు తపము .గావించె. అతఁడట్లు సహస్రవర్షము లతిభయంకర మగుతపము సలుపఁగా నంత హిమవంతమున దేవతలకు భయము గలిగె. వారును ఋషులు నందఱును నొక్కటఁ గూడి బ్రహ్మకడకుఁబోయి 'దేవా! ఈవిశ్వామిత్రుఁడు మహర్షి యని చక్కఁగా పిలువఁబడుఁగాక. అందులకై విచ్చేయు' మని పిలిచిరి. ఆ సర్వలోకపితామహుఁడును వారలవాక్యము విని 'వల్లె' యని విశ్వామిత్రుని కడకు వచ్చి యాతపోధనునిం జూచి తీపారుపలుకుల 'మహర్షీ! నీకు స్వాగతము. వత్సా! నీయుగ్రతపమునకు మెచ్చితి. ఋషులకెల్ల ముఖ్యుండవై యుండుమహత్త్వము (మహర్షిత్వము) నీకొసంగెద' ననఁగా, సర్వలోకేశ్వరుని వాక్యము వినియు, ఆ తపోధనుఁడు విషాదముగాని సంతోషముగాని పొందక యాసకల లోకపితామహునకు నమస్కరించి ప్రాంజలియై నిలిచి 'మహాత్మా! నాచేసిన శుభకృత్యములవలన ఎనలేని 'మహర్షి' నామము నాకుఁ బలికితివేని నేనపుడు జితేంద్రియుఁడ నయితిఁ గదా' యనఁగా నా దేవుం డాతనితో 'నీవు మునుల కెల్లఁ దలమిన్నవు. అయినను నీవు, మనోవికారము బుట్టించుహేతువులుండియు వికారము నొందక యుండునంతకాలము వచ్చువఱకును జితేంద్రియుండవు మాత్రముగావు. అందులకై యింకను బ్రయత్నింపు' మని చెప్పి దివమునకుఁ జనియె. తక్కిన దేవతలందఱును దివమునకుం బయనమై పోవఁగా, ఆ

విశ్వామిత్రుఁడు మునులకెల్ల మేటి గాన తనపూనికి వ్యర్థ మగుటకు వెనుదీయక చేతులు పైకెత్తి యేపట్టునులేక నిలిచి వాయుభక్షుఁడై తపమునలిపె. మఱియు నాతపోధనుఁడు వేసంగికాలమున వెలుంగుపంచాగ్నిమధ్యమున నెలకొనియు, వాన కాలంబుల వాన కేమఱుఁగులేని బట్టబయల నిలిచియు, చలివేళల రేయుంబవలు నీట మునింగియుండుచును, ఇట్లు వేయిసంవత్సరములు భయంకర మగుతపము చేసె. అతఁ డిట్లుగ్రతపము సేయుచుండఁగా దేవతలు నింద్రుఁడును మిక్కిలియు భయమున తత్తఱపడిరి. ఇంద్రుఁడును దేవత లందఱితోఁగూడి విచారించి రంభ నుజూచి తనకు హితమును విశ్వామిత్రునకు నహితమును గలిగింప నిట్లనియె. ఇది యఱువదిమూఁడవ సర్గము.

---

## ఇంద్రుఁడు రంభను బంపుట, విశ్వామిత్రుఁడు దానిని శపించుట.

'రంభా! నీవు పోయి విశ్వామిత్రుని మరులుకొలిపి మనసు కలఁచి నీయందు మిక్కిలి యాసగొనునట్లు సేయవలయు. ఇది కేవలమైనపని కాదు. గొప్ప దేవ కార్యము సుమీ. కావున తప్పక నీవు సేయవలయు' నని యింద్రుఁడు మతి దీపింపఁ జెప్పఁగా నామాట విని యాపాటలగంధి 'ఇదేమి! నా కలవి కానిపలుకు చెప్పె'నని బలితంపు సిగ్గునూల్కొన కేల్మోగిచి సురపతితో 'దేవవల్లభా! ఈవిశ్వామిత్రుఁడు సామాన్యుఁడు గాఁడు. ఒకగొప్పముని యగును. ఇంతే కాక యతఁడు భయంకరుఁడు. నేను బోయి సయ్యాట చూపితినేని ఘోరముగా నన్నుఁ గినిసి శపించును. ఇందులకు సందేహము లేదు. కావున నేను బోవ వెఱతును. నన్నుఁ బంపక యనుగ్రహింపఁ దగు'నని విశ్వామిత్రునిని దలంచి వెఱచి నడు నడు నణంకుచుఁ గేలు మొగిచి నిలఁబడి యున్నయావన్నెలాఁడిం జూచి యప్పుడు వేయుగన్నుల ప్రోడ 'రంభా! భయపడకు. నాపంపు తప్పక సేయుము. నీకు శుభం బగు. నేను వసంత ఋతువునందు రమణీయ మైనయొక వృక్షమున మనోహర మగు కోకిలరూపము నొందిమన్మథునితోఁడ నీప్రక్క నుండెద. నీవును సింగారంపుఁ గలికి చెయ్వులు పెక్కులు నీటు గులుక మిక్కిలియుఁ బ్రకాశించు చున్నరూపము దాల్చి విశ్వామిత్రుని కడకుం బోయి యతని యుగ్రతపము సెడునట్లు మనస్సు గలంపు' మనియె. ఆసుందరీమణియు. ఆవిన్నాణిపలుకులు విని యొయ్యారొని. యొయ్యారంబుల యిక్కువైన యెన లేని చక్కదనము గలుగుకెంజిగురాకు దాల్చి, నిద్దంపుఁదెలికులుకు నవ్వులు పెదవి కలఁకుల నివ్వటిల్ల, ఆవిశ్వామిత్రునికిఁ బొడకట్టి తనయెడల మక్కువగొలిపిన దియ్యె. అపుడు గుబగుబ మనినిం రు కోవెలపలుకులును వినంబడఁగా నతండు మిక్కిలియు ముదము మనమునఁ బొంపల సంత నెదుట నున్న కాంతామణిని జూచె. అట్లతఁడు కోకిలధ్వనిని విని రంభను జూచియు,ఎన లేని దాని మధురగానము నాలకించి 'ఇది యేమి? తానై వచ్చెనా?

లేక యింద్రుఁడు పంపెనా?' యని సందేహము నొంది, యంత 'ఇది సంగీతాదుల వలన నన్ను బేలుపుచ్చుటఁ జూడఁగా దేవేంద్రుఁడు పంచినపని' యని యెఱిఁగి కోపము పయికొన రంభను జూచి 'ఓసీ! కామక్రోధములను జయింపఁగోరి వ్రతము గావించు చున్న నన్నుఁ గలంచి యాసగొలిపి నాబాస దూలించితివి. నీచెడుపూని కికి ఫలముగా పదివేలేండ్లు శిలాప్రతిమ వై నెలకొని యుండఁగలవు. నాకోపము నకు బారి వై యిట్లు కలఁకఁబాఱి కుందు చున్ననిన్ను మహాప్రభావసంపన్నుఁ డును దపోబలసమన్వితుఁడు నగునొక బ్రాహ్మణుఁడు శాపమునుండి తొలఁగించు' నని శాపం బొసఁగెను. ఇట్లు మహాతేజుం డగునమ్మునిరాజు కోపము పట్ట లేక యాచెలువను శపించి యంత 'అయ్యో! తనయొడయండు పంచిన ట్లిది చేసెనే కాని దీనివలనఁ దప్పేమి? దీని నేల దయమాలి తిట్టితి' నని పశ్చాత్తాపము నొంది కుందె. అప్పు డతని శాపమువలన రంభయు శిలారూపము దాల్చె. అమ్మ హర్షి శాపవచనము విన్నంతనే మన్మథుఁడును ఇంద్రుఁడును అచ్చోట నుండక పరు గిడిరి. అమ్మహాతేజుఁడు తన మేటితప మంతయుఁ గోపముచేత వీటిఁబోవఁగాఁజూచె. అయినను ఎంతటి యాపద గాని యింద్రియములను గెలిచినవానిని గుందింపదు. అతఁడు జితేంద్రియుఁడు కామిచేఁదనతపము డిందుపడుటకు మనమునఁ గలిగినచింత తీఱదయ్యె. ఇట్లింద్రియజయము లేమిచేఁ దపమంతయుఁ దూలుటను జూచి యతఁడు తనమనమున 'నే నింకఁ గోపము నొందను. ఏవిధమున నేని మాట లాడక మౌనమే తాల్చియుండెదను. కాదేని, యూర్పులవలనఁ గ్రోధాదులు గలుగును గాన వందల కొలఁదియేం డ్లయినను నిట్టూర్పు విడువక యే యుండెద. తపము మహిమవలన నేను బ్రాహ్మణ్యము గడించి కయికొనువఱకు నింద్రియములఁ జిక్కఁబట్టి నా శరీర మును సుక్కఁ జేసెద. అంతవఱ కెన్నియేండ్లయినను నూర్పు పుచ్చకయు నాహా రము గొనకయు నుండెద. నేను దపము సలుపుచుండుదును గాన యీ తపఃప్రభా వమునం జేసి నాయవయవము లాహారాదులు లేమివలన తఱుఁగకుండెడు' నని సంకల్పము గావించుకొనియె. ఇట్లమ్మహామునివరుఁడు వేయి సంవత్సరములు నిట్టూర్పుపుచ్చకయు భుజింపకయు నుండుదీక్షను బూని, దీనిని ఎట్లేని కావించియే తీరునట్లు సాటిలేని ప్రతిజ్ఞయుఁ గావించిన వాఁడయ్యె. ఇది అఱువది నాలుగవ సర్గము.

---

## విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షి యగుట.

అంత హిమవంతం బున్నయుత్తరపుదిక్కును విడిచి యామునివరుఁడు తూర్పు దిక్కును జేరి యచట సహస్రవర్షములు నిరుపమాన మైనమౌనవ్రతము దాల్చి యుండునట్లు సంకల్పించుకొని అతిభయంకరమును అత్యంతదుష్కరమును అప్రతిమానము నై నతపము గావించె. అంత వేయేండ్లును నిండునంతకు, ఎన్ని

విఘ్నములు వచ్చి కలఁచినను, కొయ్యవలె నిశ్చలుఁడై యున్న యమ్మునీంద్రుని
కోపంబు నొందదయ్యె. అతఁడు వ్రతముగట్టిగాఁ బూని యేవిఘ్నమును గలుగ
కుండునట్లు తపముఁగావించె. కావునఁ గోపమున కవకాశం బెట్లుకలుగు? ఆమహా
వ్రతుఁడు వేయేండ్లకుఁ దన వ్రతము ముగియఁగా నపు డన్నమును భుజింప యత్నిం
చుటయు, నింద్రుఁడు బ్రాహ్మణరూపముఁ దాల్చి యతనియొద్దకు వచ్చి పక్వమై
యున్న యాయన్నము నంతయుఁ దనకుఁ బెట్టునట్లు యాచించె. అపు డామునియు
వేయేండ్లకుఁ బిదపఁ దాను పారణకై వండిన యన్నము నాబ్రాహ్మణుఁ డడిగినందు
లకు శంకింపక, తపస్సిద్ధికొఱకు నడిగినవారి కన్నము పెట్టవలయునని నిశ్చయించి,
పక్వమై యున్న యాయన్నమునంతయు వానికిఁ బెట్టియొక్క పిడుచయుఁ దనకు
మిగులక పోవుటంజేసి కుడువక యే యూరకుండినవాఁడ వ్రతముఁదాల్చి యాబ్రాహ్మ
ణు నేమియు ననఁడయ్యె, అతఁడు మహాతపస్వి; కాన యిట్టిచెఱుపుల సరకుసే
యునా? అంత నమ్మునివరుఁడు వేయిసంవత్సరములు నిట్టూర్పు విడువక వ్రతము
సలుపుచుండె. అట్లూర్పు పుచ్చ కున్నయమ్మహాత్ముని శిరసునుండి పొగ యొకటి
లేవఁగా దానివలన ముల్లోకములును గలఁతనొంది కాల్పంబడినవియుం బోలెఁ
దూలినవయ్యె. అంత దేవతలును గంధర్వులును పన్నగులును నసురులును రాక్ష
సులును ఆతప స్సనెడియగ్ని వేంద్రంబునఁ దమతమ తేజంబులు దూలి పోఁడిమి
మాలి మూర్ఛల మునింగి కలంగఁ బాఱి శోకించుచు బ్రహ్మకడకుఁ బాఱి యిట్లని
మొఱయిడిరి. 'దేవా! విశ్వామిత్రమునివరుని, రంభాదులనుబంపి పేరాస గొలిపి
తిమి. వేయేండ్లకుండ నండిన యన్నము నిచ్చికొనుట మొదలగువానిచేఁ గోప
మును గలిగింపఁ జూచితిమి. పెక్కు మార్గముల నాతనిని జెఱుపఁబూనితిమి. ఏమి చేసి
నను నాతని తపము కొఱఁతపడక పెరుగుచున్నది. ఆతనియం దేదేనియొక తప్పు
అల్పంతయైనఁగాని పింప దయ్యె, కావున నతఁడు మనసునఁ గోరిన దేదియో దాని
నొసఁగనియెడల చరాచరాత్మకమగు త్రైలోక్యమును నాశము నొందించును.
దిక్కులన్నియుఁ గలఁక నొంది కొంచెమేని ప్రకాశింపకున్నవి. సముద్రములన్నియు
గలఁగినవి. పర్వతములును బ్రిదులుచున్నవి. భూమి వడఁకుచున్నది. వాయువును
మిక్కిలి సొంపుదక్క వీచుచున్నది. ఇందులకుఁ బ్రతీకార మేదియో తెలియరాకు
న్నది. ఇట్టి యుపద్రవముల వలన జనులు నిత్యానుష్ఠానములు సెడి నాస్తికులవలె
వర్తిల్లుదురని తోఁచెడిని. ఇంతకంటె విపరీతమేమి కావలయు? ముల్లోకములును
మనసు మిక్కిలి కలఁగి తెలివి దప్పినట్లున్నవి. ఆమహర్షి తేజమువలన సూర్యుని
ప్రభయు మాసె. ఇఁకఁ దక్కిన వారినిగూర్చి చెప్పనేల? ఆ మహాముని యో
యగ్నివంటివాఁడు. అత్యంతమహిమచే మిక్కిలి కాంతిని దీపించుచుండువాఁడు.
అట్టివాఁడు ముల్లోకములను నాశము సేయఁదలంచుటకు మును పే దేవర యాతని నను
గ్రహింపఁదగు. తొల్లి ప్రళయకాలాగ్ని యెట్లో యట్లే యతఁడును త్రిలోకము

నంతయు దహించు నని తోఁచెడి. ఒకవేళ దేవరాజ్యమును గోరినను గోరును. కావున నిట్టివిపరీతములు కలుగకముందే యాతఁడు గోరినది యొసంగవలయు' ఇట్లు చెప్పి యంతట బ్రహ్మమొదలగు దేవతలందఱును మహాత్ముఁడగు విశ్వామిత్రుని కడకు వచ్చి మధురముగా 'బ్రహ్మర్షీ! స్వాగతము. నీతపమునకు మే మెంతయు సంతోషించితిమి. ఈయుగ్రతపమువలన నీకు బ్రాహ్మణ్యమును గలిగినది. నేనును దేవతలును నీకు దీర్ఘాయుష్యమును గూడ నొసంగెదము. నీకు సుఖంబగు. నిన్ను మేలొందెదుఁగాత; నెమ్మదిని బొమ్ము' అనిరి. పితామహుఁడును దక్క దేవతలందఱును జెప్పినమాట విని విశ్వామిత్రుఁడు ముదము నొంది యందఱికిని బ్రణామంబాచరించి 'బ్రాహ్మణ్యము నాకుఁ గలిగెనేని దీర్ఘాయుష్యమును నాకుఁ దొరకెనేని ఓంకారమును వషట్కారమును వేదములును దమంతట వచ్చి నన్ను వరింపుఁగాక. నేను వానిని ఒకరికిఁ జెప్పుటకుఁగాని, యొకరిని యజింపఁ జేయునప్పుడు వినియోగించుటకుఁగాని, యర్హుఁడను గావలయు. మఱొక్కటి వినుఁడు. వసిష్ఠుఁడు సూర్యవంశ్యుల కనాదిపురోహితుఁడై యుండుటంబట్టి క్షత్రియులకు వలయు నాథర్వణవేదముల నెల్లఁ జక్కఁగా నెఱింగినవాఁడు; మఱియు బ్రాహ్మణులకు వలయువేదములందును దేరుగడయైనవాఁడు; బ్రహ్మకు మానసపుత్రుఁడు. ఇట్టిమహిమగల యావసిష్ఠుఁడు నన్ను బ్రహ్మర్షి యనవలయును. నాకు ముఖ్యమగుకోర్కి యిదియే. దీని నొడఁగూర్చితి రేని యిప్పుడు మీరు నాయెడఁ గృతకృత్యులై పోవచ్చును. మఱొక విధమున మీరు కృతార్థులుగాఁ గానుండీ' యనియె. అంత బ్రహ్మర్షి యగువసిష్ఠుని దేవతలు ప్రార్థింపఁగా నమ్మునియుఁ బ్రసన్నుఁడై విశ్వామిత్రునితోఁ జెలిమిగావించి దేవతలు చెప్పినట్లే యతఁడు బ్రహ్మర్షియగు ననియె. దేవతలును విశ్వామిత్రునిఁ జూచి 'నీవు బ్రహ్మర్షివగుటకు సందేహ మేమియు లేదు. ఒక్క బ్రహ్మర్షిత్వమే కాదు. దానివలని యాజనాధ్యాపనాదు లగునన్ని యధికారములును నీకుఁ గలుగు' నని చెప్పి తమవచ్చినదారిం బోయిరి (విశ్వామిత్రుఁడట్లు తపముచేసి బ్రాహ్మణత్వము నొంది యంతధర్మము లెఱింగినవాఁడుగాన బ్రహ్మర్షియగు వసిష్ఠునిఁ బూజించి కృతార్థుఁడై తపము సలుపుచుఁ బుడమియంతయుఁ దిరిగె) రామా! ఈమహాత్ముఁ డీచందమున బ్రాహ్మణత్వముఁ బడసె. ఇతఁడు మునులకెల్లఁ దలమిన్న. ఇతఁడు రూపొందినతపంబు. ఇతఁడు సంతతధర్మపరుఁడు. ఇతఁడు పరాక్రమమునకు మేలిపట్టుసుమీ" ఇట్లు మహాతేజుండగు *శతానందుఁడు విశ్వామిత్రుని మహాత్త్వ

* శతానందుఁడు తనతల్లి శాపనివృత్తి గావింపఁజేసిన యుపకారము దలఁచి విశ్వామిత్రుని చరిత్రము నతనిశిష్యులగు రామలక్ష్మణులకు నింపుగఁ బ్రతిపాదించె. ఈచరిత్రమువలన నుపకారకుఁడైన గురువుయొక్క వైభవము తెలియుదగుననుటయు, కామక్రోధములు సర్వవిధముల నివారింప సాధ్యము కాదనియు. కామక్రోధముల జయించినవాఁడే బ్రాహ్మణోత్తముఁ డనియు. బ్రాహ్మణత్వము సులభము కాదనియు, బ్రహ్మవిదులకపచారము చేయుట సర్వకార్యములను జెఱుపుననియు మొదలగు విషయములు వ్యంజితము లగుచున్నవి.

ముల నుగ్గడించి యంతట విరమించె. జనకుఁడును రామలక్ష్మణులకు శతానందుఁడు వచించిన వాక్యములు విని తాను కౌశికుం జూచి కేలుమొగిచి మునీంద్రా! కాకుత్థ్సకుల తిలకు లగురామలక్ష్మణులను గూడి నీవు నాయాగమునకు వచ్చుటంజేసి నేను ధన్యుండనైతిని. నీయనుగ్రహమునుబడసితి, మహాముని వగునిన్ను దర్శించుటచేఁ బవిత్రుఁడనయితిని (నీవుమహాత్ముఁడవు బ్రహ్మర్షులకెల్ల నగ్రగణ్యుఁడవు) భవద్దర్శనమువలన నాకు బహుగుణములుగలిగె. మహాప్రభావసంపన్నుఁడ వగునీవు గావించిన యీ పెనుతపమును శతానందుండు విస్తరించి కీర్తించుచుండఁగా నేనును మహాత్ముఁ డగు రాముండును వింటిమి. నీగుణములనేకము లీసదమునకు వచ్చి యున్న వారలునువినిరి. నీతపమునకుఁ గొలఁది లేదు. నీబలమును గణింపఁ దరముగాదు. నీగుణములు నిన్ని యని లెక్కింప నెప్పుడును నలవిగావు. అవి బ్రహ్మదేవునికిని శివునకు నెట్లుగలవో యట్లు నీకునుఁ బ్రకాశించు. మిక్కిలి యాశ్చర్యకరములైన నీకథ లెంత వినియు నాకుఁ దృప్తిగలుగదు. ప్రొద్దు గ్రుంకనున్నది. సాయంకాలకర్మమునకు సమయమయ్యె. కాన యిప్పుడు పనివినియెద. రేపు పెందలకడ నీవు నన్నుఁ జూడవలయును. స్వాగతము. నాకు సెలవీయఁదగు' ననఁగా నపుడు విశ్వామిత్రుఁడు మనముననుల్లసిల్లి, తనపలె సంతసిల్లి యున్న యాపురుషసింహునిఁ జనకుని బొగడి, వేగవీడుకొలిపినవాఁ డయ్యె. మిథిలాధినాథుఁ డా జనకుఁడు ఋషికి నిట్లు చెప్పి నిజపురోహితబాంధవ సహితముగాఁ బ్రదక్షిణం బాచరించి వీడుకొనియె అంతధార్మికుఁ డగునమ్మునియు మహర్షులు దన్నుఁబూజింపఁగా రామలక్ష్మణులనుగూడి తమ విడిపట్టునకుం బోయె. ఇది అఱువదియైదవ సర్గము.

---

జనకుఁడు శివధనువృత్తాంతమును జెప్పుట.

అంత బలబల తెల్లవాఱఁగా జనకుఁడు ప్రాతఃకాలకరణీయముల నిర్వర్తించి మహాత్ముఁ డగువిశ్వామిత్రుని రామలక్ష్మణులను బిలిపించె. వారును వచ్చిరి. జనకుఁడును ధార్మికుఁడు గాన విధ్యుక్తవిధానంబున నామునిని మహాత్ములగు రామలక్ష్మణులను అర్చించి యంత నాఋషిని జూచి 'మహాత్మా! మీకు స్వాగతము. నేనేపని సేయుదునో దానిని దేవరయానతీయవలయు. మీరు పంచినపని మిముబోఁటులకుఁ జేయ వలయువారము గదా' యనియె. అమ్మునియు (మహాత్ముఁడు గాన యింక జరుగవలయు కార్యం బిదియని యెఱుంగును. మఱి) ధార్మికుఁడుగాన యాకార్యము నలవరించు పాడియుఁ దెలియును. ఇంతే కాక మాటపొం దెఱిఁగిన నెఱిదంటగాన మహాత్ముఁడగు జనకుం డాడినమాటవిని యవ్వీరునితో 'ఈ దశరథకుమారులిరువురు క్షత్త్రియకుల ప్రసూతులు. మఱియు జగమున మిగులఁ బ్రసిద్ధులు. వీరు నీయొద్ద నున్న మేటివిల్లు చూడఁ గోరెదరు. నీయాధనువును జూపుము. నీకు

శుభం బగు. రాజకుమారులు దానిని జూచినంతనే తమకోర్కి యీడేఱి మఱల
నిచ్చవచ్చినట్లు పోయెదరు' అనియె. జనకుఁ డది విని యామునివరునితో 'మహా
త్మా! ఈధను వెందులకొఱకు నిందున్నదో చెప్పెద వినుఁడు. మాకులమునకు నిమి
కూటస్థుఁడు. దేవరాతుఁ డనుమహీపతి యతని కాఱవతరమువాఁడు. మహాత్ముఁ
డగుశివుం డీధనువు నాదేవరాతునిచేతుల నిల్లడగాఁ బెట్టినవాఁడు. ఇది శివునివిల్ల
గుట యెట్లో చెప్పెద. తొల్లి శివుఁడు పరాక్రమము మెఱసి దక్షునియజ్ఞమును
రూపుమాపునప్పు డీధనువు నెక్కు పెట్టి కట్టలుక సెలఁగ లీలమెయి దేవతలను
జూచి సురలారా! ఈ యజ్ఞమందు నేను హవిర్భాగమును గోరఁగా నాకు భాగ
ముల నేర్పఱుపరైతిరి గదా. కాన యీధనువుచే శ్రేష్ఠములగు మీశిరములను
జెండాడెద. చూడుఁ' డనఁగా దేవత లందఱును దీనులై యాదేవేశుని బ్రార్థించి
ప్రసన్నునిఁ గావింపఁగా నద్దేవుఁడును వారలయెడఁ బ్రీతుండయ్యె. శివుఁ డిట్ల
తిప్రీతినిజెంది మహాత్ము లగునాదేవతల కెల్ల నీవిల్లొసఁగె. మహాత్ముఁ డయిన
యాదేవదేవుని యీ మేటిధనువును దేవతలు వడసి పిదప మా తొంటివాఁ డైన
దేవరాతుని కిల్లడగా నిచ్చిరి. అంత నేను యాగముకొఱకు భూమిని దున్నుచుం
డఁగా నాఁగటిచాలువలన నొకకన్నియ పుట్టినది. నేను యాగభూమిని శోధించు
నపు డాకన్నియ నాకు లభించె. సీత యనఁగా నాఁగటిచాలు. దానం బుట్టుటచే
నాకన్నియ సీత యని ప్రసిద్ధి గాంచినదయ్యె. భూమిని బుట్టినయాచిన్నారికూనయు
బూఁటపూఁట కిల్లారుముద్దుగా నేను బెంపఁగా నానాఁటఁ బెరుఁగుచు వచ్చె.
నేను బెంచుటం జేసి యది నా కూఁతు రయ్యె. ఈకన్య అయోనిజ గావున నామా
న్యున కెవ్వరికేని యూరక యీయందగినది కాదు. దీనికి వీర్యమే ఉంకువ (ఓలి)
యని తలఁచి శివునివిల్లు ఎక్కుపెట్టునంతవీర్యము గలబలుదిట్టకే యొసంగఁ దగు
నని యింతకాల మెవ్వరికి నియ్యకయే యుంచితిని. ఇట్లు భూమిని బుట్టి నానాఁటఁ
గన్నులపండువుగాఁ బెరుఁగు చున్న నాకుమారిని రాజు లనేకులువచ్చి తమ కిమ్మని
యడిగిరి. కాని యారాజుల కిందఱికిని 'నిరాతంకపరాక్రమమును ఉంకువగా
నిచ్చువానికే యీ బిడ నిత్తు' నని చెప్పి వారికీయనైతిని. అంత నలుగడలనుండి
రాజులందఱును గూడి నేనెక్కుపెట్టవలయు నన్నయావింటిసారమును దెలియఁ
గోరిమిథిలా నగరమునకు వచ్చిరి. వారటువచ్చి యావింటిసారము నెఱుఁగఁ
గోరుటఁజూచి నేను దానిని దెప్పించి వారికిఁ జూపితిని. వారు దానిని సరిగాఁ
బట్టికొనుటకుఁగాని, మీఁది కెత్తి చూచుటకుఁ గాని, చాల రైరి. ఆరాజులు
పరాక్రమ శాలులై యుండవచ్చును గాని యీ ధనువు విషయమున వారివీర్య
మల్ప మని నాకుఁ దెలిసెను. కాన నేను కన్నె నీయనని వారిని నిరాకరిం
చితిని. అంత వారు తమ పరాక్రమమునందు సంశయము గలుగుటచే దాని
చేత నాకూఁతుం బడయరాదని తెలిసి పెనుకోపము దనుక బలాత్కారము

నకుఁ జొచ్చి యందఱును మిథిలచుట్టును ముట్టడించిరి. వారట్లు నాపురము నరికట్టుటకు మఱియొక కారణమును గలదు. వారు వీర్యశుల్కము నేర్పఱుచుటచేఁ దమ్ము నేను దిరస్కరించితి నని తలంచిరి. ఇట్లెంచి మించురోషము ముంచుకొని మిథిలను ముట్టడివైచి పీడించిరి. ఇవ్విధమున నొకసంవత్సరము గడువఁగా నాదుర్గమును బదిలముగా రక్షించుటకు వలయుసేనాదిసాధనము లన్నియు నశించె. దానివలన నేను చాలదుఃఖితుఁడ నైతిని. అంత నేను దపము సేసి దేవతల నెల్లఁ బ్రసన్నులఁగావింపఁగా వారు మిక్కిలియు సంతసించి నాకుఁ జతురంగబలములఁ నొసంగిరి. ఆబలములవలన పాపకర్ము లగునానరపాలు రందఱును భంగమునొంది వీర్యములు దూలియుఁ దమపరాక్రమమునను శంకించుచు మంత్రులతోఁ గూడ నలుగడలఁ బాఱిరి. మునీంద్రా! ఈ వింటిమహిమను వింటివిగదా. అతిభాస్వరం బగు నీధనువును రామలక్ష్మణులకుఁ గూడఁ జూపెద. రాముం డీధనువును మోపెట్టునేని అయోనిజ యగు నాసుతను సీతను ఈ దశరథకుమారున కిచ్చెద" ననియె ఇది అఱువదియాఱవ సర్గము.

---

## రాముఁడు విల్లు విఱుచుట.

జనకుఁ డాడినమాట విని విశ్వామిత్రమునిపుంగవుఁడు 'రాజా! రామునకు ధనువును దెప్పించి చూపు,' మనియె. అంత నాజననాథుఁడును మంత్రులను బిలిచి 'గంధమాల్యసమలంకృతం బైనయాదివ్యధనువును గొనితెం' డని యాజ్ఞాపించెను. జనకునిపంపున వారును యజ్ఞవాటము విడిచి పురము సొచ్చి యాధనువును ముందట నిడుకొని పురమునుండి బయలు దేఱిరి. ఒడ్డుఁబొడువును మంచిబలిమియుం గల పురుషు లయిదువేవురు ఎనిమిదిచక్రములు గలిగి బండవలె నున్న యాయినుప మందసను (పెట్టె) బట్టిలాగిరి. వారయిదువేవురయ్యు నాయొకపెట్టెయును అతికష్టముతో లాగుచుండిరి. మంత్రులు శివధనువును బెట్టియున్న యాయినుపపెట్టెను దీసికొనివచ్చి దేవతాసన్నిభుఁ డగుజనకునిఁ జూచి "రాజేంద్రా! మిథిలాధిపా! సీతను గోరి వచ్చినసకల రాజులును 'ఔరా! ఈవింటిసారం బేమి!' యని కొనియాడినకైదువిల్లిదె చూడుము. దీనిని నీవు చూడఁ గోరితివిగాన దెచ్చితి" మనఁగా వారిపలుకు విని యానరపతియు కృతాంజలి యై మహాత్ముఁ డగువిశ్వామిత్రునిని ఆరామలక్ష్మణుల నిరువురిని జూచి 'బ్రాహ్మణోత్తమా! ఈవిల్లు పూర్వము మా వంశీయు లగుజనకులచే నెల్లఁబూజింపఁబడినది. మున్ను సీతనుగోరివచ్చి మహావీర్యు లయ్యు దీనిని పూరింపఁజాలక పోయిన రాజులును 'ఔరా' యని దీనిసారమును మెచ్చుకొనిరి. ఆరాజు లేమి! దేవతలందఱు గుంపుకట్టి వచ్చినను గాని, మఱి యసురరాక్షసగంధర్వయక్షప్రవరులు గాని, కిన్నర మహోరగులు గాని, దీనిని వంపఁ జాలరు: మఱిమోపెట్టనేని, బాణము దొడుగనేని, నారి గూర్పనేని,

బరువుచూచుట కెత్తికదలుపనేనియుఁ, జాలరు, ఇఁక మనుష్యుల కట్లు సేయుశక్తి యెక్కడిది? అట్టియీమేటివిల్లును దెప్పించితిని. మహాత్మా! దీని నీరాజపుత్రులిరువురకుఁ జూపుము' అనియె. ధర్మాత్ముఁ డగువిశ్వామిత్రుఁడును జనకుఁడు చెప్పిన వాక్యమును విని రామునిఁజూచి 'నాయనా! రామా! వింటిని జూడు' మనియె. ఆబ్రహ్మర్షిపంపు గయికొని రాముఁడును ఆవింటి నుంచియున్న మందసను దెఱచి యాధనువునుజూచి విశ్వామిత్రునితో 'బ్రాహ్మణోత్తమా! ఈబలువింటిని జేత ముట్టెద. ఇంతేకాదు. దీనినెత్తి కదల్చెద. మఱి సెలవేని మోపెట్టుటకునుఁ బ్రయత్నించెద. చిత్తగింపుఁ' డనఁగా రాజును మునియు 'అట్లేకాని, మ్మనిరి. ముని పంపున రాముఁ డావింటినడుము లీలమెయింబట్టికొని పెక్కువేలరాజులు చూచుచుండఁగా (అలవోకగా దానిని మోపెట్టె). *అట్లాధార్మికుఁడు దానిని మోపెట్టి ఆకర్ణాంతముగాఁ దెగదీయఁగా ఆవిల్లును రాముని యశము దశదిశల వెల్లివిరియఁ బ్రల్లన నడుమవిఱిగె. ఆవిఱిగినచప్పుడు పిడుగు పడినయులివుంబోలె మిక్కిలి బెడిదంబయ్యె. పెనుగొండ బ్రద్దలువాఱెనో యన భూమియు వడఁకె. మునివరుఁ డగువిశ్వామిత్రుఁడును జనకుఁడును రామలక్ష్మణులును దక్క దక్కినమనుష్యులందఱు నాధ్వనికి మూర్ఛిల్లి నేలం బడిరి. పిదప నాజను లందఱును దెప్పిఱి లేవఁగా జనకుఁడు భయముమాలి కేలుమొగిచి పలుకు పొందుమీఱ నమ్మునిపుంగవుఁ జూచి 'మహాత్మా! దశరథకుమారుఁ డైనయీరామునివీర్యము నేను జూచితిని. బాలుఁ డెక్కడ! ఈ బలువిలు నెక్కిడుట యెక్కడ! ఇది యెంతయువింత. మఱి యిది యెందును గానరాదు. కాని యిట్టిదట్టిదని తలఁపనుగూడ నలవికాదు. ఇంతేకాక యిది మనుష్యుల కేయసాధ్యము. కనుక నిట్లు గలుగునని నే నూహించినవాఁడనుగాను. † నాకూఁతు రైనయీసీత దశరథునికుమారుఁ డగు

* పూర్వోక్తవిధమున మిక్కిలి పొడవైనయాధనువుయొక్క మొన బాలుఁ డగు రామునికి అందనేరదు గాన అతఁడు దాని నెట్లు మోపెట్టు? నని యడిగినయెడల నతం డాశ్చర్యకర మగు శక్తి కలవాఁడు గాన చేత ముట్టఁగానే యది వంగిన దని తెలియునది.

† ఇందులకు 'జనకానాం కులే కీర్తి మాహరిష్యతి మే సుతా। సీతా భర్తార మాసాద్య రామం దశరథాత్మజమ్' అను మూలము (మేసుతా) నాకూఁతురు అనుటచే తనతోడిసంబంధముచేఁ గలిగిన యతిశయమును, (సీతా) సీత అనుటచే నాఁగటిచాలున జన్మించుటవలని - అనఁగా అయోనిజ గాఁబుట్టుటవలని. యతిశయమును దెలియునది. (దశరథాత్మజమ్) దశరథకుమారుఁడు అనుటచే 'బాన్ధవాః కులమిచ్ఛన్తి' అనురీతిని బంధువులు గోరుకులీనత్వమును, (రామమ్) రాముని అనుటచే 'రమయతీతి రామః' అన్నట్లు సౌందర్యాదులచే రమింపఁజేయువాఁడు గాన 'రూపమిచ్ఛతి కన్యకా' అనురీతిని కన్యక గోరురూపాతిశయమును, (భర్తారమ్) భర్త అనుటచే ద్రవ్యాదులచే భరింపఁజాలినవాఁడని తెలియుటవలన 'విత్తమిచ్ఛన్తి మాతరః' అన్నట్లు తల్లి గోరుధనవత్త్వమునుగలవని సూచితము. సర్వసమ్మతుఁ డైనవరుఁడని భావము. అట్టి యతిశయములుగలనాకన్య యిట్టి సకలశుభ

రాముని భర్తగాఁ బడసి జనకులకులమునకుఁ గీర్తి తేఁగలదు. పరాక్రమమే యుంకువగాఁ గొని దీని నిత్తునన్న నాప్రతిజ్ఞయు సత్యమైనది. నాకుఁ బ్రాణముకంటె ఎక్కుడైనయీనానుతను సీతను రాముని కీయందగు. నీపంపు గయికొని నామంత్రులు రథము లెక్కి మిక్కిలి వేగముగా నయోధ్యకుం బోయి వినయముతోడ మెలుపుమాట లాడి యారాజను నాపురమునకుఁ దేవలయు. వారుపోయి యాకాకుత్థ్సకులతిలకులు విశ్వామిత్రమునికాపునఁ బదిలముగా నున్నవారనియు, వీర్యశుల్క యగుసీతను నొసంగుటయు, మొదలుగాఁగల సకలవృత్తాంతములను రాజునకుఁ జెప్పి యాతనికిఁ బ్రీతిగొలిపి మిక్కిలి వడిగాఁ దోడితేవలయు' ననియె. కౌశికుఁడును 'వల్లె' యనగా నాధార్మికుఁడును మంత్రులఁ బిలిచి కల్యాణపత్త్రికయు సందేశపత్త్రికయు నిచ్చి 'ఆరాజును జరిగినవృత్తాంత మున్నరూపునఁ జెప్పి తోడుకొని రావలయు' నని యానతిచ్చి పుచ్చినవాఁడయ్యె. ఇది అఱువదియేడవ సర్గము.

---

జనకుఁడు దశరథునిఁ దోడితెచ్చుటకు దూతలను బంపుట,

జనకుఁడు పంపినదూతలు గుఱ్ఱములు బడలిక లొంద నమందగతిని బయనమైపోవుచుఁ ద్రోవను మూఁడు రాత్రులునిలిచి యంత నయోధ్యాపురముఁ బ్రవేశించిరి. వారట్లు సొచ్చి రాజగృహము సేరి యచటిదౌవారికులఁ జూచి 'మేము జనకరాజు దూతలము. ఇది మీరాజునకు వేగ తెలుపుఁ' డనఁగా నాద్వారపాలకులును దశరథునకు వారిరాక తెలిపిరి. దూతలు తమ్ము జనకరాజు పంపినట్లు చెప్పుటచే దశరథుఁడు వారలను దోడితెచ్చుట కానతిచ్చె వారును దౌవారికులవెంట రాజభవనము సొచ్చి యచ్చట దేవతాసన్నిభుండై యున్నవృద్ధుని దశరథమహీనాథునిఁ గాంచిరి. వారు ఆరాజన్యునిసౌజన్యమును జూచి భయము విడిచి యందఱును బద్ధాంజలులై వినయము గడలుకొన దీయనిపలుకుల నారాజతిలకునిఁజూచి "మహారాజా! మిథిలాపతి యగుజనకమహారాజు మాటిమాటికి నెయ్యముఁ దొలఁకుతియ్యనిపలుకుల, మీకుశలం బెడ తెగకుండునా? యని యడిగె. మీకు పురస్కరించుకొనియుండు నగ్నిహోత్రములయు నుపాధ్యాయులయుఁ బురోహితులయుఁ గుశలములు నల్లె యడిగె. ఇట్లావిదేహరాజు మీకుశలం బడిగి విశ్వామిత్రునియనుమతిని మీతో నిట్లను మనియె. 'పరాక్రమమే యోలిగాఁ గొని నా

---

లక్షణలక్షితుఁడైన వరుని (ఆసాద్య) పడసి 'అనన్తం బత మే విత్తం యస్య మే నాస్తి కించన। మిథిలాయాం ప్రదీప్తాయాం న మే కిఞ్చిత్ప్రదహ్యతే' అన్నట్లు అధ్యాత్మజ్ఞాననైభవమునఁ బ్రసిద్ధ గన్నమాపూర్వులగు (జనకానాం) జనకుల. (కులే) కులమున, (కీర్తిం) (కీర్తిని, (ఆహరిష్యతి) సంపాదించును అని భావము 'కీర్తి' ఏకవచనముగా నుండుటచే ఎప్పుడు నొక్కరూపై యొప్పుచుండునట్టిదని గ్రాహ్యము.

కుమారి నిత్తునని మును నేఁ జేసియున్న ప్రతిజ్ఞ మీ కందఱికిని దెలియునే కదా. రాజు లనేకులు రోషమున వచ్చి యావింటిని మోపెట్టు వీర్యమునూలి విముఖులై పోవునట్లు సేయుటయుఁ దెలిసియున్నదయే. ఇట్లు సకలరాజులును గోరునట్టి యీ సీతనీతోడిసంబంధమునకు సర్వాం డైనట్టి నేను బడసినకూఁతురు. పూజ్యుఁ డగు నీపుత్త్రుఁడును విశ్వామిత్త్రుని ముందిడుకొనిమద్భాగ్య వశమున నాపురికివచ్చి యీనాకొమారితను వీర్యంబు పెంపున తనవశము గావించికొనియె. ఆవిధము చెప్పెద. రాముఁడు తనమహత్త్వమువలన అనేకులు బలిసియున్న వెనుకొలువున మహామహిముఁడైన శివునిదివ్యధనువును నడుమ వించిన వాఁడయ్యె. నాకూఁతురు వీర్యశుల్క గావున అట్టిశుల్కం బొసఁగినమహాత్మునకు ఈరామునకే యాబిడ నీయందగు. నా పట్టిన ప్రతిన తీర్పఁగోరెద. అందులకు నీ వనుమతింపఁ దగును. మహారాజా! నీవు ఉపాధ్యాయపురోహితపురస్సరముగా వేగరమ్ము. నీకు శుభం బగు. నీకన్నగారాబుల రామలక్ష్మణుల నీకుఁ జూడం దగదే. రాజేంద్రా! నిన్ను దర్శించియు సీతను ప్రదానము సేసియు సంతోషింపఁ గోరెద. ఆసంతోషము నీవు నాతోడ గూర్పఁగను. నీయిరువురుకొడుకులఁ జూచియు' వారలయు నాకుమారితలయు కల్యాణమును జూచియు, నేను సంతసించునట్లు నీవుగూడ సంతోషింతువు'. ఇట్లు విదేహనాథుం డగుజనకుఁడు విశ్వామిత్త్రునియనుమతి నొంది శతానందునిసమ్మతియుం జెంది యీ మధురవాక్యము తమకుఁ జెప్పి పుత్తెంచె'' (నని చెప్పి యారాజునం దలి గౌరవముచేత మఱియు నెక్కువగా మాటాడుటకు శంకించి యంతటితో విరమించిరి.) రాజును ఆదూతలవాక్యము విని మిక్కిలియు హర్షించి వసిష్ఠునిని వామదేవునిని మఱియుఁ దక్కినమంత్రులనుఁ జూచి 'కౌసల్యా నందమును వెల్లిగొలుపు రాముఁడు విశ్వామిత్రుని కాపులక్రిందఁ బదిలముగాఁ దమ్ముఁ డగులక్ష్మణుని తోడ విదేహదేశమున నున్నాఁడు. మహాపరాక్రమవంతుఁడగు జనకుఁడును రాముని వీర్యముఁ గనుఁగొనెను. కావున నతఁడు తనకుమారి తను రామునకు నియ్యఁగోరుచున్నాఁడు, మహాత్ముఁ డగుజనకుఁడు చెప్పి పంపిన వృత్తాంతము మీకు నభిమతమగునేని మిథిలానగరమునకు వేగ పోవుదము జాగుసేయఁ దగ' దనియె. అందులకు మంత్రులును మునులును 'మంచి' దని చెప్పిరి. రాజు నందులకు మిక్కిలి సంతుష్టుఁడై 'రేపు పయనం' బని మంత్రులకుఁ జెప్పె. జనకరాజమంత్రులు మంత్రిత్వమునకు నలయుగుణము లన్నిటించే రాణించువారు గావున దశరథునివలన మిక్కిలియు సత్కారములనొంది సంతోషముతో నారాత్రి యంతయు నందుండిరి.

ఇది అఱువదియెనిమిదవ సర్గము.

---

దశరథుండు మిథిలానగరమునకుఁ బోవుట

అంత రాత్రి గడచిపోఁగానే దశరథుఁడు ఋత్విజులను బాంధవులనుఁ గూడి సంతసమున సుమంత్రునిఁ జూచి 'ఇపుడు కోశాధికారు లందఱును శ్రేష్ఠంబైన ధనమును దీసికొని నానావిధము లగురత్నములను గయికొని కల్యాణమునకు వలయు కార్యములఁ గుదురుపఱుచుకొని తగినకాపుదలతో ముందర పోవలయును. నే నాజ్ఞ యిచ్చినతోడనే నలుగడలఁ జతురంగబలములును, శిబికలు పల్లకీలు మొదలగు యానములును, రథాదియుగ్యములును వేగమున బయలుదేఱవలయు. వసిష్ఠుడు, వామదేవుండు, జాబాలియుఁ, గాశ్యపుఁడును, మిక్కిలి దీర్ఘాయుష్యుఁడగు మార్కండేయుఁడును గాత్యాయనఋషియు ననెడి యీ బ్రాహ్మణులు ముందు పోవలయు. జాగు సేయక నారథమును బూన్పఁ బంపుము. రాయబారులు నన్ను తొందర పెట్టుచున్నారు సుమీ' యనియె. రాజు ఋషులతోడఁ గూడి పోవుచుండఁగా నతని యానతి చొప్పున చతురంగబలములు నాతనివెంటఁ బోయెను. రాజును నాలుగుదినములు పయనము సేసి విదేహదేశముఁ బ్రవేశించెను. శ్రీమంతుఁడగు జనకభూకాంతుఁడును దశరథునిరాక విని కానుకలు సమకట్టించె. అంత జనకుఁడు వృద్ధుఁడగు దశరథునికడకు వచ్చి యాతనిదర్శనమున ముదంబు నొంది మేనం బులకలొత్త వివాహము వేగజరుగు నని హర్షము నొందెను. రాజశ్రేష్ఠుఁడు భూపతిలకునిఁ జూచి యేచినయుబ్బున 'మహారాజా! నీకు స్వాగతము. మహారఘుకులమునఁ బుట్టిన మహనీయుండవు. ఇట్టి నీవు నాభాగ్యవశమున నిచ్చోటికి విచ్చేసితివి. నీకుమారుల విలువిఱుచుట మొదలగు పరాక్రమకృత్యములు నీకు సంతోసముఁ గూర్చు. వారిని జూచి యాసంతోషము ననుభవించుము. మహాతేజుఁడును, భగవంతుఁడు నగు వసిష్ఠమహర్షియు బ్రాహ్మణోత్తములతోఁ గూడి నాభాగ్యవశమున దేవతలతోడి దేవేంద్రునివలె వచ్చినవాఁడు. ఇట్టి మహాత్ములను దెచ్చిన నాయదృష్టమువలన నావిఘ్నములు నశించినవి. పరాక్రమముచే మిక్కిలి యుత్కృష్టులును మహాత్ములు నగు రఘువంశపువారితో వియ్యము సేయఁ గలిగిన యీభాగ్యమునం జేసి నాకులము పూజ్యం బయ్యె. ప్రథమం బగునిక్ష్వాకువంశమునఁ బుట్టినవాఁడవు. కాననీవు నరేంద్రులకు నింద్రుఁడవు. ఇట్టినీవు రేపటిప్రాతఃకాలమున వివాహవిషయ మగు ప్రసంగమును నడపఁ దగుదువు. మూఁడు నాలుగు దినములలో నా యజ్ఞము ముగియఁగానే ఋషులకు సమ్మతి మగు బ్రాహ్మవివాహమును నెఱవేర్పవలయు' ననియె. మాట పొందెఱింగినవారలలో దశరథుఁడు మేటి. కాన యాతఁడు జనకుఁడు చెప్పినమాటవిని ఋషులనడుమ నాతనితో 'ఇచ్చువాఁ డెప్పుడిచ్చునో యపుడే పుచ్చుకొనువాఁడు పుచ్చుకొనవలయును గాని వేఱులేదు. కావున ప్రతిగ్రహము (పుచ్చుకొనుట) దాతయధీనము. నీవు వీర్యశుల్కముగాఁ జేసెడి యీ కన్యాప్రదానమును ముందే వినియున్నారము. కాఁబట్టి యిచ్చుదాత వైననీ వెట్లు

చెప్పుదువో పుచ్చుకొనువార మైనమే మట్లు చేయుదుము. నీవు ధర్మజ్ఞుఁడవు, కాన నీకుఁ దెలియనిధర్మములే దనియె. సత్యసంధుఁ డగుదశరథుఁ డిట్లు మిక్కిలి ధర్మయుక్తముగాను యశస్కరము గాను జెప్పినమాట విని విదేహనాథుఁడు మిక్కిలియు విస్మయమునొందె. అంత మునిజను లందఱును బరస్పరసమాగమము గలుగుటవలన మిక్కిలి హర్షము నొందినవారై యారాత్రి యచట సుఖముగా నుండిరి. దశరథుఁడును రఘుకులాలంకారు లగుతనకుమారులఁ జూచి మిక్కిలియు సంతసమునొంది జనకుఁడు సేయుపూజలకుఁ గరంబు ప్రీతిగడలుకొన నందు వసించి యుండె. మహాతేజుఁడగు జనకరాజు తత్త్వవిదుఁడు ధర్మము చొప్పున యాగమునకు సంబంధించిన కడమకార్యమును, గూఁతులకై వివాహమునకు ముందు చేయవలసిన యంకురార్పణాదికార్యములును, నిర్వర్తించి యారాత్రి గడపె. ఇది అఱువదితొమ్మిదవ సర్గము.

---

## వసిష్ఠుఁడు జనకునకు నిక్ష్వాకువంశక్రమమును జెప్పుట.

అంతఁ దెలతెలవాఱగా జనకుఁడు మహర్షులనుగొని యజ్ఞాదిక్రియలు ముగించి మాటపొందు మీఱఁ బురోహితుఁ డగుశతానందుఁ జూచి* 'సాంకాశ్యమనెడు పురము గలదు. ఆ పట్టణము మంగళకర మైనది. దానిచుట్టుఁబట్టుల నగడ్తవలెఁ జుట్టుకొని యున్న యిక్షుమతియనెడి యేటినీటియందుఁ బగవారు రాకుండఁ గాచుటకై మేకులు నాటంబడియున్నవి. మఱియు దానిచుట్టు నీటియుసిరిక చెట్లు చెలువారుచుండును. సుకృతమువలెనే యదియునుఁ దనయందువసించువారికి సకలాభీష్టములు నొసఁగుచుఁ బుష్పకవిమానమువలె నెసఁగుచుండు. మహాపరాక్రమవంతుఁడును మిక్కిలిధర్మాత్ముఁడు నగునాతమ్ముఁడు కుశధ్వజుఁ డనుపేరుగలవాఁ డాపట్టణమునందు ఇక్షుమతీనదీజలములఁ ద్రావుచు నివసించియున్నాఁడు. అతఁ డీయజ్ఞమునకు రక్షకుఁ డైనవాఁడని తలఁచెద. కాన వానిని జూడఁగోరుచున్నాను. అమ్మహాతేజుఁ డీకల్యాణమువలని సంతోషంపుసొంపును నాతోడఁ దాను నయితమనుభవింపఁగలవాఁ' డనియె. (శతానందునిముందట జనకుఁ డిట్లు చెప్పఁగా మిక్కిలి చుఱుకుగల కొందఱు వచ్చిరి. రాజు వారలకుఁ గుశధ్వజునిఁబిలుచుకొనిరా నియమించెను.) వారును వడి గలగుఱ్ఱముల నెక్కి యింద్రునిపంపున విష్ణునింబోలె నానరేంద్రునిపంపునఁ బురుషసింహుఁ డగుకుశధ్వజునిం దోడితేరఁ బయనమైపోయిరి. అట్లుపోయి సాంకాశ్యను జేరి కుశధ్వజునిఁ గాంచి రాముఁడు విలు విఱుచుట మొదలుగా జరిగిన వృత్తాంతమును జనకునియభిప్రాయమును దెలిపిరి. ఆ కుశధ్వజుఁడును బలవంతు లగునాదూతమిన్నలచేత నావృత్తాంతమును విని రాజా

*ఇంతవఱకు విశేషములు శతానందునికిఁ దెలిసినవియే యైనను, దెలియఁజెప్పుటకుఁ గారణము అవి పరంపరగా దశరథునిచెవులం బడవలయునను కోర్కియే కాని వేఱుకాదు.

క్షణంజేసి పయనమై వచ్చి మహాత్ముఁడును ధర్మతత్పరుఁడు నగుజనకుని దర్శించెను.
అతఁడు మొదట శతానందునకును బిదప ధార్మికుఁ డగు జనకరాజునకు నభివాద
నము సేసి వారియనుమతిని రాజార్హమును మహార్హము నగుసింహాసనము నెక్కి
కూర్చుండె. మిక్కిలి తేజంబున రాజిల్లు నాయన్నదమ్ము లిరువురును ఆసనములఁ
గూర్చుండి సుదాముఁ డనుమంత్రిలలామునిఁ జూచి 'మంత్రిపుంగవా! నీవు వేగ
మునఁబోయి యమేయకాంతిం బొలుపారుచు నెవరికిని నెదిరింపరాకుండు నిక్ష్వాకు
కులుని దశరథభూపాలుని నతనికుమారులను మంత్రులనుఁ దోడి తె' మ్మనిపంపిరి.
వాఁడా రఘుకులవర్ధనుండున్న విడిపట్టునకుఁబోయి యావిభునిఁ గాంచి యాదల వాంచి
మ్రొక్కి 'అయోధ్యాపతీ! వీరాగ్రణీ! మిథిలాధినాథుఁ డగు వైదేహుఁడు మిమ్మును
మీయుపాధ్యాయపురోహితులతోడఁ జూడఁ బూనినాఁ' డని విన్నవించె. రాజును
ఆమంత్రివరుని మాటను బాటించి యపుడు ఋషిబృందమును బంధువులనుఁ గూడి
జనకుఁ డున్న యెడకుఁ బోయె. అట్లుపోయి యాభూనాయకుఁడు మంత్రులును బాంధ
వులు నుపాధ్యాయులును బలసియుండ మాటపొందు మీఱ విదేహపతినిఁ జూచి
'మహారాజా! భగవంతుఁడగు వసిష్ఠమహర్షి మాయిక్ష్వాకుకులమునకుఁ బరము
గురుఁ డనియు మాకు వలయుకార్యము లన్నిటను ముందునిలిచి మాటాడువాఁ
డనియు నీకు దెలిసియేయున్నది. ఈధర్మాత్ముఁడు విశ్వామిత్రునియనుజ్ఞ నొంది
మహర్షుల నందఱిని గూడి నావంశము క్రమముగాఁ జెప్పును' (అని మహాత్ములగు
రాజులనడుమఁ జెప్పి నరశ్రేష్ఠుఁడగు) దశరథుఁడు మిన్నకుండె. భగవంతుఁడును
వాక్యవిశారదుఁడు నగు వసిష్ఠుఁడు విదేహపతిని అతనిపురోహితునిఁ జూచి 'ప్రత్య
క్షాదిప్రమాణములకగోచరము గానివస్తు వగుటచే విష్ణుఁడు అవ్యక్తము నాఁబడు.
ఆవిష్ణువునకు బ్రహ్మ జనించినవాఁడు. ఆతఁడు * శాశ్వతుఁడును నిత్యుఁడును అవ్య
యుఁడు నగు. ఆబ్రహ్మకు మరీచి పుట్టెను. మరీచికిఁ గాశ్యపుఁడు పుట్టె. కాశ్యపు
నకు సూర్యుండు పుట్టె. సూర్యునకు మనువు కుమారుఁడయ్యె. ఆమనువే మున్ను
రాజయ్యె. అతనికి నిక్ష్వాకుఁడు పుట్టె, ఆయిక్ష్వాకుఁ డయోధ్య నేలినరాజులలో
మొట్టమొదటి వాఁ డని తెలియుము. ఇక్ష్వాకునకు శ్రీమంతుఁడగు కుక్షి పుట్టె.
కుక్షికి శ్రీమంతుండగు వికుక్షి కొడుకయ్యె. వికుక్షికి మహాతేజుఁడును బరాక్రమ
శాలియు నగు బాణుండను సూనుండు పుట్టె. బాణునకుఁ దేజస్వియు బ్రతాప
వంతుఁడు నగు ననరణ్యుఁడు పుట్టె. అనరణ్యునకుఁ బృథువు పుట్టె. పృథువునకుఁ ద్రిశం
కుఁడు గలిగె. త్రిశంకునకు మహాయశుఁ డగు దుందుమారుఁడు కుమారుఁడయ్యె.
అతనికి యువనాశ్వుఁ డని నామాంతరము గలదు. అతనికి మాంధాత పుట్టె.

---

* బహుకాలముండువాఁడుగాన 'శాశ్వతుఁ' డనియు, రెండుపరార్ధముల కాలము నాశము
లేకుండువాఁడు గాన 'నిత్యుఁ' డనియు, ప్రవాహరూపముగా నెడతెగక ప్రతికల్పము నుండువాఁడు
గాన 'అవ్యయుఁ' డనియుఁ దెలియనది.

మాంధాతకు శ్రీమంతుఁ డగుసుసంధిపుట్టె. సుసంధికి ధ్రువసంధి ప్రసేనజిత్తు లను నిద్దఱుకొడుకులు గలిగిరి. ధ్రువసంధికిఁ గీర్తిమంతుఁ డగుభరతుఁ డనువాఁడు పుట్టె. భరతునకు మహాతేజుఁ డైనయసితుండు పుట్టె. ఆ యసితునకు హైహయులును, తాలజంఘులును, శూరు లగుశశిబిందువులును బగవారై బాధసేయుచుండిరి. వారలు పైనెత్తి రాఁగా అసితుఁడు వారలను ఎదుర్కొని పోరుచు ఆయుద్ధమందే పరాజితుఁడై రాజ్యమునుండి వెడలఁ గొట్టఁబడినవాఁ డయ్యె. అప్పు డసితుఁ డల్ప మగుతనసేనను గూడి మంత్రులతోడ హిమవంతమునకుఁ బోయి యచట * భృగుప్రస్రవణం బనుశిఖరమున వసించియుండెను. అతని భార్య లిరువురు నపుడు గర్భిణులుగా నుండి రనివినికి గలదు. అందొక్కతె తన సవతికి, దానిగర్భము నశించుటకై విషము గలిపినభక్ష్యము నిచ్చెను. అంత భృగువంశమునఁ బుట్టినచ్యవనుఁ డనుముని యారాజు తనదేశమందు వసించుచున్నవాఁ డనునభిమానముచేత, నతనియందుఁ బ్రీతుఁడై వర మనుగ్రహించుకొఱకు రమణీయ మైనపర్వతరాజ మగునాహిమవంతమునకు వచ్చెను. అయిద్దఱిలో విషము తిన్నయుద్దియ మంచిభాగ్యవతియై తామరఱేకులవంటి కన్నులు గలిగి చెలువారుచుండెను. అది తనకు కుశలముగాఁ గొడుకు పుట్టవలయు నని కోరుచు వేలుపువలెఁ గాంతిచే వెలుంగుచున్నయాభార్గవునకు నమస్కరించెను. విషము పెట్టిన కాళింది యనుకట్టిఁడిభార్యయు, ఆమునికడకు వచ్చి మ్రొక్కెను. ఏయడ్డియు లేక మగబిడ్డపుట్టవలయునని కోరినదై మొదటఁ దనకు మ్రొక్కిన వరవర్ణినింజూచి యాబ్రాహ్మణుఁడు పుత్రోత్పత్తివిషయముగా 'తామరఱేకుల వంటి కన్నులు గల యో భాగ్యవంతురాలా! నీయుదరమునందు మహాబలుఁడును భూరిపరాక్రముండును, మహాతేజుఁడును, శ్రీమంతుఁడు నగుసుపుత్రుఁడు విషముతోఁ గూడినవాఁడై త్వరలోఁ బుట్టఁగలఁడు విషముతోఁ గూడఁ బుట్టు నని వగవకుము. ఏమియు భయములే' దనియె. పతివ్రతయు బట్టపురాణియు నగునారాజపుత్రి చ్యవనునకు మ్రొక్కె. అంత అచిరకాలముననే పతివియోగము గలుగఁగా, ఆకాంత పుత్రునిఁ గాంచెను. చూలును బోఁగొట్టవలయు నని సవతి విషముఁ బెట్టెను గదా. ఆ విషముతోఁ గూడియే పుట్టినందున ఆకొమరుఁడు సగరుం డనఁబడియె. సగరునకు అసమంజుఁడు పుట్టె. అసమంజున కంశుమంతుఁడు గలిగె. అంశుమంతునకు దిలీపుఁడు పుట్టె. దిలీపునకు భగీరథుఁడు జనించె. భగీరథునకు కకుత్స్థుఁడుగలిగె. కకుత్స్థునకు రఘువు పుట్టె. రఘువునకు నలఘుతేజస్సమృద్ధుఁడై నప్రవృద్ధుఁడు పుట్టె. ఇతఁడు మొదటఁ బ్రవృద్ధుఁ డనుపే రొంది పిదప వసిష్ఠునిశాపమువలన రాక్షసుఁడై

* భృగుప్రస్రవణ మనఁగా భృగుమహాముని సాన్నిధ్యము గల సెలయేటిదాపటిప్రదేశము, ఇదియే పూర్వము భృగుతుండ మనఁబడినది.

యంతఁ దాను వసిష్ఠుని శపింప జలమును గ్రహించి తనభార్యవల దని యాఁటడింపఁగా దానిని విడిచె. అది అతనిపాదములమీఁదం బడఁగా నతఁడు కల్మాషపాదుం డనఁబడియె. అతనికి శంఖణుఁడు పుట్టె. శంఖణునకు సుదర్శనుఁడు పుట్టె. సుదర్శనున కగ్నివర్ణుఁడు జనించె. అగ్నివర్ణునకు శీఘ్రగుఁడు పుట్టె. శీఘ్రగునకు మరువు పుట్టె. మరువునకుఁ బ్రశుశ్రుకుఁడు గలిగె. ప్రశుశ్రుకున కంబరీషుఁడు పుట్టె. అంబరీషునకు నహుషుఁ డనురాజు పుట్టె. *నహుషునకు యయాతి పుట్టె. యయాతికి నాభాగుఁడు పుట్టె. నాభాగున కజుఁడు పుట్టె. అజునకు దశరథుఁడు పుట్టె. ఈ దశరథునకు అన్నదమ్ము లైనయీరామలక్ష్మణులు పుట్టిరి. రాజా! ఇక్ష్వాకుకులజాతు లగురాజులు మొదటినుండియుఁ బరిశుద్ధమైనవంశముగలవారును బరమధార్మికులును పరాక్రమశాలులును సత్యవాదులును అగుదురు. అట్టివారి కులమునఁ బుట్టిన యీరామలక్ష్మణులకొఱకై నీకొమారితలను గోరుచున్నవాఁడ. నీకూఁతులకు ఈకొమారులే తగుదురు. ఈకొమారులకు నీకూఁతులే తగుదురు. ఇట్టి తగినవారికి అట్టితగినకూఁతుల నియ్య నీకునుఁ దగును'' డెబ్బదియవసర్గము.

---

## జనకుఁడు తనవంశక్రమమును జెప్పుట.

వసిష్ఠుఁ డిట్లు చెప్పఁగా జనకుఁడు చేతులు మొగిడ్చి యమ్మునిని జూచి 'మహాత్మా! నీకు శుభం బగుఁగాక. పొగడ్తగన్నమావంశమును జెప్పెద. నీకు వినఁదగు. సత్కులప్రసూతుఁ డైనవాఁడు తాను కన్యాదానము సేయునపుడు తనకులమునంతయు నిశ్శేషముగాఁ జెప్పవలయు. కావున మావంశమును చెప్పెద వినుము. మహనీయకార్యములచేత ముల్లోకములను బ్రసిద్ధిగాంచిన నిమి యను రాజు గలఁడు. అతఁడు మిక్కిలి ధర్మాత్ముఁడు. బలవంతుల కెల్లఁ దలమిన్న. అతనికి మిథి యనుపుత్త్రుఁడు గలిగె. ఆమిథిచేత నే యీమిథిల నిర్మింపఁ బడినది. అతఁడే మొదటిజనకుఁడు. అతనికి ఉదావసువు గలిగె. ఉదావసువునకు ధార్మికుఁ డగునందివర్ధనుఁడు పుట్టె. నందివర్ధనునకు సుకేతుఁ డని ప్రసిద్ధి గన్నపుత్త్రుఁడు గలిగె. సుకేతునకు ధర్మాత్ముఁడును బలవంతుఁడు నగు దేవరాతుఁడు పుట్టె. రాజర్షి యగు దేవరాతునకు బృహద్రథుఁడు పొడమె. బృహద్రథునకు శూరుఁడును ప్రతాపవంతుఁడు నగుమహావీరుండు గలిగె. మహావీరునకు ధీరుఁడును సత్యపరాక్రముఁడు నగుసుధృతి గలిగె. సుధృతికి ధర్మబుద్ధి గలిగి మిగుల ధర్మము నాచరించుదృష్టకేతువు పుట్టె. రాజర్షి యగుదృష్టకేతువునకు హర్యశ్వుఁ డనువాఁడు గలిగె. హర్యశ్వునకు మరుఁడు కొడుకయ్యె. మరువునకుఁ బ్రతింధకుఁడు పుట్టె. ప్రతింధ

---

* ఈ నహుషయయాతులు చంద్రవంశ్యు లగునహుషయయాతులకంటె వేఱైనవారు. ఇందలి క్రమవైషమ్యము కల్పభేదములవలనఁ గలిగిన దని యెఱుంగునది.

కునకు ధర్మాత్ముఁ డగు కీర్తిరథుఁడనురాజు తనూజుఁడయ్యె. కీర్తిరథునకు దేవమీఢుఁడు పుట్టె. దేవమీఢునకు విబుధుఁ డనువాఁడు గలిగె. విబుధునకు మహీధ్రకుఁడు జనియించె. మహీధ్రకునకు మహాబలుఁ డగుకీర్తిరాతుఁడు పుట్టె. రాజర్షి యగుకీర్తిరాతునకు మహారోముఁడు జన్మించె. మహారోమునకు ధర్మాత్ముఁ డగు స్వర్ణరోముఁడు గలిగె. రాజర్షియగు స్వర్ణరోమునకు హ్రస్వరోముఁడు జన్మించె. ధర్మజ్ఞుఁడును మహాత్ముఁడు నగునా హ్రస్వరోమునకు నిరువురుపుత్రులు గలిగిరి. అందు నేను బెద్దవాఁడను. వీరుఁడగుకుశధ్వజుఁడు నాతమ్ముఁడు. మాతండ్రి పెద్దవాఁడనగునన్ను రాజ్యాభిషిక్తునిఁ జేసి కుశధ్వజునిఁ బోషించుభారము నాపయి మోపి తపోవనమునకుఁ జనియె. ముదుసలి యగుమాతండ్రి దివమునకుఁ బోవఁగా నేను దేవసముఁ డగునాతమ్ముని కుశధ్వజుని నెయ్యముతోఁ జూచికొనుచు రాజ్యభారము దాల్చితిని. అంతఁ గొంతకాలమునకు సాంకాశ్యపురము నుండి వీర్యవంతుఁ డగుసుధన్వుఁ డనురాజు ముట్టడించుటకు మిథిలపయి నెత్తివచ్చి యనుపమాన మగుశివధనువును, జలజాతనేత్రయగు సీతను దన కిమ్మని నాకుఁ జెప్పి పుచ్చెను. వింటిని గాని సీతను గాని నే నీయనైతి. దానివలన వాఁడు నాతో యుద్ధమునకుఁ దలపడఁగా నన్నెదిరినయాసుధన్వుని నారణమునం జంపితిని. అట్లానరవరునిఁ బరిమార్చి సాంకాశ్యమునకు వీరుఁ డగునా తోఁబుట్టువు కుశధ్వజునిఁ బట్టము గట్టితిని. ఈతోడఁబుట్టువు నాకుఁ దమ్ముఁడు. నేను బెద్దవాఁడను. మునీంద్రా! నీ వడిగినట్లు మిగులఁ బ్రీతితోడ నాయిద్దఱుకూఁతుల నిచ్చెదను. నీకు శుభంబగుఁగాక. రామునకు సీతను, లక్ష్మణునకు నూర్మిళను, ఒసంగెద. పరాక్రమమే యుంకువగాఁ గలిగి వేలుపుకన్నియవలెఁ జెన్నారు నా కూఁతురు సీతను, రెండవకూఁతు రైనయూర్మిళను ద్రికరణశుద్ధిగ ముమ్మాఱు నొసంగుచున్నాఁడ. (దశరథభూనాథా! రఘుకులతిలకుఁడ వగునీకు మిగుల ముదముతో నాకూఁతులను గోడండ్రుగా నొసంగెద.) రామలక్ష్మణులకు * గోదానం బనుసమావర్తనకర్మమును జేయింపుము. నీకు శుభం బగుఁగాక. వివాహకాలమునఁ జేయవలసిన పితృకార్య మగునాందీశ్రాద్ధమును గావింపుము. మహాబాహూ నేఁడు మఘానక్షత్రము గదా. నేఁటికి యేఁడవనాఁటికి మంగళకర మగునుత్తరఫల్గునీనక్షత్రమునందు వివాహకార్యమును జరుపుము. రామలక్ష్మణులకు మీఁదు మిక్కిలి సుఖముగూర్చు గో భూ తిల హిరణ్యాదిదానములను గావింపు' మనియె.

డెబ్బదియొకండవసర్గము.

---

* 'గోదానమ్'-'గావః' అనఁగా కేశములు. 'దాన' మనఁగా ఖండనము. బాహుపాదమూల రోమములు ఖండింపఁబడుకర్మ మనుట. ఇదియె వివాహమునకు ముందు సేయంబడు సమావర్తనకర్మమనఁబడును.

యంతఁ దాను వసిష్ఠుని శపింప జలమును గ్రహించి తనభార్యవల దని యాఁటిడింపఁగా దానిని విడిచె. అది అతనిపాదములమీఁదం బడఁగా నతఁడు కల్మాషపాదుం డనఁబడియె. అతనికి శంఖణుఁడు పుట్టె. శంఖణునకు సుదర్శనుఁడు పుట్టె. సుదర్శనున కగ్నివర్ణుఁడు జనించె. అగ్నివర్ణునకు శీఘ్రగుఁడు పుట్టె. శీఘ్రగునకు మరువు పుట్టె. మరువునకుఁ బ్రశుశ్రుకుఁడు గలిగె. ప్రశుశ్రుకున కంబరీషుఁడు పుట్టె. అంబరీషునకు నహుషుఁ డనురాజు పుట్టె *నహుషునకు యయాతి పుట్టె. యయాతికి నాభాగుఁడు పుట్టె. నాభాగున కజుఁడు పుట్టె. అజునకు దశరథుఁడు పుట్టె. ఈ దశరథునకు అన్నదమ్ము లైనయీరామలక్ష్మణులు పుట్టిరి. రాజా! ఇక్ష్వాకుకులజాతు లగురాజులు మొదటనుండియుఁ బరిశుద్ధమైనవంశముగలవారును బరమధార్మికులను పరాక్రమశాలులును సత్యవాదులును అగుదురు. అట్టివారి కులమునఁ బుట్టిన యీరామలక్ష్మణులకొఱకై నీకొమారితలను కోరుచున్నవాఁడ. నీకూఁతులకు ఈకొమారులే తగుదురు. ఈకొమారులకు నీకూఁతులే తగుదురు. ఇట్టి తగినవారికి అట్టితగినకూఁతుల నియ్య నీకునుఁ దగును'' డెబ్బదియవసర్గము.

---

## జనకుఁడు తనవంశక్రమమును జెప్పుట.

వసిష్ఠుఁ డిట్లు చెప్పఁగా జనకుఁడు చేతులు మొగిడ్చి యమ్మునిని జూచి 'మహాత్మా! నీకు శుభం బగుఁగాక. పొగడ్త గన్నమావంశమును జెప్పెద. నీకు వినఁదగు. సత్కులప్రసూతుఁ డైనవాఁడు తాను కన్యాదానము సేయునపుడు తనకులమునంతయు నిశ్శేషముగాఁ జెప్పవలయు. కావున మావంశమును చెప్పెద వినుము. మహనీయకార్యములచేత ముల్లోకములను బ్రసిద్ధిగాంచిన నిమి యను రాజు గలఁడు. అతఁడు మిక్కిలి ధర్మాత్ముఁడు. బలవంతుల కెల్లఁ దలమిన్న. అతనికి మిథి యనుపుత్త్రుఁడు గలిగె. ఆమిథిచేతనే యీమిథిల నిర్మింపఁ బడినది. అతఁడే మొదటిజనకుఁడు. అతనికి ఉదావసువు గలిగె. ఉదావసువునకు ధార్మికుఁ డగునందివర్ధనుఁడు పుట్టె. నందివర్ధనునకు సుకేతుఁ డని ప్రసిద్ధి గన్నపుత్త్రుఁడు గలిగె. సుకేతునకు ధర్మాత్ముఁడును బలవంతుఁడు నగు దేవరాతుఁడు పుట్టె. రాజర్షి యగు దేవరాతునకు బృహద్రథుఁడు పొడమె. బృహద్రథునకు శూరుఁడును బ్రతాపవంతుఁడు నగుమహావీరుండు గలిగె. మహావీరునకు ధీరుఁడును సత్యపరాక్రముఁడు నగుసుధృతి గలిగె. సుధృతికి ధర్మబుద్ధి గలిగి మిగుల ధర్మము నాచరించుదృష్టకేతువు పుట్టె. రాజర్షి యగుదృష్టకేతువునకు హర్యశ్వుఁ డనువాఁడు గలిగె. హర్యశ్వునకు మరుఁడు కొడుకయ్యె. మరువునకుఁ బ్రతింధకుఁడు పుట్టె ప్రతింధ

* ఈ నహుషయయాతులు చంద్రవంశ్య లగునహుషయయాతులకంటె వేఱైనవారు. ఇందలి క్రమవైషమ్యము కల్పభేదమువలనఁ గలిగిన దని తోఁచుచున్నది.

నకు ధర్మాత్ముఁ డగు కీర్తిరథుఁడను రాజు తనూజుఁడయ్యె. కీర్తిరథునకు దేవమీఢుఁడు పుట్టె. దేవమీఢునకు విబుధుఁ డనువాఁడు గలిగె. విబుధునకు మహీధ్రకుఁడు జనియించె. మహీధ్రకునకు మహాబలుఁ డగుకీర్తిరాతుఁడు పుట్టె. రాజర్షి యగుకీర్తిరాతునకు మహారోముఁడు జన్మించె. మహారోమునకు ధర్మాత్ముఁ డగు స్వర్ణరోముఁడు గలిగె. రాజర్షియగు స్వర్ణరోమునకు హ్రస్వరోముఁడు జన్మించె. ధర్మజ్ఞుఁడును మహాత్ముఁడు నగునా హ్రస్వరోమునకు నిరువురుపుత్త్రులు గలిగిరి. అందు నేను పెద్దవాఁడను. వీరుఁడగుకుశధ్వజుఁడు నాతమ్ముఁడు. నాతండ్రి పెద్దవాఁడనగునన్ను రాజ్యాభిషిక్తునిఁ జేసి కుశధ్వజునిఁ బోషించుభారము నాపయి నుంచి తపోవనమునకుఁ జనియె. ముదుసలి యగునాతండ్రి దివమునకుఁ బోవఁగా నేను దేవసముఁ డగునాతమ్ముని కుశధ్వజుని నెయ్యముతోఁ జూచు చుము రాజ్యభారమును దాల్చితిని. అంతఁ గొంతకాలమునకు సాంకాశ్యపురము నుండి వీర్యవంతుఁ డగుసుధన్వుఁ డనురాజు ముట్టడించుటకు మిథిలపయి నెత్తి వచ్చి యనుపమాన మగుశివధనువును, జలజాతనేత్ర యగుసీతను దన కిమ్మని నాకుఁ జెప్పి పుచ్చెను. వింటిని గాని సీతను గాని నే నీయనైతి. దానివలన నతఁడు నాతో యుద్ధమునకుఁ దలపడఁగా నన్నెదిరినయాసుధన్వుని ఆరణమునం జంపితిని. అట్లానరవరునిఁ బరిమార్చి సాంకాశ్యమునకు వీరుఁ డగునా తోఁబుట్టువు కుశధ్వజునిఁ బట్టము గట్టితిని. ఈతోడఁబుట్టువు నాకుఁ దమ్ముఁడు. నేను పెద్దవాఁడను. మునీంద్రా! నీ వడిగినట్లు మిగులఁ బ్రీతితోడ నాయిద్దఱుకూఁతుల నిచ్చెదను. నీకు శుభంబగుఁగాక. రామునకు సీతను, లక్ష్మణునకు నూర్మిళను, నొసంగెద. పరాక్రమమే యుంకువగాఁ గలిగి వేలుపుకన్నియవలెఁ జెన్నారు నా కూఁతురు సీతను, రెండవకూఁతు రైన యూర్మిళను త్రికరణశుద్ధిగ మూఁడుమాఱు లొసంగుచున్నాఁడ. (దశరథభూనాథా! రఘుకులతిలకుఁడ వగునీకు మిగుల ముద మతో నాకూఁతులను గోడండ్రుగా నొసంగెద.) రామలక్ష్మణులకు * గోదానం బనుసమావర్తనకర్మమును జేయింపుము. నీకు శుభం బగుఁగాక. వివాహకాల మునఁ జేయవలసిన పిత్రుకార్య మగునాందీశ్రాద్ధమును గావింపుము. మహాబాహా! నేఁడు మఘానక్షత్రము గదా. నేఁటికి మూఁడవనాఁటికి మంగళకర మగును త్తర ఫల్గునీనక్షత్రమునందు వివాహకార్యమును జరుపుము. రామలక్ష్మణులకు మీఁదు మిక్కిలి సుఖముగూర్పు గో భూ తిల హిరణ్యాదిదానములను గావింపు' మనియె. డెబ్బదియొకండవసర్గము.

---

* 'గోదానమ్'-'గావః' అనఁగా కేశములు. 'దాన' మనఁగా ఖండనము. బాహుపాద ముల రోమములు ఖండింపఁబడుకర్మ మనుట. ఇదియె వివాహమునకు ముందు చేయుంబడు సమా వర్తనకర్మమనఁబడును.

## దశరథుఁడు కుమారులవివాహార్థము గోదానాదులు సేయుట.

జనకుఁ డిట్లు చెప్పి యూరకుండెను. అంత విశ్వామిత్రుఁడు వసిష్ఠసహితుఁడై యావీరునిఁ జూచి 'రాజోత్తమా! ఇక్ష్వాకువంశమును విదేహవంశమును ఆశ్చర్యములైనవి. వానిమహిమ యింతింత యనిగొలఁదిపెట్ట నలవికాదు. ఏలన ఈ రెంటికి సాటి మఱొక్కటియు లేదు. సీతను ఊర్మిళను రామలక్ష్మణులకు ధర్మమున నిచ్చునట్టి యీవివాహసంబంధము. సమానకులములకుఁ గలుగుటంబట్టి తగియున్నది ; వధూవరులకుఁ గలసమానసౌందర్యసంపదను బట్టియుఁ దగియున్నది. మఱి యొకటి మీకుఁ జెప్పవలసి యున్నది. ఆమాటను బాటించి వినుము. ఈ కుశధ్వజమహారాజు నీకుఁ దమ్ముఁడు. మఱియొక ధర్మజ్ఞుఁడు, కావున నీవలెనే యితఁడును సంబంధమునకు నర్హుఁడు, ఈధర్మాత్మునకుఁ బుడమియందు సాటి లేని చక్కఁదనము గల యిద్దఱుకూఁతుండ్రుగలరుగదా. ఆముద్దియలను పత్నులుగా నొకరికొఱకు వరించుచున్నాము. మఱెవరికొఱకును గాదు. చిన్నవాఁ డగుమనభరతుఁడును బుద్ధిమంతుఁ డగుశత్రుఘ్నుఁడును గలరుగదా. ఆమహాత్ములకొఱకే యాతనికూఁతుండ్ర నిరువురను వరించుచున్నారము. దశరథుని యీకుమారు లందఱును మంచి రూపమును యౌవనమును గలవారు; అందఱును దిక్పాలకులకు సాటివత్తురు; అందఱును దేవతలంబోని పరాక్రమవంతులు. మీయిరువురసంబంధమువలన నిర్దుష్టంబైనయిక్ష్వాకులమును, పుణ్యకర్ముఁడవగు నీకులమును వియ్యముచే నొకటితో నొకటి గట్టువడి యుండునుగాక' యనియె. విశ్వామిత్రుఁ డాడినమాటలు విని వసిష్ఠునియనుమతిని గొని యపుడు జనకుఁడు చేతులు మొగిచి వారిద్దఱిని జూచి 'మునిపుంగవులారా! ఇక్ష్వాకుకులముతోడివియ్యము మిక్కిలి తగినది. అట్టితగిన సంబంధమును జేయుఁ డని మీరు తామె మా కాజ్ఞాపించుటవలన మాకులము ధన్యం బయ్యెనని తలఁచుచున్నాఁడను. మీరానతిచ్చినట్లే యగు. మీకు శుభం బగుఁగాత. ఒకరి నొకరు వీడక నవగూడి యుండు భరతశత్రుఘ్ను లిరువురును కుశధ్వజునియీకూఁతుండ్రను ఈ యిద్దఱినిఁ బెండ్లాడుదురుగాక. మునీంద్రా! మహాబలు లగురాజకుమారులు నలువురును ఒక పగటియందే నలువురు రాజపుత్త్రికలను జెట్టపట్టుదురుగాక. బ్రాహ్మణోత్తమా! భగుండు ప్రజాపతి (దేవత) గాఁ గలయుత్తరఫల్గునీనక్షత్రమందు పగలు వివాహము సేయుట ప్రశస్తమని పండితులు చెప్పెద'రని చల్లఁదనంబునఁ జెప్పి చేతులు మొగిడ్చి యాయిరువురు మునుల నెదుర్కొని జనకుఁడు "మీరు నాకుఁ గన్యాప్రదానం బొనర్చి చాల ధర్మము గలిగించితిరి. మీకు నే నెల్లప్పుడును శిష్యుఁడ నయితిని. మీరు మా యన్నదమ్ములిరువుర దివ్యసింహాసనములను దశరథునిసింహాసనమును అధిష్ఠించి మామువ్వుర రాజ్యంబులను బాలింపుఁడు. 'దశరథునిరాజ్యం బిచ్చుటకు నీవెవ్వ' రందురా? ఈమిథిల దశరథుని కెట్లుసొంతమో అయోధ్యయు నా కట్లు సొంతము.

కావున నేను దశరథునిరాజ్యమును మీ కీయవచ్చును. కాఁబట్టి మీకు మూఁడు రాజ్యములందును ప్రభుత్వము గలదనుటకు సందియము లేదు. మే మందఱమును మీ కధీనులము మీరందఱును మాకు హితముపదేశించి మాకుఁ దగినట్లుపకార్య మేని చేయఁదగు'' నని యా జనకుఁ డిట్లు చెప్పుచుండఁగా రఘుకులదీపకుఁ డగు దశరథుఁడు సంతసిల్లి యాజనకవల్లభునిఁ జూచి, మిథిలాధిపతు లగునన్నదమ్ములు మీయిరువుర కల్యాణగుణము లెక్కింప నలవి గాకున్నవి. కావుననే రాజులును ఋషిజనులును మీచేఁ జక్కఁగాఁ బూజితు లైరి. నీవు శుభము నొందుము. నీకు మంగళ మగుఁగాక, నేను నావిడిపట్టునకుఁ బోయి శ్రాద్ధకర్మము లన్నియుఁ గావించుకొనెద' నని పలికి యపు డారాజునొద్ద సెలవు పుచ్చుకొని మునీంద్రుల నిద్దఱిని ముం దిడుకొని యమ్మహాయశుఁడు వేగ వీడుఁబట్టునకుం బోయి నాందీ శ్రాద్ధమును విధిచొప్పునఁ గావించి తెలతెలవాఱఁగా లేచి యప్పటికిఁ జేయవలసిన యుత్తమకార్య మగు గోదానమును (సమావర్తనకర్మమును) జరిపె; అంత నారాజు పుత్త్రులం గూర్చి యొక్కొక్కనికొఱకు లక్షగోవులచొప్పున బ్రాహ్మణులకు దానము సేసెను. ఆరఘునందనుఁడు పుత్త్రులయందు మిక్కిలి వాత్సల్యము గలవాఁడు. కావున నింతటితోఁ దనియక వారలసమావర్తనోత్సవమును గుఱించి, బంగరుకొమ్ములు గలవై భాగ్యవంతము లగు నాలుగులక్షలగోవులను దూడలతోను బాలు పిదుకుకొంచు పాత్రలతోను బ్రాహ్మణులకు దానముసేసి, మఱియు బహుధన మవ్వారిగా వారికి నిచ్చె. అప్పుడు సమావర్తనము చేసికొన్నపుత్త్రులు తన్ను బలసియుండఁగా ఆ దశరథ భూవిభుఁడు దిక్పాలురు బలసి కొలువఁ బ్రసన్నుఁ డై యున్నబ్రహ్మదేవునివలెఁ బ్రకాశించెను. ఇది డెబ్బదిరెండవ సర్గము.

---

## సీతాకల్యాణము.

దశరథుఁడు తనకుమారులకు ఉత్తమ మగుసమావర్తనము జరిపిననాఁడే శూరుఁడైనయుధాజిత్తు అతనికడకు వచ్చెను. ఆయుధాజిత్తు కేకయరాజునకుఁ గొడుకు; భరతునికిఁ దల్లితోడఁబుట్టిన మేనమామ. అతఁడు దశరథునిఁ జూచి కుశలమడిగి 'రాజేంద్రా! కేకయరాజు స్నేహముతో మీకుశలము నడుగు మనెను. నీ వెవరిక్షేమముగోరుదువో యట్టి మేమందఱము నిపుడు కుశలముగా నున్నవారము. మాతండ్రియైన యాకేకయరాజు నామేనల్లుఁ డైనభరతునిఁ జూడఁ గోరుచున్నాఁడు. కావున వానిని బిలుచుకొని పోవుటకొఱకు నేనయోధ్యకుఁ బోయితిని అయోధ్యయందు నీవును నీ కుమారులును వివాహార్థము మిథిలకుఁ బోయినారనివిని నామేనల్లునిఁ జూచుటకై యచటనుండి శీఘ్రముగా వచ్చితి' ననియె. అంత దశరథుఁడు ప్రియాతిథియై యుధాజిత్తు వచ్చుటను జూచి, పూజార్హుఁ డైన

యతనిని మిక్కిలి పూజించెను. అంత నా మహీకాంతుఁడు మహాత్ములైనతన కుమారులతోడ నారాత్రి గడపి తెల్లవాఱఁగా లేచి, ఆ యాకాలములందుఁ జేయ వలసిన కర్మముల నన్నిటిని దెలిసినవాఁడు గావున నప్పటికి వలసిన కర్మములుతీర్చి, ఋషులను ముం దిడుకొని, యజ్ఞశాలసమీపమునకుఁ బోయెను. రాముఁడు సమస్త భూషణాలంకృతులై యున్నతమ్ములను గూడి, తోరము గట్టుకొనుమంగళాచారమును నిర్వర్తించి, వివాహమునకు యుక్తమై *విజయము గూర్చునట్టి శుభముహూర్త మున వసిష్ఠునిని మఱియుఁ దక్కిన మహర్షులను ముందిడుకొని యజ్ఞశాలకుఁ బోయెను. (అట్లుపోయి తమ్ములు తన్నుచుట్టి యుండఁగా తండ్రియొద్ద గూర్చుండెను) భగవంతుఁ డగు వసిష్ఠుఁడు జనకునియొద్దకు బోయి యతనితో 'రాజోత్తమా! దశరథ భూనాథుఁడు, తోరము గట్టుకొని యున్నకొడుకులతోఁ గూడి కన్యాదాత వగునిన్ను ఎదురుచూచుచున్నాఁడు. కన్యనిచ్చువానికిని. పుచ్చుకొనువానికిని సమస్త పురుషార్థములు సమకూరును. వారిద్దఱివలననే కన్యాదానము ప్రతిగ్రహము మొదలగు వివాహకార్యము లన్నియు జరుగవలయును. కాఁబట్టి దాత వగు నీవు ఊరకుండరాదు. కన్యాదానముచేసి నీవు ప్రతిజ్ఞను దీర్చుకొనవలయును. అదియే దాతవైననీకు ధర్మము. ఉత్తమమైన యీవివాహము జరిపి యాధర్మమును బొందుము' అనియె. మహాపరాక్రమవంతుఁ డగుజనకుఁడు మిక్కిలియు దాత; మఱియును పరమధర్మము లన్నియుఁ దెలిసినవాఁడు కనుక వివాహమునకు తాను జేయువలసిన విధులన్నియుఁ దీర్చియే యుండెను. కాఁబట్టి మహాత్ముఁ డగువసిష్ఠుఁడు అట్లు చెప్పినప్పుడు తాను అమ్మునితో 'మహాత్మా! మీరై యేల త్వరితముగా రాకున్నారు? మీరు రాఁగా నడ్డగించు ద్వారపాలకుఁ డెవఁ డున్నాఁడు? వచ్చుటకు ఎవరియాజ్ఞను ఎదురు చూచుచున్నారు? నీకు నీరాజ్యము వలెనే యీ రాజ్యము కూడ సొంతము. నా రాజ్యమే నీ సొమ్మై యుండఁగా ఇఁక నాగృహమును నీకు సొంత మని చెప్పవలయునా? సొంత గృహములో విచార మే మున్నది? నాకై మీ రెదురు చూచుచున్నా'మంటిరి. 'నాకన్యలు వివాహమునకు వలసినమంగళాచారములను అన్నిటిని జేసికొని జ్వలించుచున్న యగ్నిజ్వాలలవలె వెలుఁగుచు వివాహవేదిసమీపమునకుఁ వచ్చి యున్నవారు. నేను సిద్ధుఁడనై యీవేదియం దుండి మిమ్ము నెదురుచూచుచున్నాను. కాఁబట్టి దశరథ మహీపతి నిర్విఘ్నముగా శుభకార్యమును జేయుఁగాక. జాగుసేయ నేల' యనియె. జనకుఁడు చెప్పిన వాక్యమును, వసిష్ఠుఁడుచెప్పి పుచ్చిన పురుషుని మూలముగా దశరథుఁడు విని తనకుమారులను ఋషులను అందఱిని గూడఁ దీసికొని యాగశాలను బ్రవేశిం

---

* 'విజయ' మనెడి ముహూర్తమునం దని కొందఱు వ్యాఖ్యాతలమతము వివాహముహూర్తము అపరాహ్ణమున జరుగుటచేతను విజయము అనుముహూర్తము పూర్వాహ్ణమునందలిది గావునను, ఇచట విజయమనఁగా జయావహమైనదనియే యర్థము సేయవలయునని మఱికొందఱి మతము.

చెను. అంత విదేహరాజు వసిష్ఠునితో 'మునీంద్రా! నీవు ధార్మికుఁడవు; మఱియు మాకుఁ బ్రభుండవు. లోకుల నందఱిని రమింపంజేయు మనరామునకుఁ జేయవలసిన వివాహకార్యము నంతయు నీవు ఋషులను గూడి చేయింపుము' అనియె. భగవంతుఁడైనయావసిష్ఠుఁడును 'వల్లె' యని చెప్పి విశ్వామిత్రునిని ధార్మికుఁడైన శతానందునిని ముందిడుకొని వివాహమునకై యాకులతోఁ గ్రొత్తగాఁ గట్టఁబడిన పెండ్లిపందిరినడుమ శాస్త్రవిధి ప్రకారమున వివాహవేదిని గావించి దానిచుట్టును గంధపుష్పములను, మొలకలు (జాజులు) నించిన బంగారుపాలికలను * మొలకలు గల యడుగు లేనిపాత్రలను, మొలకలు నించిన మూఁకుళ్లను, ధూపముతోఁ గూడినధూపపాత్రలను, శంఖరూపము లైనపాత్రలను ఆజ్యహోమములకుఁ గావలసిన స్రుక్స్రువము లనెడిపాత్రములను, అర్ఘ్యముకొఱకు జలముతో నింపఁబడిన పాత్రములను. లాజలు నించినపాత్రలను, పసుపుఁబూసి సంస్కరింపఁబడిన యక్షతలను నుంచి, వాని నలంకరించెను. మహాతేజుఁడును భగవంతుఁడు నగువసిష్ఠుఁడు వేదియం దగ్నిని బ్రతిష్ఠించి సమ మైనకొలత గల దర్భలను సమంత్రకముగా పఱచి విధిమంత్రపూర్వకముగా వధూవరులకు అభ్యుదయముకొఱకు ఆయగ్నియందు హోమము చేసెను. అంత జనకరాజు సర్వాభరణముల నలంకరించుకొని యున్నసీతను తోడ్కొని వచ్చి యగ్నికి ముందట రామునకెదురుగా నిలిపి, కౌసల్య కానందము పెంపు గూర్చుచున్నరామునితో † 'ఈసీత నాకూఁతురు. ఈబిడ నీకు ధర్మపత్ని యగును. దీనిని బ్రతిగ్రహింపుము.

---

* 'ఛిద్రకుమ్భైః' అను పాఠమునకు ఇది యర్థము. 'చిత్రకుమ్భైః' అను పాఠమునందు, నానావర్ణాదులతోఁ గూడినపాత్రములని యర్థము

† దీనికి 'ఇయం సీతా మమసుతా సహధర్మచరీ తవ। ప్రతీచ్ఛచైనాంభద్రంతే పాణిం గృహ్ణీష్వపాణినా' అని మూలము ఇందులకు విశేషార్థము:—సౌందర్యము ఆభిజాత్యము మొదలైన వానిని బట్టి సీత ప్రతిగ్రహించుటకుఁ దగినది అని చెప్పుచు జనకుఁడు దారవోయుచున్నాఁడు—(ఇయం) ఇది-ఈ కనఁబడుచున్నట్టి మితిలేని సౌందర్య సౌకుమార్య లావణ్యాదులు గలిగి యున్న యీబిడ-అని సీత సౌందర్యాదులను బ్రత్యక్షముగా నిర్దేశించుచున్నాఁడు. కేవలము ప్రత్యక్షముగా కనబడు సౌందర్యాదులే కాదు, సీత అను పేరునుబట్టి అనుమానముచే తెలియుందగు అయోనిజత్వమును సూచించుచున్నాఁడు:—(సీతా) సీతయనఁగా నాఁగటిచాలు. అందుఁ బుట్టినదిగావున సీతయనఁబడినది. దీనిచే అయోనిజత్వమును అనుమితమైనది. ఇది మితిలేని సౌందర్యాదులు గలిగినది మాత్రమే కాదు; నాఁగటిచాలున పుట్టుటచేత అయోనిజయు అగును గాన మిక్కిలి మహనీయురాలు అని భావము. (ఇయం సీతా)-ఈసీత-సిద్ధాశ్రమమున విన్నది మొదలుగా శివధనువును విఱచుట మొదలైన వానిచేత ఎప్పుడు చూతుమా యని నీకు మిక్కిలి కుతూహలము గలిగించుచున్నయీసీత. లేక,—* మెఱుపు మెఱసినపుడు ఎప్పుడుగాని మెఱపుయొక్క అవయవమైనకాంతి తెలియునే కాని అవయవి అగు ఆమెఱపు తెలియదు. సీతయొక్కరూపును మెఱపుమెఱసినట్లే కాంతి జ్వలించుటఁజేసి ఆ రూపముయొక్క కాంతిమాత్రముచే కన్నులు మిఱుమిట్లు గొనఁగా అవయవి యైన ఆరూపు తెలియ

నీకు శుభం బగుఁ గాత. నీ హస్తమున ఈబిడ హస్తమును గ్రహింపుము. ఇది పతివ్రతయై మహాభాగ్యవంతురాలునై, నిన్ను నీడవలె ఎప్పుడును అనుసరించి

---

రాదయ్యె. అట్లు తెలియక తొట్రుపడుచున్న రామునికి (ఇయం సీతా) ఇదె యీసీత-అని తేటపడ చూపుచున్నాఁడు. లేక;—రాముఁడు సీతను విన్నది మొదలుకొని ఎప్పుడు నెడతెగక ఆమెనే మనస్సునందు భావించుకొనుచు నుండుటచే ఆభావనాప్రకర్షమునలన 'ప్రాసాదే సా పథిపథిచ సా పృష్ఠతస్సా పురస్సా'-'మేడయందును, ప్రతిమార్గమందును, వెనుకను, ముందటను, అదియే కనఁబడుచున్నది' అన్నట్లు అంతయు సీతామయమై అన్నియెడలను సీతయే కనబడుచుండుటవలన జనకుఁడు తానియ్యఁబోవు సీత ఇచట నున్నదని రామునకు సవిశేషముగా తెలుపుటకై (ఇయం సీతా) 'ఇదిగో సీత' అన్నాఁడు. 'మేము కోరినది సౌందర్యము మాత్రమే కాదు; ఆభిజాత్యమును ఉండవలయు' నని రాముఁడు అడుగునో యని చెప్పుచున్నాఁడు—(మమసుతా) నాకూఁతురు-ఆచారమే ప్రధానముగాఁ గల జనకకులమందుఁ బుట్టినదానికి ఆభిజాత్యము చెప్ప నేల యని భావము. లేక—(మమ సుతా) 'మహతా తపసా రామః' అన్నట్లు నీ వెట్లు దశరథునకు మహాతపస్సుచేతఁ గలిగితివో అట్లే నీకు ఇచ్చుటకై అనేకవ్రతములు ఉపవాసాదులును చేసిన నాకుఁగలిగినకన్య యిది యని అర్థము. 'ఈ సుందరి నాకు భోగార్థమై ఉండనీ, ధర్మములు ఆచరించునపుడు మఱియొకతెను తోడుగా నుంచుకొనెదను' అని రాముఁడు తలఁచునోయని చెప్పుచున్నాఁడు—(సహధర్మచరీతవ) ఇది నీకు భోగముకొఱకే కాక నీతోఁగూడి ధర్మములు లాచరించునదియు-అనఁగా ధర్మపత్నియు-అగుననుట. లేక;—'సమానో ధర్మః సహధర్మః తంచరతీతి సహధర్మచరీ' అనువ్యుత్పత్తినిబట్టి నీవు ఏధర్మమును ఎట్లు చేయుదువో అద్దానిని అట్లే ఇదియు చేయునట్టిది. లోకమునందు ఒకరివలె మఱియొకరు ఉండరు, ఇది అట్లుగాక నీవలెనే ఉండుటంజేసి నీకు ఇదియే తగినది. ఇదితప్ప మఱియేకన్యయు నీకు పత్ని కాఁదగదు అని యర్థము. 'ఇట్లు సౌందర్యము. ఆభిజాత్యము, ధర్మాచరణశీలత్వము మొదలైనవి కలదిగా నున్నను, నీయనుమతి లేక నేను దీనిని పుచ్చుకొనఁజాలను' అనునో యనితలఁచి (ప్రతీచ్ఛచైనాం) దీనిని ప్రతిగ్రహింపుమన్నాడు. రామునికి అవినాభూతయై (ఎప్పుడును ఎడఁబాయనిదై) ఉండునది. కావున ఆమెను రామునికి ప్రదానము సేయుట అనునది ఒప్పదు. కాన జనకుఁడు (ప్రతీచ్ఛ) ప్రతిగ్రహింపుము అనెనేకాని, (దదామి) ఇచ్చుచున్నానని చెప్పఁడయ్యె. 'సీత నాకు ఎప్పుడును తనంతనె సిద్ధించినదై యుండఁగా ఆమెను నాకు క్రొత్తగా ఇచ్చుటకు నీవెవ్వఁడవు' అని రాముఁడు కోపించునో యని తలఁచి (భద్రంతే) నీకు శుభం బగుత, అని ఊఱడించుచున్నాఁడు లేక:—ఎనలేని కన్యాలక్షణములతో నొప్పుచున్న యీబిడను ప్రతిగ్రహించుటచే (భద్రంతే) నీకు సర్వమంగళములు కలుగునని యర్థము. లేక:—అనురూపులైన వధూవరులగు మీయొక్క సంయోగముచే దృష్టిదోషము కలుగునోయని (భద్రంతే) అని మంగళాశాసనము చేయుచున్నాఁడు. నేను అనుజ్ఞ ఇయ్యఁగానే రాక్షసగాంధర్వవివాహములచే పెండ్లాడునో యని వెఱచి, (పాణింగృహ్ణీష్వ) పాణిగ్రహణము సేయుచున్నాఁడు. ప్రణయకలహకాలమందు, పాదగ్రహణము సేయుదువుగాక. ఇప్పుడు పాణిగ్రహణము సేయుమని ఆదంపతులకూడికవలని శోభాతిశయమును చూడఁగోరి యిట్లు చెప్పినాఁడని తెలియునది. లేక, సిద్ధాశ్రమమున విన్నది మొదలుకొని రామునకు సీతయందు దృఢానురాగము పెరుఁగుచుండుటంజేసి భావనావశమున సీతకుఁ ప్రణయకోపము గల్గినట్లు ఎంచి రాముండామెపాదమునే పట్టుకొనునోయని శంకించి, (పాణింగృహ్ణీష్వ) పాణినేపట్టుకొమ్మన్నాఁడనియు గ్రాహ్యము.

యుండును' అని చెప్పి రాముని హస్తమున నపుడు మంత్రపూత మగుజలమును విడిచెను. అప్పుడు మేలుమే లని దేవతలును ఋషులును గొనియాడిరి. అపుడు

---

* అర్థాంతరము:—రాముని అప్రమేయరూపమును, ఎవ్వరికిని గదల్పను రాని శివధనువును విఱిచిన బలసంపత్తిని, మఱియుఁ దక్కిన లక్షణములను బట్టి జనకుండు బ్రహ్మనిష్ఠుఁడు గావున రామునిని విష్ణుదేవునిగాను సీతను శ్రీదేవినిగాను తెలిసికొని యీదేవరహస్యమును వెలిపుచ్చుటకు ఇచ్చగింపనివాఁడగుటవలన స్పష్టముగాఁ గాక పోయినను ధ్వనివృత్తిచే సీతారాముల అనాదిసంబంధమును సూచించుచున్నాఁడు.—(ఇయం) ఈ స-జగత్సృష్ట్యాది కారణభూతుఁడును సాక్షాద్విష్ణుదేవుఁడును అగు నీవు రాముఁడవై అవతరించినట్లె లక్ష్మియును సీతయై యిదె అవతరించియున్నది చూడుమనుట. మీకుదాంపత్యము నిత్యమే అయినను మీరు మనుష్యులరై పుట్టితిరి గావున మనుష్యధర్మమును అనుసరించి సీతను బెండ్లాడుము. (సీతా) నాఁగటిచాలున పుట్టిన అయోనిజ; నీవు దేవకార్యార్థము కౌసల్యకుఁ బుట్టినవాఁడవు. ఇట్లు నీవలె పుట్టుకగాని మఱియొక ప్రయోజనముగాని లేనిదైనను నిన్ను అనుసరించుటకొఱకె నాఁగటిచాలునఁ దోఁచి మనుష్యత్వమును మాత్రము గయికొని నిన్నే వరించుచు నీతోడి నిత్యదాంపత్యమును సూచించుచున్నది. (మమసుతా) నాకూఁతురు మనుష్యత్వమునకుఁ దగినట్లుగా కన్య ఒకరియింటఁబుట్టి ఒక పురుషుని చేపట్టవలసినట్లు తానును నాయింటఁ బుట్టి పెరిఁగినది కావున నేను కూఁతురుగా భావించి నీకు దానము సేయుచున్నాఁడను. (సహధర్మచరీ తవ) నీవు ఆచరించు జగత్సృష్ట్యాది ధర్మములందుఁ దోడ్పాటైయుండి తానును ఆచరించునది. (ప్రతీచ్ఛచైనామ్) నీకు నిత్యపత్నియైనను మనుష్యత్వమును అభినయించుటకై అంగీకరింపుము, (భద్రంతే) నీకు నిత్యసిద్ధయైన దానిని నేను క్రొత్తగా నిచ్చెదనని కోపింపకుము, (పాణింగృహ్ణీష్వ పాణినా) నీ వెప్పుడును వక్షమున నే ధరింతువు, ఇప్పటి మనుష్యత్వమునకుఁ దగినట్లు వివాహవిధిని బట్టి పాణినే పట్టుకొనుము.

* అర్థాంతరము;—జనకుఁడు తనయుత్కర్షము సూపుచుదానము చేయుచున్నాఁడు;—(ఇయం) ఇది వీర్యశుల్క - వీర్యము ఓలిగా ఇచ్చి కొనఁదగినది. శివధనువును విఱిచి దీనిని జయించితిని అని అలతిఁగా తలంపవలదు. (ఇయం) నీకు గౌరవింపఁదగినది. (సీతా) నాఁగటిచాలునఁ బుట్టినది కావున నిన్నునుఁ దక్కిన జంతుజాలములు భరించుచున్న భూదేవియొక్క కూఁతురైనది. ఇంత మాత్రకే నీవు ఈబిడను బహుమానింపవలయును. భార్యయైనప్పుడు విశేషించిబహుమానింపఁ దగునని చెప్పనేల. (సీతా) ఇది అయోనిజ. నీవు కౌసల్యకు పుట్టినవాఁడవు. కావున పుట్టుకయందు నీకును దీనికిని చాలభేదమున్నది. దీనినిబట్టి నీవు ఈబిడయందు మిక్కిలి గౌరవము నుంపవలయును. (మమ సుతా) నాకూఁతురు - రాజ రాజనగు నాచే పెంపఁబడినది. కాఁబట్టి నాయందుండు గౌరవమును నీవు దీనియందు జూపవలయును. (మమసుతా) ఇది బ్రహ్మనిష్ఠుఁడను తపస్విని నగునాకూఁతురు. దీనియందు గౌరవము చూపనియెడల నాకుఁ గోపమువచ్చును. దానిచే నీకు కీడు గలుగును. (సహధర్మచరీతవ) ఇది నీకు కేవలభార్యగాదు; ధర్మపత్ని - దీనిని అగ్రపత్నిగా నుంచుకొనవలయును. (భద్రంతే) మేము చెప్పినట్లు చేసితివేని నీకు శుభం బగును.

అర్థాంతరము:—జనకుఁడు వినయానుసంధానములో దానము చేయుచున్నాఁడు;—(ఇయం) ఈబిడ నీవు శివధనువును అవలీలగా విఱిచిన మహాపరాక్రమనిధివి. ఇది నీపరాక్రమమునకు ఈడు జోడు గానిదైనను కరుణించి కైకొనవలయు (సీతా) నాఁగటిచాలునఁ బుట్టినది; తల్లిలేనిది. తల్లిలేనిబిడ్డను లోకు లెక్కువగా ప్రేమింతురుగదా కావున నీవును దీనియందు మిక్కిలి ప్రేమ చూప

దేవదుందుభులు' మ్రోఁగె. పూవులసోనలు మిక్కిలి కురిసె. ఇట్లు మంత్రజల పూర్వకముగా సీతను దారవోసి జనకుఁడు సంతోషమునఁ దెప్పలఁ దేలుచు

---

వలయును, (మమసుతా) నాకూఁతురు-నేను బ్రహ్మనిష్ఠుఁడను గావున నావలన పెంపుడు సౌఖ్యమును దీనికి అంతగాఁ గలుగదు. నేను బ్రహ్మనిష్ఠయందే యుండుటవలన నీవు దీనిని ఉపేక్షించినను నేను విచారించుట గలుగదు. కాఁబట్టి అట్లు చేయక దీనిని దృఢముగా ప్రేమింపు మని యిప్పుడే చెప్పెదను. (సహధర్మచరీతవ) నీకు ధర్మపత్ని - నీవు ధర్మపత్నిగా గ్రహించినను చాలును. కర్మఠుల మగు మాకు అంతే కావలయును. (ప్రతీచ్ఛచైనామ్) వరులు చాలగౌరవము కలిగినకన్నెను దాని తలిదండ్రులను ప్రార్థించితామై పుచ్చుకొనుటకు త్వరపడుదురు. ఇట్టి కన్నెనో తల్లిదండ్రులు, తామే కొంతప్రార్థించి వరునకు ఇయ్యవలసి యున్నది, కాఁబట్టి నేనే యిచ్చెదను ప్రతిగ్రహింపుము. (భద్రంతే) మాయందు ప్రేమయుంచుటవలన నీకు ఇట్టి శుభంబులు గలుగును.

తనిశ్లోకి;—(ఇయం) రూపసౌందర్యాదు లందు నేనే అధికుఁడ నని ఊరకుండకుము. నీవలెనే రూపసౌందర్యాదులు గలయీసీతను జూడుము. (సీతా) నాఁగటిచాలునఁ బుట్టినది. బంగారుతీఁగ భూమియందే పుట్టును; సీతయు బంగారు తీఁగవంటిదే కాన భూమియందుఁ బుట్టినది. దీనిచే అయోనిజయు అయినది. (మమసుతా) జనకకులమునఁ బుట్టుటచే ఆభిజాత్యమును జెప్ప నక్కఱ లేదు. (సహధర్మ చరితవ) నీ నాచరించు ధర్మములను ప్రవర్తింపఁ జేయును. (ప్రతీచ్ఛ) అత్యాదరముతో ప్రతిగ్రహింపుము. (పాణింగృహ్ణీష్వపాణినా) ప్రణయగా పగాధమునందు పాణిచే పాద గ్రహణము కలుగనీ; ఇపుడు పాణిగ్రహణము చేయుము. లేక, నీవు శివధనువును విఱువఁ దగినంతటి హస్తంబు గలవాఁడవు సీతహస్తము అతిమృదులము. కావున మెలపుతోఁ బట్టుకొను మనుటం (భద్రంతే) ఒండొరుల పాణులను బట్టుకొనియున్న వధూవరు లిరువురకును మంగళాశాసనము.

ఇందే అర్థాంతరము:—(ఇయం) ఇది-నిన్ను ఎడఁబాయకుండునప్పుడు మాత్రమే తాను ఉండు నట్టిది యగును. నిన్నెడఁబాసినచో తాను ఉండియులేనట్టు దానివలెనుండునది. 'ఆర్తార్తే ముదితేహృష్టా ప్రోషితే మలినా కృశా। మృతే మ్రియేత యానారీ సా స్త్రీజ్ఞేయా పతివ్రతా॥' 'భర్త దుఃఖింపఁగా దుఃఖించునదియు, సంతసింపఁగా సంతసించునదియు, దేశాంతరము పోఁగా మలినాంగియై కృశించునదియు, మరణింపఁగా మరణించునదియు, అగుస్త్రీ పతివ్రత' అను నట్లు సాధారణముగా పతివ్రతయైన స్త్రీ భర్తను బాసినప్పుడు తాను ఉనికి లేనిదే యగుచుండఁగా పతివ్రతలం దుత్తమురాలును, అత్యంత విలక్షణయు నగు ఈబిడ నిన్ను ఎడఁబాసినయెడ సత్తానాశము గలది (ఉనికి లేకుండునది) యే అగునని చెప్పవలెనా. (ఇయం) ఇది-నీకాత్మయు శరీరమును ఛాయయు అయినది. కావున ఇది నిర్దోషయే-ఒకవేళ దోషము ఉండెనా, అది నీదే గదా. ఒకరికి తనయాత్మ దోషము గాని తనశరీరదోషము కాని తనఛాయాదోషము గాని తనదే కదా. కావున నీ వట్లో ఇదియును అట్లె దోషములేనిది. (సీతా) నాఁగటి చాలున-అనఁగా భూమిని - బుట్టినది. మాతర మంగళాః-స్త్రీలు గుణంబులను పల్లిం బోలుదురు' అనునట్లు భూదేవికూఁతురు గాన భూమివలెనే క్షమాది గుణములు గలది. (ఏనాం)-అనేక వ్రతనియమములచే నాకుఁ బుట్టినది. (భద్రంతే) నావ్రతనియమాదులచేత పుట్టినందులకు సాఫల్యము నీదియే. భోగ్యవస్తువు యొక్క గుణసమృద్ధి భోక్తయే కదా మిక్కిలి అనుభవించును. (ప్రాణింగృహ్ణీష్వ పాణినా) సీతముగ్ధ తాను చేయి చాఁచి నీచేతిని బట్టుకొన నేరదు. కాన నీవే పట్టుకొనుము.

లక్ష్మణునిఁ జూచి *'లక్ష్మణా! రమ్ము. నీకు మంగళ మగుఁగాక. నేను ఊర్మిళను నీ కియ్య నిశ్చయించితిని. నీవు ఆబిడను పరిగ్రహించి పాణిగ్రహణము సేయుము. జాగు సేయవలదు' అనియె. ఇట్లతఁడు లక్ష్మణునకుఁ జెప్పి భరతుం జూచి 'రఘునందనా! నీహస్తముచేత మాండవిపాణిని గ్రహింపుమా' యనియె. ఆధర్మాత్ముఁడు శత్రుఘ్నుని సైతము చూచి 'మహాబాహూ! నీవు నీహస్తముచేత శ్రుతకీర్తిని బాణిగ్రహణము సేయుము. మీ రందఱును తిన్ననివారు. మీకందఱికిని సచ్చరిత్రమే వ్రతము. ఇట్టిమీకే మాకన్యలు పత్నులు కాఁదగుదురు. కావున, కాకుత్స్థతిలకులారా! మీ రందఱును †పత్నులం గూడి మాకన్నులు చల్లఁజేయుఁడు. కాలవిలంబము వలదు' అనియె. ఆ రాజకుమారులు జనకుని వాక్యమునువిని వసిష్ఠునియనుమతిని గొని వారు నలువురును రాజపుత్రికలు నలువురిహస్తములను తమహస్తములచే స్పృశించిరి. అప్పుడు మహాత్ములగు రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు తమతమ భార్యలతోడ ‡ అగ్నిహోత్రమునకును వేదికిని జనక మహారాజునకును ఋషులకును, బ్రదక్షిణముసేసి శాస్త్రోక్త ప్రకారమునను గల్పసూత్రానుసారముగాను వేఱువేఱ వివాహకర్మమును గావించిరి. కాకుత్స్థకులతిలకులగు రామాదులు తమ లలనామణుల సుందరహస్తములను బట్టుకొనఁగానే మిక్కిలి యొప్పిదమైన గొప్పపుష్పవాన యాకాశమునుండి జోరున గురిసె. దేవదుందుభులు మొరసె. గీతములును వాద్యములును సెలఁగె. అప్సరసలు గుమిగూడి యాడిరి. గంధర్వులు మధురముగాఁ బాడిరి. రామలక్ష్మణులు రఘుకులతిలకులు గాన వారివివాహమునం దట్టివింతలు పుట్టినవి. ఇట్టినృత్త గీత వాద్యధ్వనులచే నలుగడలు ప్రతిధ్వనులు గలుగుచుండఁగా మిక్కిలి తేజస్సున రాజిల్లుచున్న యా రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు మూఁడుమాఱులు తమతమ యగ్నిహోత్రములకుఁ బ్రదక్షిణముసేసి భార్యలను బెండ్లాడిరి. అంత నారఘు

---

* పెద్దవాఁడగు భరతుఁ డుండఁగా పిన్న యగు లక్ష్మణునికి ముందు వివాహము చేయుట దూష్య మని తలఁపరాదు. 'పితృవ్యపుత్రే సాపత్నే పరనారీసుతేషు వా । వివాహదాన యజ్ఞాదౌ పరివేదోన దూషణమ్' అన్నట్లు పెద్దవానికి ముందు పెండ్లి చేయుటలయునను విధి సహోదరులకే కానిసవతి బిడ్డలకు లేదు.

† 'పత్నులంగూడి' అనుటచే దారపోసి యైన దని ఊహించునది. జనకుఁడు జ్యేష్ఠుఁడుగాన మాండవీశ్రుతకీర్తులంబట్టి అనుజ్ఞమాత్రమే చేసెను, వారిని దారపోసినవాఁడు కుశధ్వజుఁడే.

‡ మొట్టమొదట వసిష్ఠుఁడు హోమము చేయుట, రామాదుల యభ్యుదయమును గుఱించి యని తెలియునది. పిదప అగ్నిని ప్రతిష్ఠించి వివాహహోమమును రామాదులు చేసిరి. పాణిగ్రహణమైనపిదప ఆయగ్నికిని బ్రాహ్మణులకును దాత యగుజనకునికిని రామాదులు ప్రదక్షిణములు సేసి పిమ్మట స్వకల్పానుసారముగా ఒక్కొక్కరు వేఱువేఱ అగ్నిని ప్రతిష్ఠించి వివాహహోమము చేసిరి. పిమ్మట లాజహోమము చేయుచు తమతమ యగ్నులకు మూఁడుమాఱులు ప్రదక్షిణము సేసిరి.

నందనులు తమతమ పత్నులతోడ విడిదిపట్టునకుం బోయిరి.|దశరథుఁడును భార్యలతోఁగూడి సొంపారు చున్నకొడుకులను గన్నులారఁ జూచుచు వారివెంట ఋషులను బంధువులను గూడి పోయెను. ఇది డెబ్బది మూఁడవసర్గము.

---

### పరశురామదర్శనము.

అంత నారాత్రి గడవఁగానే విశ్వామిత్రమహాముని జనక మహారాజును దశరథభూనాథునిని వీడుకొని (రామలక్ష్మణ భరత శత్రుఘ్నులను సీతోర్మిళామాండవీశ్రుతకీర్తులనును ఆశీర్వదించి) ఉత్తరమునఁ దాను వసించి యుండు హిమవంతమునకుఁ బోయెను. అమ్ముని పోయినపిమ్మట దశరథుఁడును మిథిలాధినాథుఁ డగుజనకుని వీడుకొని వేగముగాఁ దానపురమునకుఁ బోయెను. అతఁడు పోవుచుండఁగా కొంత దూరము పంపి వచ్చుటకు జనకుఁ డాతని వెంబడించెను. పిదప నావిదేహరాజు కూఁతులకు అరణము మిక్కిలి యిచ్చువాఁడై అనేకలక్షలు గోవులును, పెక్కులక్షలు మేలికంబళములును, శ్రేష్ఠము లైనపట్టువస్త్రములును, మంచి రూపుగలిగి చక్కఁగా నలంకరింపఁబడి యున్న రథగజతురగపదాతులును, మిక్కిలి మేలైన దాసదాసీ జనంబులును, వారికి నొసఁగెను. మఱియు నామహీపతి మిక్కిలి సంతుష్టుఁడై పెక్కులక్షలవెండి బంగారునాణెములను ముత్తెములను బవడములను కన్యాధనముగా నిచ్చె. ఇట్లు అపారధనము నిచ్చి రాజుచేత సెలవు పుచ్చుకొని యామిథిలాధీశుఁడు నిజస్థానమగు మిథిలను బ్రవేశించెను. అయోధ్యాధిపతి యగు దశరథుఁడు చతురంగ బలములును పరిజనములును గొలువ మహాత్ములగు కొడుకులను గూడి ఋషుల నందఱిని బురస్కరించు కొని తనపురమునకుఁ బోయెను. అట్లారాజు ఋషిగణమును గూడి కొడుకులతోఁ బోవుచుండఁగా నతనిద్వెక్క యాకాశమునఁ బక్షులు అశుభమున సూచించుచు ఘోరముగాఁ గూసినవి. భూమియందో మృగములతనికిఁ బ్రదక్షిణముగాఁ బోయి శుభము సూచించినవి. ఆశకునములను జూచి రాజు వసిష్ఠునితో 'క్రూరములగు పక్షులు భయంకరముగాఁ గూయుచున్నవి. మృగములు ప్రదక్షిణముగా నడుచుచున్నవి. అశుభశకునములును శుభశకునములును గానిపించుచున్నవి. ఇది యేమో తెలియక నాహృదయము మిక్కిలి తత్తఱపడుచున్నది. శుభమో అశుభమో యని నిర్ణయింపలేక నా మనస్సునకు మిక్కిలి దుఃఖ మగుచున్నది. తెలియఁజెప్పు' మనఁగా నవ్వాక్యము విని యమ్మహర్షి తీయనిపలుకుల 'రాజా! దీని కేమిఫలము గలుగునో చెప్పెద వినుము. మనకు ఘోరముగాఁ గలుగ నున్నభయమును ఆకాశమందు పక్షులకూఁతలు సూచించుచున్నవి. ఈభూమియందలి మృగములు ఆభయము ఉపశమిల్లు నని సూచించుచున్నవి. కాఁబట్టి యీతాపమును విడువు' మనియె. అచ్చట వారిట్లు

మాటాడుకొనుచుండఁగా వాయువు భూమియెల్ల గడగడ వడఁకునట్లు మంచి మ్రాఁకులను బడఁగూలుచుచు బిట్టుగా వీచెను. సూర్యుని చీఁకట్లుగ్రమ్మె. దిక్కులన్నియుఁ దెలియవయ్యె. దుమ్ము గ్రమ్ముకొనఁగా ఆసైన్యమంతయు సొమ్మసిల్లినట్లుండె. అప్పుడయ్యెడ వసిష్ఠుఁడును, తక్కిన మహర్షులును, దశరథుఁడును, అతని కుమారులును మాత్రమే తెలివిగలిగి యుండిరి. తక్కినవారందఱును ఎఱుకదప్పియుండిరి. ఆచిమ్మచీఁకటి భయంకరముగాఁ గ్రమ్ముకొనఁగా నపుడాసేన బూడిదచే గప్పఁబడినట్లుండెను. అప్పు డది అతిభయంకరుఁడై జడలగుంపు దాల్చి వచ్చు పరశురామునిఁ జూచె. అతఁడు భృగువంశ జాతుఁడు; జమదగ్ని కుమారుఁడు; రాజరాజులనేని మర్దించి మించినవాఁడు. అతఁడు కైలాస పర్వతమువలె నెదిరింపరాని దిట్టయై, కాలాగ్నివలె సహింపరాని ప్రతాపముగలిగి, మిగుల కాంతులచే వెలుంగుచుండును. కావుననే పామరజనులకు నతఁడు దేఱిచూడ రాకుండును. ఆమహాత్ముఁడు మూఁపున గొడ్డలి నిడుకొని, మెఱపుల గుంపువలె తన తేజంపు మెఱుఁగులు నలుగడలఁ బ్రసరింపఁగా, విల్లును మేటిబాణమును బట్టుకొని, త్రిపురంబులను గూల్చిన శివుఁడో యనఁజూపట్టెను. జపహోమంబులను ఎడతెగక చేయుచుండు మహాత్ములగువసిష్ఠాది బ్రాహ్మణు లందఱును, అతిభయంకరుఁడై యగ్నివలె జ్వలించుచున్న యాతనిని జూచి, అందఱు నొకటిగాఁ గూడి యొకరితో నొకరు 'ఈపరశురాముఁడు తనతండ్రిని జంపినారని క్షత్రియులందు ముందు గోపించియుండును. మరల నిప్పుడు క్షత్రజాతిని చంపఁడే కదా. ఏలన మును పే క్షత్రియులను జంపి కోపమును తాపమును దీఱియున్నవాఁడు. కావున మఱల వారిని జంపఁ గోరఁడేకదా' యని గుసగుస లాడుకొనిరి. వారిట్లు మాటలాడుకొని యర్ఘ్యమునుగొని భయంకరుఁడై కానఁబడుచున్న యా పరశురాముని 'రామా ! రామా !, అని యింపార తీయని పలుకులఁ బిలిచి పూజింపఁగా నాఁడిమగఁ డగునాజమదగ్ని రాముఁ డాఋషులు చేసినపూజలను గయికొని దశరథరామునిఁ జూచి యిట్లనియె. ఇది డెబ్బదినాలుగవ సర్గము.

---

## పరశురాముఁడు రాముని ధిక్కరించుట.

'దశరథరామా! రామా! ఆశ్చర్యకరమై నీవీర్యము లోకములన్నిటను వినఁబడుచున్నది. శివునివిల్లు విఱుచుట, తాటకను జంపుట మొదలైన నీకృత్యములను అన్నింటిని వింటిని. శివునివిల్లెక్కడ! నీవెక్కడ! అట్టిధనువును నీవువిఱుచుట మిక్కిలి యాశ్చర్యము. మఱియు దానిని ఇట్టి దట్టిదని తలంపనుగూడ శక్యముగాకున్నది. దానిని విని, నేను మేలైనమఱియొక ధనువును గొనివచ్చినాఁడను. అతి భయంకరమైన యా మహాధను విదియే. ఇది మాతండ్రి యగుజమదగ్ని నాకిచ్చెను. దీనియందు బాణమును దొడిగి ఏదీ! నీబలమును జూపుము. ఈవింటిని

మోపెట్టితివేని నీబల మిట్టిదని నేను దెలిసికొందును. అప్పుడు నీవీర్యము మెచ్చుకొనఁదగినదియగును. అట్టి వీర్యముగల నీకు ద్వంద్వయుద్ధము నిచ్చుచున్నా'ననెను. అతనిమాటలు విని యపుడు దశరథుఁడు దుఃఖంబున మొగము వెలవెలఁబాఱ దీనుఁడై చేతులు మోడ్చి యతనితో "నీవుక్షత్రియులయందు ముందు గలిగి యుండినరోషమును విడిచి మిక్కిలిశాంతుఁడవైతివి; మఱియును బ్రాహ్మణుఁడవు; బ్రాహ్మణులకు శాంతియే కదా స్వరూపము. అందును మహాకీర్తిమంతుఁడవు. కావున సహజమగు శాంతిని విడిచి ఆకీర్తిని జెఱుపుకొనరాదు. నీవన్నిటను ఆరి తేఱిన పెద్దవు. నాకొడుకులు బాలురు. కావున వీరలయెడ రోషముడిగి అభయము నొసఁగఁ దగును. ఎప్పుడును వేదాధ్యయనము మొదలగు వ్రతములాచరించుచుండు భార్గవులవంశమునఁ బుట్టితివి. ఇంద్రునియొద్దఁ బ్రతిజ్ఞసేసికొని శస్త్రమును విడిచితివి. ఇట్టివాఁడవు గావుననే నీవుధర్మపరుండవై కాశ్యపునికిభూమియంతయు దానముసేసి వనమునకుఁబోయి మహేంద్రపర్వతమునందు వాసము చేయుచున్నాఁడవు. మరలను వచ్చితివిగా! ఎందులకు? మమ్మందఱిని నాశముసేయుటకే మరలవచ్చితివి. 'మిమ్ముగాదు. రాముని ఒక్కనినే నాశముసేసెద' ననకుము. రాముని ఒక్కనిని జంపితివేని మేమందఱమును బ్రదుకము సుమీ" అనియె. దశరథుఁ డిట్లు చెప్పుచుండఁగా జామదగ్న్యుఁడు తన ప్రతాపము పెంపున ఆతనిమాటలను పాటింపక వీటఁబుచ్చి రామునిదిక్కు మొగమై "దేవనిర్మితములై లోకమందెల్లఁ బ్రసిద్ధిఁ గాంచిన మేటిధనువులు రెండు. అవి మిక్కిలి దృఢములై మంచిసారము గలిగి విండ్లలోపల ముఖ్యములై యొప్పును. వానిని విశ్వకర్మ మిక్కిలి ప్రయత్నపడి చక్కఁగా నిర్మించెను. ఆరెండువిండ్లలో ఒకదానిని త్రిపురాసురులతో యుద్ధము సేయఁగోరిన శివునికి దేవత లొసఁగిరి. అది యప్పుడు త్రిపురాసురులను జంపినది. దానినే నీవు విఱిచితివి. (నాచేతనున్న యీధనువు రెండవది దీనిని దేవతలు విష్ణువున కొసఁగిరి). రామా! మిక్కిలియుఁ బ్రకాశించుచున్న యీధనువు విష్ణుదేవునిది. ఇదియును శివునివింటికి నున్నంతటిసారము గలది. 'శివునివింటిదే యిది యైనయెడల దానివలెనే యిదియును నాకు ఒకసరకా' యనవలదు. ఆశివునివిల్లువికలమై యుండఁగా నీవు విఱిచితివి. లేకున్న దానిని విఱువఁజాలవు. దాని వైకల్యమునకు గారణము వినుము. శివుఁడు త్రిపురములను దహించినపిదప దేవతలు * శివునియు విష్ణునియు బలాబలములు తెలియఁగోరి అందఱును బ్రహ్మనుజూచి 'శివకేశవులలో

* దేవతలు బ్రహ్మను జూచి 'మున్ను వరాహాది రూపములచేత భూమినుద్ధరించుట మొదలగు కార్యములు విష్ణుఁడు చేయుటనుబట్టి అతఁడే అధికుఁడని నీవు పొగడఁగా మేము వింటిమి. ఇప్పుడు శివుఁడు విష్ణుని కోలను ఒకసాధనముగాఁ జేసికొని తా నేముఖ్యుఁడై త్రిపురములను దహించుటను జూడఁగా శివుఁడే అధికుఁడని మాకు తోఁచుచున్నది. కాఁబట్టి ఈయిద్దఱిలో అధికుఁడెవఁడు అని యడిగిరని తెలియునది.

బలవంతుఁ డెవఁ'డని యడిగిరి. బ్రహ్మయో సత్యవంతులలోనెల్ల శ్రేష్ఠుఁడు. శివకేశవులయెక్కువతక్కువలనుగుఱించి యాదేవుఁడు చెప్పిన యుపదేశములు సత్యములుగా దేవతలు నమ్మినను కన్నులారఁ జూడకగాని వారి మనస్సునకు సమాధానము కలుగదయ్యె. కానయాదేవుఁడు వారియభిప్రాయమును దెలిసికొని శివకేశవులకు *విరోధముఁ గలిగించెను పగ కలుగఁగానే శివుఁడును విష్ణువును ఒకరినొకరు గెలువఁ గోరి లోకుల కెల్ల దిగులుచేఁ గగురుపొడుచున ట్లతిభయంకరముగా యుద్ధము సేసిరి. అప్పుడు విష్ణుదేవుఁడుహుంకారముసేయఁగా భయంకర మైనశక్తి గలదయ్యును శివునివిల్లు జడనుపడి తూలినదయ్యె. మహాదేవుఁ డగుత్రిలోచనుఁడును స్తంభితుఁ డయ్యె. అప్పుడు దేవతలును ఋషిసంఘములను చారణులను గూడికొని వచ్చి † యుద్ధము వలదని ప్రార్థింపఁగా వారిద్దఱును శాంతిఁ బొందిరి. అప్పుడు దేవతలును ఋషులును విష్ణుదేవునిపరాక్రమమువలన శివునిధనువు జడనుపడి తూలుటఁ జూచి విష్ణుండే యధికుఁ డని తలఁచిరి. శివుఁడు మహాయశుఁడు. అట్టిదేవుఁ డిట్టితక్కువపాటు గలుగఁగా కోపము నొంది యాధనువును బాణముతోఁ గూడ విదేహ దేశము నేలు ‡ దేవరాతుఁడను రాజర్షి చేతికి నిచ్చెను. శత్రు

---

* బ్రహ్మ విష్ణునితో 'త్రిపురజయమందు శివుఁడు విలుకాఁడు తానేయగుటవలన తానే ఆజయమునకు ముఖ్యుఁడనియు నీవు సాధనమమాత్రమగుటచేత అముఖ్యుఁడనియు నాకుచెప్పె'నని చెప్పి ఆదేవునికి శివునియందు విరోధమును, శివునితో 'విష్ణువు నీబాణముకొనయందు తానుండుటచే తానే త్రిపురములను గాల్చెననియు నీవు గాదనియు నాతోఁజెప్పె' నని చెప్పి ఆశివునకు విష్ణువునందు విరోధమును బుట్టించె నని గ్రాహ్యము.

† 'దక్షయజ్ఞవధే పూర్వం ధనురాయమ్య వీర్యవాన్' 'ముందు దక్షయజ్ఞధ్వంసమున వీర్యవంతుఁ డగుశివుఁడు ధనుస్సును సారించి అనుటచేతను, దక్షయజ్ఞముకడపట శివుఁ డాధనువును దేవతల కిచ్చె ననుటచేతను, శివకేశవులకు విరోధము దక్షయజ్ఞసమయముననే కలిగెనని తెలియునది. ఆయజ్ఞముకడపటనే ఆధనువు జడనుపడిన దనియు ఊహ్యము.

‡ దక్షయజ్ఞాంతమందు శివుఁడు ధనుస్సును దేవతలకిచ్చెనని పూర్వముచెప్పబడినది, శివుఁడుధనువును దేవరాతునిచేతఁ బెట్టినాఁడని యిపుడు చెప్పఁబడినది. విశ్వామిత్రాశ్రమమండలిమునులు' దేవతలు జనకునికి యజ్ఞమం దిచ్చి'రని చెప్పిరి. సీత అనసూయతో 'వరుణుఁడు ఆధనుస్సును జనకునికి ఇచ్చె' నని చెప్పెను. ఇవన్నియు పరస్పరవిరుద్ధములుగా నున్నవి. వీనికి సంగతి యెట్లనఁగా; దక్షయజ్ఞాంతమందు శివుఁడు కోపముతో ఆవింటిని దేవతలకు ఇచ్చివేయఁ బూనఁగా ఆకోపమును జూచి దేవతలు దగ్గఱకుఁ బోయి ఆవింటిని దీసికొనుటకు భయపడి దానిని తమకుఁగా దేవరాతుని కిమ్మని ప్రార్థింపఁగా శివుఁడు దానిని దేవరాతునిచేతఁ బెట్టెను. కావుననే శివుఁడు దానిని దేవతల కిచ్చెననుటయు దేవరాతుని కిచ్చెననుటయు రెండును పొసఁగియున్నవి. శివుఁడు దేవరాతునిచేతఁబెట్టె ననుటచేత అతనికి దేవతలు వింటిని సొంతముగాఁ గాక యిల్లడగా నిప్పించిరని తెలియునది. పిదపజనకుఁడు యజ్ఞముచేత దేవతలను తృప్తిఁబొందించి యిల్లడగా నున్న యావిల్లును సొంతముగాఁ దనకిచ్చునట్లు

వులపురంబులను జెండాడునదై నాచేతనున్న యీవిష్ణుధనుస్సును ఆదేవుఁడు భార్గవుఁడైన ఋచీకునకు 'నీయొద్ద నుంచుకొనియుండు' మని యిల్లడగా నిచ్చెను. మహాతేజస్కుఁడైన యాఋచీకుఁడు కార్యములం దెదురు లేనివాఁడగు తనకుమారునికి జమదగ్నికి ఆ దివ్యధనువు నిచ్చెను. మహాత్ముఁడైనయాజమదగ్నియె మా తండ్రి; ఆవింటి నిల్లడగాఁ గలిగియుండియు నాతండ్రి ఆయుధమును విడిచి తపము సలుపుచుండెను. కావున నతఁడు తపోబలకలితుఁడై యుండినను గార్తవీర్యార్జునుఁ డాతనియెడఁ దామసబుద్ధి గలిగి చంపెను. ఇట్టిది మఱియెచ్చటను గలుగునా ? ఇది యెంతక్రూరము! దీనిని వినఁగా నేను గడుఁ గోపావేశము నొంది క్షత్రియజాతిని జంపఁ దొడఁగి యది పుట్టఁగా పుట్టఁగా మఱిమఱి పెక్కుమాఱులు నిర్మూలముగాఁ ద్రుంచుచు నది యేలుభూవలయమునంతయు గైవసము చేసికొని యాగముచేసి యాగముకడపటఁ బుణ్యకర్ముఁడును మహాత్ముఁడు నగు కాశ్యపునికి దానిని దక్షిణగా నొసఁగి మహేంద్రపర్వతమున వాసముచేయుచుఁ దపము సలుపుచుఁ దపోబలమును గలవాఁడ నయితిని (దేవతాసేవిత మగు నాపర్వతమున మిక్కిలి సుఖముగాఁ దపము సేయుచు నున్నవాఁడను. అయిన నిపు డిచటికి రాకకుఁ గారణ మేమనఁగా మహాబలుండ వగు నీవు నీపటువీర్యమున) విల్లు విఱుచుట విన్నాఁడను, కావున నే వేగముగా వచ్చితిని. రామా! తండ్రి తాతలవరుసనుండి క్రమముగా నాకు వచ్చిన యీవిష్ణుని పెనువిల్లిది. నీవు క్షత్రియుఁడవు. బ్రాహ్మణుని వలె నాచేతఁ గాదని చెప్పక క్షత్రధర్మమును ముందిడుకొని, శివుధనువువలె శిథిలముగాక సారము గలిగి యున్న యీమేటిధనువును బట్టుము. పరపురంబుల గెలుచు నీబలు వింటియందు, నీవు దంట వయితేని, బాణంబు దొడుగుమా చూతము. అంత మెచ్చి నీతో ద్వంద్వయుద్ధమును జేసెద' ననియె. ఇది డెబ్బదియైదవసర్గము.

---

## పరశురామగర్వభంగము.

దశరథరాముఁ డపుడు పరశురాముఁడు చెప్పినవాక్యము వినియుఁ దండ్రి దగ్గఱ నుండుటవలన నితనియందలిగౌరవమును బట్టి బిగ్గఱగాఁ బలుకక కొంత మెలుఁగు కొలఁదిపఱిచి పరశురామునితో 'భార్గవరామా! తండ్రిఋణము దీర్చు కొనఁ బూని నీవు గావించిసకృత్యము లెల్ల వింటిని. శూరునకు వైరము దీర్చుకొన వలసినదియె కదా! కావున నందులకు నీవు చేసినది ఒప్పుకొనెదను గాని నీవు నన్ను

---

ప్రార్థింపఁగా వారు దానిని ఆతనికి సొంతముగా నిచ్చివైచిరి. కావున దేవతలు దానిని జనకునకి ఇచ్చి రనుట యొప్పుచున్నది. మఱి యాదేవతలు ఆవింటిని వరుణునిచేతులార జనకునికి ఇచ్చుటచే సీత అనసూయతో వరుణుఁడు దానిని జనకుని కిచ్చెనని చెప్పినమాటయు ఉపపన్న మగుచున్నది. కాబట్టి సగంబును సమంజసమే యని తెలియునది.

వీర్యహీనునిగాను కావుననే క్షత్రధర్మముచొప్పున నీవింటిని బట్టుట కశక్తునిగాను దలఁచి యవమానించుచున్నాఁడవు. ఇదియొప్పదుజుమా. పరులు క్రిందుపఱచుచుట యోరువనినా తేజస్సును, పగవారిని గ్రిందుపఱుచునా పరాక్రమమును, ఇదె చూడు' మని చెప్పి కోపంబు దీపింప నాభార్గవునిచేతినుండి ధనువును బాణమును (విష్ణుని యవతారమగుటఁజేసి యతనియం * దుండు వైష్ణవకళను) పరాక్రమము మెఱసి చులుకఁగాఁ దీసికొనెను; ఆవింటియందు బాణముదొడిగి యెక్కుపెట్టి జమదగ్ని రాముని జూచి యేచినకినుకతో 'పరశురామా! నీవు బ్రాహ్మణుఁడవగుట చేతను † విశ్వామిత్రునియెడ నాకుఁ గలస్నేహముచేతను పూజ్యుఁడ వైతివి. కావున నేను నీప్రాణములను బుచ్చుకొనుట కీ బాణమును వైవఁజాలకున్నాఁడను. ఓయీ! నీయీపాదములగమనశక్తినైనను, నీవు తపోబలముచే నార్జించిన యెన లేని ‡ లోకముల నైనను. ఈ రెంటిలో నీవు దేనిని గోరుదువో దానిని గొట్టెదను. ఈ బాణము దివ్యమైనది. మఱియు విష్ణుదేవతాకమైనది. కావున శత్రువులపురముల జయించునది. ఇది ఇట్టిది గావున నీబలమును దూలింపక గుఱి తప్పి నేల వ్యర్థముగాఁ బడదుగదా' యనియె. అయ్యెడ ఋషులును దేవతలును గంధర్వులును అప్సరసలును సిద్ధచారణకిన్నరులును యక్షరాక్షసులును ఉరగులును గుంపులుగొని బ్రహ్మదేవునిఁ బురస్కరించుకొన్నవారై విష్ణునిమేటియాయుధమైన యాధనువును గేలం బట్టి గ్రాలుచున్న రామునిని, మహాశ్చర్యమైన యతనికృత్యమును జూచుటకు వచ్చిరి. రాముఁ డామేటి వింటిని దాల్పఁగానే లోకమంతయు మ్రానుపడి మిన్నక నిలిచె. జామదగ్న్యుఁడు (దన యందలి విష్ణుతేజంబు దూలఁగా) వీర్యము మాలి రామునిఁ జూచె. ఇట్లు రాముని తేజంబునఁ దనవీర్యంబు దూలఁగా జామదగ్న్యుడు జడనుపడినవాఁడై జలజదళాక్షుం డగురామునిఁ జూచి యల్లనల్లన నిట్లనియె. "కాకుత్స్థతిలకా! తొల్లి యీ భూమినంతయు నేను గాశ్యపున కిచ్చినపుడు, అతఁడు 'నాదేశ మైన యీ భూమియందు నీవు వసింపరా' దనియె. కాశ్యపునికి భూమి నంతయు సొమ్ముగావించితిని. అతని నేలయందు వసింపననియుఁ బ్రతినవట్టితిని. కాఁబట్టి నేను గురుఁ డగుకాశ్యపుఁడు చెప్పినట్లు సేయువాఁడనై రాత్రుల నీభూమియందు వసిం

---

* 'ఇత్యుక్త్వా దేవి వైష్ణవ్యాశక్త్యా తద్గతయాసహ । జగ్రాహ వైష్ణవం చాపం వినయేనచ లీలయా' అని పాద్మపురాణమునఁ జెప్పఁబడినది.

† విశ్వామిత్రుని యప్పచెల్లెలు ఋచీకునిభార్య. ఋచీకుఁ డామెయందు జమదగ్నిని గనెను. జమదగ్ని పరశురామునిఁ గాంచెను. ఇట్లు పరశురాముఁడు విశ్వామిత్రునితో బంధుత్వము గలిగియుండుటంబట్టి ఆతనిని రాముఁడు చంపనొల్లఁడయ్యె నని తెలియునది.

‡ లోకములను అనఁగా లోకములప్రాప్తిని అనుట. లేక దానికి మూలమైన పుణ్యకర్మములను అనియు । గాహ్యము.

చుటలేదు. కాఁబట్టి వీరాగ్రణీ! నాయీగమనశక్తిని నీవు గొట్టరాదు. ఏలన నేనిందు నిలువక మనోవేగమున మహేంద్ర పర్వతమునకుఁ బోఁగలవాఁడను. నేను తపము సేసి యప్రతిమములైన లోకంబులను సంపాదించితిని. నీమేటిబాణమున * వానిని గొట్టుము. కాలవిలంబము వలదు. నేను వేగపోవలయు. ఈధనువును పట్టుటంజేసి నీవు నిర్వికారుఁడై శత్రునిరసనశీలుఁడగు పురుషోత్తముఁడవును దేవదేవుఁడవును అగుదు వని యెఱుంగుదు. పరంతపా ! నీకు భద్రం బగుఁగాత. ఇదిగో దేవతలందఱును గుములుగొని వచ్చి యుద్ధమం దెదురు లేనినిన్నును, ఎనలేనినీవీరకృత్యమును జూచుచున్నారు. కాకుత్స్థా ! నాకే సిగ్గు పుట్టినది. ఇదినాకుఁ దగదు. నీవు ముల్లోకములను వల్లభుఁడవు. ఇట్టి స్వామి వగునీవు నన్నోడించి నందులకు నాకు సిగ్గుగలుగదు. రామా! శత్రువుల నడంచుట నీసువ్రతము. కావున సాటి లేనినీమేటితూపును వదలుమా. తూపును విడువఁగాఁ జూచి మహేంద్రగిరికిఁ బోయెద'' ననియె. ప్రతాపవంతుఁ డయ్యుఁ బోఁడిమిసెడి పరశురాముఁ డట్లు పలుకఁగా శ్రీమంతుఁ డగు శ్రీరాముఁ డుత్తమమగు బాణమును బ్రయోగించె. పరశురాముఁడును తాను తపముచే నార్జించిన లోకములు రామునిచేఁ గొట్టువడి పీఱువీకు లగుటఁ జూచి వేగముగ మహేంద్ర పర్వతమునకుఁ బోయెను. అప్పుడు దిక్కులన్నియును విదిక్కులును తెలివుందెను. సురలును ఋషిసమూహములును ఆబలువింటిని బూని యున్న చిన్నారిరాముని నెంతయుఁ బ్రశంసించిరి. జామదగ్న్యుఁడును దశరథరామునిం గొనియాడి యుంచెఁ బ్రదక్షిణంబు సేసి వేగముగ నిజస్థానమునకుం జనియె. ఇది డెబ్బదియాఱవ సర్గము.

---

దశరథుఁడు పుత్త్రులతో నయోధ్య సేరుట. సీతా రాముల పరస్పర ప్రేమము.

పరశురాముఁడు పోవఁగానే దశరథరాముఁడు కోపము విడిచి మనమున శాంతి వహించి యప్రమేయుఁడైన (అదృశ్యుఁడైన) వరుణునిహస్తమున నాధనువును దానిబాణముతోఁ గూడ నొసఁగెను. అంత రాముఁడు వసిష్ఠుఁడు మొదలగు ఋషులకు నమస్కరించి పరశురాముని వలనిభయమున † తబ్బిబ్బు వడి యున్న తండ్రిని జూచి 'జామదగ్న్యుఁడు పోయెను. కావున చతురంగిమాలతోఁ గూడిన

* లోకంబులను గొట్టుట యనఁగా, లోకములప్రాప్తికి హేతువైనకర్మములను విఫలములుగాఁ జేయుట. ఒకకార్యమును మూర్తమైననుగాని అమూర్తమైననుగాని అడ్డగించుటయే రామబాణముయొక్క అపేక్షితము.

† దశరథుఁడు తబ్బిబ్బుతో నుండుటచే పరశురాముఁడు రామునిపరదైవముగాఁ జేసినస్తుతిని గాని విష్ణుధనువును వరుణున కిచ్చుటను గాని ఎఱుఁగఁడయ్యెనని ఊహించునది. తక్కిన వానిని మాయా తిరోధానముచేత అవి తెలియవనియు గ్రాహ్యము.

మనసేన యేలిక వైన నీపాలనము క్రింద, అయోధ్యను గూర్చి పోవుఁగాక. ఈసేన నీయాజ్ఞను ఊసియుండునది. కాన దానికిఁ బయన మగుట కాజ్ఞయిమ్ము. చాతకంబుల బారు మబ్బులలోనినీరు గోరునట్లు యీసేన నీయాజ్ఞ గోరుచున్న' దనియె. దశరథుఁడు రాముని వాక్యము విని యక్కుమారునిఁ జేతుల బిగియారఁ గౌఁగిలించి యూదల మూర్కొనియె. మొదట పరశురాముఁడు పోయె నని రాముఁడు చెప్పినను అప్పటి భయమున నాపలుకు స్పష్టముగా నతఁడు తెలిసికొన కుండె. కొంత తెప్పిఱిలఁగానే, మరల రాముఁడు చెప్పఁగా పరశురాముఁడు పోయె నని విని మేను నిబ్బరముగా గగురుపొడువ మిగుల నుబ్బి యప్పుడే తన్నును దన కొడుకులను మరలజన్మించినట్లు తలఁచెను. అంతనతఁడు నిజసైన్యము నయోధ్యా పురికిఁబయనంబగునట్లు లాజ్ఞాపించెను. అప్పుడప్పురమును, వస్త్రములు గలటెక్కెయములతోను చిఱుటెక్కెయములతోను పెనుధ్వజములతోను గూడి బెడఁగై మంగళతూర్య ఘోషములు బోరుకొన పెంపారుచుండె. జనులు రాజమార్గముల కలయాంపులు చిలికిఁ పువ్వులు పెల్లుగా చల్లియుండిరి. రాజు రాకవలని యుల్లాసమున మొగములు విఃసిల్ల మంగళ వాద్యములు సేయువారు నలుగడల నిండియుండిరి. ఇట్లతిరమణీయమైన బహుజన సమూహములచే నలంకృతమై యున్న పట్టణమును రాజుప్రవేశించె. పురవాసులగు బ్రాహ్మణులును దక్కిన పురజనులును జాల దూరము రాజు నెదుర్కొనిచనిరి. మహాయశస్కుఁడగునా శ్రీమంతుఁడు ఆపుర జనులును శ్రీమంతులగు తనపుత్త్రులును బలసి కొలువ హిమవంతమువలె తెలి గచ్చు మెఱుఁగున తలతలలాడుచుఁ గడుంబొడవై బెడఁగారునిజ గృహములను ప్రవేశించెను. ఆరాజ గృహమందలి జనులు మిక్కిలి సంతసించిరి. రాజు తన నగరం గలభోగపరికరము లగుసమస్త పదార్థములచేతను మిక్కిలి పూజింపఁబడి రాజిలుచుండెను. కౌసల్యయు, సుమిత్త్రయు, నెన్నడుము చెన్ను గలకైకేయియు మఱియుఁదక్కిన రాజస్త్రీలును గోడండ్రకు నుపచారములు సేసి యంతఃపుర మునకుఁ గొనిపోఁబూని, మహాభాగ్యవతి యగుసీతను యశస్విని యైన యూర్మిళను గుశధ్వజునికూఁతుల నిద్దఱిని లోనికిఁ దోడ్కొని పోయిరి. ఆవధువు లందఱును మంగళాశీర్వచనములంది మంగళాలంకార కలితలై పట్టుపుట్టములను గట్టి గృహదేవతాలయంబులకు వేగ *పూజలు గావించిరి. అవుడు వారు మ్రొక్క వలసివారల కెల్ల మ్రొక్కి (కుబేరుని గృహములవలె సుందరములైన) తమతమ మందిరములను జేరి గోవులను ధన ధాన్యములను నిచ్చిబ్రాహ్మణులకుఁ దృప్తి గావించి యందఱు ముదంబు వ్రసల నేకాంతమునఁ దమతమ కాంతలతోడం గూడి క్రీడించుచుండిరి. మహాత్ములైన యారాజకుమారులును భూమియందు సాటి లేనిపరాక్రమంబున మించి తమకనురూపలైన మించుఁబోండ్లం బెండ్లాడి,

---

* స్త్రీలకు దేవతాలయతనములను మాత్రమే పూజించుటకు అధికారమని తెలియునది.

యస్త్రమలం దారి తేఱి, యపార ధనవంతులై, బహుసుహృజ్జనులు గలిగి, పురుష సింహులనఁ బొలుపారుచుండియుఁ గన్నతండ్రికి నడఁకువతో శుశ్రూష సేయుచు నుండిరి. (మఱియు వారయ్యా కాలములకుఁ దగిననీతి యెఱింగి తమనుగుణములచేఁ దండ్రికి సంతసము గూర్చుచుండిరి.) అంతఁ గొంత కాలమునకు దశరథుండు తాను గై కేయియందుఁ గన్నకొడుకును భరతునిఁ జూచి 'నాయనా! కేకయరాజు కుమారుఁడును నీకు మేనమామయు నైన యీయుధాజిత్తు నిన్నుఁ దోడ్కొని పోవుటకు నిట వచ్చియున్నాఁడు. (అతఁడు మిథిలయందు ఋషులనడుమ నన్నుఁ జూచి నిన్నుఁ బంపునట్లు ప్రార్థించెను. నీవు ధర్మజ్ఞుఁడవు; కాన యాతనికిఁ బ్రీతిసేయవలయు)' ననియె. దశరథునిమాట విని కైకయీసుతుఁ డగు భరతుఁడును (దండ్రికి నమస్కరించి రామలక్ష్మణులను గౌఁగిలించుకొని) యపుడు శత్రుఘ్నునితోడఁ బోవుటకు బయలుదేఱెను. పోవునపు డాపురుష లలాముఁడు తండ్రిని, దుఃఖరహితముగా నే కార్యమును జేయునట్టి రామునిని, తల్లులను, వీడుకొని శత్రుఘ్నునిఁగూడి యరిగె. భరతుఁడు పోవఁగానే యపుడు మహాబలుఁ డగు రాముఁడును లక్ష్మణుఁడును దేవతాసదృశుఁ డగు తమతండ్రిని బూజించిరి. రాముఁడును ధర్మాత్ముఁడు గావునఁ దండ్రియాజ్ఞను మున్నిడుకొని పట్టణవాసులగు జనులకుఁ బ్రియములును హితములు నైన సకల కార్యములను జేయుచుండెను. పురజనుల కేకాదు. రాముఁడు శ్రుతి స్మృతి నియమములకు బద్ధుఁడై నడుచుకొనువాఁడు గావునఁ దల్లులకుఁ జేయవలసిన కార్యములను దల్లులకును, గురువులకు జేయవసిన కార్యములను గురువులకును, ఆయా కాలములను గనికొని కావించుచుండెను. రామునికిం గలయిట్టి సుస్వభావమునకును మంచి నడవడికిని అపుడు దశరథుఁడు ప్రీతుండయ్యె. అతఁ డొక్కఁడు ప్రీతుఁ డగుట వింతకాదు; బ్రాహ్మణులును వణిజులును అతని దేశంబునందుఁ గలతక్కిన జనులును బ్రీతులయిరి. మహాయశస్కుఁడును సత్యపరాక్రముఁడు నగు రాముఁడు శీలవృత్తముల చేతనే కాక తక్కిన గుణముల చేతను, భూతములకు బ్రహ్మదేవుఁడుంబోలె, వారి కందఱికిని బ్రియతముఁడును వారలం దెల్లగుణాధికుఁడు నై రాణించుచుండె. * రాముఁ

* ఇందులకు మూలము 'రామస్తు సీతయా సార్థం విజహార బహూన్ నృతూన్ । మనస్వీ తద్గత స్తస్యా నిత్యంహృది సమర్పితః' ఇందులకు విశేషార్థము:—(రామస్తు) తుశబ్దము భేదమును దెలుపుచున్నది. ముందు కేవలము పితృశుశ్రూషాదులు సేయుచుండిన రాముఁడు, ఇపుడు కామ పరతంత్రుఁడైకూడ బ్రవర్తించునంత భేదమునొంది నాఁడనుట (మనస్వీ) మిక్కిలి మనస్సుగల వాఁడు-భోగరసాస్వాదనమందు హెచ్చిన మనస్సుగల వాఁడనుట. (తద్గతః) తస్యాంగతః అని విగ్రహము-సీతయందే తగిలియున్న మనస్సుగల వాఁడనుట, (తస్యాః హృదినిత్యం సమర్పితః) సీతయు రాముఁడు చేయు నాయా వ్యాపారములచే వశీకృతయై అతనిని మనస్సున నెప్పుడును తలఁచుచు తనమనస్సును ఆతనికి లోనుగావించి యుండు ననుట, (నిత్యం) చిరకాలముగా కూడి

డును అనుకూలం బగుమనము గలిగి సీతయందు మనసు నిలిపి, యాబిడ మనస్సునందు దానును నెలకొని పెక్కు ఋతువు లామెతోడం గూడ విహరించుచుండెను. రామునికి సీత యతనితండ్రి గూర్చిన యిల్లాలగుటంజేసి ప్రియురాలైనది. ఇంతే కాదు. పతిశుశ్రూష సేయు గుణమును బట్టియు, సౌందర్య గుణమును బట్టియు, ఆభిజాత్యమును బట్టియు, రామునికి సీతయందుఁ బ్రీతి పయింబయి పెచ్చు పెరిఁగిన దయ్యె. రాముని ప్రీతి యట్లుండ, సీతహృదయము నందు * భర్త యందలి ప్రీతి యినుమడిగాఁ బొదలుచుండెను. సీత మనస్సునందలి యనురాగభావము గూఢముగా నుండినను, రాముఁడు తగినచిన్నెలచేతఁ దర్కించి దానిని తెలిసికొనుచుండును. ఎప్పుడును తా నాబిడహృదయ మందే మెలంగువాఁడు గాన యామె యనురాగము ఎంత గూఢమైనను తెలియకుండునా? సీతయుఁ దన యంతరంగమును రాముఁడెఱుంగుట కంటె మిక్కిలి యెక్కుడుగా నతనిహృదమును దాను తెలిసికొనుచుండును. ఎట్లన, సీతయో మైథిలి ; మఱియు జనకుని కూఁతురు; కావున సూక్ష్మజ్ఞ యగును. మీఁదు మిక్కిలి రూపమున దేవతలతోడ సాటియైనది; కాన ప్రగల్భురాలు. అందఱికిని గనఁబడుచున్న రూపు నొందిన శ్రీదేవి వలె వెలుఁగునది; కావున సహజబుద్ధి విశేషమును జెప్పవలయునా. ఇట్టిది కావుననే రాముని మనసును అతని కన్నమించి తానెఱిఁగిన దాయెను. † మహారాజ

---

యుండియు అప్పుడే క్రొత్తగాఁ గూడినట్లు మితిలేని ప్రేమ కలిగియుండిన దనుట, (బహూన్ ఋతూన్) ఇచట అత్యంత సంయోగమునందు ద్వితీయ-ఇదిభోగము ఎడతెగకుండుటను సూచించుచున్నది. సంవత్సరములను జెప్పక ఋతువులనుటచే ఆయాఋతువులకుఁ దగిన భోగోపకరణములతో భోగ మనుభవించి నాఁడని తెలియునది. (విజహార) అని పరస్మైపదము-ఇందు క్రియాఫలము కర్తను బొందదు. కాఁబట్టి యెంతకాలము క్రీడించినను తృప్తినొందఁడయ్యె ననియర్థము; పరస్పరబద్ధానురాగము నిరవధికమైనదని యిట సూచితమైనది.

* ఇచటభక్తి యనుటచే నొకసారస్యము. రామునికి తండ్రిగూర్చిన భార్య యగుటచేత సుగుణ రూపాభిజాత్యము గలుగునది యగుటచేతను, సీతయందు ప్రేమకలిగినది. సీతకో కేవలము భర్తయైనంత మాత్రముచేతనె రామునియందు ప్రేమకలిగినది అని భర్తృశబ్ద సారస్యము.

† మహారాజకుమారుఁడనుటచే మితిలేని భోగోపకరణ సంపద తెలియుచున్నది. ఉత్తమ రాజకన్య యనుటచే అతనికంటె అధికభోగోప కరణసమృద్ధిసీతకుఁ గలదని సూచితమగు చున్నది. తానే రాముఁడు-అనఁగా రమింపఁ జేయువాఁడు. అభిరామయనుటచే వానికంటె నధికముగా రమింపఁ జేయునదని తెలియుచున్నది. అత్యంత కామ యనుటచే రామునికి తనయందుఁ గలకామము కంటె రామునియందు తనకు ఎక్కుడుకామము గలదనుట భావ్యము. తుల్యానురాగమును అమిత (స్త్రీ) కామమునుగల రాముఁడు ఇట్టి భోగసమృద్ధి హేతువైన సీతవంటిసతి గలుగుటచే మిక్కిలి ప్రకాశించెనని చెప్పఁబడినది.

కుమారుండగు రాముఁడు ఉత్తమ రాజకుమారియు అభిరామరూపవతియు అత్యంత కామయునగు సీతనుగూడి ప్రోడయై మహాలక్ష్మిం గూడిన దేవవల్లభుం డగునాది విష్ణుండు నుంబోలెఁ బ్రకాశించెను. ఇది డెబ్బదియేడవ సర్గము.

(బాలకాండము సమాప్తము.)

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనూమత్సమేత శ్రీరామచంద్రార్పణమస్తు.

